# శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్థ దరువులు క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందములు



రచయిత
శ్రీ మద్భాగవత కృష్ణ దేశికేంద్రులు

భావ విశేషార్థములు
రచయిత
శ్రీ చిన్మయ విలక్షణ సద్గురుస్వామి టేకి వెంకటాచార్యులు

# శ్రీ బృహద్వాశిష్ఠ సిద్ధాంత నిర్ధారణోద్ధారకులు అచల గురు పీఠ సద్గురు సార్వభౌములగు



## శ్రీమాన్ శివరామ దీక్షితుల వారు

ఈ పుస్తకములు లభించు మా చిరునామా
శ్రీ చిన్మయ విలక్షణ సద్గురుస్వామి టేకి వెంకటాచార్యులు
చౌదరిగారి పెట్రోలుబంకు వెనుక, అచలాశ్రమం
మండపేట (P.O.), తూ॥గో॥జిల్లా (ఆంధ్ర) Pin : 533 308.

ఓం
శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువులు క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్త్వ కందములు

రచయిత

## శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రులు

భావ విశేషార్థములు
రచయిత
శ్రీ దంతులూరి జగన్నాథ రాజ విమలానంద సద్గురు సార్వభౌముల
వారి ప్రియశిష్యుండగు

## శ్రీ చిన్మయ విలక్షణస్వామి టేకి వెంకటాచార్యులు

ప్రోత్సాహకులు
**శ్రీ సద్గురు చిన్మయ విలక్షణస్వామి శిష్యమండలి**

ప్రథమ ముద్రణ
మే 2000



వెల : 40.00

శ్రీ నిజగురుభ్యోనమః ఓం శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీ విమలానంద సద్గురు పరబ్రహ్మణేనమః

# విజ్ఞాపనము

అయ్యా! శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠ పరంపరా వచ్చిన పీఠసాంప్రదాయకులైన శ్రీ పరశురామ సీతారామస్వాముల వారి ప్రియ శిష్యులైన శ్రీమద్ భాగవతుల కృష్ణదేశి కేంద్రులు, శాలివాహన శకము 1765 సంవత్సరం మరియు క్రీస్తుశకము 1843 సంవత్సరం శోభకృతనామ సంవత్సరం మార్గశిర బహుళ చవితి నాటికి శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్థ దరువులు 292 ను క్రీస్తుశకము 1863 సంవత్సరం దుందుభినామ సంవత్సరం మాఘశుద్ధ పౌర్ణమి నాటికి క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వ కందపద్యములు 261 యును రచించి యున్నారు. ఈ కందార్థములు కందపద్యములు మన సాంప్రదాయులంతా చదువుచు సభలలో చెప్పుకొనుచున్నాము మరియు శ్రీ శివరామదీక్షితుల వారు రచించిన దీక్షితీయము చదువుచూ సభలలో చెప్పుకొనుచున్నాము మరియు పండితారాధ్య పండితశివానందస్వామి రచించిన పరిపూర్ణ సిద్ధాంత శిరోమణులు అచలబోధశిఖామణి యివి చదువుకొనుచు సభలలో చెప్పుకొనుచున్నాము యింకా గురుగీతలు మరియు భద్రాద్రి రామశతకము వేమన పద్యములు బలరామ పండితులవారి ద్విపదార్థ దరువులు, ఇంకా ఎన్నో గ్రంధములు చుదువుచు చెప్పుకొనుచున్నాము, నేను కూడా ఈ కందార్థములు లలో మొదటి ఐదు కందార్థములకు ఐదు గ్రంధములు వ్రాసియున్నాను. ఇప్పుడు ఈ కందార్థములకు కందపద్యములకు భావవిశేషార్థములు అందరికీ బాగా తెలిసేలాగు విపులముగా విడదీసి పరిపూర్ణం ఏదో లేని యెరుక ఏదో అందరికి తెలిసేలాగు వ్రాసి యున్నాను మరియు ఈ కందార్థములకు ఎంతోమంది మహాత్ములు తాత్పర్య భావములు వ్రాసియున్నారు ఐతే మన సాంప్రదాయం నాల్గు మార్గములుగా ఉన్నదని పండిత శివానందస్వామి పరిపూర్ణ సిద్ధాంత శిరోమణిలో గుహ్యోద్గుహ్య ప్రకరణములో చెప్పియున్నారు ఎలాగనగా వాచార్థము, లక్ష్యార్థం, అనుభవార్థం, నిర్ణయార్థంమని నాల్గు మార్గములు వ్రాసియున్నారు అందులో

**వాచార్థము :** అభ్యాసము, నిశ్చలసయమదీక్ష వేమనార్యులు ఇందుకు పరిపూర్ణములో ఎరుక పుట్టుచున్నది గిట్టుచున్నది అని శెలవిచ్చియున్నారు.

**లక్ష్యార్థము :** అభ్యాసాతీతము నిరామయనిర్వాణ దీక్ష ఇందుకు అల్ల మా ప్రభువు శ్రీకృష్ణులు పరిపూర్ణం ఎరుకగుచున్నది ఎరుక పరిపూర్ణమగుచున్నది అని శెలవిచ్చి యున్నారు.

**అనుభవార్థము :** ఆరూఢము అద్వయ అమల దీక్ష ఇందుకు శ్రీ శివరామ దీక్షితుల వారు పరిపూర్ణం ఎరుకవదు ఎరుక పరిపూర్ణమవదు అని శెలవిచ్చియున్నారు.

నిర్ణయార్థము : ఆరూఢాతీతము, నిరంజన తూష్ణీ భూత పరిపూర్ణ దీక్ష ఇందుకు దక్షిణామూర్తివారు ఎరుకపుట్టలేదు అదికాదు అని శెలవిచ్చియున్నారు. పండిత శివానందస్వామి, ఈ నలుగురు చెప్పిన నాలుగు మార్గములు యదార్థమే ఇవన్నీ ఒక్కటేనని శెలవిచ్చియున్నారు.

అందువల్ల ఈ పరిపూర్ణబోధ వాచార్థపరులకు పరిపూర్ణం ఉన్నది ఎరుకలేదని వాచాగా అనుకుంటేమేగాని యెరుకనే తెలివి పూర్తిగా రహితమై ఊహకూడా లేకుండా పోయిన తరువాత శేషించియున్నదేదో అదే పరిపూర్ణమని, అది కేవలాత్మయని తెలియదు.

యిక లక్ష్యార్థపరులకు గురుకరుణ వలన పరిపూర్ణం ఎరుకవటము ఎరుక పరిపూర్ణమవటము తెలుసును అనగా గురుసూచన ద్వారా విచారించినప్పుడు మనతెలివి బయలవటము విచారించనప్పుడు ఎరుకవటం జరుగుచుండునే కానీ ఎరుక పూర్తిగా రహితమై ఎరుకలేక సేవించే మార్గం తెలియదు గనుక పరిపూర్ణమైయున్న అఖండానుభవరహితమై యుండేమార్గం తెలియదు.

యిక అనుభవార్థపరులు యెరుకలేక సేవించుచు పరిపూర్ణమైయుండునే కానీ అఖండా నుభవరహితం ఎరుగరు గనుక ఊహారహితమైన ఉనికిగాని ఉనికి ఎరుగరని భావము. అనగా పరిపూర్ణుడై అఖండమై యున్నాననే తెలివి ఉన్నది గనుక అతనికి తెలియదు.

యిక నిర్ణయార్థపరులు ఇతను పరిపూర్ణమనిగాని, యెరుకయని గాని, అది ఉన్నదని గాని, ఇదిలేదనిగాని దేనిని యెరుగక ఉనికిగాని ఉనికియై అనగా అఖండానుభవరహితమై ఊహారహితమై కేవలాత్మయై ఉంటాడు అనగా మూడవకూచి యైయుంటాడు అనగా మూడవరోజు పిల్లవాడు అందరిని చూచుచుండును గాని తల్లయనిగాని తండ్రియని గాని ఎవరిని ఎరుగడు అలాగే వీడు ఉంటాడు కానీ నేచి ఇంత విచారణజేసినాను అనియేమాత్రం తోచినా వాడు పరిపూర్ణుడు కాడు పరిపూర్ణుడంటే ఏవూహ లేక వూహారహితుడై నిర్ణయా నిర్ణయములకు అతీతుడై ఏమిలేక ఒకే తీరుగా వున్నవాడని తెలియవలెను.

పరిపూర్ణబోధయంటే అంతులేనిది అందుకే శ్రీ శివరామ దీక్షితులవారు యేమీలేని బట్టబయలులో ఏమిలేక యుంటే విచారణకు ఫలం అని శెలవిచ్చి యున్నారు. అనగా ఉన్నది ఉన్నట్లు ఉండడమే పరిపూర్ణమని శెలవిచ్చియున్నారు, మరియు అనేక కోట్లలో ఒక్కరున్నారో లేరోయని శెలవిచ్చియున్నారు. మరియూ ఇంద్కు పండిత శివానంద స్వాములవారు ఈ విధముగా శెలవిచ్చియున్నారు.

శ్లో॥ జ్ఞానరూపే జగచిత్రం - జ్ఞానరూపంన విద్యతే ।
జ్ఞానంనాస్తి సదాకించి - త్ప్ర పంచం నాస్తి సర్వదా ॥

దీపము తన దగ్గరనున్న పదార్థములను తానంటక ఏలాగుననున్నదో ఆ విధముగానే పరిపూర్ణము సర్వమును అంటకయున్నది ఉన్నదన్నదే అబద్ధము అన్నదే చిజ్జడాత్మకము ఈ ద్వయదోష రహితమైతే ఉన్నది ఉన్నట్లుగానున్నది, మొలవదు ఘాతలు పొందదు.

స్వజాతీయ విజాయతీయ స్వగతభేద రహితమై సకలకాలములయందు సకల దేశములయందు సకలవస్తువులయందు సర్వబ్రహ్మాండములయందు నిండి భాహ్యాభ్యంతరములయందు ఉన్నదే పరిపూర్ణము సర్వకారణ వర్జితమై స్వచ్ఛమైన ఉపాధి ద్వయము లేక ఉండును. ఉపాధియనగా అశ్వర్యము చిజ్జడములనగా విషముషినికాయ, త్రిపుటియనగా మలత్రయము, మలత్రయమనగా జీవేశ్వర కూటస్థులు జీవుడే అణవమలము ఈశ్వరుడే మాయామలము కారణము చిత్రైన పరవస్తువు కూటస్థుడే బ్రహ్మము ఈ మూడు రహితమే త్రిపుటి రహితము.

ఇదే భ్రాంతి రహితము ఇదే అంజన రహితము ఈ బోధ లేకపోతే యేబాధ వదలదు, యింతకంతెను ఎక్కువలేదు. శివోపాశన శివభక్తి శివప్రసాదము మహేశ్వర శేవ ఆచరించిన రీతిగా ఇవియే సద్గురువునకు అట్లే చేసితే ఈ మార్గము సంప్రాప్తమగును, ఈ మార్గము తెలియకపోతే ముఖమునకు ముక్కులేనట్లుగా భర్త విహీన యవ్వనవత్ గాయత్రీ విహీన సంధ్యవత్ మాతృ విహీన శిశువువత్ పరిపూర్ణబోధ గురించి యాగయోగ జ్ఞానభక్తి వైరాగ్యములు బోధించే గురువులు వ్యర్థము.

పరిపూర్ణబోధ తెలియని శాస్త్రపశుల జోలికి బోకుము అహంకార వాద రహితుడే పరిపూర్ణుడు, అహంకార వాదముంటే ఇది సిద్ధించనే సిద్ధించదని యెరుగ వలెను, దేహీదేహ విదేహ సర్వశూన్యమితి సిద్ధాంతః

త్రిపుటి రహితమైన పరిపూర్ణమే ఉన్నది అదియే లాగనగా సర్వ కాలములయందు ఉన్నది గనుక కాలకృత పరిచ్ఛేదమున్నూ, సర్వదేశములయందు ఉన్నది గనుక దేశకృత పరిచ్ఛేదమున్నూ, సర్వవస్తువులయందు ఉన్నది గనుక వస్తుకృత పరిచ్ఛేదమున్నూ ఈ పరిచ్ఛేదములు యేమియూలేక అంతర బహిస్సులందు ఆవగింజంతైనా అవకాశములేక ద్రష్ట దృక్కు దృశ్యరూప రహితమై నిరవయమై నిరాకారమై నిరాకాశమై స్వతః సిద్ధమై యున్నదే అచల పరిపూర్ణము, ఇది సద్గురువు లభించితే క్షణములో అబ్బును ఇందుకు సందేహము లేదు, ఇదే గురువాక్య ధృఢము అని శెలవిచ్చియున్నారు.

మరియూ నేచెప్పబోయేది నిరసన చేయక ఈ గ్రంథం కడకంతా పూర్తిగా చూడండి అనగా మొదటనుంచి చివర వరకూ ఏమీవిడిచి పెట్టకుండా చూడండి అప్పుడు నేనేమి చెప్పేనో గ్రంథకర్తయైన శ్రీ భాగవత క్రిష్ణ ప్రభువుల వారు ఏమి చెప్పినారో మీకే తెలియబడుచున్నది.

నాయనలారా నేను ఎందుకు ఆసాంతము చూడమని చెప్పుచున్నానంటే ఈ సాంప్రదాయములోయున్న నా సోదరులు వారి శిష్యులు ఎంతోమంది వాచార్థముగా విచారించుచున్నారు. అనగా సద్గురు సూచన తెలియక మనకుఎదురుగా ఉన్న బయలే అచలమని పరిపూర్ణమని గురువులు చెప్పటం ఆ శిష్యులు నిజమేనని

నమ్మటం నేను ఎన్నోచోట్ల విన్నాను, చూసాను మరియు కొంతమంది ఇది బయలు కాదు. ఆకాశమేనని యుక్తిగా ఆ స్థితిని పొందాలి అని ఎన్నో విధముల వాచార్థముగా చెప్పటమే కాని ఆ స్థితిని యెరిగినవారు చాలాతక్కువ, యక్కడో కాని లేరు, ఎందుకనగా సద్గురు సూచనవల్ల ఆ స్థితి రావాలంటే, గురువుగారు సూచన చూపించిన శిష్యుడు సూచన గ్రహించే సరికి తానులేక బయలై అచలమై యుండాలి. చలనములేనిదే పరిపూర్ణము చలనముంటే ఎరుకైనది, చలనము లేకపోతే అచలమైనది ఈ అచలమైయున్నదే సచ్చిదానందస్వరూపమైన శుద్ధ యెరుక ఇదే అఖండ ఎరుక యిట్టి యెరుకను విడిపించిన వారే సద్గురువులు ఈ ఎరుకను విడిపించవలెనంటే సద్గురుమూర్తియై యుంటే పూర్ణ సూచన చేస్తారు. ఆ సూచన ద్వారా విచారించిన యెడల ఆ శిష్యుడు ఎరుకను విడిచిపెట్టి ఎరుకలేక సేవించే మార్గం అవలంబించి విచారణచేయగా చేయగా యెరుక శూన్యమై యెరుక ఏమీలేక ఈ ఎరుక పరిపూర్ణమై అఖండాను భవరహితమై శుద్ధ నిర్గుణతత్వమై పరిపూర్ణ పరశివమై యుండునని భావము.

అందువల్ల ఈ విధముగా విచారించి అఖండాను భవరహితమై, స్థితి నిర్ణయ రహితమై అనగా వునికిగాని వునికై ఎవరు ఉన్నారో వారే పరిపూర్ణులు అని తెలియవలెనని నా మనవి.

మరియూ నేను కూడా గురుశిష్యవదలకుండా అఖండాను భవరహితం అనగా వునికిగాని వునికిని విచారించు చున్నానేగాని నేనై తీరేననిలేదు, నేను కూడా ఇంకా విచారణచేయుచున్నానని మనవి చేయు చున్నాను. అందువల్ల మీరంతా శ్రద్ధగా విచారించి మీరు పరిపూర్ణులై సర్వకాల సర్వావస్థలయందు ఆ వునికిలో వుండి వునికిగాని వునికై తరించెదరని కోరి ప్రార్థించు చున్నానను.

యిందుకు శ్రీ భాగవతుల కృష్ణదేశిక ప్రభువులు కందార్థము 198 కందార్థం "ధ్వని మొదలగు తన్మాత్రలు - కనుగొనగాలేశమైన గాన్పించని చోటును బట్టబయలుగా గని" మరియు 250 కందార్థం "గురు గురుబోధల చేతను - పరిపూర్ణము నెరిగి యెరుక బాసిన యతనిన్ - గురుతెరుగ నొరుల శక్యమె" ఈ కందార్థం చూడండి మీకే తెలియబడుచున్నది. అఖండమై యున్న పరిపూర్ణమును 25 వదైన యెరుకయును రెంటిని విడిచిపెట్టన తరువాత శేషించి యున్నదేదో అట్టి వునికిలో వున్న వారు బాలునివలె, ఉన్మత్తునివలె, పిశాచము పట్టిన వానివలెను వుంటాడని గ్రహించవలెను.

యిట్లు

గ్రంథకర్త

**శ్రీ చిన్మయ విలక్షణ సద్గురు టేకి వెంకటాచార్యులు**

**అచలాశ్రమం, మండపేట.**

ఓం
శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# గురుప్రార్థన

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణు । గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరబ్రహ్మ । తస్మైశ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ అఖండ మండలాకారం । వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం । కేవలం జ్ఞాన మూర్తిం ।
ద్వంద్వా తీతం గగన సదృశ్యం । తత్వమస్యాది లక్ష్యం ॥
ఏకం నిత్యం విమల మచలం । సర్వధీ సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణ రహితం । సద్గురుం తం నమామి ॥

# గురు పరం పర ధ్యానం

శ్లో॥ ఓం నమో బ్రహ్మదిభ్యో । బ్రహ్మవిద్య సాంప్రదాయ ।
కర్తృభ్యో వంశ ఋషుభ్యో । మహద్భ్యో నమో గురుభ్యః ॥
సర్వోపప్లవ రహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో ।
బ్రహ్మైవాహ మస్మి । అహం పదార్థ రహితః ॥ 1

# శ్రీ మహా విష్ణు సాంప్రదాయం

శ్లో॥ శ్రీ బ్రహ్మ విద్య గురుర్విష్ణు సూర్యం ।
శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకం చ ॥
సాందీపమీశం కృష్ణంచ (అర్జునం) ఉద్దవం ।
వందే గురున్మే గురుపాదు కాంతం ॥ 2

శ్లో॥ శ్రీ యచలావధూత నిర్వికార ప్రభోదనం ।
శ్రీ బ్రహ్మానందస్వామి బ్రమర మత్తేభ కామం ॥
బ్రమరహిత యమలానంద యప్రయాణనం ।
బవ బంధవిమోచన భవానందం నమామి ॥ 3

శ్లో॥ శ్రీ దత్తానందస్వామి చరణసేవా నిరంతరం ।
కర్మజ్ఞాన నివారణ ధర్మాధర్మ వివర్జితం ॥
శ్రీ పూర్ణానంద పరిపూర్ణ బోధామృతషట్పదం ।
శ్రీ రామానంద స్వామి చరణం నిత్యం నమోనమః ॥ 4

శ్లో॥ జ్ఞానాజ్ఞాన ప్రజ్ఞాన రహితమనిశం । జ్ఞానేశ్వర స్వామి సంపూర్ణ ద్వాదశార్థం ।
జననమరణనాశ యాశోభ కారణ । సహజానంద సద్గురు చరణం నమః ॥ 5

శ్లో॥ శ్రీరామావధూత బోధ మకరంద పాన బృంగం ।
క్షరాక్షరోపాది ద్వయదోషరహిత సత్సంగం ॥
సుబ్రమణ్య సుబోధ దివ్య చరణ యణుస్మారం ।
వేమనార్య కవి వందిత సుశ్లోక జగద్గురుం ॥ 6

శ్లో॥ మారునూరు నంబి మహోద్విచార మార్గ వర్తనం ।
తిరువెంగళ స్వామి త్రివిధ దీక్షాపరధనం ॥
శ్రీ అతీతావధూత స్వామి పరిపూర్ణ బోధనం ।
శ్రీ తిరుపాణి ఆళ్వారు చరణం నమోనమః ॥ 7

## శ్రీ శివరామ దీక్షిత గురు సాంప్రదాయం

శ్లో॥ శ్రీధర స్వామినం నిత్యం । బోధకారణమవ్యయం ।
భావాతీత మహం వందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥ 8

శ్లో॥ వందారు జనమందారం । వందే హంతన్నిరంతరం ।
రామడ్గు వంశజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితం ॥ 9

శ్లో॥ యస్య్యబోధ దయాన్సర్వం । బ్రహ్మైవేత్యవగమ్యతే ।
శివరామే విధిఖ్యాతం । తద్దైవచ ముపాస్మహే ॥ 10

శ్లో॥ కామాది రిపుహం తారం । రామలింగార్య చరణాంమృత పాన సారంగం ।
పరమారాధ్య గురుం పరం । వందే మద్గురుం ॥ 11

శ్లో॥ శ్రీ మద్దేశి కాన్వయబ్ధి చంద్రమనోరమం ।
నిత్యసాంద్ర కృపాంమృత మత్రికృతే శ్రీ సత్యనాగార్య గురుంపరం ।
శ్రీ మల్లేశ దేశి కేంద్ర సద్గురు కారణం ।
శ్రీ పండిత శివానంద సద్గురువేనమః ॥ 12

శ్లో॥ శ్రీ నాగార్య పాద కమలాంమృత । పాన భృంగం 7
బావాతీత పరమగుహ్య లబ్యం । బలరామాఖ్య పండితం ॥ 13

శ్లో॥ శ్రీ బలరామార్య చరణసేవా నిరంతరం అచల పరిపూర్ణ ।
కేవలాత్మ స్వరూపకం । శ్రీ కృష్ణమాచార్య పాదద్వంద్వం భజే ॥ 14

శ్లో॥ శ్రీకృష్ణమాచార్య పాద పంకజ చంచరీకం । శ్రీరాజయోగి
కులవార్ధిపూర్ణస్థోమం । శ్రీ సన్యసాచార్య సద్గురు చరణం భజామ్యహం 15

శ్లో॥ శ్రీ సమరస నిర్మలానంద । సన్యసాచార్య ప్రభుదేశి కేంద్రుకారణం ।
శ్రీదంతులూరు జగన్నాధరాజ । విమలానందసద్గురు చరణం నమోనమః ॥16

శ్లో॥ శ్రీ సద్గురు జగన్నాథరాజ విమలానంద స్వామి ।
బోధాంతమృత చరణపాన మత్తేకృత సఛిష్యం ॥
శ్రీ సగుణ నిర్గుణాతీత కేవలాత్మ ప్రబోధ శితయ్య ।
నిర్మలాంబ పరిపూర్ణ గుర్వీణీం భజే ॥ 17

శ్లో॥ శ్రీ సద్గురు విమలానంద స్వామి ।
చరణ పాన మత్తీకృత సద్భృంగం ॥
శ్రీ చిత్త నిర్మూల చిన్మయ విలక్షణ ।
సద్గురు చరణం భజామ్యహం ॥ 18

శ్లో॥ అస్మద్గురు సమారంభం । శ్రీకృష్ణ సాందీపమధ్యమాం ।
శ్రీ మహావిష్ణు పర్యాంతం । వందే గురు పరంపరాం ॥ 19

## లఘుపూజ

శ్లో॥ ధ్యానమావాహనం సింహా । సనం పాద్యంత దైవచ ।
అర్ఘ్యమాచమనీయ్యంచ । స్నానం పంచామృతైస్సహ ॥ 1

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రం విభూషణం ।
విలేపనంచాక్షతాంచ । పుష్పం స్వర్ణ వినిర్మితం ॥ 2

శ్లో॥ ధూపం దీపంచ నైవేద్యం । పానీయం ఫలమేవచ ।
తాంబూలం దక్షిణార్తిక్యం । మంత్రపుష్పం ప్రదక్షిణం ॥ 3

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదయేత్ ।
కృపయాగృహ్యతాం స్వామిన్ । న్యూనాధిక్యం నచింతయా ॥ 4

శ్లో॥ లఘుపూజా విధిం భాగ । వతకృష్ణద్వి జన్మనా ।
రచితం శ్రోతువక్త్రుణా । మిదం మోక్షకరం పదం ॥ 5

శ్లో॥ అయం వ్యర్థ బాహ్యాకోపీన భవతి ।
మూలాభావ మిదం జ్ఞాతం శరీరం కిమునాస్తిహి ।
స్వప్నేప్రతీయ మానాని రూపాని యథా తథా ॥ 1

శ్లో॥ బిందుమధ్యే గురోశ్శిష్యం । దృష్టద్రాష్టాంత బోధకం ।
ద్వాదశీ షోడశీ మంత్రం । జపితే జన్మరాహిత్యః ॥ 2

శ్లో॥ ఇతి మంత్ర సమానైవ । సాందీపగురు వగ్రణీ ।
కృష్ణస్యమస్తకేనస్య । హస్తం తూష్ణీపభూవహః ॥ 3

## పరిపూర్ణ అచల ధ్యానం

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం । ఆగ్నేయం నిర్గుణం తథా ।
దక్షిణే నిత్యసుద్ధంచ । నైరృత్యే నిరుపద్రవం ॥ 1

శ్లో॥ పశ్చిమే నిష్కళంచైవ । వాయువ్యేచ నిరంజనం ।
ఉత్తరేచ నిరాకాశ । యీశాన్యే నిర్మలో భవేత్ ॥ 2

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః ।
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః ॥ 3

## పరాపూజ

శ్లో॥ పూర్ణస్యావాహనం కుత్ర । సర్వాధారస్యచాసనం ।
స్వచ్ఛస్యపాద్యమర్ఘ్యంచ । శుద్ధాస్యాచ మనంకుతః ॥ 1

శ్లో॥ నిర్మలస్య కుతస్నానం । వస్త్రం విశ్వోద రేస్యచ ।
నిరాలంబస్యోపవీతం । రామస్యాభరణం కుతః ॥ 2

శ్లో॥ నిర్లేపస్య కుతో గంధః । పుష్పం నిర్వాసనస్యచ ।
నిర్గంధస్య కుతోధూప । స్వప్రకాశస్య దీపకం ॥ 3

శ్లో॥ నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్య ఫలంకుతః ।
తాంబూలంచ విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణా ॥ 4

శ్లో॥ స్వయం ప్రకాశమానస్య । కుతో నీరాజ నాదికం ।
ప్రదక్షిన మనంతస్య । అద్వితీయస్య కాస్తుతిః ॥ 5

శ్లో॥ అంతర్బహిశ్చ పూర్ణస్య । కథముద్వాసనం భవేత్ ।
ఇయమేవ పరాపూజా । సర్వావస్థాసు సర్వదా ॥ 6

శ్లో॥ ప్రేమబుధ్యాను సర్వేశో । మనోదేవో నివేశయేత్ ।
ఏషామజ్ఞాన జీవానం । సమస్తారిష్ట శాంతయే ।
యద్యబోధవ్యమఖిలం । తత్తద్బ్రూక్యా బ్రవీమ్యహం ॥ 7

## శ్రీ గురుమాలా మంత్రః

**ఓం నమః శ్రీ గురుదేవాయ పరమపురుషాయ సర్వ దేవతావశీకరాయ సర్వారిష్ట వినాశనాయ సర్వమంత్ర చ్ఛేదనాయ త్రైలోక్యం వశమానాయస్వాహా**

తా॥ పరమపురుషుడును, సమస్త దేవతలను స్వాధీనముగా గలవాడును, సమస్త అమంగళములను పోగొట్టెడి వాడును, సమస్త మంత్రములను ఖండించెడి వాడునగు సద్గురువు కొరకు నమస్కారము, అట్టి పరమ పురుషుడవగు ఓ గురుదేవా, నాకు సమస్త లోకములను స్వాధీనము చేయుము.



భావ విశేషార్థములు

రచయిత

శ్రీశ్రీశ్రీ దంతులూరి జగన్నాథరాజ విమలానంద సద్గురు సార్వభౌముల వారి ప్రియ శిష్యుండు

**శ్రీ నిష్కల్మషాంబా సమేత చిన్మయ విలక్షణ సద్గురు స్వామి**

**టేకి వెంకటాచార్యులు**

శ్రీ నిజగురుభ్యోనమః ఓం శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీ విమలానంద సద్గురు పరబ్రహ్మణేనమః
శ్రీ చిన్మయ విలక్షణ సద్గురు పరబ్రహ్మణేనమః

# యోగ్యతా పత్రము

అయ్యా శ్రీ చిన్మయవిలక్షణ నిజగురు ప్రభువులైన శ్రీ సద్గురు సార్వభౌముల వారు ప్రియశిష్యుండైన శ్రీ విమలానంద విలక్షణ సద్గురు చోడిశెట్టి వెంకటేశ్వర్లు రచియించిన యోగ్యతా పత్రవ్యాఖ్యానము.

శ్రీవారు రచించిన ఖండా ఖండనిరసన అఖండాను భవరహిత తత్వ కందార్థ దరువులు అఖండ మాలగ్రంథమున్నూ, శ్రీ భాగవతుల కృష్ణ దేశికేంద్రులవారు రచించిన శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థదరువులలో మొదట ఐదు కందార్థములకు వ్యాఖ్యానముచేసి రచియించిన ఐదు గ్రంథములున్నూ మరియు 292 కందార్థములకు మరియు 261 కందపద్యములకు భావార్థ విశేషార్థములు రచించియున్నారు.

మరియు వారు చిన్న తనమునుండి ఈశ్వరునియందు భక్తి విశ్వాసములతో పూజించి శేవించేవారు తరువాత ఒక గురువును ఆశ్రయించివారి ద్వారా యోగాభ్యాసములు 12 సంవత్సరముల బాల్యములోనే చేసినవారు తరువాత శ్రీ సరస్వతీ దుర్గానందస్వాముల వారి ప్రియశిష్యుండైన శ్రీ ప్రజ్ఞాన విలక్షణానంద బట్ట తాతబ్బాయ సద్గురుస్వాముల వార్ని ఆశ్రయించి ఈ పరిపూర్ణబోధ సాంప్రదాయములోకి వచ్చియున్నారు అప్పటికి వారికి 20 సంవత్సరములు వయస్సు ఉన్నది ఆ గురువుగార్ని భక్తి విశ్వాసములతో 20 సంవత్సరములు శేవచేసియున్నారు, ఆ గురువుగారు ఆ సేవకు మెచ్చి ఆయనకు అధికారము ఇచ్చియున్నారు. ఆ తరువాత కొన్నాళ్ళకు ఆ గురువుగారు పరంపదించినారు ఆ తరువాత శ్రీ దంతులూరి జగన్నాధరాజుగారైన శ్రీ విమలానంద సద్గురు సార్వభౌములవారి యొద్దకు చేరియున్నారు. వారికి భయభక్తులతో 25 సంవత్సరములు ఎంతో వినయ విధేయతలతో వారికి కావలసిన సేవలు చేయగా వారికి దయగలిగి నిజగురు సాంప్రదాయ సూచన జేసి విచారించమన్నారు, ఆ సూచన ద్వారా విచారించితే కొన్నాళ్ళకు పరిపూర్ణమేదో ఎరుక ఏదో తెలిసినది అప్పుడె ఎరుకలేక సేవించే మార్గం బాగా ధృఢమైనది మరల కొన్ని సంవత్సరములకు పూర్ణసూచనజేసి విచారించమని చెప్పియున్నారు ఆ పూర్ణసూచన ద్వారా విచారించగా ఎరుక ఏమీలేక పరిపూర్ణమై యున్నది అలా విచారించగా విచారించగా అఖండాను భవరహితమైనది అనివారికి అప్పుడు అర్థమైనదని వారు చెప్పియున్నారు.

విమలానంద స్వాములవారు అంత్యకాలములో చెప్పిన విషయము లివి యివే విషయములు యేనుగు వానిలంక రామచంద్రయోగి చెప్పియున్నారట, విమలా

నందస్వాములవారు రెండురోజులలో పరమపదించుతారనగా అలా విచారించితే యెరుక పూర్తిగా నశించి రెండవది ఏమిలేక పరిపూర్ణమై యుండునని చెప్పియున్నారు. ఆ విధముగావిచారించగా విచారించగా యెరుక పూర్తిగా నశించి అఖండాను భవరహితమై పరిపూర్ణమై యున్నదని వారి అనుభవమంతా మాకు చెప్పియున్నారు. మరియు ఈ గ్రంథములలో వారి అనుభవము చెప్పి మహాత్ములైన పెద్దలు చెప్పిన శాస్త్రములు యెన్నో ఉదాహరణలు ఇచ్చి మన అందరికి తెలియజేసి యున్నారు, ఇంకా ఎన్నో గ్రంథములులో ఎన్నో వాఖ్యములు దృష్టాంత ద్రాష్టాంతములుగా వారు రచియించిన గ్రంథములలో తెలియజేసి యున్నారు. అవి మనమంతా చూచి చదివి యున్నాము ఆ గ్రంథములలో మన సాంప్రదాయం వెలగొల్పియున్నారు. అట్టి సాంప్రదాయము భక్త శిఖామణులు జూచి విచారించి ఆనందించియున్నారు. వారి శిష్యులైన మేము ఆ సూచనలను గ్రహించి ఆచరించి చాలాముందుకు వచ్చియున్నాము. అనగా వారు తరించి మమ్ములను తరింపజేయుచున్నారని ఎంతో సంతోషించి ఆనందించుచున్నాము.

అనగా ప్రతి శిష్యునకు శిక్షణ ఇచ్చి, ఆ శిక్షణకు తగిన నడక, ఆ నడకకు తగిన ఆచరణ, ఆ ఆచరణకు తగిన ధర్మము, ఆ ధర్మమునకు తగిన మర్మము, మర్మమునకు తగిన స్థితి, ఆ స్థితికి సరిపడిన ఉనికి, ఆ ఉనికిని విచారించి పాటుపడి స్వబుద్ధిచేత సంపాదించుకొన్న అనుభవము, అట్టి అనుభవముతో వారు వ్రాసియున్నారు వారు వ్రాసియున్న విషయములు నా మనస్సునకు బాగా నాటియున్నవి గనుకనె ఈ విషయములన్నీ వ్రాయడమైనవి ఎందుచేతనంటే వారు సాక్షాత్ పరశివస్వరూపులై ఎరుకలేక యున్నారు. అనగా లేని ఎరుక లేక యున్నారు. అనగా సర్వకాలము సంకల్పములేక నిస్సంకల్పులై పరిశుద్ధ యెరుకైయున్నారు. వారు జీవేశ్వర్లు రహితమై అఖండమై అచలమై పరిపూర్ణులై యున్నారు.

మరియు అఖండాను భవరహితులై పరిపూర్ణ పరాకాశమై అమూల్యమైన నిజగురు ప్రభువులైయున్నారు, అనగా అఖండాను భవరహితులై స్వదృష్టిపరులై లేక యున్న ఉత్తములు, వారుకన్న దాన్ని ఉండజూచి లేని దాన్ని లేక జేసిన పరమ గురు స్వరూపులై యున్నారు, మరియూ జ్ఞాన కర్మలు నశింపజేసి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములను రహితముజేసిన అశరీర గురుప్రభువులు. వారు మూలము నిర్మూలము జేసుకొన్న నిజగురుప్రభువులు, వారు చెక్కు చెదరని కల్పితములేని కైలాసములో పరశివ స్వరూపులైయున్నారు, వారు కుంఠితముగాని వైకుంఠములో ఏమిలేక యున్నవారు, బట్టబయలనే స్వరూపమును విడిచి, విడిచిన దానిని ఎరుగక లేకయున్నవారు, పరిశుద్ధమై అఖండమై ఎరుక లేకయున్నవారు, వారు అనుకూలమనే కులము లేని యెరుక లేకయున్నవారు, ఎరుకను రహితము జేసుకొని పరమ పురుషుడై యున్న ఎరుకలేక యున్నవారు, మూల్యముగాని అమూల్యులైయున్న దేశిక చక్రవర్తులు,

నందస్వాములవారు రెండురోజులలో పరమపదించుతారనగా అలా విచారించితే యెరుక పూర్తిగా నశించి రెండవది ఏమిలేక పరిపూర్ణమై యుండునని చెప్పియున్నారు. ఆ విధముగావిచారించగా విచారించగా యెరుక పూర్తిగా నశించి అఖండాను భవరహితమై పరిపూర్ణమై యున్నదని వారి అనుభవమంతా మాకు చెప్పియున్నారు. మరియు ఈ గ్రంధములలో వారి అనుభవము చెప్పి మహాత్ములైన పెద్దలు చెప్పిన శాస్త్రములు యెన్నో ఉదాహరణలు ఇచ్చి మన అందరికి తెలియజేసి యున్నారు, ఇంకా ఎన్నో గ్రంధములలో ఎన్నో వాఖ్యములు దృష్టాంత ద్రాష్టాంతములుగా వారు రచియించిన గ్రంధములలో తెలియజేసి యున్నారు. అవి మనమంతా చూచి చదివి యున్నాము ఆ గ్రంధములలో మన సాంప్రదాయం వెలగొల్పియున్నారు. అట్టి సాంప్రదాయము భక్త శిఖామణులు జూచి విచారించి ఆనందించియున్నారు. వారి శిష్యులైన మేము ఆ సూచనలను గ్రహించి ఆచరించి చాలాముందుకు వచ్చియున్నాము. అనగా వారు తరించి మమ్ములను తరింపజేయుచున్నారని ఎంతో సంతోషించి ఆనందించుచున్నాము.

అనగా ప్రతి శిష్యునకు శిక్షణ ఇచ్చి, ఆ శిక్షణకు తగిన నడక, ఆ నడకకు తగిన ఆచరణ, ఆ ఆచరణకు తగిన ధర్మము, ఆ ధర్మమునకు తగిన మర్మము, మర్మమునకు తగిన స్థితి, ఆ స్థితికి సరిపడిన ఉనికి, ఆ ఉనికిని విచారించి పాటుపడి స్వబుద్ధిచేత సంపాదించుకొన్న అనుభవము, అట్టి అనుభవముతో వారు వ్రాసియున్నారు వారు వ్రాసియున్న విషయములు నా మనస్సునకు బాగా నాటియున్నవి గనుకనె ఈ విషయములన్నీ వ్రాయడమైనవి ఎందుచేతనంటే వారు సాక్షాత్ పరశివస్వరూపులై ఎరుకలేక యున్నారు. అనగా లేని ఎరుక లేక యున్నారు. అనగా సర్వకాలము సంకల్పములేక నిస్సంకల్పులై పరిశుద్ధ యెరుకైయున్నారు. వారు జీవేశ్వర్లు రహితమై అఖండమై అచలమై పరిపూర్ణులై యున్నారు.

మరియు అఖండాను భవరహితులై పరిపూర్ణ పరాకాశమై అమూల్యమైన నిజగురు ప్రభువులైయున్నారు, అనగా అఖండాను భవరహితులై స్వదృష్టిపరులై లేక యున్న ఉత్తములు, వారుకన్న దాన్ని ఉండజూచి లేని దాన్ని లేక జేసిన పరమ గురు స్వరూపులై యున్నారు, మరియూ జ్ఞాన కర్మలు నశింపజేసి స్థూల, సూక్ష్మ, కారణ, మహకారణ శరీరములను రహితముజేసిన అశరీర గురుప్రభువులు. వారు మూలము నిర్మూలము జేసుకొన్న నిజగురుప్రభువులు, వారు చెక్కు చెదరని కల్పితములేని కైలాసములో పరశివ స్వరూపులైయున్నారు, వారు కుంఠితముగాని వైకుంఠములో ఏమిలేక యున్నవారు, బట్టబయలనే స్వరూపమును విడిచి, విడిచిన దానిని ఎరుగక లేకయున్నవారు, పరిశుద్ధమై అఖండమై ఎరుక లేకయున్నవారు, వారు అనుకూలమనే కులము లేని యెరుక లేకయున్నవారు, ఎరుకను రహితము జేసుకొని పరమ పురుషుడై యున్న ఎరుకలేక యున్నవారు, మూల్యముగాని అమూల్యులైయున్న దేశిక చక్రవర్తులు,

మూడు వాఖ్యల మూలము రహితము జేసుకొన్న పరమగురుస్వరూపులు, వారు అచలమును గని అచలాతీతమైయున్న అనుభవరహితులై యున్నవారు, నా జన్మను రహితము జేసి నన్నులేక యుంచిన మహానుభావులు వారు.

అలాంటివారిని ఏమని వర్ణించను, వర్ణించుటకు నాలాంటి వానికి సాధ్య పడనిది, ఎందుచేతనంటే ఆయన ధర్మాధర్మములకు అతీతమై యున్న ధర్మము చెప్పియున్నవారు, కాబట్టి అట్టిదానిని సక్రమముగా ఆచరించలేక ఇంకా అంతః కరణ శుద్ధి అవక సరియైన గురుసేవ గురుభక్తి గురునిష్ఠ చేయలేక నేను ఈ రకంగా లేని మనస్సుతో తపించుచున్నాను. అందుచేత గురుపుత్రులు భక్తులైనవారు అబాల గోపాలం సాంప్రదాయులంతా ఈ గురు సాంప్రదాయం పరంపరా ప్రాప్తింపజేసుకొని వారు జెప్పియున్న ధర్మాధర్మములు ఆచరించి వారు తరించి వార్ని ఆశ్రయించిన ముముక్షువులను తరింపజేయుదురని ఈ వాఖ్యములను వ్రాసియున్నాను.

మరియు నా నిజగురుదేవులైన శ్రీ చిన్మయ విలక్షణ సద్గురు ప్రభువులు టేకి వెంకటాచార్యులవారికి నా శిరః సాష్టాంగ ద్వాదశ నమస్కారములు అంతః కరణ శుద్ధితో జేసి వారికి జేజేలు సమర్పించుచున్నాడను.

జై సద్గురుప్రభు మహారాజుకు జై జై జై
సమస్తము సద్గురు చరణారవిందార్పణమస్తు

ఇట్లు
**శ్రీచిన్మయ విలక్షణ స్వామి**
**శ్రీ టేకి వెంకటాచార్యులవారి ప్రియశిష్యుండైన**
**శ్రీ విలములానంద విలక్షణ సద్గురు**
**శ్రీ చోడిశెట్టి వెంకటేశ్వర్లు**
**గుత్తెనదీవి - దేవపరం**
**తూ॥గో॥జిల్లా.**

ఓం
శ్రీ సద్గురుభ్యోనమః
శ్రీ మద్భాగవత కృష్ణ దేశి కేంద్రులు రచించిన
**శక్తిద్వయ నిరాసికంబైన శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థదరువులు**
**క్షరాక్షరోపాధి ద్వయ దోష రహిత పరమతత్త్వ కందములకు**
శ్రీ చిన్మయ విలక్షణ సద్గురు స్వామి టీకి వెంకటా చార్యులు రచించిన
భావ విశేషార్థముల
గ్రంథము అచ్చువేయుటకు ద్రవ్య సహాయం చేసినవారు

## మహారాజ పోషకులు

| | |
|---|---|
| శ్రీ నల్లమిల్లి రామిరెడ్డి గారు (పాలమూరు) | రూ. 2000-00 |
| శ్రీ చోడిశెట్టి రాధాకృష్ణ గారు, S.I. (పాండిచ్చేరి) | రూ. 2000-00 |
| శ్రీ చోడిశెట్టి వెంకటేశ్వర్లు గారు (గుత్తెనదీవి-వేమవరం) | రూ. 1000-00 |
| శ్రీ కోనాడ వెంకయ్యబాబు గారు (మత్స్యలేశం) | రూ. 1000-00 |
| శ్రీ సూరాడ అప్పన్నబాబు గారు (మత్స్యలేశం) | రూ. 1000-00 |
| శ్రీ వానపల్లి పోలీసుబాబు గారు (బలరామపురం) | రూ. 1000-00 |
| శ్రీ పోలిశెట్టి సత్యన్నారాయణ గారు (ముమ్మిడివరం) | రూ. 1000-00 |
| శ్రీ చిక్కాల రామంగారు (ముమ్మిడివరం) | రూ. 1000-00 |
| శ్రీ చిక్కాల బాబులుగారు (ఐనాపురం) | రూ. 1000-00 |
| శ్రీ చిమ్మిలి వెర్రియ్యగారు (ఎర్రగరువు) | రూ. 1000-00 |

## రాజపోషకులు

| | |
|---|---|
| ముగ్గురు భక్తులు యిచ్చిన మొత్తం | రూ. 1500-00 |
| శ్రీ యం. పల్లమరాజు గారు (కాకినాడ) | రూ. 558-00 |
| శ్రీ కూనపరెడ్డి దుర్గారావుగారు (గుత్తెనదీవి-వేమవరం) | రూ. 500-00 |
| శ్రీ సానబోయిన శేషారావుగారు (కూనిమిల్లుపాడు) | రూ. 500-00 |
| శ్రీ పినపోతు సూర్యనారాయణగారు (కాకినాడ) | రూ. 500-00 |
| శ్రీ పెన్మెత్స వీరభద్రరాజు గారు (చిన కొమరగిరి) | రూ. 500-00 |
| శ్రీ పెమ్మాడి కామేశ్వరావు గారు (కాకినాడ) | రూ. 500-00 |
| శ్రీ బొడ్డు సత్యన్నారాయణ గారు (కాకినాడ) | రూ. 300-00 |
| శ్రీ నామాల సత్యంగారు (ద్వారపూడి) | రూ. 116-00 |
| శ్రీ కాకరపర్తి గంగరాజు గారు (ద్వారపూడి) | రూ. 116-00 |
| శ్రీ వెన్నా కృష్ణమూర్తి గారు (వట్రపూడి) | రూ 100-00 |

శ్రీ సద్గురుభ్యోనమః　　　ఓం　　　శ్రీనిజగురుభ్యోనమః

శ్రీ సీతారామాయ నమః

శ్రీ విమలానంద సద్గురు పరబ్రహ్మణేన్నమః

# శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్ధ దరువులు

## ☆ 1 .సభావిజ్ఞాపన. 21 ☆

1 ॥ జనులార జననమరణము - లను దొలగన్ - ద్రో యజాలు లక్షణయుతమై
- వినువారికి -కనువారికి - తనలా వెరిగించుదీని - తప్పాకవింటే - అప్పుడె
వార - లెప్పూడుగంటే - కనుకావిన బుద్ధైతె వినుడీచదివెదమికె-కనుగొనమన
సైతె కనుడీపుస్తకమంత - తప్పాక వింటే - అప్పుడె వారలెప్పుడు గంటే ॥ 1

తా॥ అయ్యా ! ఇది సభావిజ్ఞాపన. ఈ సభలో అనేక రకముల ప్రజలున్నారు. మరియు ద్వైతులు అద్వైతులు విశిష్టాద్వైతులు శాస్త్రీయులు గాణాప్రత్యులు అనేకరకముల మతములవారున్నారు. ఇట్టి సభలో ఓ జనులార జననమరణము లనగా పునరపి జననం పునరపి మరణం అను సంకల్ప వికల్పములనే ప్రవాహమును తొలిగింపచేయు మార్గమొకటున్నది. అనగా ఈ గ్రంధములో పునరావృత్తిరహితమయ్యే పద్ధతి ఒకటున్నదని చెప్పియున్నారు. అది ఎవరికనగా, రజోగుణ తమోగుణములు లేకే, సత్వగుణ ప్రధానులై, ఏకాగ్రత కలిగి, రెండవదిలేక వినేలక్షణము కలవారికి, అనగా జననమరణములనే సంకల్పవికల్పములు నశింపజేసుకొనవలెనని తపించుచూ వినేవారికి, ఆ విన్నదికనేవారికి, తనలావెరిగించు, అనగా తాను ఎలా వచ్చినాడో, తనస్వరూపం ఏమిటో, తెలుసుకొనుటకు. ఎక్కువ ప్రయత్నం చేయుచూ, దానికోసమే తపించుచూ. ఎంతో ఆదుర్దాకలవాడై, అనగా ఎప్పుడా ఎప్పుడా అని దానిని తెలుసుకొనవలెనని కోరిక దృఢముగా యున్నవాడే, ఆ స్వరూపమును పొందగలడు. అనగా అఖండ స్వరూపమైన అచలము తానని గ్రహించి, పరిపూర్ణమైయుండును. అలాకానివాడు అనుకున్నా వినుకున్నా ఎంత మాత్రమున అది తెలియబడేదికాదు. గురువుగార్కి తను మనోధనములు ధారబోసి, గురుభక్తిగురునిష్ట గురుసేవ కలిగియున్నవానిపై. గురుమూర్తికి దయగలిగి, గురుసూచన చేయును, ఆ గురుసూచనవల్ల, ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును, పొందుదురు. అలాంటివారికే ఆ స్వరూపము తెలియబడుచున్నది. తన స్వరూపం ఎలా వచ్చినదనగా, శుక్లశోణితముల వలన వచ్చినది, అన్నం వలన శుక్లం తయారైనది. నీరు వలన శోణితం తయారైనది. అన్నం పృధ్వితత్వం వల్ల వచ్చినది. నీరు జలతత్వం వలన వచ్చినది. ఈ పృధ్వితత్వానికిగాని. జల తత్వానికిగాని. తల్లిగాని తండ్రిగాని ఉన్నారా! లేరు. గనుక వీటికి మూలంలేదు అని తెలిసినది. కనుక ఈ మూలంలేని

గుర్తెరిగే శరీరం ఏమీ లేదని పెద్దలు శెలవిచ్చియున్నారు. అందువలన యెరుకకు మూలం ఏమీలేదు. అని స్పష్టంగా మన అందరికి తెలిసినది. మరియు జననమరణములనగా యెరుకపుట్టుట గిట్టుట అనే సంకల్పవికల్పములేగాని. తాను జన్మించుట చచ్చిపోవుటలు కావు. కనుక తన స్వరూపం ఏదో తెలుసుకొనవలెను. యెరుక యొక్క స్వరూపం అఖండమై అచలమై పరిపూర్ణమైయున్నదే అనియూ. ఇందుకు - 56 కం॥లో అఖండంబగు యెరుక రూపుగనరా మా తండ్రీ అని శెలవిచ్చియున్నారు. మరియూ యెరుకయొక్క స్వభావము ఏమిటనగా, పుట్టుట గిట్టుటలనే సంకల్పవికల్పములు, జాగ్రత స్వప్న సుషిప్తితుర్యావస్థలు పొందుట. ఇందు్క 92 వ.కం॥లో చచ్చుట. పుట్టుట మేలుకవచ్చుట అని శెలవిచ్చియున్నారు. మరియూ యెరుక స్వలక్షణం ఏమిటనగా ఎరుగుట మరచుటలు ఇందు్క 86వ కం॥లో యెరుకపని చేయదనకుము ఎరుగుట మరచుటలు రెండు ఎవ్వరిపనులో అని శెలివిచ్చియున్నారు. మరియు యెరుక యొక్క స్వస్థానం ఏమనగా ఎరుపు - తెలుపు - నలుపు - దూమ్రం - ఆమధ్యనున్న ఆకాశమే స్వస్థానం. ఇందు్క 103వ.కం-లో ఎర్రది - తెల్లది- నల్లది క్రిరిది దానాగ్రమందు కలదొక్కతూటు అని శెలవిచ్చి యున్నారు. గాన దీన్ని సాంప్రదాయం తప్పకుండా నీవు ఏకత్వం పొంది యుండి దీనినడకంతా నీవు ఎప్పుడుకంటే యెరుక అప్పుడులేదు. నీవు అఖండమై అచలమైనప్పుడే, యెరుక ఏమీలేదు. గనుక వినబుద్ధైతే వినుడి. మీరు విచారించి తెలుసుకొనవలెనని, కోరికయుంటే తెలియజేసెదను కనుగొనమనసైతే దీనిలోతు ఎంత ఉన్నదో తెలుసుకొనవలెనని ధృఢనిశ్చయముంటే. ఈ పుస్తకమంతా కని యెరుక నడనుడులు ఉత్పత్తి స్థితిలయములు విచారించి తెలుసుకొని. యెరుకను ఏమీ లేకుండా చేసుకొనవలెనని భావము.

**విశేషార్థం** - ఓ జనులార జనన మరణములనగా సంకల్పవికల్పములు. ఈ సంకల్ప వికల్పములు లేకుండా పోయే మర్గమొకటున్నది. అది ఎవరికనగా ఏకాగ్రచిత్తముతో, రెండవది లేక వినేవారికి. ఆవిన్నదికనేవారికి, కనుట అనగా సంకల్పవికల్పములేని బయలగుట ఎరిగి. అనగా తానుబయలయ్యే మార్గం కనుట. అనగా తాను బయలవ్వాలంటే గురుకరుణచే గురుసూచనద్వారా విచారించి, తాను బయ[illegible] ఈ బయలే అచలం. ఈ అచలంకనవలెను. అట్లు కన్నవానికి, తనలా తెలియబడును. అనగా తానంటే అఖండస్వరూపమైనబయలు, ఇదే అచలం. ఈ అచలమనే బయలులో తనంతట తానుగా కల్పింపబడివచ్చేదే లేనెరుక. యిదే 25వదైన ఈశ్వరతమవ్వు ఇదే అక్షరం. ఇందులో క్షరమనే జీవతనువ్వు కల్పింపబడి ఈ జగత్తైనది. ఇదంతా తనలా ఈలావిచారించినవారికి. తనలా అంతాతెలిసినది. అనగా సాంప్రదాయము తప్పకుండా సద్గురుముఖతావిచారించినవారికి. తనలా తననటనంతా తెలిసినది. గనుక తాను ఎప్పుడు విచారిస్తే అప్పుడే అచలమౌచున్నది. విచారించకపోతే క్షరా క్షరమౌచున్నది. గనుక దీనిని వినబుద్ధైతే వినవలెనని మీకు మనసుంటే వినండి. ఆసాంతము దీనిని చదివి వినిపించెద మీకు. ఈ విన్నది కనవలెనని మీకు మనస్సుంటే దృఢనిశ్చయముంటే. నీవు బయలు ఏవిధముగా అవ్వాలో ఆ విధముగా నీకు సూచనజేసి చూచించెదను. నీవు ఆ సూచనద్వారా విచారించి బయలై అచలపరిపూర్ణమయ్యేదవు అని భావము.

2॥ వినవలెనని కనవలెనని - మనసందున కోర్కెగల్గుమనుజులెవినుడీ -
వినజేసెదకనజేసెద - ఘనమగుయీబోధ విన - కననొల్లనట్టి - మనుజులు
చనుదెచ్చినత్రోవబట్టి - తినుమంటె పులివల్లదనిలోకులనవింటి - గనుకానె
వినవాలెననరాదదు విన -కననొల్లనట్టి-మనుజులు చనుదెచ్చినత్రోవబట్టి ॥ 2

తా॥ ఓజనులారా! సంకల్ప వికల్పములు రాకపోకలు ఏమియూ లేకుండా చేసుకొనవలయునని గాని యెరుకయొక్క వడకంతా తెలుసుకొని ఆచరణపూర్వకంగా విచారించి, యెరుకను ఏమీ లేకుండగా చేసుకొనవలెనని, దృఢమైన కోరికయున్నవారే అవిన్నది కనండి. కనుట అనగా గురుసూచనద్వారాగా విచారించి మీరు బయలగుటయే కనుట, కనుక అట్టి మార్గం మీకు వినిపిస్తాను. ఆ విన్న దాన్ని కనజేస్తాను. అనగా మీరు బయలయ్యే విదానాన్ని సూచనజేస్తాను. ఆ ప్రకారం మీరు విచారించినట్లైతే, మీ జ్ఞాననేత్రానికి అపరము అనగా మీరు బయలయ్యే అచలమయ్యే విధానము మీకు తెలియబడును. ఘనమైనటువంటి మార్గం, అనగా దీని గొప్ప తనమేమనగా పునరావృత్తిలేకుండా చేయును. మరియు ఈ బోధయొక్క అఖండస్వరూపమును అచలపరిపూర్ణమును, మీకు వినజేస్తాను. విన్నదాన్ని కనజేస్తాను. ఇట్టి గొప్పదైన అచలబోధను మేము విననని కననని అనే మనుజులు, మీరు యేత్రోవలోనుండి వచ్చారో ఆత్రోవనే అనుసరించండి. మీది ఏ మతమో అనగా సంకల్ప వికల్పములను, జనన మరణములను, పొందుచునే ఉంటామంటే ఆ మతములోనే ఉండండి. ఎలాగంటే పులిత్రేన్పు పట్ట వానిని, నాలుగు కూరలు, పిండివంటలు వడ్డించి, భోజనము తినుమంటే నాకు పులిత్రేన్పుపడినది అందువలన నేను తినను అని లోకులు అనుట నేను విన్నాను. కనుక యిటువంటి గొప్పమార్గం విననని అన్నవార్ని మనము ఎలా వినుమంటాము. ఎందుకనగా అడవిలో మేసే ఆవును తినుటకు పెద్దపులి వచ్చినది. అప్పుడు ఆవు అమ్మా నాకు ఒక దూడ ఉన్నది. దాన్కిపాలు యిచ్చి ఇంకొకరికి అప్పగించివస్తాను అని వెళ్ళి దూడకు పాలిచ్చి ఇంకొక ఆవుకు అప్పగించి వెంటనే వచ్చి నన్ను తినుమన్నది. అప్పుడు ఆ పులి నవు సత్యంగా వచ్చినావు గనుక నిన్ను తినను అన్నట్లుగా సత్యవాక్కును నేను వినను అనేవారికి ఈ బోధవినమని అనుటకు, నాకు నోరాడుటలేదు అని భావము.

**విశేషార్థము** : ఓ జనులారా మీరు బయలయ్యేమార్గం అనగా అచల పరిపూర్ణమయ్యేమార్గం వినవలెనని కనవలెనని మీ మనస్సులో దృఢనిశ్చయముంటేనే దీనిని వినండి. మీరు పరిపూర్ణమయ్యేమార్గం మాకు అక్కరలేదంటే వినకండి, కావాలంటేనే వినండి. అతి వినజేస్తాను. ఆ విన్నది కనజేస్తాను. గొప్పదైన ఈబోధ అంటే ఎవరు చెప్పేబోధలైనా తానుండి చెప్పేవేగాని, తానులేక చెప్పే బోధలు లేవు. ఇది తాను,లేక ఉండే మార్గం. గనుక యింత గొప్పమార్గం ఇంకొకటి లేదు. యీలాంటి గొప్పదైన అచల బోధ విననని. కననని అనే మనుజులది ఉండి చేసే మార్గం. మీరు ఆ మార్గంలోనే ఉండండి. అనగా మీరు పరిపూర్ణమై యుండి అన్ని చేసే మార్గం మీకు అక్కరలేదు. గనుక మీరుండి అన్నిపనులు చేసుకొనే మార్గంలోనే ఉండండి. పులిత్రేన్పు పట్టవానికి నాలుగు కూరలు పిండివంటలు వడ్డించి బోజనం చేయమంటే నేను తినను అన్నటుగా మంచిదైన, గొప్పదైన బోధ విననంటే, మేమెట్లు వినిపించెదము. వినుమేని అనుటకు నాకు నోరాడుటలేదు. అని భావము.

**3 ॥ నను మిమువేగని పుస్తక - మునుజేసితి దీన్ని మీరు మదమునవినుడం - చనుటయు మిమునను మీరలు - గనుగొని వినిపించుమనుట - కలయిట్టిమాటా - బోధనమేల్క- గనలేదెచ్చోటా - ఘనులార యిటువంటికలలో ముచ్చటలాడి - గనకోవిమీరు మేల్కొని- మేల్కొల్పుడినన్ను - కలయిట్టిమాటా - బోధను మేల్క - గనలేదెచ్చోటా ॥ 3**

తా॥ సభలో ఉన్న ఓ జనులారా, నన్ను మిమ్ములను జీవేశ్వరులనే ప్రపంచమని నేను విచారించి తెలుసుకొని, ఇది ఆత్మానాత్మలని నేను ఎరిగి ఈ పుస్తకమును రచించితిని, అనగా నేననగా ఆత్మ మీరనగా అనాత్మ, ఆత్మానాత్మలనే జగత్తులను నేను ఎరిగి, ఈ గ్రంథమును రచియించితిని. దీన్ని మీరు వినుమని నేననుటయు, మీరు మిమ్ములను నన్ను అనగా జీవేశ్వరులను కనుగొని, వినుపించుమనుట కల. అనగా నేననే ఆత్మనుండి వచ్చిన జగత్తు ఈ రెండు స్వప్నము వంటివేనని ఎరిగి ఇట్టి మాటను అనగా ఈకలను, బోధనే మేల్క అనగా గురు సూచనవల్ల అచలపరిపూర్ణమనే మేల్కవల్లను నేనెరిగితే, నేనుఅనేకల మేలుకున్నవారైతే, లేకయుందురు, అనగా మీరు బయలై అచలపరిపూర్ణమై యుందురు అనగా జీవేశ్వర్లనే ఆత్మానాత్మలనే కలలేదు. మహానుభావులైన మీరు నేను మేనులనే కలలో మాట్లాడుకొని విచారించుకొని మీరు మేల్కొని, అనగా మీరు బయలనే అచలమయ్యి అందులో తోచిన యెరుకనే జగత్తని గాని నేను మేనులుగాని, ఆచూపులో ఏమీ లేదని యెరిగి, నన్ను మేల్కొల్పుడి, ఆ మేల్క ఏవిధముగా పొందెరో, ఆపొందినది మేల్కలో ఎలాగున్నదో ఆ మేల్కలో యెరుకపుట్టుచున్నదా నాకు ఆ వివరములన్నీ చెప్పండి. అనగా మేల్కనే బయలులో జీవేశ్వర్లనే ప్రపంచమున్నదా లేదా! నాకు చెప్పవలయును, అనగా ఈ విధముగా విచారించి శిష్యుడు మేల్కొని పునరావృత్తి రహితులై యెరుకపుట్టకుండ ఉండడమే గురుని మేల్కొల్పుట. అనగా ఆ మేల్కయొక్క విషయము గురునికి చెప్పుకొనుటయే గురుని మేల్కొల్పుట అని భావము.

**విశేషార్థం** : ఓ జనులారా! నేను మేనులు జీవేశ్వర్లు అనే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు. అను దానిని నేనుగని. ఈ పుస్తకము రచించితిని, దీన్ని మిమ్ములను వినుమనుటయు, మీరు కూడా ఆ జీవేశ్వర్లనే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదనే విషయం ఎరిగి మీరునన్ను వినిపించుమనుట కల. ఇట్టి మాటబోధనే మేల్కగన లేదచ్చోట. అనగా నేను మేనులనే కల అచలపరిపూర్ణమనే మేల్కను పొందేసరికి ఈ కలయనే యెరుక ఆ మేల్కలో లేదు. మహాఘనులైన మీరు యిటువంటి కలలో ముచ్చటలాడి విచారించి ఈ కలను మీరు మేలుకొని నన్ను మేల్కొల్పుడి. అనగా ఆయన నిర్వికల్ప సమాధిలో ఉన్నారా! లేక నిద్రపోతున్నారా! ఎందుకు మేల్కొల్పాలి. అని విచారించితే, ఇది ఏమీ కాదు. కలలో ఏలా ఉన్నదో, మేల్కలో ఎలా ఉన్నదో, ఆ విషయములు చెప్పమని అర్థము. అనగా కలలో ఎరుక ఎన్నో వికారములు పొందుచున్నది. మనం ఆకలను మేలుకుంటే ఏ వికారములు లేక ఎరుకబయలై నిర్మలముగా ఉందని చెప్పుటయే మేలు గొల్పుట అని భావము.

4 ॥ ఒరులొరులు నేను నేనని - యొరులను తననెన్నడెరుగకున్న బయలులో - నరుదెంచి తనను తాగని - పరులనుగని లెస్స నేను - పరులానియనుచూ - యెరిగే యెరుకే - బయలుండగను చూనిరతాము తానెందునిలువాకుండుటకూనై - విరచిస్తిదీన్నెరుకా వినెనా నిల్వదునేను - పరులానియనుచూ - యెరిగేయెరుకే - బయలుండగనుచూ ॥ 4

తా॥ ఓ జనులారా! ఒరులనగా ప్రకృతి, నేననగా పురుషుడని. ఈ ప్రకృతి పురుషులను యన్నడు యెరుగనటువంటి బయలులో నుండి యెరుక ఏర్పడి తనంతట తానుగా వచ్చినదేనేను అనగా 25వది అయిన ఈశ్వర తనువని యెరిగి, మేననగా 24 ఇంద్రియములతో కూడిన జీవతనువని యెరిగి, నీవే నేను నేనే నీవు అని తెలుసుకొని, అనగా జ్ఞానమే అజ్ఞానము, అజ్ఞానమే జ్ఞానము, అని తెలుసుకొని ఏ తెలివిచేత తెలసికొన్నావో ఆ తెలివి అనే జ్ఞానంచేతనే బయలును ఉండచూచే సరికి, బయలును ఉండజూచుట అనగా, తాను బయలై జ్ఞానాజ్ఞానములు రహితమైనవాలేక తోచుచున్నావా అని, తాను బయలైన అచలములో యింకా తోచుచున్నదంటే, నీవు బయలయ్యే ఆ బయలు ఎప్పుడూ ఉండేవరకూ విచారించవలెను. అనగా 26వ తత్వమైన అఖండ స్వరూపాన్ని ఉండజూచి, ఈ ఎరుకను ఏమిలేకుండా చేయవలెను. అనగా నేననే ఆత్మ దానియందు తోచు జగత్తు లేకనీవు బయలై పరిపూర్ణమై ఉండవలెను. గనుక ఈ ఎరుక సర్వకాల సర్వావస్థలయందు ఏమీ లేకుండా పోయేకొరకు అనగా తాను బయలై అచలమై సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమైయుంటే ఈ దేహాదేహములుగా యున్న ఎరుక ఏకాలమందూ లేదు. గనుక అలా ఉండేకొరకు ఈ గ్రంథము రచించితిని గనుక ఇది మీరు విని విచారించి తెలుసుకున్న వారికి పునరావృత్తి రహితమై తాను లేక యుండును. ఇటువంటి వారివద్ద యెరుక ఏ కాలమందు నిల్వదని భావము.

**విశేషార్థము** : ఓ జనులారా! ఒరులని మీరనినేనని వీరెవరిని యెరుగని బయలులో నరుదెంచి అనగా తనను యితరులను యన్నడు ఎరుగని బయలులో తనకు తానే వచ్చి తనను తాను చూచి అనగా అఖండ ఎరుకనుచూచి పరులను చూచి ఆయఖండములో వచ్చిన జీవేశ్వర్లను జూచి లెస్సగా నేనే పరులు పరులేనేను అనగా జీవుడే ఈశ్వరుడు, ఈశ్వరుడే జీవుడు అని అనుకొని ఈయన్నిటినీ యెరిగిన యెరుకే బయలును ఉండజూచి అనగా తాను బయలైన స్థితిని తానుండ జూచి, నిరంతరము త్రికాలములయందు తాననెయెరుకెలదులోను నిలవకుండా పోయేకొరకు అనగా తాను బయలైన బయలులో తానైన యెరుక ఎక్కడా లేకుండా పోయేకొరకు ఈ గ్రంథము రచించితిని. దీన్ని యెరుక వినినా విచారించి ఆ మేల్కను పొందిన, తాననే యెరుక యక్కడానిలువకుండా పోవునని భావము..

5 ॥ ఎరుకను కలలోపలనే - నరుదెంచితి మీరలట్లయరుదెంచితిరీ - ఎరుకజననేను మీరలు - యెరుకతో జనువారమనుచు - యెరిగేటికొరకూ - గ్రంథముజేస్తి నెరిగీ యీ వరకూ - గురుబోధంచనుమేల్కొనరులారచేకొంటె - యెరుకానెకలజోలి నెరిగున్న నిల్వదం - చెరిగేటి కొరకూ - గ్రంథము జేస్తి - నెరిగి యీ వరకూ ॥ 5

 

తా॥ ఓ జనులారా! మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమనే కలను. అనగా యెరుక అను జీవేశ్వరులు అనేకలలో నేను వచ్చితిని. మీరు కూడా అలాగే వచ్చినారు. అనగా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమనే కలలో. 25వది ఐన ఈశ్వర తనువనేనేను వచ్చితిని. అందులో నుండి 24 ఇంద్రియములతో కూడియున్న జీవతనువనే మీరు కూడా అలాగే వచ్చారు. ఈ గుర్తెరిగే నేను మేనులు అనే యెరుక లేకపోయిన యడల. దానితోపాటు మీరు మేమనేజీవేశ్వర్లు కూడా లేకపోయే వారమేనని ఎరిగే కొరకు. నేను ఎరిగి ఈ గ్రంథము రచించితిని, ఓ నరులారా మీరు గురు సూచనవల్ల మేల్కొని ఆ మేల్కయనే పరిపూర్ణమే మీరైయుంటే, అనగా గురుషూచనవల్ల అఖండ స్వరూపమైన మేల్కను ఎరిగి. ఆ మేల్కేతానై ఉంటే, అనగా తాను బయలై ఉంటే. యెరుకనే కల ఒకప్పుడుతోచినా అది నిలువదు. పరిపూర్ణములో లేక తోచిన ఈ యెరుకనే నేను మీరులేకపోయే వారమేనని. ఆ పరిపూర్ణ పరశివతత్వమే యల్లప్పుడూ ఒకే తీరుగా శాశ్వితముగా ఉండేదని. అది యెరిగే కొరకు. ఈగ్రంథము రచించితిని. అనగా మీరు సర్వకాలములయందు మేల్కనే పరిపూర్ణమై యుంటారన్నియు, యెరుకనేకల యేకాలమందులేదనియు. శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్ర ప్రభువులవారి భావము.

**విశేషార్థము :** ఓ జనులారా! యెరుకే కల, ఆకలలో నేను వచ్చితిని, మీరు కూడా ఆకలలోనే వచ్చియున్నారు. గురుకరుణచే అనగా గురుసూచనద్వారా విచారించితే యెరుకనేకల లేకపోయెను. ఆ యెరుకతోనే మీరు నేను లేకపోయేము. యిక కలలేదుగనుక మేల్కేయున్నది, అనగా యెరుకలేకపోతే మీరు నేను ఆ యెరుకతోనే పోయేవారమని ఎరిగేకొరకు, ఈ గ్రంథము రచియించితిని. కలలేదని మేల్కయున్నదని ఎరిగి యింతవరకూ కలలేదు. గురుమేల్క ఉన్నదని ఎరిగి, అనగా తాను బయలైన అచలమేయున్నదని ఎరిగినప్పుడు, యెరుక ఏమీ లేదుగనుక, తాను సర్వకాల సర్వావస్థలయందు, ఆ మేల్కయనే, పరిపూర్ణమై యున్నాడు గనుక, యెరుకనేకల ఎరుగున్నా నిల్వదు. అనగా తాను పరిపూర్ణమైయున్నదానిలో ఒకప్పుడు ఆ పరిపూర్ణములో ఎరుక తోచినా ఆ యెరుకనిల్వదు. అనగా తాను ఒకప్పుడు ఎరుకైనా ఆ యెరుకనిల్వదు. అని యెరిగే కొరకు, ఈ గ్రంథము రచియించితినని భావము.

**6 * శ్రీ మించునచలబోధను - యే మహనీయుండు జేసి - యెగజల్లెనోయీ - భూమిన్ సుజనుల కొరకా - రాముడుగన్యయజ శివ - రామాదీక్షతులన్ - తలచి యప్పారావ్ - గుణతతులన్- ప్రేమాతో బొగడినే భూమి నిర్ణయపరశు-రామాసీతారామ స్వామికి మ్రొక్కిశివరామదీక్ష తులన్ - తలచి యప్పారావ్ - గుణతతులన్ ॥ 6**

తా॥ శ్రీమించునచలబోధనగా, లక్ష్మినిమించినది అచలబోధని, అచలమనగా అఖండ స్వరూపమైన బయలు, ఇట్టి బయలును సుజనులైన పుణ్యాత్ములకొరకు, యే మహనీయుడు తెలుసుకొని వీనిని విచ్చలవిడిగా వెదజల్లెనో, అట్టి శ్రీమద్రామడుగు శ్రీ శివరామదీక్షితులవారిని, చేరి అప్పయ్యమంత్రి, వీరు శిష్యులు శ్రీమత్ సీతారామస్వాములవారిని, ఈ మహాత్ములందరికీ, నమస్కరించి, నా మనస్సు

నందు ఏరిని నిలుపుకొని, ఈ గ్రంథము వ్రాయుటకు, ప్రారంభించుచున్నాడనని భావము.

7 ॥ **శ్రీ మత్సీతారామ - స్వామికృపన్ జెప్పనయ్యీ - సదసద్రహితం బేమిపదార్థమొదానివి - యీ మహికందార్థములుగా - నివి వినరయ్యా - ఓ జనులార - యిటుగనరయ్యా - వేమారునే మిమ్ము వేడిదింతియనుమ్మి - నా మీద కృపజేసినను జదువుమని మీర - లివి వినరయ్యా - వో జనులార యిటుగనరయ్యా ॥ 7**

తా॥ అట్టి శ్రీ మద్గురు ప్రభువులైన, సీతారామ స్వాములవారి, కృపవలన సదసద్ రహితంబేమి పదార్థమో, అనగా సత్తుచిత్తులు రహితమైన తరువాత ఏది ఉన్నదో, అదే పరిపూర్ణ పరబ్రహ్మం, అట్టి దానిని అనగా అఖండమై అచలమై బయలై యున్న దానిని, ఈ భువిలో కందార్థదరువులుగా, అపరిపూర్ణం మీరు తెలుసుకొనే కొరకే, ఈ గ్రంథము రచియించితినని, శ్రీ భాగవతుల క్రిష్ణదేశిక ప్రభువరులవారు ఈ పద్యమందు చెప్పుకొనెను మరియూ ఇవి మీరు వినండి అనగా ఇవి మీరు ఆసాంతముగా చదివి, విని విమర్శించి, తరించెదరని నేను ఈకందార్థములను రచించితిని, ఓ జనులార ఇటుచూడండి, మీరు విచారించె ద్వైతాద్వైతములకు, అతీతమైన పరిపూర్ణ బోధయిది గనుక మీరు దీనిని బాగా చూచి గ్రహించి, ఆచరించి జన్మరహితము చేసుకొనెదరని, నేను మిమ్ములను పదే పదే వేడుకొనుచున్నాను, అందువలన నామీద దయ ఉంచి, నన్ను చదువమని మీరు వినండని నేను వేడుకొనుచున్నాను, అనగా సత్శిష్యులైనవారై, గురుభక్తి గురుసేవ గురునిష్ఠ గలిగియున్న వారికే, ఈ పరిపూర్ణ బోధ తెలిసి, వారు అచలమై ఆచరించగలరని, నేను చెప్పుచున్నానని భావము.

8 ॥ **శివరామ దీక్షతుల - శిష్యవరుండప్పయ్యమంత్రి - యతవి శిష్యుడీ - భువి పరశురామవంశో - ద్భవసీతారాములతని భక్తుడ సుమ్మి - తద్బోధన -యుక్తుడ సుమ్మీ - స్తవనీయులగుమీరు - త్సాహముతో యీగాధ - వినుండివేకందార్థముల చే వివిపింతు - భక్తుడనుమ్మీ - తద్బోధన - యుక్తుడనుమ్మీ ॥ 8**

తా॥ శ్రీ శివరామ దీక్షితులవారి శిష్యులు కంభాలూరి అప్పబ్రహ్మమంత్రి వర్యులవారు, వీరి శిష్యులు శ్రీ పరశురామ సీతారామస్వామి, ఇట్టి సీతారామస్వాములవారి శిష్యుడను, వారి భక్తుడను ఈ గ్రంథము రచియించితిని, నన్ను భాగవతుల క్రిష్ణభట్టు అనెదరు. నేను సీతారామస్వాములవారి బోధవలననే, ఈ గ్రంథమును చెప్పుచున్నాను. వీనిని తెలుసుకొనగోరే మీరు, ఉత్సాహముతో ఈ పరిపూర్ణ బోధ వినండి, నేను ఈ కందార్థరూపేణా మీరు బయలయ్యేలాగు, చదివి వివరించి, విపులముగా చెప్పెదనని భావము.

9 ॥ **మనసిచ్చివినుడి యికనొక - మనవిది నా పాలిగురుని - మదిలోపలనే - ననుచుకొని పెద్దలాజ్ఞను - పనిబూనుకచేస్తి నిట్టి - పద్యాములిన్నీ-తప్పొప్పు లేర్పర్చ దిద్దుండన్నీ-ఘనమతి మంతూలుగనుకొనే ప్రార్థిస్తి - నను మీకటాక్షే క్షణముల వీక్షింపూచు - పద్యాములిన్నీ - తప్పొప్పులేర్పడ దిద్దుండన్నీ ॥ 9**

# ☆ 8 .పరిపూర్ణ బోధ. 26 ☆

**135 ॥ యీ ఉత్తబట్ట బయలును నీవిప్పుడు వుండజూచి నిజముగ యెరుకన్ - నీవని నేనని జగమని - భావింపుము పిదపదీన్ని - బాయుమని శమున్ - నిజముగదీన్ని - బాయక నిశమున్ - శ్రీవని తేశరాజీవ సంభవ భవ - దేవేంద్రాదుల నింకసేవించు తలుపేల - పాయూమ నిశమున్ - నిజముగ దీన్ని బాయకనిశమున్ ॥ 1**

తా॥ శిష్యా! నీయాత్మనె యెరుక ఉత్తదై బట్టబయలై యున్నదో లేదో ఆ స్థితిని వుండజూడుము, ఆ స్థితిలో యెరుక ఎలా ఉన్నదో, సంకల్ప వికల్పములు తోపించుచున్నదో, లేక వూరుకున్నదో, లేక నీవని నేనని ఎరుగుచున్నదో, దానిని బాగా విచారించి ఎరిగి, దానిని విడిచిపెట్టుము, యెరుకను విడిచిపెట్టకపోతే నీకాస్థితి కుదురదు, గనుక నీవు ఉత్తబట్టబయలై అచలమై చలనము లేని స్థితిని విడిచి పెట్టకుము, సర్వకాల సర్వావస్థలయందు ఈ స్థితిలో ఉండవలెను. అలా ఉండక సర్వకాలముల యందు యెరుకతోనే ఉండిన యెడల నీకాస్థితి కుదరదు. గనుక యిక నీవు బ్రహ్మ విష్ణు మహేశ్వరులని గాని ముప్పై మూడు కోట్ల దేవతలని గాని ఎవరిని సేవించ వలసిన పనిలేదు, ఆ తలంపునీకెందుకు, నీవు సర్వకాల సర్వావస్థలయందు, యెరుకను విడిచిపెట్టి, నీవా స్థితిని విడిచిపెట్టకు, యిక యెరుక మాట తలంచకుమని భావము.

**విశేషార్థము** : ఈ ఉత్తబట్టబయలును నీవిప్పుడు ఉండజూచి, అంటే నీ ఆత్మ అయిన యెరుక ఉత్తదైనాదా, లేదాయని నిదానించి నిలఛూడవలెను, అనగా సంకల్ప వికల్పములు పొందుచున్నాదా లేక నీవని నేనని ఎరుగుచున్నదా, వూరుకొని ఉత్తదైయున్నదా, అని నిలచూడవలెను, మరిసంకల్ప వికల్పములు పొందుచుంటే, నీవు మరల బట్టబయలు అవ్వవలెను, యెరుక పుట్టకుండా వుండవలెను. గనుక నీవెప్పుడు. బట్టబయలై ఇట్లు చేయవలెనని భావము. యిందుకు రామయోగి 85వ కందార్థం

కం॥ బట్టబయలందు నిప్పుడే ఘట్టిగనీవుండి - లెస్సకని యెరుకలెసన్ బుట్టును
నీవని నేనని గుట్టుగ నీవెరిగి యెరుక కోల్పెట్టు తండ్రీ - యామరకుమీ పట్టు
మా తండ్రీ మట్టులేని బ్రహ్మ విష్ణీశులను గొల్పు - నట్టి వింభ్రమ లెల్ల చిట్టచివరకు
నంటి కోల్పెట్టు తండ్రీ - యామరకు మీ పట్టుమా తండ్రీ ॥

**తా॥** శిష్యా! తనయా నీవిప్పుడే పరిపూర్ణము నందుండి, పుట్టునవి గిట్టునవి దేహి దేహములేనని ఘట్టిగా తెలుసుకొని, ఎరుకను పొగొట్టుము, ఈ పట్టునే మరవద్దు, బ్రహ్మ విష్ణు రుద్రాదులను గొల్పుబ్రమలను బొత్తిగా విడిచిపెట్టి, యూరకుండుమని భావము.

తా॥ అయ్యా! చందస్సు వగైరా శాస్త్రములు తెలియకుండా, ఈ కందార్థములు వ్రాసినాను. ఎందుచేతననగా, వీటిని నేను చదివితే, మీరు విని ఇందులో తప్పులేమైనా యుంటే అవి మీరు దిద్దెదరని. ఆ దిద్దినవి నా మనస్సుకు అందించెదరని, నేను చిత్తమందు ఇట్లు తలపోసి ఈ కందార్థములను రచించి మీ ముందర ఉంచితినని. మీరు భావించి యివి దిద్దవలెనని భావము.

**13 ॥ పునరుక్తి గల్గియుండిన - వినికోపము శాయవలదు - వేడుకొనియెదన్ - వినువారు దూరపర్థము - గనవలెదగ్గెరనటంచు - గల్పించినానూ - తెలియకకాదీ - గ్రంథము లోనూ - జననీ జనకులు - తమ తనయూల పునరుక్తి - వినగోరుదురు తప్పంచనకా నేనది దెలసి - కల్పించినానూ - తెలియక కాదీ - గ్రంథాములోనూ ॥ 13**

తా॥ అయ్యా! ఈ గ్రంధములో, పునరుక్తి అనగా, అన్నదే మరల అనుట, అట్టి పునరుక్తి దోషముగలిగియున్నది. అదెందుకు అంటే, ఆ పునరుక్తి తెలసియే, ఈ గ్రంధములో అనేకచోట్ల కల్పించితిని. ఏమనగా దూరముగా యున్న అర్థము, దగ్గరగా తెలుయుటకొరకు, అనగా తెలియని విషయాన్ని ఏదైనా చెప్పినదే మరల చెప్పినయడల, తేలికగా అర్థమౌనని, అన్నదే అన్నాను. దానిని మీరు చూసి తప్పగా తీసుకోవద్దు, అనగా మీరు ఆ పునరుక్తి చూచి కోప్పడవద్దని, నేను మిమ్ములను వేడుకొనుచున్నాను. నేను తెలిసియే వ్రాసినాను. ఎందుకనగా తల్లిదండ్రులు తమయొక్క పిల్లలు వచ్చీరాని మాటలు మాట్లాడితే, తప్పని చెప్పకుండా ఆ మాటలే మరల మరల పలికించుకొనట్లు, నేను పునరుక్తి కల్పించితిని. మరియు ఈ పరమ రహస్యమైన అచలబోధ, అంత తేలికగా అర్థము కాదని, యిది చాలా గుహ్యముగా యున్నదని, చెప్పినదే చెప్పితినని చెప్పితి, సులువుగా తెలియబడునని భావము.

**14 ॥ ఇది యాంధ్ర కవిత్వంబని - మదిరోయందగదు దీని మర్మమంయుడీ - పదియారు వన్నెపసిడిని - ముదమున తొల్పెట్టినుంచ ముట్టాడుదురా - లోకుఖ చాత-బట్టా కుండుదురా - యిదిగాక కులహీనుడిచ్చిన ద్రవ్యాము - విదితాముగా యెంతవేత్త లైనను దాన్ని - ముట్టాకుండుదురా - లోకులు చాత - బట్టాకుండుదురా ॥ 14**

తా॥ ఓ పండితులారా! ఇది ఆంధ్రకవిత్వమని, మీ మనస్సులో అసహ్యపడక. దీనిలో ఉన్న గొప్ప రహస్యమైన, మర్మము గ్రహించవలయును, మరియు పదహారువన్నెగల బంగారము, తోలుపెట్టిలో ఉంచినంత మాత్రమున, దాని విలువతగ్గునా, ఆ బంగారము ఎవ్వరు ముట్టకోకుండా ఉంటారా, ఈ లోకులు దాన్ని చేతపట్టుకోకుండా ఉంటారా, ఆదిగాకుండా కులము తక్కువ వాడిచ్చిన, ధనము గొప్ప పండితులైనా వారు పుచ్చుకొనకుండా ఉంటారా, అట్లాగుననే ఇది ఆంధ్ర కవిత్వంబని దీన్ని సంస్కృత భాషలో వ్రాయలేదని, దీనిని విడిచిపెట్టవద్దు సుమా అని భావము.

**15 ॥ అసాంతము యీ గ్రంథము- ప్రాసయుతుల్ శబ్దగణము భావమయుక్తుల్ -జూచి పరిపడనిచోటను - యీ సభలో పెద్దలెల్లా - యిది దిద్దవలెనూ - దిద్దియిదేనా - మది కద్దవలెనూ - మీసాటి వారికి వ్యాసాటలేదుంటే - నాసాటివారి బ్రత్కేసాటిగా కుండు - నిదిదిద్దవలెనూ - దిద్దియిదే నామది కద్దవలెనూ ॥ 15**

తా॥ అయ్యలారా! ఈ సభలోయున్న మహాపెద్దలైనమీరు, ఈ గ్రంథములోనివి సాంతముగా మొదటనుంచి చివరివరకు, దీనిభావమును చదివిస్తాన యతి శబ్దముగణము భావము యుక్తులు, యివియన్నియు చూచి సరిపోవని స్థానములయందు, పెద్దలైనమీరు, ఇవి దిద్దవలయును, దిద్దినవి నామదికి సరిపోవలెను. మీవంటి వారికి, యిది పెద్దప్రయాసకాదు, మీరేప్రయాస అనుకుంటే, నాలాంటివాని బ్రతుకు ఏదారిలేకుండు, గనుక ప్రాయాసయని అనుకోకా, నామనో భావమునకు, సరిపోయేలాగు దిద్దమని ప్రార్థించుచున్నాను. అలా తప్పులు ఒప్పులుగా చేయుటలో, ఈయచల పరిపూర్ణభావమునకు, విరుద్ధముగాకుండా, దిద్దవలయునని. నేను మనవి చేయుచున్నాను అని భావము.

**16 ॥ తప్పొప్పులురెంట్నెరుగని - తప్పుతనందుండిదీన్ని - తప్పనికూశే - తప్పుడు నరునకు జెప్పెద - చప్పుడు చాలించుమనుచు - సభవారు వినగా - సరెసరెనాని- సభవారిట్లనగా - చెప్పినవినకుంటె - తప్పువానిదెసుమ్మి - తప్పొగలిగినవెనుక- గొప్పావాడెట్లౌను - సభవారు వినగా - సరెసరెనని - సభవారిట్లగా ॥ 16**

తా॥ అయ్యా! తప్పనగా ఏదో, ఒప్పనగాఏదో, రెంట్నెరుగని తప్పుతనందుండి దీనిని తప్పనే వారికి చెప్పచున్నాను, చప్పుడు చెయ్యవద్దని, నిశ్శబ్దముగా ఉండమని, ఈ సభవారంతా వినేటట్లుగా చెప్పచున్నాను, సరే సరే అని సభవారలనగా, చెప్పిన వినకుంటే, అనగా ఈ కందార్థములలో తప్పులేనిదే తప్పంటే తప్పువానిదే, ఒకసారి తప్పు కలిగినవాడు, యప్పటికి తప్పుడు నరుడే, వాడు గొప్పవాడుకాజాలడు, గనుక తప్పుడు నరుని మాటలు, మనము లెక్కచేయవలసిన, అవసరం లేదని భావము.

**17 ॥ ఇలుజొచ్చి గ్రామసింహము -కలదొంతులు గూల్చునింటి గరితలౌరుగుదాం - తులు చక్కజేతురట్లనె - యిలసుకవిజనోక్తి తప్పులెంచూదుర్జనుడూ - తప్పొప్పు గా - వించు సజ్జనుడూ - తులలేని బుద్ధిమంతులు సర్వజ్ఞులు మీరు - తెలుసూనా తలపునే దెలిపేదేమిక తప్పు - లెంచూ దుర్జనుడూ - తప్పొప్పుగా - వించూ సజ్జనుడూ ॥ 17**

తా॥ అయ్యా! ఇంటిలోనికి చొరబడిన కుక్క, దొంతులుగా ఉన్నకుండలను పడగొట్టును, కాని ఆ కుక్కపడిపోయిన దొంతులను, దొంతులుగా పేర్చలేదు. కాని ఆ యింటిలోయున్న స్త్రీలు, ఆ పడిపోయిన కుండలను చక్కగా పేర్చుకొనియెదరు. ఆలాగుననే యిలలో సుకవులు చెప్పినమాటలు, అనగా మంచి కవులు రచించిన గ్రంథములలో ఒప్పులను వదలి తప్పులను వెదకుచుండును దుర్జనుడు, వాడు తప్పుడునరుడే, అతడు తప్పుఒప్పుగా సరిచేయలేడు. సజ్జనులు తప్పుఒప్పుగా సరిచేయును. యింత అని చెప్పలేని

బద్ధిమంతులు సర్వము తెలిసిన మీరు, అనగా జరిగేది జరుగుచున్నది. అన్నీ మీకు తెలుసును. సర్వజ్ఞులు, మీకు తెలిపేదేమున్నది, యక్కడనైనా దోషములుంటే, మీరే సరిజేయుడు, మరియు ఈ గ్రంథములో పరిపూర్ణబోధయందు ఏదైనా సవరించిన యడల, నామదికి సరిపోయేలాగున ఉండవలెనని భావము.

**18 ॥ తనగొప్పనెంచరేమో - జనులను తలపోసిసాధు - జనకృతకవితల్ - వినడితరులు వినగోరిన - వినకనరాదనుచు మనసు విరుచూ దుర్జనుడూ - విని వినిపించు వేడ్కా సజ్జనుడూ - కనవొచ్చెముంజేతి కంకణాలకు వేరే - ఘననిల్యుటద్దాము గావాలెనా మనసు - విరుచూ దుర్జనుడూ-వినివినిపించువేడ్కా సజ్జనుడూ ॥ 18**

తా॥ అయ్యా! తనగొప్ప చెప్పకోరేమో ఈ ప్రజలని, తనలో తాను తలపోవుచుండును దుర్జనుడు. సాధుజనులు చెప్పే విషయములను, అనగా సుజనులు చెప్పే కవిత్వమును, ఇతడు వినడు, యవరైనా వింటూ ఉంటే, ఆ బోధ వినవద్దు. ఆ గ్రంధము చదువవద్దు, ఆ బోధవిన్న చదివిన చెడిపోదురు. అని భయపెట్టను ధుర్జనుడు. ఎందుకనగా కనవచ్చుచున్న, తనచేతికున్న కంకణము చూచుటకు, నిలువుటద్దము కావలయునా! అక్కరలేదు. వాడు వినడు ఇతరులను వినకుండా, మనస్సు విరుచును దుర్జనుడు. సజ్జనుడు విని వినుపించును వెంటనే అని భావము.

**19 ॥ ఆగామీ కథయెట్లన - బాగుగ వివరింతుచెవ్రుల - పండువుగాగన్ - ఆగమనిగమోప నిషత్సాగర మధితార్థమవల - సాంగోపాంగముగాన్ - దయతో - వినుడి - సాంగోపాంగ ముగాన్ - ప్రాగర్థచరమార్థ యోగాములకునునం-యోగముగావించినే గుర్తెరిగిన దంత - సాంగోపాంగము గాన్ - దయతో వినుడి - సాంగోపాంగముగాన్ ॥ 19**

తా॥ అయ్యా! ఇకముందు జరగబోయే విషయం, గురించి మీకు చక్కగా వివరించెదను, మీ చెవులు విని ఆనందం కలిగేటట్లుగా చెప్పెదను, అదియేమనగా ఆగమములు నిగమములు ఉపనిషత్తులు అనే ఈ మూడింటి యొక్క సముదాయమనే, ఈ సముద్రమును మదించగా తెలిన పదార్థమునకు, ఆవలి విషయము మీకు తెలిసేలాగు, ఆనందంగా ఉండేలాగు వివరించెదను, మీరు దయతో వినండి, పెద్దలు చెప్పిన విధముగా తెలియజేయుదును. యెట్లనగా ప్రాగర్థమనగా పూర్వమందు పెద్దలు వచించినది. చరమార్థమనగా ఇప్పుడు జరుగుచున్న విషయములు, ఈ రెంటికి జత పర్చివాను. తెలిసినంత వరకు చెప్పచున్నాను. అనగా వేదములు శాస్త్రములు ఉపనిషత్తులు మధించగా విచారించగా, తెలసిన సారము అఖండస్వరూపమైన బ్రహ్మము, యిట్టి అఖండమైన యెరుకే అన్నింటికీ మూలమైయున్నది. యిదే సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మము, దీనివల్ల ముందునీవు అఖండస్వరూపమయ్యి సర్వకాల సర్వావస్థలయందు, ఇంద్రియ ప్రపంచానికి అతీతమై, రెప్పపాటులో నగం కాలం కూడా యేమర్చియుండక, త్రికాలములయందు సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మమయ్యి

ఉండగలిగినప్పుడు, అనగా నీవు బయలయ్యి అంతర బహిస్సులయందు నిండినిబిడీకృతమై సూదిమొనమోపుటకు సందిలేకుండాయున్న అఖండయెరుకకు అవలయున్నదే అఖండానుభవరహిత పరిపూర్ణంబని తెలియవలెనని భావము.

20 ॥ **మోదమున బ్రౌఢులోకకు - వాది ప్రతివాదులగుచు వరగురుశిష్యుల్ - వాదించిరను చునొకసం - వాదముగల్పిస్తికలగా వదలాక వినుడీ - మొదటినుంచి తుది వెల్లగనుడీ - వేదాంతార్థతీత వేత్తాలు మీరిందు - యేదేది సవరించుడిదెనా విజ్ఞాపన - వదలాకవినుడీ-మొదటనుంచి - తుదివెల్లగనుడీ ॥ 20**

తా॥ అయ్యా! యీ అచలబోధను కాలము వృధాకాకుండగా, కాలము సద్వినియోగము చేసుకొనుడు, వాదియనియు ప్రతివాదియనుయు, గురుడనియు శిష్యుడనియు, వీరువాదించుకున్నారని, పరమనియు లేని యెరుకనియు, మరుపనియు కల్పించినాను, అది తెలియకకాదు, యిది యొక కలయని, తెలిసియే కల్పించితిని. గనుక దీనిని వదలకుండా, మొదటినుంచి తుదివరకూ చూచి, విమర్శించండి వేదవేదాంగములు, చదివి విషయమంతా గ్రహించి, అతీతముగా పరిపూర్ణముగా యున్న వారలు మీరు, యిందులో ఏమైనా తప్పులున్న యెడల, సవరించమని వేడుకొనుచున్నానని భావము.

21 ॥ **కొంచములో సరిపుచ్చక - పెంచిన వీగ్రంథమనుచు పెద్దలలుకగన్ -మించిన వేడ్కతోవినుడీ - పెంచిన యర్థంబునేడె - ల్రెదలోకులెల్లా - అర్థముదెలసి - మదినుల్లాసిల్లా - పెంచితి పెంచితి గొంచాము వెడలూపు - వుంచుండెనదిలో తంచెంచీవామదివిడె-ల్రెదలోకులెల్లా-అర్థముదెలసిమదినుల్లసిల్లా ॥ 21**

తా॥ అయ్యా! కొంచెములో సరిపుచ్చకుండా, ఇంతపొడవు పెంచితివేమి అంటారేమో, మీరు అలుకబూనవద్దు, ఎక్కువైన ప్రేమతో వినండి, నేను ఎందుకు పెంచితినో మీకు వివరించి చెప్పతాను. ఈ పరిపూర్ణబోధ ఎంతవిచారించినా గుహ్యముగాను చాలా లోతుగాను చాలా రహస్యముగాను ఉన్నదని భావించి ఈ లోతు యెరుకయ్యే కొరకు బాగా వెడల్పు చేసితిని, ఏవిధముగా ననగా, ఈ పరిపూర్ణబోధ చాలా రహస్యమైనది. చాలా గుహ్యమైనది, అందరికీ సులువుగా తెలియబడేదికాదు. ఎందుకనగా తాను బయలై అచలమవ్వాలి గనుక అందరికీ తెలియబడదు. అనగా తానైన యెరుక 25వది సమస్తాన్ని గుర్తెరుగుచున్నది. మరియు 24 ఇంద్రియములతో కలసి, ఆయా ఇంద్రియముల వికారములు తాను పొందుచున్నది. ఇవి అన్నీ రహితమై, నిర్మలమవ్వాలంటే వికార రహితమేవా ఈశ్వరః అనేశృతి ప్రమాణం విచారించి తానే బయలై అచలమవ్వాలి. అలా అవ్వాలంటే, గురు సూచనద్వారా అవ్వాలిగాని యింకో విధముగా అవ్వలేరు. గనుక గురువుగారు బయలై శిష్యునకు చూపించి యీ విధముగా చెయ్యమని చెప్పి చేయించితే, ఆ శిష్యుడు ఆ లాచ్లేస్తే తాను బయలై అచలమౌతాడు. అప్పుడు ఆ శిష్యుడు గురుభక్తి గురుసేవ గురునిష్ట గలిగి, సర్వకాల సర్వావస్థలయందు, అలా ఆచరించుచుంటే, కొంత కాలమునకు తానే పూర్ణుడౌతాడు. ఇంత విచారణ

చెయ్యవలెను. గనుక వడిగల ప్రవాహము వెడల్పు ఎక్కువ జేస్తే ఆవడి తగ్గి మెరకౌతుంది. అలాగే ఈ బోధ పెంచితే సులువుగా తెలియునని మీరంతా తెలుసుకొని సంతోషించెదరని పరిపూర్ణమై యుంటారని యిట్లు పెంచుటకు కారణమని భావము.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణవిరచితద్వైతాద్వైత రహితపరమతత్వే సఖా విజ్ఞాపన్నామ ప్రథమోధ్యాయః భావ విశేషార్థములు

సమాప్తము



# ☆ 2 .గురు-శిష్యాన్యోన్యదర్శనం. 10 ☆

22 ॥ సాధన సంపత్తియుగల - సాధకుడొకనరుడు ఘోరసంసారమునన్ - బాధపడలేక తనవు - బోదయమున గురుని గాంచియు రుతరభక్తిన్ - శరణనిమ్రొక్కి - మరి మారియుక్తిన్ - బోధాజేయుము పుణ్యపురుషామాబోంట్లకు - సాధించదగుముఖ్య సాధనానిపల్కె - నురుతరభక్తిన్ - శరణని మ్రొక్కిమరిమారియుక్తిన్ ॥ 1

తా॥ శిష్యా! సాధన సంపత్తియు అనగా నిత్యానిత్య వస్తువివేకము, ఇహమూ త్రార్థఫలభోగ విరాగము-శమాధి షట్కసంపత్తి, ముముక్షత్వము అనునాల్గు సాధనలు కలవు. ఇందు

**నిత్యానిత్యవస్తు వివేకమనగా:** నామరూపక్రియలు లేక సచ్చిదానంద స్వరూపమై అఖండమై నిర్మలమై అచలమై యున్నదే పరబ్రహ్మమే సత్యమని, నామ రూపక్రియలు గలదై అనృతము జడము దుఃఖము ఖండము మలినము అనునవే స్వరూప లక్షణములుగా గలిగివెలుంగు ప్రకృతి చేత కల్పింపబడిన తన శరీరం తన శరీరసంబంధమైన భార్య పిల్లలు అన్నదమ్ములు తల్లిదండ్రులు ధనధాన్యములు గృహములు తోటలు మొదలైనవి బ్రహ్మవిష్ణు రుద్ర మహేశ్వర సదాశివులు మొదలు పరమాణువంటి పురుగు తుదిగా గల ప్రాణిసమూహంతో కూడిన లోకములను అసత్యములని తెలుసుకొనుటే నిత్యానిత్య వస్తు వివేకము.

**ఇహమంత్రార్థ ఫల భోగవిరాగమనగా** : ఈ లోకమందు పుష్ప చందన భూషణములను స్త్రీలు ఇండ్ల ధనధాన్యములు తోటలు వస్తు వాహనములు మొదలైనవాని భోగములయందును పరలోకమందలి స్వర్గలోక వైకుంఠ కైలాసములయందు గల సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య సాక్షిత్వమును అనెడి వేదవులలో నుండు పష్పచందనాది భోగములయందును వమనమైన అన్నము మలమూత్రములవలె ఆసక్తిలేకయుండుటయే ఇహముత్రార్థఫలభోగ విరాగము.

**శమాది షట్క సంపత్తి** : శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అను సుగుణములు ఆరును, కలిగియుండుట శమాది షట్క సంపత్తి యనబడును. అందు **శమము** : మనస్సు బుద్ధి చిత్తము అహంకారం అను అంతరేంద్రియములను, వాని వృత్తులైన సంకల్ప వికల్ప నిశ్చయచంచలత్వ కర్తృత్వములను, వానికి అది దేవతలైన చంద్ర బృహస్పతి క్షేత్రజ్ఞ రుద్రులయందు, ధ్యాన్య ఆరాధనలతో చేర్చే ఆ అదిదేవతలకు అది దేవతయైన, ఆ ఇంద్రియాది దేవతలను ఐక్యపరచి, తదేకనిష్టగా ఉండుట శమమనబడును.

**దమము** : అనగా వర్ణ ధ్వని సర్వ మిశ్రరూపములగు చతుర్విధ శబ్దములను గ్రహించునటువంటి శ్రోత్రేంద్రియములను చల్లనవేడిమి మృదువు కఠినము మిశ్రమము అని ఐదు విధములైన స్పర్శములను గ్రహించు త్వగేంద్రియమును. పొట్టి పొడవులావు సన్నము ఎరుపు. నలుపు, తెలుపు, పసుపు. ఆకుపచ్చ మిశ్రమము అను పది విధములైన రూపములను గ్రహించునట్టి నేత్రేంద్రియమును, ఉప్పు. కారం. చేదు. తీపి. పులుపు. ఒగరు మిశ్రమమనే ఏడు విధములైన రుచులను. గ్రహించెడి జింహేంద్రియమును, సుగంధము దుర్గంధము మిశ్రమగంధము అనే మూడు విధములైన గంధములను, గ్రహించెడి నాశికేంద్రియమును. సువచనము దుర్వచనము మిశ్రమ వచనములనెడి త్రివచనములుగల వాగ్వింద్రియమును, దానము ప్రతిగ్రహము అనునవి గల హస్తేంద్రియమును, గమనము ఆగమనము అనుననవి గల సాదేంద్రియమును, దిక్కులు గాలి సూర్యుడు వర్ణుడు అశ్వనీదేవతలు అగ్ని దేవేంద్రుడు విష్ణువు మృత్యువు బ్రహ్మ అను అది దేవతలయందు ధ్యానారాధన వ్రతో పాసనాదులతో చేర్చి ఆ అధిదేవతలకు అధిదేవతయగు పరబ్రహ్మయందు అదిదేవతలను ఐక్యంచేసి తదేకనిష్టతో నుండుట దమ మనబడును.

**ఉపరతి** : అనగా వేదోక్త కులాచార కర్మలు విడువకూడనివైనను బ్రహ్మనిష్టకు విఘ్నము కలుగుటవలన దానిని క్రమక్రమముగా విడుచుటయే, మరియు ఆత్మనిష్టచే ప్రబలించుచూ చిత్త వృత్తిని అటు ఇటు పోనీయక బ్రహ్మసమాధియందు మరలించుట, అనగా అచలమైచలనము లేకుండా ఉండుట ఉపరతి అనబడును.

**తితీక్ష** : అనగా ప్రారబ్ధవచనము కలిగెడ్డి శీతోష్ణ సుఖదుఃఖ మానావమాన నిందాస్తుతి లాభాలాభ జయాపజయ జరామరణ శోకమోహ క్షుత్పిపాసాదులైన సకల ద్వంద్వములో ఏది ప్రాప్తించి యుండినను తన నిష్ట వదలక వానివలన కలిగెడి బేదమోహములను సమించియుండుటయే తితీక్షయనబడును.

**శ్రద్ధ** : అనగా ప్రభు, మిత్ర స్త్రీలతో సమానములగు శృతి స్మృతి పురాణ ఇతిహాసములను నమ్మి ద్యూత చోరయుద్ధ శృంగారాధి కథలను తనకు ప్రయోజనము కలుగజేయునని సామాన్య శాస్త్రములను స్వప్రయోజనములను ఆపేక్షించెడి అనాచార్యులను విడిచిపెట్టవలెను. ప్రతిప్రయోజనముల నొల్లని సదాచారులయందును. ఆకలి పోగొట్టు కొనుటకై తనవద్దకు వచ్చెడి బ్రహ్మవిదుడు మొదలగు వారియందును విశ్వాసము కలిగియుండుటే శ్రద్ధ అనబడును.

**సమాధానము** : అనగా వేదాంత శాస్త్రముల యందు ఉపనిషత్తులయందు గల విషయములను చక్కగా చదివి ఆలోచించి విచారించి [illegible] సమాధానముపరచుకొనుట సమాధాన మనబడును.

**ముముక్షత్వము** : అనగా లోకమున ఎల్లజనులను [illegible] ఆపేక్షించుచున్నారు. అది మోక్షేచ్ఛకాదు. ఇల్లుకాలు చుండినపుడు ఆ గృహమును ప్రవేశించినవారు. పుత్రకళత్రాదులేమైరో అని విచారపడి అగ్నిచేగాలి అపుత్రమిత్రాదులను విడిచి శీతలజలములో ప్రవేశించిన రీతిని, సంసారమునందలి

తాపత్రాదులచేతగాని విసుగు చెందిన మానవుడు ఈ సంసారతాపములను తొలగించు సద్గురువులెవరో ఎక్కడ యున్నారో అని వెతుకుచూ, దీనికి సాధనములు ఏమేమి కావలెనో అని తపించుచుండు చిత్తవృత్తిని మోక్షేచ్ఛ అని అనబడును. మరియూ మనస్సనెడి వ్యాఘ్రంబును ఆశయనెడి కృష్ణ సర్పమును కామాదులనెడి దొంగలను నిరాకరించుటకై పైనాల్గు సాధనములు కావలెను. అవి గలవాడే అధికారి, శ్రవణమునకు ముందే సాధనచతుష్టయ సంపన్నుడై శ్రవణమును ఆపేక్షించవలెను. అనగా సద్గురువద్దకు చేరని క్రితమే నాలుగు సాధనములు చేసియుండ వలయునని పెద్దలు శెలవిచ్చియున్నారు. ఈ సాధనములు నాలుగు చేయనియెడల ఈ జన్మమునందు జన్మరహితం కలుగనేరదు. గురువులైనవారు అనధికారులకు ఉపదేశింపరు. కాబట్టి సాధనచతుష్టయ సంపన్నుడై ఉండవలయును, అట్లు కానియెడల ఈ బోధకు అర్హుడు కాదని తెలియవలెను. ఇట్లు పైన ఉదహరించిన ఆ నాలుగు సాధనములు సాధించుకునే సాధకుడైన ఒకనరుడు తానసత్యమని బ్రహ్మమని నమ్మియున్న అఖండములో ఖండాఖండములగుచున్న ఘోరసంసారమను, బాధపడలేక సద్గురుమూర్తికై వెదకుచుండును, కొంతకాలమునకు తన పుణ్యముదయించి, సద్గురు మూర్తిని దర్శించి అమితమైన భక్తితో శరణుశరణు అని సాష్టాంగ ద్వాదశ నమస్కారములుచేసి మరీమరీ వేడుకొనెను. ప్రభోనేను సాధన సంపత్తిగలవాడను. నాలాంటి వానికి ఏమీ బోధించవలయునో, అట్టి బోధ చెప్పుము పుణ్యపురుషానేను సాధించవలసిన ముఖ్యసాధన, యేదోవానిని చెప్పుము. ప్రభో అని వేడెనని భావము.

**23 ॥ శరణాగతుడగు శిష్యుని - కరుణామృత దృష్టిచేతగని మోదము -ముప్పిరిగొన మృదువాక్యములను - పరమదయాళుండుగురుడు - భక్తావినుమనెనూ - సంశయ మిక - బాధింపదనెనూ - పరిపూర్ణమొకటి లేనెరుకానెడొకటి - పరిపూర్ణ మెరుకాల నెరిగీయెరుకనుమాను - భక్తావనుమనెనూ - సంశయమిక-బాధింపదనెనూ ॥ 2**

తా॥ శిష్యా! అట్టి శరణాగతుడైన శిష్యుని, అనగా తను మన ధనములు ధారపోసి, యేకాగ్ర చిత్తుడై నిలచియున్న శిష్యుని, గురుమూర్తి కరుణా రసమనే అమృత దృష్టిచే చూచి, హస్తమస్తక సంయోగముచేసి, వాగ్దీక్ష స్పర్శదీక్ష దృగ్దీక్ష ఇచ్చి సంతోషముతో పొంగిపొరులుచు, ఇలాంటివానిని తనంతవానినిగా చేసే విషయములు చెప్పవలెనని, కుతూహలము కలవాడై, నాయనా నేను నీకు చెప్పిన ఈ దీక్షలు జాగ్రత్తగా విచారించుచూ ఉంటే, నీవు అఖండమై యుంటావు అని, పరమ దయాళుండైన గురుదేవుడు, నాయనా జాగ్రత్తగా విను, నీవు అఖండమైఉంటే నీకున్న సందేహాలన్నీ తీరుపోవును. అనగా ఉన్నది అఖండమైన పరిపూర్ణములేనిది ఎరుకే ఈ రెంటిని అనగా పరిపూర్ణము ఎరుకను యెరిగి విచారించి ఈ పరిపూర్ణములో వస్తూపోతూయున్న లేనియెరుకను యెరిగి, ఆ యెరుకను విడచిపెట్టుము. ఇట్టి యెరుకను విడిచిపెట్టినవెనుక. నీవు పరిపూర్ణమై ఉంటావని భావము.

**24 ॥ యేసాధనసీకెందుకు - వీసానికి బనికిరాదు వినుమా యయ్యా - నేసాధులచే విన్నది - యేసాధనలేనిబోధ - నెరిగింతుపోకూ - సాధనలందు - మరిగి తేరాకూ - యేసాధనలజోలియే నొల్లననినీవు - బాసాజేసితివేని పరిపూర్ణ బోధనే - నెరిగింతు పోకూసాధనలందు - మరిగితేరాకూ ॥ 3**

తా॥ శిష్యా! నీవు ఇంతక్రితం చేసిన సాధనలన్నీ అనగా అష్టాంగయోగములు అష్టసిద్ధులు షడ్చక్రములు యందును, శ్వాసను నిలిపి 21600 హంసలను లెక్కించిన, ఇవి అన్నియు ఈ పరిపూర్ణ బోధయందు, ఒక వీసానికి పనికిరావు, ఎందుకనగా పరిపూర్ణాన్ని ఎరిగి, లేనెరుకను ఎరిగి, ఆ యెరుకను లేకుండగా చేయుటకు, ఈ సాధనలు పనికిరావు. నాయనా వినుము. నేను సాధువులైన సద్గురువులచే విన్నది. యేసాధనలేని పరిపూర్ణ బోధ, ఆబోధ నీకు ఎరిగింతును, నీవు సాధనలయందు మరిగితే నావద్దకురాకు, యేసాధనలు ఇకనేను చేయను. అని నీవు ప్రమాణం చేసినట్లయితే, నీకు పరిపూర్ణ బోధ నేనెరిగించెదను. అనగా గురుసూచనచేసి నీవు బయలయ్యే మార్గము నీకు సూచించెద, ఆ ప్రకారము నీవు విచారిస్తే ఎల్లప్పుడూ అఖండమై పరిపూర్ణమై ఉంటావని భావము.

**25 ॥ గురు వరపరిపూర్ణంబన - నెరుకననివిరెండు యెట్టి -వెరుకోద్భవమెం -దెరుక జను చోటు యెయ్యది - యెరుకనునేనెట్లు విడిచే - దెరుగించుమనెనూ - అట్లనె గురుడెరి గింతుననెనూ - చరణాధూళిని రెండు - కరమూలగొనితన - శిరమూన ధరియించి శరణానియాశిష్యు - డెరిగించుమనెనూ - అట్లనెగురు - డెరిగింతుననెనూ ॥ 4**

తా॥ ప్రభో గురువర అనగా సమస్త విద్యలు తెలిసి అన్నింటికీ అతీతమై పరబ్రహ్మ స్వరూపుడైన పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపా, ఓ సద్గురుప్రభో, నాకు పరిపూర్ణమనగా యెటువంటిదో, యే స్వరూపమై ఉన్నదో, నాలో ఉన్నదా యెక్కడనైనా ఉన్నదా, ఆ వివరములన్నీ తెలియజేయుము ప్రభో, మరియూ యెరుకనగా యెటువంటిదో, అది ఎక్కడ ఉన్నదో, దాని స్థానమేది దావి నడనుడులు ఏమిటి, దాని స్వరూపమేది, ఈ వివరములన్నీ నాకు విపులముగా తెలియపర్చుము స్వామీ, మరియూ ఈ యెరుక ఎందులోనుంచి వచ్చినదో నాలో నుండి వచ్చినదో యక్కడ నుంచైనా వచ్చినదో ఇది విపులముగా వివరించుము ప్రభో, మరియు ఈ యెరుక యక్కడకు వెళ్ళుచున్నది. ఆచోటు యేది, ఇవన్నీ వివరించవలయును ప్రభో. తరువాత ఈ యెరుకను నేను ఏ విధంగా విడిచిపెట్టవలయును. అనగా ఈ యెరుకను పూర్తిగా యేమీలేకుండా చేసుకోవలెను. లేక ఏమీలేదు. యెరుక యేమీలేదు. అని అనుకుంటా ఉంటే చాలా, ఈ వివరములన్నీ నాకు తెలిసేలాగు చెప్పవలయును ప్రభో, అని ఆ శిష్యుడు వేడుకొనగా, గురువులైన గురుమూర్తి నాయనా నీవడిగినవన్నియు, అలాగే చెప్పి ఎరిగించెదను అనెను. అప్పుడు శిష్యుడు గురుమూర్తి యొక్క రెండుపాదములు మీదనున్న దూళిని, తన రెండు కరములతో తీసుకొని, రెండు కళ్ళకద్దుకొని, శిరస్సునందుంచుకొని, ప్రభో నేనడిగినవన్నియు నాకు తెలిసేలాగున విపులముగా

వివరించి చెప్పవలయును. స్వామీ అని వేడగా, పరమదయాళుండైన గురుదేవులు హస్తమస్తక సంయోగము చేసి, బాబూనీవడిగినట్లే వివరంగా విపులముగా నీకు తెలిసేలాగు చెప్పెదనని భావము.

**26 ॥ మొదలచలము నెరిగించెద - విదితముగా లేని యొరుక వివరింతుపయిన్ - తుదకెరుకనువిడిపించెద - మదిలోనామాట నమ్మిమరివింటివేనీ - చంచలబుద్ధి మానుంటివేని - పదుగురు నినుజూచి భళిశాబాసిత్రోవ - కెదురూలేదనెటట్టు - యిదిగో నేజేసెద-మరివింటివేనీ - చంచలబుద్ధిమానుంటివేని ॥ 5**

తా॥ శిష్యా! నీకు మొదలైన అచలము నెరిగించెద, అనగా నీ స్వరూపమైన ... నెరిగించెద, అనగా నీవఖండమై బయలయ్యే విధానము నేనుగురుసూచన చేస్తే దానిని నీవు విచారించి నట్లైతే, నీవు బయలై అచలమౌతావు. అనగా నీవే అచలం. అట్టి అచలములోనుండి, అనగా నీలో వచ్చే క్షరాక్షరములనే లేనేరుక. ఎలా వచ్చినదో, వచ్చి ఎన్నివికారములు పొందుచున్నదో, దాని యొక్క సంగతంతా వివరించి చెప్పెదను. కడకు యెరుకను విడిపించి, ఏమిలేకుండా జేసెదను. నీ మనస్సులోనే చెప్పినమాట నమ్మిఉంటివేని, అనగా నేను చెప్పినట్లుగా విచారించి నీవు బయలైఉండి, నీలో ఉన్న చపలత బుద్ధంతా మానుకొని, నేచెప్పినది మర్చిపోకుండా ఆచరించుకొంటే, పదిమంది నినుజూచి, బలే శభాష్ ఈ మార్గము ఏ గురువుపట్ల తెలుసుకున్నావో, గాని బాగుందనేటట్టు నేజేసెదనని భావము.

**27 ॥ మీరంతవారుగనుకనె - చేరితిమీ పాదసేవ సిద్ధించుటకై - యేరింత వారు జగమున - లేరని నామదికి దోచే - లెస్సాగ వినుడీ - ఆజ్ఞకు మీర - లేదు కనుగొనుడీ-యేరీతి వినుమంటె - నారీతివినియెద - మీరానతివ్వండితేరా మాయాబోధ -లెస్సాగవినుడీ - ఆజ్ఞకు మీర-లేదూ కనుగొనుడీ ॥ 6**

తా॥ ఆర్యా సద్గురు ప్రభో. మీరు అలా తయారుచేసే సద్గురు సార్వభౌములని, మీయంతవాని గానున్న చేస్తారని ఉద్దేశ్యము చేతను, మీవద్దకు వచ్చి మీ పాదసేవ చేసుకొని నేను తరించెదనని. నమ్మివచ్చితిని, మీ లాంటి ప్రభువులు ఈ జగత్తులో ఎవ్వరూ లేరని. మీలాంటి వారి సేవనాకు దొరుకుటయే పదివేలు అని నామనస్సులో నిశ్చయించుకొని వచ్చినాను. అనగా మీరు సమస్తము తెలిసిన వారని వరము దయాలురని, మీరే వరమూ గురుస్వరూపులని, అట్టి పరమగురుస్వరూపులైన. పరిపూర్ణ పరబ్రహ్మను నా జ్ఞాననేత్రమునకు దర్శింపచేసి, నన్ను పరిపూర్ణునిగా చేయగల సమర్థత తమకున్నదని, నాకు తెలిసియే తమ వద్దకు వచ్చితిని, ఇది యదార్థం ప్రభో, కూర్చోమంటే కూర్చుంటాను, నుంచోమంటే నిల్చుంటాను. ప్రభో, తమరు ఏమి చెప్పితే అదే చేస్తాను. అదేవింటాను ఏమైనా తేడా వస్తే అడగండి, మీ ఆజ్ఞకు జవదాటను ప్రభో, మీరు చేప్పే విషయములు తోరముగా చెప్పండి, ఒకదానిని అనుసరించి ఒకటి ఉండాలి. అంటే ఒకదాని తరువాత ఒకటి వరసగా ఉండాలి. అక్కడిది ఒక్కటి ఇక్కడిది ఒక్కటి చెపితే నాకు ఏమీ

తెలియదు ప్రభో. అని భావము.

28 ॥ మొద్దులనైనమ దొల్తురు - బద్దులబద్ధత్వమడవి పాల్జేతురు మీ-వద్దికి వచ్చినగని-
పరి-శుద్ధపుబోధేక్తమైన - సూక్తులు గుప్పి - అందుకు తగిన - యుక్తులు జెప్పి-
పెద్దాలచే మీ ప్రసిద్ధిని విని వస్తి - దిద్దూడినే వట్టి బుద్ధిహీనుడనన్ను - సూక్తులు
గుప్పి - అందుకు తగిన -యుక్తులు జెప్పి ॥ 7

తా॥ ఆర్యా నేను మొద్దుబుద్ధి గలవాడును. తమరు మొద్దులనైనను దొలిచి, అనగా పనసమొద్దును దెచ్చి, దాని మధ్య భాగమంతా దొలిచి. రెండు వైపులా తోలుమూయించి. మద్దెలుగా తయారుచేసి దానిని మంచి శబ్దములను పలికింప చేసినట్లు, నాలాంటి అజ్ఞానుని జ్ఞానునిగా తయారుచేసి, మంచి పలుకులను పలికించెదరు; అలాగునైనా నాలాంటి బద్దుకుని, బద్దత్వమంతా పటాపంచలై పారిపోవులాగు. చేయగలరని. తెలసి మీవద్దకు వచ్చితిని తయారైన వారిని చూచి. నన్నుకూడా అలా తయారుచేస్తారని, పరిశుద్దమైన బోధచెప్పి నన్ను పరిపూర్ణునిగా చేసి. దానికి తగినటువంటి బోధచెప్పి, అనగా దానికి సరిపోయే యుక్తులు సూక్తులు చెప్పి. నన్ను దిద్దవలెను ప్రభో. నేను వట్టి బుద్ధిహీనుడను. గనుక తమరు ఏమిచేసినా నీళ్ళముంచినా పాలతో ముంచినా మీదే భారము అని భావము.

29 ॥ నూటిగనుబోధనామది - నాటినదిక చాలుచాలుననినీకైనీ - నోట నీవు
బల్కుదాకను - పాటువులను జెప్పచుందు - సరేనా నామాటా - రాగోరూచూ -
మరినేనీమాటా - నూటికొక్కటోలు మాటాని తెలియూము-మాటి మాటికి
వట్టిపాటాలేమిటికింక - సరేనా నామాటా - రాగోరూచు మరినేనీమాటా ॥ 8

తా॥ శిష్యా! నాయనా ఈ పరిపూర్ణబోధ, నీమనస్సుకు సరిగ్గా అర్ధమైనది. నాకు తెలిసినది. ఇంకా చాలు చాలు. అని నీ నోట నీవు అనేవరకు, నేను చాటువులుగాను యెన్నోయుక్తులుగాను సూక్తులుగాను చెప్పచునే యుంటాను. అనగా నేను చేసిన సూచన ప్రకారం, విచారించి నీ మనస్సుకు అత్తించుకొని చూసుకో, నీకు ఆ అచలము గోచరమైనదా లేదా నిదానముగా చూచుకొని, ఆ అచలపరిపూర్ణము యదార్ధముగా నాకు తెలిసినది ప్రభో. అని నినోట నీవనేవరకు, నేను అనేకమైన సూక్తులు యుక్తులు చెబుతూనేయుంటాను. నేను చెప్పినటువంటి సూచననేమాట ఎటువంటి దనగా నూరుమాటలకు ఒక్కమాటచాలు, అనగా నీకు సమస్తమూ తెలియబడేటటువంటి యుక్తి, చెప్పితిని. అలాకాకుండా నీకు తెలియబడనటువంటి మాటలు పాటలు ఎన్నిచెప్పినా ప్రయోజనమేమున్నది. అందువల్లనే చేసిన సూచన ప్రకారం విచారించుకొని, నాకు తెలిసినదని నీలోనుంచి మాటవచ్చేవరకు. నేను చెబుతునే ఉంటాను, ఇందుకు ఉపమానం సుబ్బకవిగారు. భ్రాంతి రహితమైన గురుని చెంత జేరి శోడశాక్షరి సంతతము ఈద్వాదశాక్షరి చింతన చేసేటి వారిక, ఏచిరా ఈ జనన మరణం, అనే సంకల్ప వికల్పములు లేవనిన్నీ మరియు బంధములేదు. విడుదల లేదు. సర్వకాలం నీవు ద్వాదశిని చింతనచేస్తే విచారిస్తే

యేమియులేక ద్వాదశి అయి ఉంటావని అర్థం. అని తెలియవలెను. మరియు "నీవు బయలులోన ఉంటివి నీయందు బయలు నిండియున్న దెరుగవైతివి" అనగా ఈ భూతాకాశమనే బయలులో మనమంతా యున్నాము. అలాగే నీవున్నావు కాని నీలో నిండియున్న ద్వాదశి అనే బయలును అనగా నీవు బయలై యున్నదానిని నీవెరుగలేకపోతివి అనియు మరియు నీకు బయలు సూచనైతే నిలువలేవు. నిముషమైనను కేవలమూ నీకావలివలిస్వావరము పరిపూర్ణమాయెను. యేదిరా అనగా నీకు బయలయ్యే సూచనచేస్తే అనగా నీవు బయలయ్యే విధానం నీకు చూపిస్తే నిముషమైన నిలువక బయలయ్యి నీవు ఉంటానికి కేవల పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపమే లోపలా వెలుపలా నిండి నిబిడీకృతమై దశ దిశలయందు ఉంటాదని భావము. మరియు నేచేసిన సూచన నీవు గ్రహించి తెలుసుకొంటేనే చెప్పినమాట సరిపోయేనా ఐతే నామాటయను బోధ నీనోట ఆబోధ చెప్పాలి గదాయని భావము.

**30 ॥ తానేనవకను నిండిన -దానికి పేరేమి బయలు - తానేననుచును నేననియెదనే నెవ్వరు - లేనెరుకవు - వుంటి వుంటే - లేనేలేననుమీ - అంటివి - అంటె -లేనే లేవు సుమీ - లేనేలేనని నేనులేకాపోయిన వెనుక - తానుండుగద వుంటె - దాన్నెట్లెరిగెద వీవు - లేనేలేననుమీ - అంటివి అంటి - లేనేలేవుసుమీ ॥ 9**

తా॥ ప్రభో తాను నేను అనక నిండి నిబిడీ కృతమై యున్నదాని పేరేమి స్వామీ. అని శిష్యుడు అడిగెను. గు॥నాయనా దాని పేరు బయలు శి॥ ప్రభో తాను నేను అనేది ఇది ఎవరు గు॥నాయనా ఇది ఆ బయలులో తోచిన లేని యెరుక శి॥ ప్రభో ఇది లేని ఎరుక అనుచున్నారు. ఇది ఈశ్వరతనువై బ్రహ్మాండములో నుండి గుర్తెరుగుచున్నది. మరియూ 24 ఇంద్రియములతో కలసి, అనేక సంకల్పాలు వికల్పాలు పొందుచున్నది. లేదంటారేమిటి. గు॥ ఉంటే దాన్ని లేకుండా చేయుము. శి॥ దాన్ని లేకుండా చేసేదను ప్రభో, గు॥ అలా చేస్తే లేనేలేవు సుమీ శి॥ లేనేలేనని నేను లేకపోయిన వెనుక తానుండుగదా. అనగా ఆ బయలు ఉన్నది గదా, గు॥ నాయనా దాన్ని ఎలా ఎరిగేవు అది ఎలాంటిది, ఎలా ఉన్నదో ఆ వివరములన్నీ చెప్పుము. శి॥ ఆర్యా అది ఎలాంటిదో, నాకు తెలియబడుట లేదు. ఇలా ఉన్నదని చెప్పటానికి అలా ఉన్నదని చెప్పడానికి ఎలా చెప్పాలో నాకు తెలియబడుటలేదు. స్వామి అది పలానయని మీరే చెప్పాలి నాకు ఏమీ తెలియబడుటలేదు. అని భావము.

**31 ॥ మీరాజ్ఞయిచ్చివుంటిరి - నేరుపుతో బయలునెరుక నెరిగించి పయిన్ పేరణతు యెరుకననియి - ట్లారీతిన యెరుకపరచు - మయ్యా మ్రొక్కేనూ - అనుమానాము - జెయ్యాకియ్యేడనూ - సారెకు మీపాద జలజాయుగ్మము నా హృత్సారాసమున నిల్పిల సల్పాము పూజానే - యయ్యా మ్రొక్కేనూ - అనుమానాము జెయ్యాకియ్యేడనూ ॥ 10**

తా॥ ప్రభో మీరు చెప్పిన పరిపూర్ణము ఎటువంటిదో, ఎరుక ఎటువంటిదో ఆ వస్తు నిర్ణయం నాకు సరిగా తెలియబడలేదు. తమరు మొదట అచలము ఎరిగించెదనన్నారు. ఆ తరువాత లేనేరుక సంగతంతా వివరించి చెబుతానన్నారు.

తుదకు యెరుకను విడిపిస్తానన్నారు, గనుక తమరు అప్రకారంగానే ఎరిగించండ ప్రభో, ఆ వస్తువు ఎటువంటిదో సరైనటువంటి నిర్ణయం నాకు తెలియబడలేదు. నిర్ణయమయ్యేలాగున నాకు తెలియజేయండి ప్రభో, నాయందు ఏవిధమైన అనుమానం పెట్టుకోవద్దుస్వామి, పదే పదే తమపాద కమలములు నా హృదయములో నిలుపుకొని యల్లప్పుడు పూజచేసుకొంటూ మీ పాదసేవ చేసుకొంటాను, ప్రభో, నాకు ఆ వస్తు నిర్ణయం అయ్యేలాగు, అనగా పరిపూర్ణమెరుకలు తెలియజేయండి ప్రభో అని భావము.

**ఇతి శ్రీ మద్భాగవతకృష్ణ విరచితద్వైతాద్వైత రహిత షరమతత్వే గురుశిష్యాన్యోన్యదర్శ నన్నామద్వితీయోధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము**



# ☆ 3 .అచల లక్షణం. 13 ☆

**32 ॥ పుట్టుట గిట్టుటలేకను - పుట్టే గిట్టేటి యెరుకపోడి మెరుగకన్ - చట్టువలె కదలకుండును - బట్టబయలే యిట్టి దెరిగి - భావింపదగునూ - యెరుకలేక సేవింపదగునూ - వట్టి యాశలచాత పట్టుబడకనుయీ - గుట్టూ దేశికునోట గట్టిగ దెలుసూక - భావింపదగునూ యెరుకలేక - సేవింపదగునూ ॥ 1**

తా॥ శిష్యా! ఈ అచలమునకు పుట్టుట గిట్టుట లేవు. ఆ పుట్టి గిట్టేటువంటి లేనెరుక యొక్క పొడియైనా ఈ అచలము ఎరుగదు, అచలము ఎలాగు నుండుననగా ఒకరాయిలాగ కదలకుండా మెదలకుండా యుండును. అనగా చలనము లేక మనయెదుట కనిపించే భూతాకాశమువలె బయలుగా ఉండును. దానికి ఇతరమైన వస్తువులు రెండోది ఏమీ లేక బయలుగా అచలమైయుండును. అది గురు సూచన వల్ల గ్రహించి విచారించినట్లైతే, తెలియబడును, కాని ఇంకే విధముగాను తెలియబడునది కాదు. అని ఎరుగవలెను. మరియు అచలమనే బట్టబయలు ఇట్టిదని భావించుకొనుము, నీవు యే తెలివిచేత ఈ అన్నింటినీ యెరుగుచున్నావో ఆ తెలివిలేక దీనిని సేవించుము, అంతేగాని తెలివితో దీనిని తెలుసుకుందా మని నీవెంత ప్రయత్నం చేసినా ఇది తెలియబడేటటువంటిదికాదు, నాయనా అటువంటి దానిని వట్టి ఆశల చేత పట్టుబడేటటువంటిదికాదు. నాయనా అందువల్ల ఈ గుట్టు అనగా ఈ రహస్యము ఈ గురు గుహ్యము తెలుసుకొనుటకు గట్టిగా ప్రయత్నం చేయవలెను. అంటే శ్రద్ధగా మంచి పూనికతో చేయవలెను. అనగా సద్గురుమూర్తిని భక్తి విశ్వాసములతో పూజించుచూ, ఆయనకు అనుగుణ్యముగా సేవలు చేస్తే, ఆ సేవలవల్ల ఆయనకు ఆనందము సంతోషము కలిగి యిటువంటి శిష్యునికే చెప్పవలెనని

కుతూహలము కలిగినప్పుడు ఆ గురుసూచన జేసినీకు చూపించును. దానికి తగిన బోధ చెప్పును. అప్పుడు నీవు గ్రహించి యెరుకలేక సేవించే మార్గము నీకు అలవడును. గాని. ఇంకో విధముగా తెలియదు. మరియు అచల పరిపూర్ణమనగా యెరుకలేకసేవించేది. యెరుకుంటే అచలపరిపూర్ణముకాదు. గనుక నీవు గురుభక్తి గురుసేవ గురునిష్ట సర్వకాలం కలిగియుంటే, ఆ గురుయుక్తి నీకు గురువుగారు చెబుతారు, దాని వల్లనీవు యెరుకలేక సేవించేమార్గం గ్రహించి ఆచరించునప్పుడే, నీవు అచలమౌతావని భావము. ఇందుకు

. కం॥ నీ నిజరూపమె అచలము, నీ నిజరూపంబు బయలు, నిజముగ ఎపుడున్, నీ నిజరూపమె పూర్ణము. నీ నిజరూపంబు బ్రహ్మ. నీ వెరుగవయ్యా. నీ నిజరూపం నీవుగాదయ్యా, నీవే విశ్వరూపం నీవే భ్రమరూపం, నీవే మాయారూపం, నీవెరుక రూపామని, నీవెరుగవయ్యా. నీ నిజరూపం నీవు గాదయ్యా॥ అని శెలవిచ్చియున్నారు.

**33 ॥ యెరుకైనరీతినుండును - యెరుగనశక్యంబటంచు యెన్నినయెరుకన్ - యెరుగు దుననినను యెరుకకె - యెరుగుటదుర్లభము సుమ్మి - యీ వృత్తబైలా - యెరుగనె యెరుగదెరుకానీ బైలా - పెరుగాదు - విరుగాదు వొరుగాదు - తరుగాదు - అరుగాదు కరుగాదు తిరుగాదు మొరుగాదు - యీ వృత్తబైలా - యెరుగనెయెరుగ - దెరుకానీ బైలా ॥ 2**

తా॥ శిష్యా! ఈ ఉత్తబట్టబయలు తెలినట్లె ఉంటుంది. కాని తెలియుటకు శక్యము కానిది, అనగా పరిపూర్ణ పరబ్రహ్మములో యెరుకలేదు, గనుక యెరుక యెరుగదు. పరిపూర్ణము శాశ్వతమై కదిలికలేకయున్నది. అట్టి పరిపూర్ణము తెలుసుకోవాలంటే, ఒక్కగురు సూచన వల్లనే తెలియబడునుగాని, యింకో విధముగా తెలిసికొనుటకు, యెరుక ఎన్ని ప్రయత్నములు చేసినా, ఎన్ని విధములు విచారించినా, నాకు తెలిసినదని అనుకొన్నను. ఎన్ని విధములు ఎన్నుకొనినను. అది అఖండ ఎటుకనే యెరుగునుగాని, ఈ ఉత్తబట్టబయలును యెరుగదు, ఈ ఉత్తబయలులో యెరుకలేదు. గనుక యెరుక ఈ ఉత్తబయలు యెరిగేదికాదు, తిరిగేదికాదు, మొరిగేదికాదు, ఎందుకనగా దీనికి చలనములేదు. ఇది అచలమై బయలై యెరుకలేక యున్నది. దీనిని తెలుసుకొనవలెనంటే, గురుభక్తి గురుసేవ గురునిష్ట సర్వకాల సర్వావస్థలయందు, కలిగియున్న వారిని జూచి, ఆ గురుమూర్తికి దయకలిగినవాడై ఆ గురుయుక్తి చెప్పను. ఆయుక్త ద్వారా [illegible]గ్రహించినయెడల. ఆ పరిపూర్ణము అచలముగాను, బయలుగాను, చలనములేక. [illegible] నిర్గుణమై. ఏమీలేనిది ఏదో, అగోచరముగా ఉన్నట్టు గోచరమౌనని భావము. ఇందుకు రామయోగి

కం॥ నేనెరుగ వెరుక నెపుడును, నేనెరుగను నెరిగి తనగ- నేరను, బయలున్ - నేనెరిగినదే అచలమె - నేనెరిగిన దెరిగినటుల నీకూ చూపుదురా - సూచన జేయగానే తెలగునురా-లేనిపోనీ శశి విషాణమునకును - బయమేనాడంట నీరీతిగ యెరుకన్ను - పట్టినీకు చూపుదురా - సూచనచేయగానే తెలగునురా॥ అనిశెలవిచ్చినారు.

**34 ॥ పలుకునబలుకగరాకను - తలపోయుదమనిన మదికి దగులకయెపుడున్ - ములు
గ్రుచ్చసంధిలేకను - కలిగున్నది బట్టబయలు - గదరామాయన్నా- యిదిగో చూడు
- కదులాదోయన్నా - పలుకన్నబలుకాక తలపన్నదెరుగాక - చలియండవానాల
నలయాక నిలచుండుగదరా మాయన్నా - ఇది గోచూడు - కదులాదోయన్నా ॥ 3**

తా॥ శిష్యా! ఈ బయలుకు పలుకులేదు తలంపులేదు ముల్లుగ్రుచ్చుటకు సంధిలేకుండా, అంతటానిండి నిబిడీకృతమై అచలమై పరిపూర్ణమై చలించకుండా యున్నది. అలాంటి బయలును మనం పలుకరించుదామన్నా పలుకదు, దానిని తెలుసుకుందామన్నా ఎంతప్రయత్నం చేసినా అది తెలియబడేదికాదు. గురుసేవజేసి ఆ గురుమూర్తికరుణవల్ల తెలియవలెనుకానీ. అది మనస్సుకు అందేదికాదు. అలాంటబయలు యిదగో చూడు. నేను చేసిన సూచనప్రకారం, నీవు చూస్తూ విచారిస్తే. నీవు బయలై అచలమై కదలక మెదలక పలుకులేక తలంపులేక ఎండకు యండక వానకు తడియక అఖండమైన పరిపూర్ణమై నిలచుందువు. అనగా నేచేసిన సూచన ద్వారా. విచారించి సర్వకాలం నీవు చలించక బయలై ఉండవలెనని భావము. ఇందుకు శ్రీకృష్ణపరమాత్మ అర్జునకు ఈ విధముగా తెలియజేసెను

శ్లో॥ నైనం చిదంతి శాస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో. నశోషయతి మారుతః
శ్లో॥ అచ్ఛేద్యోయ, మదాహ్యాయ. మక్లేద్యోయ శ్యోసఏవచః
నిత్యం సర్వగతఃస్తాను. రచలోయం సనాతనః

అర్జునా! ఈ కేవలాత్మయైన అచలపరిపూర్ణ పరబ్రహ్మమును. అస్త్ర శస్త్రములు ఖండించలేవు, అగ్నికాల్చలేదు. నీరు ఈ ఆత్మను తడుపలేదు, వాయువువీచి పడగొట్టలేదు, ఈ అచలపరిపూర్ణము సనాతనమైనది, యిది యెల్లప్పుడు ఒకే తీరుగా చలించకయున్నది, ఇది అంతటా నిండి నిబిడీకృతమై సూది మొనమోపుటకు సంధిలేకయున్నది. దీనికి కదిలికలేదు. దీనికి చావులేదు, యిది నీలోను నాలోను 84 లక్షల జీవరాసులయందు ఉన్నది, నీవు తెలుసుకొంటే అదే నీవు అని తెలవిచ్చియున్నారు.

**35 ॥ సామర్థ్యమేమిజూపదు - కామక్రోధాదికములగలయదనిశమే - బాములెరుంగదు
యితరులు - యేమనినమూరు బల్కాదీబట్టబైలూ - దీనికేమ్రొక్కే - రితరా
జేజేలూ - నామరూపక్రియనటనాలన్నియు మీరి - యేమానియన రాక
యేకమైయున్నాది-యీ బట్టబైలూ- దీనికి మ్రొక్కే-రితరాజేజేలూ ॥ 4**

తా॥ శిష్యా! నేను పైనచెప్పిన ప్రకారం. విచారించి అంతటా ఉన్న బయలేనీవని. నీవే అంతటావున్న బయలని గ్రహించి, నీవే ఆ బయలైయుంటే, అనగా నేను చేసిన సూచనద్వారా విచారించి, నీవు బయలైయుంటే, అనగా మాంసచక్షులుగాక, నేను చూపించినజ్ఞానచక్షువులతో చూచి. విచారించిన యెడల, నీవు బయలైఉంటావు. ఈ బయలు తప్ప రెండవది యింకో బయలు ఏదీలేదు.

అదేయిది. యిదేఅది. గనుక ఆ బయలు నేను యిలాంటి దాన్ని. నేను యింత గొప్పదాన్ని అని ఏ సామర్థ్యము జూపదు. మరియు కామక్రోధ లోభ మోహ మదమత్సరములనే గుణములు ఏమియూ లేక ఏ భావములు ఎరుగక ఎవరు ఏమన్ననూ మారుపలుకక ఏమి అనకుండా ఉండును. ఈ బట్ట బయలుకే ప్రతివారు నమస్కరించినారు. ఈ బయలునామ రూపక్రియా నటనలన్నియు మీరియున్నది. అనగా ఈ బయలులో తోచిపొయ్యో లేనెరుక యొక్కనటనలేమీ యెరుగక ఏకమై అన్నింటికి అతీతమై అచలమై యుండును. అనగా నేజేసిన సూచన ద్వారా విచారించి నీవు బయలై అచలమైయుంటే, ఏ వికారములు లేక ఏమిగాక ఏమి లేక పరిపూర్ణమై సర్వకాల సర్వవస్థలయందు ఉండవలెనని భావము. యిందుకు అవధూతగారి కం॥ అప్పుడు ఇప్పుడు అనకను - ఎప్పుడు బయలైయుండు ఏమియులేకన్ - యిప్పగది ఎరిగినప్పుడె -చప్పుడులేకుండ యుండు - చెదరక వినరా - మదిలోనెపుడు వదలాక గనరా - అని సెలవిచ్చియున్నారు.

**36 ॥ దానము ధర్మము సగుణ - ధ్యానము ప్రతిమార్చనంబుతజ్జపతీర్థ - స్నానములి విముక్తిదమవి - మానవులొనరించబయలు మాటాడదేమీ - యెరుకేలేదు - మాటాడేదేమీ - ఔను కాదనకనీ వనకనేననకక్క - మేనైనతాగాకమితి మీరీ యున్నాది - మాటాడదేమీ - యెరుకేలేదు మాటాడెదేమీ ॥ 5**

తా॥ శిష్యా! నేను నీకు చేసిన సూచనద్వారా. విచారించి నీవు బయలైనదే, అంతటా యున్న బయలు. ఆ బయలుకు ఈ లోకులు చేసేదానములు ఎన్నిచేసినా, ధర్మములు ఎన్నిచేసినా, సగుణములో దేవుడనిదేవతలని ఎన్ని ప్రతిమలకు పూజలు చేసినా, ధ్యానములు ఎన్ని చేసినా, ఆ దేవునికి అర్చనలు చేసినా, జపములు చేసినా, తీర్థయాత్రలు తిరిగి స్నానములు చేసి ముక్తి అనుకొని మానవులు ఎన్నిజేసినా, ఈ బయలు మాట్లాడినదా, యెరుకేలేదు, కనుక ఏమీ మాట్లాడదు. అవుననదు కాదనదు నీవనదు నేననదు ఒక మేనైనాతానుగాక అన్నిటికీ అతీతమై యెరుకమరుపులు లేక అచలపరిపూర్ణమయున్నది. ఈ బయలు అని భావము.

**37 ॥ ఇంతంతనియనరానిది - వింతలు శాయనిది - యన్ని విధములగనినన్ - చింత లెరుంగనిదీబయ -లెంతని వినుపింతునేనీకే మిరవృధుకా - తెల్పుటవినుట- మీకపెద్దకథకా - సంతతమొకరీతినకలదేశములాయం - దంతట నిండున్న దదుగోపరిపూర్ణము - యేమిర పృధుకా - తెల్పుటమినుట-మికపెద్దకథకా ॥ 6**

తా॥ శిష్యా! నేను పైన చెప్పిన సూచన ద్వారా విచారించి నీవు బయలైయున్న ఆ బయలే అనంతమై అంతటా నిండి నిబిడీకృతమై సూది మోపుటకు సందిలేక సర్వకాలముల యందు సర్వదేశములయందు యున్నది. అట్టి బట్టబయలు ఇంతా అంతా అని కొలతలులేనిది, ఏ వింతలు లేనిది ఎన్ని విధములు చూచినా ఏ చింతలు ఎరుగనిది. ఏ ప్రమాణములు లేనటువంటిది ఈ బయలు, అట్టి బయలును ఎంతని వినిపించను ఏమిరా పృధుకా, అటే ఓ శిష్యా ఓ పిల్లవాడా ఓ అటుకు గింజలాంటి

వాడా, నేను చెప్పటము నీవు వినటము ఇది ఒక పెద్ద కథగా, అనగా కథగాదు జనన మరణ వ్యధ మానుటకై రచిస్తే అని శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువు శెలవిచ్చినారు. గనుక ఈ బయలు సర్వకాలములయందు సర్వదేశములయందు సమస్త వస్తువులయందు, ఒకే తీరుగా అంతటా నిండి నిబిడీకృతమైయున్నది, ఈ బట్ట బయలు, అనగా ఈ బయలంటే తాను బయలైనది. అని అర్థము. అదిగో బయలు చూడు అంటే అంతటా ఉన్న బయలు, అని అర్థము, గనుక అదిగో చూడు అనగా నేను నీకు ప్రసాదించిన జ్ఞాన నేత్రము చేత ఆ బయలును చూడుము, ఆ పరిపూర్ణ పరబ్రహ్మము, అంతటా నిండి అమితమైయున్నది, చూడుము, అదే నీవు నీవే అది. ఇంకోటి లేదు, దానివలె నీవు సర్వకాలసర్వావస్థలయందు బయలై ఉండవలెనని భావము.

**38 ॥ ఆకాశాదికభూతా - నీకాత్మకమగుచుయెకయీ జగముయ్యేన్ - రాకడ పోకడ దీనికి ప్రాకటముగదేనిలోనొ -బట్టబయలదిరా - కాదనియంటె - వట్టిపల్కిదిరా - లోక త్రయము తనలోపాల తిరుగాగ - జోకాతోడుతదాని జోలెరుగనిది యేదొ - బట్టా బయలదిరా - కాదనియంటె - వట్టిపల్కిదిరా ॥ 7**

తా॥ శిష్యా! నీకు పైన చెప్పిన బట్ట బయలులో తనంతట తానుగా వచ్చిన ఆకాశము వాయువు అగ్ని జలము పృథ్వి, ఈ పంచభూతములవల్ల నీ ఆత్మ అయినది, ఈ ఆత్మ అనే ఎరుకవల్ల ఈ జగత్తు అయినది, ఇదే ఎరుక, దీని రాకడ పోకడ దేనిలోనో అదే బట్ట బయలు, కాదని అన్నవారిది వట్టి పల్కే ఈ లోకత్రయమనగా బ్రహ్మలోకములో సృష్టి విష్ణులోకములో స్థితి ఈశ్వరలోకములోఅయం అనగా ఉత్పత్తి స్థితి లయములు, తనలో ఆబయలులో జరుగుచున్నను, వీటిజోలి అనగా వీటి స్వరూపం యేమీ యెరుగనిదేదో అదే బట్టబయలు, అదే అచలం అదే పరిపూర్ణం, అదే నీ స్వరూపం, గనుక నీవు సర్వకాల సర్వావస్థల యందు బయలై యుండవలెను, కాదన్నవారి మాట అబద్ధమేనని భావము.

**39 ॥ తండోపతండములుగా - దండిరుషాదికములన్ని తనలోపలను - ద్దండతనుండి నపోయిన - నుండు సముద్రంబు యరుగా - కుండూనెప్పటికీ - పరిపూర్ణమి - ట్లుండూనెప్పటికీ - యండామావులరీతినుండేటి బ్రహ్మండ - ముండినపోయిన రెండూ గుర్తెరుగాని దుండూనెప్పటికీ - పరిపూర్ణమి - ట్లుండూ నెప్పటికీ ॥ 8**

తా॥ శిష్యా! సముద్రములో తండోపతండములుగా లెక్కలేని జలచరములు చేపలు పుట్టిపెరిగి చలించుచు తనలో గుంపులు గుంపులుగా నున్ననూ, చచ్చిపోవుచున్నను తనలోపల ఉన్నవని గాని పోయెననిగాని కొంచెమైనా ఎప్పుడూ యెరుగదు నిండు సముద్రము, అలాగే పరిపూర్ణములో ఎన్ని ఉన్నా పోయినా రెండు ఎరుగకుండా ఉండును. పరిపూర్ణము అనగా యండమావులవలె ఈ బ్రహ్మాండములో ఈశ్వరతను వనిగాని ఇందులో తోచిన జీవ తనువని గాని, ఇది ఉన్నావనిగాని పోయిన వనిగాని ఈ రెండూ గుర్తెరగక ఉండినదే పరిపూర్ణ పరబ్రహ్మము, అనగా నీవు బయలై

అచలమైయున్న పరిపూర్ణము దేనిని గుర్తెరుగకుండా ఉన్నదని భావము.

**40 ॥ యెరుకతొ వచ్చినవిశ్వము - యెరుకతొజనుగాని నిల్వదీబయలైతే - యెరుక తొరాదెరుక తొబోదెరుకతనందేమి లేదు - యిది నిశ్చయమురా - వుండుంటె యీ - యెరుకె తానౌరా యెరుకాయెరిగిన వస్తువెరుకాని తెలియూము - యెరుకా యెరుగదు బయలునిట్టి దట్టిదియన - నిదినిశ్చయమురా - వుండుంటె యీ యెరుకేతానౌరా ॥ 9**

తా॥ శిష్యా! 25వదైన యెరుకతో వచ్చిన జీవతను వైన ప్రపంచము. ఆయెరుకతోనే పోవును: గాని నిల్వదు ఈబయలైతే అనగా ఈ యెరుక బయలైతే, యెరుకతోరాదు యెరుకతోపోదు. అనగా ఈ యెరుక పరిశుద్ధమైతే ఆ పరిపూర్ణములో యెరుకలేదు, గనుక ఇది నిశ్చయము, ఈ యెరుక బయలవ్వకపోతే, యెరుకేతానౌను, అనగా తాను యెరుకయ్యే వుండును, యెరుక యెరిగిన వస్తువు అనగా యెరుక యంతవరకు ఎరుగుచున్నదో అంతవరకూ యెరుకని ఎరుగుము. యెరుక బయలును ఇట్టిదని అట్టిదని ఎరుగదు, అనగా యెరుక బయలైతే, దేనిని ఎరుగదు. ఆ బయలు ఎరుకైతే, అన్నిటనీ ఎరుంగును. ఇది నిశ్చయము. అని భావము.

**41 ॥ రవితమసమున్నెరుగునె - ప్రవిమలదావాగ్నిచదలు బట్టుటెరుగునా - దినమును రాతిరిరాత్రిని - దివమెరుగునెలేమి - లక్ష్మీదేవీ యెరగునా - అన్నమునూ భూదేవి యెరుగునా - భవనాశస్థితులు రాపాడేటి యెరుకాను - భవనాశస్థితిలేని బయలట్లెరు గదు - లక్ష్మీదేవీ యెరుగునా - అన్నమునూ భూ-దేవీ యెరుగునా ॥ 10**

తా॥ శిష్యా! నేను పైన చెప్పిన పరిపూర్ణము యెరుకను యెరుగదు. అలాగే సూర్యుడు చీకటిని ఎరుగడు, భగభగా మండే అగ్నికి చెదలు పట్టవు, పగలును రాత్రి ఎరుగదు, రాత్రిని పగలు ఎరుగదు, లక్ష్మీదేవి దరిద్రమును ఎరుగదు, అన్నమును భూదేవి ఎరుగదు, అలాగుననే ఉత్పత్తి స్థితి లయములతో కూడిన ఎరుకను. ఉత్పత్తి స్థితి లయములు లేని బయలు ఎరుగదు. అనగా నీవు బయలై యుంటె, దేనిని ఎరుగవని భావము.

**42 ॥ యెరుకైన భూతపంచక - మెరుకకు చరణములు కటియు హృదయము గళమున్ - శిరముననయ్యెను క్రమమున - ధరణి మొదల్జేసియిట్లు - తనయాగుర్తెరుగూ - గగనము బయలంచన రాదీమరుగూ - యెరుగాకాశమె పరిపూర్ణమనుచు కొందరు బల్కిరి దివిని గురిదప్పియుండేవు - తనయా గుర్తె రుగూ - గగనము బయలం - చనరాదీమరుగూ ॥ 11**

తా॥ శిష్యా! యెరుకైన పంచభూతములే ఎరుకకు అవయములన్నీ ఐనవి. పృధ్వి పాదములుగను జలము కటిప్రదేశముగాను అగ్ని హృదయముగాను వాయువు కంఠముగాను ఆకాశము శిరస్సుగాను ఏర్పడినది. అనగా పృధ్వి ఎరుపువర్ణం . జలం తెలుపువర్ణం అగ్ని నలుపు వర్ణం. వాయువు పొధూమ్రవర్ణం ఆకాశం నీలివర్ణం గనుక

పృథ్వి తత్వం లగాయతు ఆకాశ తత్వవరకు విచారించి గుర్తెరుగు ఆకాశతత్వం అనగా యిందుకు శృతి ప్రమాణం

శ్లో॥ చిత్తాకాశ చిదాకాశ మకాశంచ తృతీయ కం
ద్వాభ్యాం శూన్యం తరం విద్ధిచిదాకాశం మహామునేపి ॥

చిత్తాకాశమనగా ఈ కనుపించేటటువంటి దృశ్యప్రపంచమంతా చిదాకాశమనగా తనకు తానైయున్న గుర్తెరిగే శరీరం, మహాకాశమనగా అఖండమైయున్నటువంటి ఆత్మే, ఈ మూడు ఆకాశములు కల్పితముతోను శబ్దముతోను కూడి ఉన్నవి. గనుక ఇవి పరిపూర్ణం కావు. వీటికి లోపల వెలుపల అంతటానిండి నిబిడీకృతమై, నిశబ్దమైనదే పరిపూర్ణపరాకాశము, ఈ విషయములు కొందరు ఎరుగక ఈ ఆకాశమే పరిపూర్ణమని చెప్పుచున్నారు, ఇది నీవు విని గురుదప్పియుండేవు సుమా. నీవు బయలయ్యి అచలమయైనటువంటిదే పరిపూర్ణము గనుక. నీవు సర్వకాల సర్వావస్తలయందు పరిపూర్ణమై యుండవలెనని భావము.

**43 ॥ విత్తేచెట్టైపుట్టును - విత్తేవిత్తనము రీతివెలయును ధరపై - విత్తుకు చెట్టుకు వేరే - విత్తనమొకటున్నదనిన - వినగూడదో యా - తనకు దాబుట్టును వినవోయీ - విత్తూచెట్టులరెంటి విధమీభూమెరుగానట్లు త్రా బయలెరుగాదు - సత్తూచిత్తుల రెంట్ని - వినగూడదోయీ తనకుదా - బుట్టును వినవోయీ ॥ 12**

తా॥ శిష్యా! విత్తనమే చెట్టై పుట్టును, చెట్టే విత్తనమై వెలయును. ఈ విత్తునకు చెట్టునకు వేరేయింకో మూలం లేదు. ఉన్నదన్నా వినకూడదు. తనకు తానే పుట్టుచున్నది. తనకు తానే నశించుచున్నది, ఈ విత్తనాన్ని చెట్టుని భూమి ఎట్లు ఎరుగదో. అట్లే ఈ ఉత్త బట్టబయలు సత్తుచిత్తులను ఎరుగదు. ఏలాగు ననగా నీవు బయలైయున్న పరిపూర్ణములో జీవేశ్వరులనే సత్తుచిత్తులు అనగా ఎరుక మరుపులు లేవు. కాని ఆ పరిపూర్ణములో తనంతట తానేతోచి. ఎరుక మరుపులు ఒకదాని వల్ల ఒకటి సృష్టైవచ్చి మరల లేకపోవుచున్నది, ఈ ఉత్పత్తి స్థితి లయములను నీవు ఎరిగి. సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై. యుండవలెనని భావము.

**44 ॥ చెట్టే మూలమువిత్తుకు - చెట్టుకు మూలంబు విత్తుక్షితపైరెండున్ - పుట్టిన చచ్చినరెంటిని - ఘట్టిగ తానెరుగకుండు - గదరా ఈనేలా - నీవీరీతి - గనుగొనావేలా - పుట్టూను గిట్టూను పొలుపొందుతను వెరుక - లిట్టివిచిత్రాము లెన్నాడెరుగదు బయలు - గదరాయీ నేలా - నివీరీతికనుగొనవేలా ॥ 13**

తా॥ శిష్యా! చెట్టుకు మూలం విత్తు, విత్తుకు మూలం చెట్టు, చెట్టు విత్తులు రెండూ పుట్టిన గిట్టిన ఈ రెంటిని భూమి ఎరుగదు. అలాగే పరిపూర్ణములో సత్తుచిత్తులు రెండు పుట్టినా గిట్టినా పరిపూర్ణము ఎరుగదు. నీవీరీతిగా ఎందుకు విచారించుకొనుటలేదు. తను వెరుకలు పుట్టుచున్న గిట్టుచున్న ఇట్టి విచిత్రములు

బయలెన్నడు ఎరుగదు, కాని నీవు బయలైయుండకపోతే, తనువు ఎరుకలు తోస్తూనే ఉంటాయని భావం. ఇందుకు రామయోగి కందార్థం :

కం ॥ఎరుక శరీరమునకు ప్రియకరమై తనలోనే తాను గల్పించుచు. శ్రీ గురుబోధాచల వనధిలొ సరసముగను బుద్బుదములు, సలిలమైనటులా, విలయమునొందు. తనువెరుక లటులా ఎరుకచేతనే - యచలమెరిగి - పరిపూర్ణమై - ఎరిగేటి యెరుకా నుగురు తుండనియ్యాకూ - సలిలమైటులా - విలయము నొందు-తనువెరుకలటులా ॥

తా॥ శిష్యారత్నమా వినుము. సముద్రోదకమునందు బుద్బుదములు పుట్టి తిరుగా నీటియందే లయమగు రీతిగా, యెరుకదేహంన నిండా ప్రియకరమై తనలో తానె గనబడుచు, తనువెరుకల రెండునూ, గురుబోధయను, అచల మహాసముద్రమునందు లయించుచున్నది. ఈ యెరుకచేతనే అచల మిట్టిదని తెలుసుకొని, పరిపూర్ణమై ఎరిగేటి యెరుకను వదలిపెట్టుమని భావము.

**ఇతి శ్రీ మద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వే అచలలక్షణన్నామ తృతయ్యోధ్యాయః బావ విశేషార్థములు**

**సమాప్తము**



# ☆ 4 .యెరుక లక్షణము. 20 ☆

**45 ॥ యెరుకేదేహేంద్రియములు - యెరుకే వర్ణాశ్రమములు యెరుకే శృతులున్ - యెరుకేనీవును నేనును - యెరుకే సతిసోదరాదులెరుగుమువత్సా - నేదీర్చెద - నిదుగోనీయిచ్చా-హరిహరబ్రహ్మాది సురనరగిరి సరి - తరు మృగముఖ చరాచరమూలు యెరుకాని - యెరుగుమువత్సా - నేదీర్చెద - నిదుగోనీయిచ్చా ॥ 1**

తా॥ శిష్యా! ఈ శరీరము అంతరేంద్రియ ప్రాణేంద్రియ జ్ఞానేంద్రియ శబ్దేంద్రియ కర్మేంద్రియములు యెరుకే. పంచవర్ణములు యెరుకే, బ్రహ్మచర్య గృహస్త వానప్రస్త సన్యసాశ్రమములు యెరుకే, కులగోత్ర నామ రూపములు యెరుకే, భార్య సోదరులు పుత్రులు మిత్రులు బంధువులు అందరూ యెరుకే, కులగోత్ర నామ రూపములు యెరుకే. యింకా నీయిచ్చను తీర్చెదను వినుము, విష్ణువు ఈశ్వరుడు బ్రహ్మాది దేవతలు నరులు పర్వతములు, చెట్లు, మృగములు యజ్ఞములు చరాచరములు యివి అన్నియు ఎరుకేనని యెరుగుము, నీవు బయలై యుండకే, యెరుక ఇన్ని విధములుగా తోస్తూనే ఉంటుందని నేవెరిగి, నీవ్వత్రికాలముల యందు బయలైయుండుమని భావము.

**46 ॥ యెరుకే విద్యావిద్యలు - యెరుకే ప్రణవంబునాద మెరుకే కళయున్ - యెరుకే బిందువు చిత్తు - త్రెరుకే ఆనందమిదినీ వెరుగూసద్బుద్ధీ - నీ నామాట - లెరుకేని బద్ధీ - యెరుకే నిర్గుణ సగుణాలెరుకే యెరుకకు యంత - యెరుకోనేనిదియంత యెరుకా జేసితినీ విల్లెరుగూ సద్బుద్ధీ - నీ నామాట - లెరుకే నిబద్ధీ ॥ 2**

తా॥ శిష్యా! ఓ మంచి బుద్ధికలవాడా, యిదియునుగాక ఇంకా ఎరుకను వివరించెదను వినుము, విద్యావిద్యలు యెరుకే, ఓంకారము యెరుకే, నాదు బిందు కళలు యెరుకే, సత్తుచిత్తు ఆనందములుయెరుకే, నీనామాట యెరుకే, సగుణ నిర్గుణములు యెరుకే, ఇంకనూ ఈ యెరుక ఎంత యెరుగునో అనగా ఈ తెలుసుకొనే తెలివికి ఎంతవరకు తెలియబడునో అది అంతయు యెరుకేనని తెలియజేసితిని. గనుక ఇవి అన్నియు యెరుకేనని నీవు ఎరుగుము, నీవు బయలై ఉండకపోతే తనువెరుకలు ఈ విధముగా తోస్తూనే ఉంటాయని నీ వెరిగి త్రికాలములయందు, నీవు బయలై యుండుమని భావము.

**47 ॥ యెరుకే ఇహపరసౌఖ్యము - లెరుకే జ్ఞానంబు జ్ఞేయ మెరుకే మోక్షం - బెరుకే భక్తి విరక్తులు - యెరుకే సంకల్పమనినీ వెరుగూసత్కీర్తి - యెక్కడికొర - యెరుకా సంపూర్తి - యెరుకే జీవుండీశుడెరుకేతదేకత - యెరుకే సర్వమునే గుర్తెరిగీ చెప్పితి యాకీ - లెరుగూ సత్కీర్తీ - యెక్కడికొర - యెరుకాసంపూర్తీ ॥ 3**

తా॥ శిష్యా! ఇంకను ఎరుకను వివరించి చెప్పుచున్నాను వినుము, ఇహ సౌఖ్యము పరసౌఖ్యము జ్ఞాత జ్ఞానము ఇవన్నీ యెరుకే, జ్ఞేయమనే బయలు శుద్ధ యెరుకే, మోక్షమనగా తానురహితమై లేకయుండుట ఇది శుద్ధ యెరుకే, ఇంకనూ భక్తి విరక్తి సంకల్పము ఇవన్నీ యెరుకయే, మంచి కీర్తి గలవాడా, ఈ యెరుక సంపూర్తి ఎక్కడి కొతుందని చెప్పను, పిండాండములో జీవుడు బ్రహ్మాండములో ఈశ్వరుడు ఈ జీవశివులు రెండూ ఏకమైనది యెరుకే, తత్పదము త్వంపదము అసిపదము సర్వము ఎరుకయ్యే కానవచ్చుచున్నది, ఇట్లు నేను గుర్తెరిగి చెప్పుచున్నాను, నీవు బయలై పరిపూర్ణమై ఉండకపోతే అన్నియు తోస్తూనే ఉంటాయి. గనుక నీవు సర్వకాలం, బయలై యుండుము అని భావము. ఇందుకు రామయోగి

కం॥ నేనే నేననె దైవము - నేనే నీవనెటి యెరుక - నేనెట్లందున - నేనే నేనైతినాహో - నేనే నీయచలమగుచు - నేనిల్వగానూ - యెరుకను మరచి నేనెవరిగననూ - నీనా సందున వెలుగుదాన్ని - పరిపూర్ణముగాను యెరిగిన నవల - నీనాబేధము విడిచి నే నిల్వగాను - యెరుకను మరచి నేనెవర్ని గననూ॥

తా॥ శిష్యా! నేనే దేవుడును, నేనే నీవనే యెరుకను, నీనా సందు ప్రకాశించు దానిని పరిపూర్ణమని తెలిసికొని నీనాబేధము వదలినేనే పరిపూర్ణమైనప్పుడు యెరుకను మరచుట కింక నెవరున్నారు ఆహా యిది చిత్రముగా నున్నదని భావము.

యుక్తి చెప్పను. ఆ యుక్తి వలన విచారించి అనగా యెరుక మరుపు లేకుండా బయలనే సద్గురు స్వరూపమును సర్వకాల సర్వావస్థలయందూ అర్చన చేస్తూ యుంటే, అనగా గురుపాదములనే జీవేశ్వరులు పుట్టకుండా ఉండేలాగున అర్చన ఎవరుచేస్తారో, అట్టివారికి యెరుక ఉత్పత్తి తెలియబడును, గాని ఇతరులకు తెలియబడదని, అనగా గురు పాదార్చన యెరుగని నరులకు తెలియబడదని భావము.

**66 ॥ లేనెరుకబయలు లోపల - తానెట్లు జనించెనవిన తగవినువంధ్యా - సూనునిగతి వియదబ్జవి - ధానంబున యక్షరాజ - ధానీ విధమునన్ - రజ్జువు సర్పమైనా విధమునన్ - స్థాణుపూరుషుని చందాన మృగజల - శశవిషాణము స్వప్నానంద మునగ - రాజధానీవిధమునన్ - రజ్జువుసర్ప - మైనా విధమునన్ ॥ 2**

తా॥ శిష్యా! ఈ లేనెరుక సర్వత్ర నిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణపరబ్రహ్మమందు జనించినది, మరి ఏ విధముగా జనించెనో చెప్పుచున్నాను వినుము, ఎట్లనగా వంధ్యాసునునిగతి, అనగా గొడ్రాలు బిడ్డవలె, ఆకాశమునందు పుష్పమువలె, యక్ష రాజధాని వలె అనగా యక్షులు ఒకచోట స్థిరముగా యుండరు వారికి రాజధాని లేదు, రజ్జువు అనగా త్రాడు సర్పమైనట్లు అనగా త్రాడు సర్పమువలె కనుపించు భ్రాంతి మరియు మొద్దును జూచి దొంగవాడని భ్రమించినట్లు యండమావులయందు నీరుయని భావించినట్లు, కుందేలునకు కొమ్ములు ఉన్నవి అన్నట్లు, స్వప్నములో కలిగిన ఆనందము వలె, ఈ లేనెరుక లేనిదే ఉన్నట్లు జనించుచున్నది, మేలుకుంటే అనగా విచారించి చూస్తే పరిపూర్ణములో ఏమీ లేదు, కానీ ఉన్నట్లు తోస్తున్నది, యివి అన్నియు భ్రమలేకాని ఏమియును లేదు, ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప, ఈ లేని యెరుక ఎంత మాత్రము లేదని భావము.

**67 ॥ లేనెరుకను యెరుకనియన - లేనెరుకెట్లా - యనవినలెస్సగ వినుమా - లేని మృగజలము వంధ్యా సూనులు గలిగుండి వెదకి - చూడాలేనట్లూ - ఈ లేనెరుక - యూడాలేదిట్లూ - స్థాణు పూరుషూడు శశివిషాణము - గగనాసూనాము నరునీ స్వప్నానందమివి వెదకి చూడా - లేనట్లూ - యీ లేనెరుక - యూడాలేదిట్లూ ॥ 3**

తా॥ శిష్యా! ఈ లేనెరుకను యెరుకనియంటే, లేనెరుక ఎట్లు ఐనదనగా, యిది బాగుగా వినుము, యండ మావులలో నీరును, గొడ్రాలియొక్క బిడ్డను, ఎంత వెదకి చూచినా కానరానట్లు, ఈ లేనెరుకను విచారించి చూచినట్లైతే, యచ్చటను కానరాలేదు, మరియు మొద్దును జూచి దొంగయని భావించినట్లు, కుందేలుకున్న చెవులు చూచి కొమ్ములు ఉన్నవని భావించినట్లు, ఆకాశమునందు పుష్పములున్నవని భావించినట్లును, మానవుని స్వప్నానందము నిజమని భావించినట్లు, అలాగే పరిపూర్ణములో లేని యెరుక ఉన్నట్లు తోచుట వలన ఉన్నదనుకొనుచున్నారు.

**50 ॥ వినమూర్ఖనాభితా - బుద్ధినమోదట - సృజన జేయుదినము హరించున్ -**
**ఘనమగుపటశతకోట్లను - తనలో పలిదారమునను - తానట్టే చనునూ - అట్లనె**
**యెరుక - తాబుట్టికనునూ - పనిబూని బ్రహ్మాండభాండనంతములాను -**
**క్షణము లోపల ద్రుంచి - కనరాకవేవేగ - తానట్టెచనునూ - అట్లనె యెరుక -**
**తాబుద్ధికనునూ ॥ 6**

తా॥ శిష్యా! వినుము, ఇంకను యెరుక ఎలాంటిదనగా, సాలెపురుగుతాను జన్మించినప్పటినుండి - సృజన చేయుచు పటములు అల్లుచుండును. రోజులు గడిచిపోవును అయిన్ననూ అనేక కోట్ల పటములను తనలో నుంచి ఉత్పన్నమయ్యే దారము వలన, అట్లు అల్లుకొనుచూ ఆదారమైపోయిన తరువాత ఆ పటములోనే నశించి పోవుచున్నది. సాలెపురుగువలెనె, యెరుక కూడా తనలో ఉత్పత్తయ్యే సంకల్ప వికల్పములనే భ్రాంతులయందే ఉండి ఈ భ్రాంతులలోనే మగ్నమై అనేక బ్రహ్మాండ బాండములను సృష్టించుకొనుచున్నది, కొన్నిరోజులు గతించిపోవును, ఈ విషయము నెరుగక పంజరంలో చిలుకవలెనే నేత్రమనే పంజరములోనె. కొన్నాళ్ళకు ఆయువు తీరిన తరువాత నశించిపోవుచున్నది. గనుక నీవు బయలైయుండకపోతే యెరుక ఇన్ని వికారములు పొందుచునే యుండునని గ్రహించి నీవు సర్వకాలం బయలైయుండుము అని భావము.

**51 ॥ తలిధండ్రులు జీవేశులు - యిలవ్యోమములేను మేనులెరుక మరుపులున్ -**
**కలమేల్కలు శుక్లాశ్రం - బులునీరాన్నములు ప్రకృతి - పురుషూడాల్మగడూ -**
**గానైయెరుక - కెరుకె కానబడూ - తెలశీబయలున్నాది ధెలశీ యీ తెలివిని -**
**తెలివిచాతనెపట్టి - తీసివెయ్యుము ప్రకృతి - పుమూడాల్మగడూగానై యెరుక -**
**కెరుకే కానబడూ ॥ 7**

తా॥ శిష్యా! వినుము ఇంకను యెరుక రూపము చెప్పచున్నాను, తల్లీతండ్రీ జీవుడు ఈశ్వరుడు భూమి ఆకాశము నేను మేనులు యెరుకమరుపులు కలమేల్కలు శుక్లము శోణితములు అన్నము నీరు ప్రకృతి పురుషుడు ఆలిమగడుగా ద్వంధరూపములుగా తయారయ్యి. ఈ యెరుక ఒక్కటే ఇన్నిరూపములుగా అయినదని, అనగా యెరుక కెరుకే ఇన్నిరూపములయ్యి కనబడుచున్నది. ఇట్లు తెలుసుకొని ఈ తెలివిని తెలివియొద్దనే వుంచి తెలివిచేతనే తెలివిని తీసివేయవలెను. అనగా ముల్లును ముల్లుపద్దనే ఉంచి, ముల్లును తీసివేయునట్లు, చూచె యెరుకను అష్టదళ పద్మము మధ్యన పీతవర్ణములోపల శ్వేత వర్ణమైన యెరుక వద్దను ఉంచి యెరుకను తీసివేయుము. అనగా ఈ చూచే యెరుకను అఖండమండల మండిత హృదయ పుండరీక మధ్యస్థ సర్వవ్యాప్త సచ్చిదానంద స్వరూపమైన యెరుక వద్దను ఉంచి యెరుకను తీసివేయవలెను. అట్లు తీసివేసిన వెనుక ఇక ఉన్నది నీవైన బయలేనని అనగా నీవు ఏమియూ లేక బయలై ఉంటావని అలా ఉంటే ఏసంకల్పములు ఏ ఊహలు ఉండవని భావము.

**52 ॥ వొక దేహధారితనువున - సకలావస్థలు జనించిచనిన విధమునన్ - అకలంకమైన బయలులో - ప్రకటంబైలేని యెరుక బయలుండజూచి - తనముచ్చట - పరికించిలేచి - వొకకొంతశేషైన వుండేటందుకు లేక - సకలాము తనవెంట జనుదేరజనుబట్ట బయలుండజూచి - తనముచ్చట పరికించి లేచీ ॥ 8**

తా॥ శిష్యా! ఒక దేహానికి బాల్యము యవ్వనము కౌమారము వార్థిక్యము అవస్థలు వచ్చి వెళ్ళినట్లుగా, జాగ్రత్త స్వప్న సుషుప్తి తుర్యావస్థలు వచ్చి వెళ్ళినట్లు, ఏకళంకము లేనటువంటి బయలులో లేనెరుక వస్తూపోతూ, ఒకప్పుడు బయలును ఉండజూచి తనముచ్చట పరికించిచూద్దాం అని అనుకొనే సరికి, ఒక క్షణమైనా ఉండడానికి వీలులేక యెరుక దానికి సంబంధించిన సమస్తమూ తీసికొని ఏమిలేకుండాపోయినవి. అనగా అఖండస్వరూపమైన బయలును ఉండజూచే సరికి ఈ చేసే యెరుక ఏమిలేకుండా బయలైపోయెను. ఇక ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మమే కనుక నీవు సర్వకాల సర్వావస్థలయందు ఆ పరిపూర్ణమై ఉండవలెనని భావము.

**53 ॥ మేలుక సుషుప్తిలోపల - నే లీలం తనకుదానుయే తెచునొగు - రా లీలబయలు లోపల - వాలాయము తనకు దానే - వొచ్చునోయన్నా - వొచ్చి హెచ్చి - చచ్చునో యన్నా - యీలోపలనే బట్టబయలున్న దెరిగితే - యేలోకమున నిల్వజాల దెరుగకుంటె వొచ్చునోయన్నా - వొచ్చి హెచ్చి - చచ్చునోయన్నా ॥ 9**

తా॥ శిష్యా ! యెరుక ఇంకను ఎటువంటి దనగా వివరించి చెప్పుచున్నాను వినుము. ఈ యెరుక సుషుప్తి లోపలనుండి మొలుకువకు వచ్చేటప్పుడు ఏ విధముగా తనకు తానే వచ్చు చున్నదో, గుర్తు అనే ఎరుక ఆ విధముగానే బయలులో నుండి తను తానే వచ్చుచున్నది. అనగా కొబ్బరికాయలోకి నీళ్ళు వచ్చినట్లు యెరుక వచ్చుచున్నది. ఆ స్థితిని పొంది లయమయ్యే లోపల ఈ ఎరుక బట్టబయలున్నదని యెరిగితె, ఏ లోకమున నిల్వజాలదు, అనగా ఉత్పత్తి అయ్యే బ్రహ్మలోకములోగాని ఈ వచ్చిన దానిని పోషించే విష్ణులోకములోగాని వీటన్నిటిని లయంచేసే ఈశ్వర లోకములోగాని యెరుక నిల్వజాలదు, బట్టబయలును యెరుగకుండా ఉంటే, జాగ్రత్త స్వప్న సుషుప్తి అనే అవస్థలు పొందుతూనే ఉంటుంది, కనుక తాను బయలై అచలమై సర్వకాలము ఉండవలెనని భావము.

**54 ॥ ఆటాడియాడకుండును - ఆటాడినమేనిబొమ్మయాటాడకనే - ఆటాడు నెరుక యని యెడి - యాటాడించేటివాడు - యతడేరకర్తా - అంతటికీ యీ - యచలా మకర్తా - చేటూపాటుల రెంటిచే వచ్చు ఫలము - ముమ్మాటికనుభవించి మరణాజననము లొంద - నతడేరకర్తా - అంతటికీ యీ - యచలామకర్తా ॥ 10**

తా॥ శిష్యా! ఈ యెరుక ఎటువంటిదనగా చెప్పుచున్నాను వినుము, 25వది అయిన యెరుకనే ఈశ్వరతనువు ఆడించితే 24 ఇంద్రియములతో కూడిన



**52 ॥ ఏక దేహధారితనువున - సకలావస్థలు జనించినని విధమునన్ - అకలంకమైన బయలులో - ప్రకటంబైలేని యెరుక బయలుండజూచి - తనముచ్చట - పరికించిలేచి - ఏకకొంతసేపైన వుండేటందుకు లేక - సకలాము తనవెంట జనుదేరజనుబట్ట బయలుండజూచి - తనముచ్చట పరికించి లేచి ॥ 8**

తా॥ శిష్యా! ఒక దేహానికి బాల్యము యవ్వనము కౌమారము వార్ధక్యము అవస్థలు వచ్చి వెళ్ళినట్లుమా, జాగ్రత్త స్వప్న సుషుప్తి తుర్యావస్థలు వచ్చి వెళ్ళినట్లు, ఏకళంకము లేనటువంటి బయలులో లేనెరుక వస్తూపోతూ, ఒకప్పుడు బయలును ఉండజూచి తనముచ్చట పరికించిచూద్దాం అని అనుకొనే సరికి, ఒక క్షణమైనా ఉండడానికి వీలులేక యెరుక దానికి సంబంధించిన సమస్తమూ తీసికొని ఏమిలేకుండాపోయినవి. అనగా అఖండస్వరూపమైన బయలును ఉండజూచే సరికి ఈ చేసే యెరుక ఏమిలేకుండా బయలైపోయెను. ఇక ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మమే కనుక నీవు సర్వకాల సర్వావస్థలయందు ఆ పరిపూర్ణమై ఉండవలెనని భావము.

**53 ॥ మేలుక సుషుప్తిలోపల - నే లీలం తనకుదానుయే తెచునొగు - రా లీలబయలు లోపల - వాలాయము తనకు దానే - వచ్చునోయన్నా - వొచ్చి హెచ్చి - చచ్చునో యన్నా - యీలోపలనే బట్టబయలున్న దెరిగితే - యేలోకమున నిల్వజాల దెరుగకుంటె వొచ్చునోయన్నా - వొచ్చి హెచ్చి - చచ్చునోయన్నా ॥ 9**

తా॥ శిష్యా ! యెరుక ఇంకను ఎటువంటి దనగా వివరించి చెప్పుచున్నాను వినుము. ఈ యెరుక సుషుప్తి లోపలనుండి మొలుకువకు వచ్చేటప్పుడు ఏ విధముగా తనకు తానే వచ్చు చున్నదో, గుర్తు అనే ఎరుక ఆ విధముగానే బయలులో నుండి తను తానే వచ్చుచున్నది. అనగా కొబ్బరికాయలోకి నీళ్ళు వచ్చినట్లు యెరుక వచ్చుచున్నది. ఆ స్థితిని పొంది లయమయ్యే లోపల ఈ ఎరుక బట్టబయలున్నదని యెరిగితే, ఏ లోకమున నిల్వజాలదు. అనగా ఉత్పత్తి అయ్యే బ్రహ్మలోకములోగాని ఈ వచ్చిన దానిని పోషించే విష్ణులోకములోగాని వీటన్నిటిని లయంచేసే ఈశ్వర లోకములోగాని యెరుక నిల్వజాలదు. బట్టబయలును యెరుగకుండా ఉంటే, జాగ్రత్త స్వప్న సుషుప్తి అనే అవస్థలు పొందుతూనే ఉంటుంది. కనుక తాను బయలై అచలమై సర్వకాలము ఉండవలెనని భావము.

**54 ॥ ఆటాడియాడకుండును - ఆటాడినమేనిబొమ్మయాటాడకనే - ఆటాడు నెరుక యని యెడి - యాటాడించేటివాడు - యతడేరకర్తా - అంతటికీ యీ - యచలా మకర్తా - చేటూపాటుల రెంటిచే వచ్చు ఫలము - ముమ్మాటికనుభవించి మరణాజననము లొంద - నతడేరకర్తా - అంతటికీ యీ - యచలామకర్తా ॥ 10**

తా॥ శిష్యా! ఈ యెరుక ఎటువంటిదనగా చెప్పుచున్నాను వినుము, 25వది అయిన యెరుకనే ఈశ్వరతనువు ఆడించితే 24 ఇంద్రియములతో కూడిన



తా॥ శిష్యా! ఈ యెరుక యెటువంటిదనగా చెప్పుచున్నాను వినుము, పిండము బ్రహ్మాండము ఇవి రెండు ఇందు పిండములో జీవోహం బ్రహ్మాండములో శివోహం, ఈ ఖండములు నాల్గుగూడి అఖండంబగు యెరుకరూపు గనరా మాతండ్రీ. అనగా జీవేశ్వరులకు అతీతమై బయలై అచలమై పరిపూర్ణమై యున్న యెరుక రూపుగనరా, పరిపూర్ణమై ఉండరా అని చెప్పియున్నారు, దీని రహస్యం చెప్పినవారే తల్లిదంగ్రీ అనగా ఈ యెరుక పిండాండములో ఈ చైతన్యము జీవతనువై ఉంటుంది, అనగా ఇది 24 ఇంద్రియములతో కలిసి తిరుగుటచే జీవుడన్నారు, బ్రహ్మాండములో ఈ చైతన్యము ఈశ్వరతనువై ఉంటుంది, ఇది 25వ దై ఎరుగుట వలన ఈశ్వరుడన్నారు, ఈ నాల్గు కలసి అఖండమౌచున్నది, ఈ విధముగా తిరుగుచున్నదని చెప్పినవారే సద్గురువులు, అనగా అఖండ యెరుక రూపు బయలు ఇదే అచల పరిపూర్ణము, అనగా అఖండంలో ఖండాఖండములన్నీ రహితమైన తరువాత శేషించియున్నదే అచలపరిపూర్ణమని చెప్పినవారే సద్గురువులు, వారే తల్లిదండ్రీ, పిండములో జీవుడై బ్రహ్మాండములో ఈశ్వరుడై ఈ యెరుక ఉద్దండులమని మేమే గొప్పవారమనుచున్నది, కాని ఇది కల లేనిది ఉన్నట్లు కల్పించుచున్నది, అయినా దీన్ని విచారించి తెలుసుకో, నీవు బయలై ఉండకపోతే యివి అన్ని తోస్తూనే ఉంటాయి, గనుక నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలై పరిపూర్ణమై ఉండవలెను. ...పోతే ఈ అఖండములో ఖండా ఖండములైన జీవేశ్వర్లు తోస్తూనే ఉంటారు, మరల అఖండమై బయలైతే లేకపోవుచున్నవి. నీవిచారించి బయలవకపోతే మరల తోస్తూనే ఉంటాయి. జీవేశ్వర్లే ప్రకృతి పురుషులు ఇవే యెరుక మరుపులు మరుపనగా స్థూల సూక్ష్మ కారణ శరీరములైన జాగ్రత స్వప్న సుషుప్తి అవస్తలు, యెరుకనగా మహాకారణశరీరమైన తుర్యావస్థ, గనుక వీటిని విచారించి నీవు అఖండమై బయలవకపోతే, ఇవన్నీ తోస్తూనే ఉంటాయి. నీవు బయలైతే లేకపోతాయి, అందువల్ల యివి కలనయినాగనరా మా తండ్రీ అని చెప్పియున్నారు. గనుక నీవు పదేపదే విచారించి అఖండమై బయలై సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై ఉండవలెనని భావము. ఇందుకు రామయోగి కందార్థం :

కం॥ పరిపూర్ణద్వాదశాక్షర - పరమంత్ర విచార పూర్ణపరవశవార్ధిన్ - పరిపూర్ణ శోడశాక్షర - పరమంత్రమునీట గలపిబైట నిలుచోరా - నిలచిన బోధ నిజమచెలమురా - గురి గురుతులనె బోధమరుగులా రెంటిలో - గురుతుషోడశ మొదట గురినీవే - ద్వాదశి బైటనిలుచోరా - నిలచిన బోధ నిజమచలమురా॥

తా॥ పరిపూర్ణ ద్వాదశాక్షరి మంత్ర విచారము వలన కలిగిన పూర్ణమైన పరవశమహా సముద్రములో - పరిపూర్ణ షోడశాక్షరి, మంత్రమును కలిపి, పరిపూర్ణమందు నిలుపుము, నిశ్చయంగా నిలచియున్నదచలమే, గురి గురుతులగు

రెంటిలో గురుతైన షోడశాక్షరిని, వదలిగురునీవై, పరిపూర్ణమునందైక్యము కమ్మని భావము.

**57 ॥ పరిపూర్ణమొకటిదక్కని - తరమైన ప్రపంచమెల్లతగదెలియుమునీ - వెరుకేనని మదిలోపల, యెరుకే పరిపూర్ణ మెరిగేదెరుకానెరిగేది - యింక్కొటిలే - దీరెంట్నె రిగేదీ - యెరుకాపుట్టువు మూలమెరుగాని దీయెరుకే - యెరుకెతాబుట్టినదెరుగా బోయిత లేదం - చ్చెరుకానెరిగేదీ - యింక్కొటిలేదీ - రెంట్నెరిగేదీ ॥ 13**

తా॥ శిష్యా! పరిపూర్ణ మనగా ఎటువంటిదో, యెరుకనగా ఎటువంటిదో ఈ రెంటినీ వివరించి, చెప్పుచున్నాను వినుము, పరిపూర్ణము అంతటానిండి నిబిడీకృతమై సూదిమొన మోపుటకు సంధిలేకుండా యున్నది, అదియొకటిదప్ప యితరమైన ప్రపంచమంతయూ సమస్తమూ ఎరుకే అని నీ మనస్సులో బాగా దృఢముగా ఎరుగుము, యెరుకే పరిపూర్ణమును యెరిగేది యెరుకను యెరిగేది యెరుకే, ఈ రెంట్నీ యెరిగేది యింకొకటిలేదు, కానీ ఈ యెరుక తనపుట్టుక దాని మూలము ఎరుగనిది. ఈ యెరుకే, ఈ యెరుక యొక్క పుట్టుక మూలం యెరుగుటకు ప్రయత్నం చేస్తే, ఈ యెరుక ఏమీ లేదు, దాని మూలం అది చూసే సరికి ఆ యెరుక ఏమీ లేకుండా బయలై పోవుచున్నది. గనుక నీవు విచారించినప్పుడు యెరుక బయలై ఏమీ లేకయున్నది, నీవు విచారించనపుడు మరలా దానికదే వచ్చుచున్నది, గనుక నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలై యుండవలెనని భావము.

**58 ॥ పాపములు పుణ్యములు భువి - బ్రాపించును యెరుక చాతభ్రమసిన వారిన్ ప్రాపింప వెరుకడళీన - తాపసులను చిత్తమందు - తగదెల్పుకొనుమీ - ఆగామిబో - ధను లెస్సా విను మీ - పాపాలలో శుద్ధస్పటికా సన్నిభమైన - ఆపో జ్యోతిని ప్రత్యగాత్మ నీమదిలోన - తగదెల్పుకొనుమీ - ఆగామిబో - ధను లెస్సా వినుమీ। ॥ 14**

తా॥ శిష్యా! ఇంకను యెరుక విషయములు చెప్పుచున్నాను వినుము. పాపమనియు పుణ్యమనియు యివి ఎరుకను నమ్మినవారిని బాధించు[illegible] చేసిన ఖర్మ ఫలితము సూక్ష్మ శరీరమును అంటే పునర్జన్మమునకు కారణ[illegible] దాని వలన ఆ పాప పుణ్యములు ఫలితము అనుభవింపక తప్పదు. గనుక[illegible] విడిచిన మహాత్ములకు, ఈ పాప పుణ్యములు బాధించవు, యెరుకను [illegible] అనగా ఎరిగేతెలివిని ఏమీ లేకుండా విడచిపెట్టిపోయిన వారికి, అనగా తన్నుతాను చూచేవారికి ఏ పాప పుణ్యములు అంటవని, తెలుసుకొని వారు చెప్పే బోధయే ఎరుకలేని పూర్ణబోధయని, అనగా సర్వకాల సర్వావస్థలయందు తాను పరిపూర్ణమై యున్నారని, తెలిసే వరకూ వినుము. కనుపాపలలో యున్న శుద్ధ స్పటికము వలె కనుపించు ఆ పో జ్యోతిని పరబ్రహ్మ పరిపూర్ణమని యనుకొనక అది పాప పుణ్యములు పొందుప్రత్యగాత్మయైన యెరుకేనని నీమదితో తెలుసుకొనుము, నీవు చేసిన కర్మల

ననుసరించి, పునరావృత్తిని కలిగించును, గనుక దానికి తగిన జన్మ కలిగించునని తెలుసుకొని, జన్మరహితమయ్యే విచారణజేసి, యెరుకను ఏమీ లేకుండా చేసుకొంటే, పునరావృత్తి రహితమై ఆ తరువాత శేషించి యున్నదే పరిపూర్ణ పరబ్రహ్మమని ఎరిగి, నీవు సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై యుండవలెనని భావము.

**59 ॥ యెరుకన్నను మరుపన్నను - యెరుకకు యెరుకన్న దేహియనమాయయనన్ - గురుతనసా - క్ష్యనజ్ఞప్త్యన - స్ఫురణయనన్ ద్రష్టయనిన - చూడూ మొక్కటిగా - యిది లేకుంటె - చూడామొక్కటిగా - మరిచలాచలమూల మర్మామెరిగేటి దన్న.- యెరిగి తాలేనాని - యెగిరిపొయ్యేటిదన్న - చూడూ మొక్కటిగాయిది లేకుంటె - చూడామొక్కటిగా ॥ 15**

తా॥ శిష్యా! ఇంకను ఎరుక ఎటువంటిదనగా దానిపేర్లు చెప్పుచున్నాను వినుము, యెరుకంటే మహాకారణ శరీరమనేకళ ఇది బ్రహ్మాండంలో నున్నది. పిండాండములోని వున్నది జీవతనువు. ఈ రెండు ఒక యెరుకే, యెరుకను యెరుకయ్యేదనగా, 25వ దైన ఈశ్వరతనువైన బ్రహ్మాండ యెరుక 26వ దైన బ్రహ్మాండాతీతమైన అఖండయెరుకను ఎరిగినప్పుడు, యెరుకకు యెరుకౌను. ఈ ఈశ్వర తనువే దేహి మాయయనిన యెరుకే, అనగా ఈశ్వరతనువే బ్రహ్మాండ ఎరుక జీవతనువే పిండాండ యెరుక ఈరెండు ఒకటే, ఇదే మూలము లేని గుర్తెరిగే శరీరము, ఇదే సాక్షి, అనగా అన్నిటికి సాక్షిగా ఉన్నది, ఇదే జ్ఞప్తి యనిన స్మరణయనిన యివి యన్నియు ఒక యెరుకే, కాని ఈ యెరుక యిక్కడ ఉండి ఏ పనిచేస్తే ఆ పేరు పెట్టినారు, ఎలాగనగా త్రోవవెంట నడుస్తూ వెళ్ళినప్పుడు బాటసారి అన్నారు, ఆ మనిషే వ్యవసాయం చేస్తేరైతు అన్నారు, అ మనిషే వ్యాపారము చేస్తే వర్తకుడన్నారు, ఆ లాగున ఏ పనిచేస్తే ఆపేరు పెట్టినారు, కాని ఉన్న వస్తువు ఒక్కటే, అఖండ యెరుక ఒక్కటే ఉన్న యెరుక, మిగతా యెరుక లేనిది, ఉన్నట్లు కనిపించుటే కాని విచారించి చూస్తే యెక్కడ ఏమీ లేదు, యండమావులలో నీరువలె కానుపించునుగాని చూస్తే ఏమీ లేదు, ఉన్నది ఒక్క అఖండ యెరుకేనని బావించుకో, యెరుక లేకపోతే ఇంక ఏమీ లేదు, అఖండ యెరుక అచలమై బయలైన యెరుకే వారికే తెలియబడుచున్నది, చలనముతో కూడి యున్నదే నేను మేనులు ప్రకృతి పురుషులు జీవేశ్వర్లు అదే మాయ అదే చలనము, అఖండ యెరుక అచలము ఈ రెండింటిని ఎరిగేది 25వది ఈశ్వర తనువైన యెరుకే ఈ రహస్యం యెరిగేది, యెరుకే అన్నిటిని యెరిగి తనను తాను యెరిగే సరికి. తానే లేకపోయేనది, తాను బయలై అఖండమై అచలమయున్న యెరుకే ఉన్నదని భావము.

**60 ॥ అనుమానము మదినుంచక - వినుమింకను యెరుకపేర్లు - వివరించెదబు- ధ్యనచిత్తంబనమానస - మనినహంకారమనిననంతఃకరణనినన్ - సంకల్ప మంచని - నాయిచ్ఛనినన్ - తననితరులనే తానని గుర్తెరిగెటిదన్న - తననేకాని తరూలతననూ దెలిశెటిదన్ననంతః కరణనినన్ సంకల్ప-మంచనినాయిచ్ఛనినన్ ॥ 16**

తా॥ శిష్యా! యెరుకపేర్లు ఇంకను వివరించి చెప్పెదను వినుము, నీ మనస్సులో అనుమానమేమీ ఉంచుకోవద్దు, నిశ్చయించే బుద్ధియనినను, సంకల్ప వికల్పముల పొందే మనస్సుయనినను, తనలో తాను చింతన చేసే చిత్తంయనినను, ఫలితాఫలితములను లెక్కచేయకుండా ఉండే అహంకార మనినను, అంతఃకరణ లనినను, ఇవి అన్నియు యెరుకపేర్లు, ఇంకను చెప్పెదను వినుము, అది కావాలి యిదివద్దు అని సంకల్పించేది అనినను, తన యిష్టానుసారము నడిపించే యిచ్ఛయనినను, తాను ఇతరులు ఇతరులు తానుయని గుర్తెరిగేదనినను, తనను తాను తెలుసుకొనేది, ఇతరులను తెలుసుకొనేది యనినను ఈ యెరుకే, అనగా ఒక్క యెరుకే యివి అన్నియు అని తెలుసుకొని, నీవు సర్వకాలం బయలై అచలమై యుండవలెనని భావము.

**61 ॥ వినుమితరులు యెరుకను - సాక్ష్యని పల్కిరినేను సాక్షినహమనినీతో - విన జెప్పితివింతియెవే - రనకూడదు రెంటినొక్కటని తెలుసుకోరా - మాటలబేధ- మనికనుక్కోరా - అనరాని వినరాని కనరాని బయలందు - తనకైతానరుదెంచి తనకైతాజనునీ - సాక్ష్యని తెలుసుకోరా - మాటలబేధ - మనికనుక్కోరా ॥ 17**

తా॥ శిష్యా! వినుము ఇతరమతస్థులు ఈ యెరుకను సాక్షియని పలికిరి, నేను ఆ సాక్షిని నేను నేననే అహమని నీతో వినజెప్పితిని, యింతియే కాని వేరుకాదు, ఈ రెండు ఒక్కయెరుకే, ఇది మాటల బేధమే కాని వేరుకాదు, అనరాని వినరాని కనరాని బయలులో, అనగా నీవు బయలైయున్న అచలంలో అనేది వినేది కనేది లేదు, అలాంటి బయలులో తనకు తానె పిలవని పేరంటమువలె వచ్చి, తనకు తానె పోయినది, ఈ యెరుకే, దీనినే సాక్షియని అహమని యన్నారు, ఈ రెండు ఒక్క యెరుకే, నీవు విచారించినప్పుడు ఈ ఎరుకే బయలౌచున్నది. నీవు విచారించకపోతే ఈ యెరుకే బయలులో వచ్చి సంకల్ప వికల్పములతో అనేకనటనలు చేయుచున్నదని, నీ వెరిగి లేకయుండుమని అనగా నీవు బయలై అచలమై లేకయుండుమని భావము.

**62 ॥ వన్నియలైదొకచోటను - పన్నుగ గలసినది హృదయపద్మంబునుచున్ - యెన్నుదురు జనులు యెరుకం - దున్నాదని శృతులు బల్కు - చున్నావినుమ్మీ - తెలుసుటె మోక్షమన్నావినుమ్మీ - వొన్నెలన్నియు మీరి వున్నావస్తువజాడ - నెన్నడెరుంగాక యన్నోరీతుల బల్కుచున్నావినుమ్మి - తెలుసుటేమోక్ష - మన్నావినుమ్మీ ॥ 18**

తా॥ శిష్యా! యెరుకను యింకా వివరించి చెప్పుచున్నాను వినుము, ఈ యెరుక లేనిదే ఉన్నట్లు రెండు విధములుగా తోచుచున్నది, ఎలా గనగా ఎరుపు - తెలుపు నలుపు ధూమ్ర వర్ణములలో తిరుగుచున్నది. పిండాండములో మరుపనే జీవతనువు, రెండవది ఎరుపులో తెలుపు తెలుపులో నలుపు నలుపులో ధూమ్రం ధూమ్రంలో

సునీలం ఈ వర్ణములలో తిరుగుచున్నదే బ్రహ్మాండమనే యెరుకనే ఈశ్వరుడు, అనగా స్థూల సూక్ష్మకారణ శరీరములతో కలసి తిరుగుచున్నదే జీవుడు, మహాకారణ శరీరములో తిరుగుచున్నదే ఈశ్వరుడు, ఈ ఐదువన్నెలు కలసియున్నదే హృదయ కమలమని, ఇతరమతముల వారు చెప్పుచున్నారు, ఇందుకు పండిత శివానంద స్వాములవారు ఈ విధముగా చెప్పి యున్నారు, అంతఃనాళ ముఖాంతర మధ్యత్రైలోక్య దర్పణ కల్పిత భ్రుగాకాశమైనదే యెరుక, ఇది జీవతనువు, పిండాండము, మరియు దహరాకాశ సూక్ష్మ రంధ్రాంతర్గత చిన్మయ కుహర విరాజ మానమై సర్వప్రకాశమానమై నిజానంద స్వరూపమై యున్నదే యెరుక, ఇది బ్రహ్మాండములో ఉన్న ఈశ్వర తనువు, ఈ రెండు కలసి యున్నదనగా, అఖండ మండల మండిత హృదయ పుండరీక మధ్యస్థ సర్వవ్యాప్త సచ్చిదానంద స్వరూపమైనదే యెరుక, ఇది పింద [illegible]కములకు అతీతమైన అఖండ యెరుక, దీనినే హృదయకమలము [illegible] యెరుకయని శృతులు శాస్త్రములు చెప్పుచున్నవి, ఆ యెరుకను తెలుసుక[illegible]యే మోక్షమని అన్నవి, మరియు ఈ ఐదు వన్నెల మీరియున్న వస్తువు యొక్కజాడ యెన్నడు ఎరుగక అనగా వన్నెలు చిన్నెలు వగైరాలు ఏమీ లేక అన్నిటికి అతీతమై అఖండాను భవరహితమై యున్న వస్తువు పరిపూర్ణ పరాకాశమని యెరుగక, ఎన్నో రీతులుగా యెన్నో విధములుగా చెప్పుచున్నావేగాని దాని అంతు తెలియలేక పోయినవని చెప్పియున్నారు. గనుక నీవు ఇవన్నీ ఎరిగి, ఈ అన్నింటికి అతీతమై లేకయుండవలెనని భావము.

**63 ॥ చులుకని యుక్తిగనొక్కటి - తెలిపెదవిను సందియంబుదీరునుదీనన్ - పలుకున గలిగినయర్థము - పలుకును విడనాడి నిల్వ - బడుచోటింకేది - రెండుగ - నొక్కపలుకె అయినాది - తెలియుమీలాగున - తెలివిదేహములయ్యె తెలివె తనువును బాసితెలివిస్థిరముగ నిల్వ - బడుచోటింకేదీ - రెండుగ నొక్కపలుకే అయినాది ॥ 19**

తా॥ శిష్యా! నీకు తేలికగా సులువుగా అర్థమయ్యే లాగున చెప్పెదను వినుము, సందేహము తీరును నేను చెప్పినమాట ఆ మాట యొక్క అర్థము రెండూ కలిసే యున్నవి కధా, అనగా కూర్చోండి.అన్నపలుకు దాని అర్థము రెండూ కలిసే యున్నవికదా, దీనిని విడచి అదియుండుటకు ఇంకో స్థానము లేదుకదా, అనగా పలుకు ఆ పలుకునకు సంబంధించిన అర్థము రెండూ ఒక్కపలుకేకదా, జ్ఞానమే అజ్ఞానము అజ్ఞానముకు జ్ఞానము ఈ విధములుగా తెలుసుకుంటే, తెలివిదేహము రెండూ ఒక్కటేనని నీకు బాగా తెలియును. అనగా తెలివిని విడిచి దేహము లేదు, దేహమును విడిచి తెలివి లేదు, గనుక దేహి దేహములు రెండూ ఒక్కటే, అనగా మనిషి యొక్క నీడ, మనిషిని విడచియున్నదా, నీడను విడచి మనిషి యున్నాడా, అలాగే తెలివిని విడిచి దేహము లేదు, రెండు ఒక్కటేనని తెలియవలయునని భావం.

యుక్తి చెప్పను. ఆ యుక్తి వలన విచారించి అనగా యెరుక మరుపు లేకుండా బయలనే సద్గురు స్వరూపమును సర్వకాల సర్వావస్థలయందూ అర్చన చేస్తూ యుంటే, అనగా గురుపాదములనే జీవేశ్వరులు పుట్టకుండా ఉండేలాగున అర్చన ఎవరుచేస్తారో, అట్టివారికి యెరుక ఉత్పత్తి తెలియబడును, గాని ఇతరులకు తెలియబడదని, అనగా గురు పాదార్చన యెరుగని నరులకు తెలియబడదని భావము.

**66 ॥ లేనెరుకబయలు లోపల - తానెట్లు జనించెనవిన తగవినువంధ్యా - సూనునిగతి వియదబ్జవి - ధానంబున యక్షరాజ - ధానీ విధమునన్ - రజ్జువు సర్పమైనా విధమునన్ - స్థాణుపూరుషుని చందాన మృగజల - శశవిషాణము స్వప్నానంద ముగ - రాజధానీవిధమునన్ - రజ్జువుసర్ప - మైనా విధమునన్ ॥ 2**

తా॥ శిష్యా! ఈ లేనెరుక సర్వత్ర నిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణపరబ్రహ్మమందు జనించినది, మరి ఏ విధముగా జనించెనో చెప్పుచున్నాను వినుము, ఎట్లనగా వంధ్యాసునునిగతి, అనగా గొడ్రాలు బిడ్డవలె, ఆకాశమునందు పుష్పమువలె, యక్ష రాజధాని వలె అనగా యక్షులు ఒకచోట స్థిరముగా యుండరు వారికి రాజధాని లేదు, రజ్జువు అనగా త్రాడు సర్పమైనట్లు అనగా త్రాడు సర్పమువలె కనుపించు భ్రాంతి మరియు మొద్దును జూచి దొంగవాడని భ్రమించినట్లు యండమావులయందు నీరుయని భావించినట్లు, కుందేలునకు కొమ్ములు ఉన్నవి అన్నట్లు, స్వప్నములో కలిగిన ఆనందము వలె, ఈ లేనెరుక లేనిదే ఉన్నట్లు జనించుచున్నది, మేలుకుంటే అనగా విచారించి చూస్తే పరిపూర్ణములో ఏమీ లేదు, కానీ ఉన్నట్లు తోస్తున్నది, యివి అన్నియు భ్రమలేకాని ఏమియును లేదు, ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప, ఈ లేని యెరుక ఎంత మాత్రము లేదని భావము.

**67 ॥ లేనెరుకను యెరుకవియన - లేనెరుకెట్లా - యనవినలెస్సగ వినుమా - లేని మృగజలము వంధ్యా సూనులు గలిగుండి వెదకి - చూడాలేనట్లూ - ఈ లేనెరుక- యాడాలేదిట్లూ - స్థాణు పూరుషుడు శశివిషాణము - గగనాసూవాము నరునీ స్వప్నానందమివి వెదకి చూడా - లేనట్లూ - యీ లేనెరుక - యాడాలేదిట్లూ ॥ 3**

తా॥ శిష్యా! ఈ లేనెరుకను యెరుకనియంటే, లేనెరుక ఎట్లు ఐనదనగా, యిది బాగుగా వినుము, యండ మావులలో నీరును, గొడ్రాలియొక్క బిడ్డను, ఎంత వెదకి చూచినా కానరానట్లు, ఈ లేనెరుకను విచారించి చూచినట్లైతే, యచ్చటను కానరాలేదు, మరియు మొద్దును జూచి దొంగయని భావించినట్లు, కుందేలుకున్న చెవులు చూచి కొమ్ములు ఉన్నవని భావించినట్లు, ఆకాశమునందు పుష్పములున్నవని భావించినట్లును, మానవుని స్వప్నానంధము నిజమని భావించినట్లు, అలాగే పరిపూర్ణములో లేని యెరుక ఉన్నట్లు తోచుట వలన ఉన్నదనుకొనుచున్నారు.

యుక్తి చెప్పను. ఆ యుక్తి వలన విచారించి అనగా యెరుక మరుపు లేకుండా బయలనే సద్గురు స్వరూపమును సర్వకాల సర్వావస్థలయందూ అర్చన చేస్తూ యుంటే, అనగా గురుపాదములనే జీవేశ్వరులు పుట్టకుండా ఉండేలాగున అర్చన ఎవరుచేస్తారో, అట్టివారికి యెరుక ఉత్పత్తి తెలియబడును, గాని ఇతరులకు తెలియబడదని, అనగా గురు పాదార్చన యెరుగని నరులకు తెలియబడదని భావము.

**66 ॥ లేనెరుకబయలు లోపల - తానెట్లు జనించెనవిన తగవినువంధ్యా - సూనునిగతి వియదబ్జవి - ధానంబున యక్షరాజ - ధానీ విధమునన్ - రజ్జువు సర్పమైనా విధమునన్ - స్థాణుపూరుషుని చందాన మృగజల - శశవిషాణము స్వప్నానంద ముగ - రాజధానివిధమునన్ - రజ్జువుసర్ప - మైనా విధమునన్ ॥ 2**

తా॥ శిష్యా! ఈ లేనెరుక సర్వత్ర నిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణపరబ్రహ్మమందు జనించినది, మరి ఏ విధముగా జనించెనో చెప్పుచున్నాను వినుము, ఎట్లనగా వంధ్యాసునునిగతి, అనగా గొడ్రాలు బిడ్డవలె, ఆకాశమునందు పుష్పమువలె, యక్ష రాజధాని వలె అనగా యక్షులు ఒకచోట స్థిరముగా యుండరు వారికి రాజధాని లేదు, రజ్జువు అనగా త్రాడు సర్పమైనట్లు అనగా త్రాడు సర్పమువలె కనుపించు భ్రాంతి మరియు మొద్దును జూచి దొంగవాడని భ్రమించినట్లు యండమావులయందు నీరుయని భావించినట్లు, కుందేలునకు కొమ్ములు ఉన్నవి అన్నట్లు, స్వప్నములో కలిగిన ఆనందము వలె, ఈ లేనెరుక లేనిదే ఉన్నట్లు జనించుచున్నది, మేలుకుంటే అనగా విచారించి చూస్తే పరిపూర్ణములో ఏమీ లేదు, కానీ ఉన్నట్లు తోస్తున్నది, యివి అన్నియు భ్రమలేకాని ఏమియును లేదు, ఉన్నది పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప, ఈ లేని యెరుక ఎంత మాత్రము లేదని భావము.

**67 ॥ లేనెరుకను యెరుకనియన - లేనెరుకెట్లా - యనవినలెస్సగ వినుమా - లేని మృగజలము వంధ్యా సూనులు గలిగుండి వెదకి - చూడాలేనట్లూ - ఈ లేనెరుక- యాడాలేదిట్లూ - స్థాణు పూరుషుడు శశివిషాణము - గగనాసూనాము నరునీ స్వప్నానందమివి వెదకి చూడా - లేనట్లూ - యీ లేనెరుక - యాడాలేదిట్లూ ॥ 3**

తా॥ శిష్యా! ఈ లేనెరుకను యెరుకనియంటే, లేనెరుక ఎట్లు ఐనదనగా, యిది బాగుగా వినుము, యండ మావులలో నీరును, గొడ్రాలియొక్క బిడ్డను, ఎంత వెదకి చూచినా కానరానట్లు, ఈ లేనెరుకను విచారించి చూచినట్లైతే, యచ్చటను కానరాలేదు, మరియు మొద్దును జూచి దొంగయని భావించినట్లు, కుందేలుకున్న చెవులు చూచి కొమ్ములు ఉన్నవని భావించినట్లు, ఆకాశమునందు పుష్పములున్నవని భావించినట్లును, మానవుని స్వప్నానందము నిజమని భావించినట్లు, అలాగే పరిపూర్ణములో లేని యెరుక ఉన్నట్లు తోచుట వలన ఉన్నదనుకొనుచున్నారు.

మేలుకొంటె ఏమీ యెరుక లేనట్లు, ఈ లేనెరుకను విచారించి చూడగా ఎక్కడా కానరాక, పరిపూర్ణమే ఉన్నదని తెలసి తాను పరిపూర్ణమైయున్నాడని భావము.

**68 ॥ యెరుకోద్భవమెట్లన్నను - సరళం బగు నారికేళ సలిలము భంగిన్ - యెరుకెట్లు బోవునన్నను - కరిమ్రింగిన వెలగపండు - కరణిగనెరుగూ - తిరిగిరాని కర - ణింకోటెరుగూ - పరిపూర్ణమున్నాది - యెరుకాతానెరిగితే - యెరుకెమ్రగ్గును - భస్మాసురుడు మ్రగ్గిననాటి - కరణిగనెరుగూ - తిరిగిరాని - కరణింకోటెరుగూ ॥ 4**

తా॥ శిష్యా! యెరుక ఎలా వచ్చినదనగా, కొబ్బరికాయలోకి నీళ్ళు ఏ విధంగా వచ్చినవో, ఆ విధంగానే ఈ యెరుక తనంతట తానుగానె వచ్చినది, యెరుక ఎలాగున పోవుననగా యేనుగు మ్రింగిన వెలగపండు పగలకుండానే అందులో ఉన్న గుంజు అంతయు హరించిపోయినట్లు, యెరుక తనకు తానుగానే లేకపోవును, తిరిగి రానిది యింకోటి ఉన్నదని ఎరుగుము, ఏ విధముగా నంటే, పరిపూర్ణమున్నదని, యెరుక పరిపూర్ణాన్ని ఎరిగితే, అనగా యెరుక బయలైతే, భస్మాసురునివలె తన హస్తములచే తానె నెత్తిమీద పెట్టుకొని తానె భస్మమైనట్లు, యెరుక తనకు తానే పరిపూర్ణాన్ని చూచే సరికి, ఏమీ లేకుండా పోవును, ఉన్నది పరిపూర్ణమని ఎరిగి నీవు పరిపూర్ణమై యుండుమని భావము.

**65 ॥ సంతోషాసంతోషము - లంతలొగనవచ్చి పిదప నరుగునెచటికోవింతైయ్యున్నది చూచితె - యింతి యెనుమి యెరుకపుట్టు - వికడెల్సుకోరా - సంశయమేల - ఖు దినమ్ముకోరా - యింతానిదెలుపూడు ఈ దేవమార్గాము - దంత్రాట బహు వెన్నెలగు పడియగు పడ - వికడెల్సుకోరా సంశయమేల - యి దినమ్ము కోరా ॥ 5**

తా॥ శిష్యా! ఇంకను ఈ యెరుక యొక్క ఉత్పత్తి ఎట్లున్నదనగా, మంచి మాట వినినపుడు సంతోషము కలుగుచున్నది, చెడుమాట వినినప్పుడు దుఃఖము కలుగుచున్నది, ఈ సంతోషముగాని దుఃఖముగాని వచ్చి అంతలోనే మటుమాయ మగుచున్నవి. అలాగే ఎరుకబయలులో వచ్చిపోవుచున్నది యిది యెచట్నుండి వచ్చుచున్నదో ఎవరు తెలియలేము, యిదే ప్రకారముగా యెరుక పరిపూర్ణములో వచ్చుచు పోవుచున్నది, ఈ యెరుక ఉత్పత్తి స్థితి లయములు యింతియే సుమీ । విచారించి చూడగా ఎంతో వింతగా యున్నది, నాయనా ఇకనీకు సంశయము వలదు యెరుక పుట్టుట గిట్టుటలు యిలాగునున్న వనినమ్ము ఈదేవమార్గమునందు అనగా పరిపూర్ణమందు యెరుకతోచి అనేక వన్నెలు చిన్నెలు కలిగి అంతలోనే మటుమాయం అగుచున్నది. ఈ వింతలన్నీ యెరుకే కాని పరిపూర్ణమునకు యే వింతలు లేవు. అని తెలుసుకొని నీవు పరిపూర్ణమై యుండుమని భావము.

**70 ॥ రాకడపోకడలేకను - యేకస్థితినుండునట్టియా బయలందున్ - రాకడపోకడ గలిగియనేకముగాదోచులేని - యెరుకాసుసీలా - ప్రతిమలొలేని - పెరుమాళ్ళ లీలా - లేకాతోచిన యెరుకలేనే లేదను చునీ - కీకీలు గురునీ చె యెరుకైతె - జాలుళ్ళ క్కెరుకాసుశీలా - ప్రతిమలొలేని పెరుమాళ్ళ లీలా ॥ 6**

తా॥ శిష్యా! నీవు గురుసూచనచే విచారించి బయలై ఏకమై అచలమై యున్న బయలువలెనె అంతటా నిండి రాకడపోకడలు లేక, కదలక మెదలక సర్వకాల సర్వావస్థలయందు ఒకే రీతిగా ఏకస్థితమైయున్న ఈ బయలందు, రాకడపోకడలు కలిగి కదులుచు మెదులుచు వస్తూ పోతూ అనేక విధములుగా తోచుచూయున్నది ఈ లేనెరుక. నాయనా మంచి గుణములు గల బుద్ధియంతా, ఈ చైతన్యమనే యెరుక. ప్రతిమలలో లేనిదే ఉన్నట్లు తోచుచూ యున్నది, గనుక ఈ లేని చైతన్యమనే యెరుక, లేనే లేదని ఈ కలలేందని గురునిచే ఈకీలు నీవెరిగతే, అనగా గురుసూచనచే నీవు పొందిన బయలనే పరిపూర్ణం నీవైయుంటే కలనేయెరుక ఉళ్ళక్కె, ఏమీ లేక పోవుననిభావము.

**71 ॥ వనిగల్లుదకములోపల - తనకైతావొచ్చి తనకు తానేగువిధం - బున పరి పూర్ణము లోపల తనకైతా వొచ్చి యెరుక తనకైతాజనునూ - అచలంబున్నదని - తానెరిగి ననూ - తన లేమిని జమాని తనకెతోచునుతోచి - తన కల్మిమృషగాభా - వనజేసి నిలు వాక - తనకైతాజనునూ - అచలంబున్నదని తానెరిగిననూ ॥ 7**

తా॥ శిష్యా! వర్షములో తనకు తానే వచ్చిన వడగండ్లు, ఆ వర్షములోనే తనకుతానె కరిగి పోయినవి, అనగా తనకు తానె వచ్చిన వడగండ్లు తకు తానే లేకపోయినవి. అలాగే పరిపూర్ణములో యెరుక తనకుతానేవచ్చి తనకుతానే పరిపూర్ణములో లీనమై నశించినది; అనగా ఆ యెరుకే నేను లేను అచలమున్న దని తానెరిగి అచమై తానుంటే, ఎరుక తనలేమి నిజమని యదార్థముగా నేను లేను, అలచలమైనబయలే ఉన్నదని ఎరిగిన, తన కల్పనంతా అనగా నేను అధిష్టానమైన బ్రహ్మాను నేను శాశ్వతమైన దానను అనే కల్పనంతాలేందని గ్రహించి తాను లేకపోయినది అనగా తాననే ఎరుకే అచలములో వచ్చినది. అచలములోనే లీనమైనది అని భావము.

**72 ॥ పరిపూర్ణములో దోచుచు - యెరుకే చనుతనకు దానె యేర్పడ వినుమీ - తొరటలు తొమ్మిదిగలదై - తరితీ పులనొందుచుండి - తనువానదగుచూ - అచలంబున్నా - దని తాలేనసుచూ - మరుగిట్లెరుకకు దెలియయెరుకె విల్వేదు గాని - పరిపూర్ణముండుదా న్నెరిగేదెట్లిక గుర్తు - తనువాన దగుచూ అచలంబున్నదని - తాలేనసుచూ ॥ 8**

తా॥ శిష్యా! 26వ తత్త్వమైన అచల పరిపూర్ణములో 25వ దైన యెరుక తనంతట తానుతోచి తనంతట తానే అచలపరిపూర్ణములో లీనమై లేకపోవుచున్నది. ఈ యెరుక శరీరమునే తనువులో ఉండి, కష్టమొచ్చినపుడు బాధపడుచూ, సుఖమొచ్చినపుడు సంతోషించుచూ, అనేక వికారములు పొందుచున్నది, ఇట్టి యెరుక అచలమున్నదని తానులేనని ఈ మరుగు ఈ రహస్యం ఎరిగి తాను అచలమైతే, ఎరుక నిల్వదు, పరిపూర్ణమే ఉండును, గాని ఈ మూలము లేని గుర్తెరిగే శరీరమనే యెరుకను, ఇక యెరుగదు అనగా గుర్తు రహిమై యున్నదని నీవు యెరిగి విచారించితే తాననే యెరుక అఖండమై పరిపూర్ణమై యుండునని భావము.

**73 ॥ తొలుకారు యెరుపుకైవడి - పొలుపుగనీళ్లందుదోచు బుగ్గలరీతిన్ - అలసూర్య**
**కిరణమందున - గలనీళ్ళంబలెనె యెరుక - గనుపించునయ్యా - అంతలో**
**యచట - గనిపించదయ్యా - కలకాలమొకరీతి గలిగుండదీయెరుక - తలకిం**
**ప పవలు రాత్రిరిదిదుగు విధమూన - గనిపించునయ్యా - అంతలో యచట**
**గనిపించదయ్యా ॥ 9**

తా॥ శిష్యా! నీవు బయలై అచలమైయున్న పరిపూర్ణములో ఇంకను యెరుక ఉత్పత్తి ఎట్లనగా తొలకరి మెరుపు వలెను, నీటియందువచ్చు బుడగలవలెను. సూర్యకిరణములయందు తోచే కెరటముల వలెను, ఈ యెరుక కన్పించుచున్నది, అంతలోనే మటు మాయం అగుచున్నది, కలకాలం ఒక్కరీతిగా కలిగియుండదు. ఈ యెరుకను విచారణ చేసినప్పుడు, కనుపించక బయలైయుండును, యెరుకను విచారించనప్పుడు యెరుకైయ్యి ఇన్ని విధములుగా తోచుచుండును. విచారించితే ఏమీ కన్పించదు, యెరుకను విచారించక పోతే, మరల యెరుకతోచి పగలు వెనుక రాత్రి రాత్రి వెనుకపగలు తిరుగునట్లుగా, యెరుక తిరుగుచున్నదని, బాగా నీవెరిగి. సర్వకాల సర్వావస్థలయందు యెరుక విచారణ మానక, చేస్తూ ఉంటే, నీవు బయలై అచలమై పరిపూర్ణమై ఉంటావు గనుక యెరుక ఏమీ లేకుండా పోవునని భావము.

**74 ॥ కట్టెందునిప్పులేకనె - కట్టియనొకసమయ మందు గనుపబడిబహుగా - మిట్టి**
**పడితుదకు గనుపడ దట్టిదెనుమి యెరుక పుట్టు - వమలవిచారా - తనకుదానె**
**- యరుదెంచెనొరొ - పుట్టుగిట్టుటలానెనట్టేట నిలచుండి - బట్టా బయలు**
**పొడగట్టినగనుపాడ - దమలావిచారా - తనకుదానె - యరుదెంచెనొరా ॥ 10**

తా॥ శిష్యా! కట్టెయందు నిప్పులేకుండగనే, ఒకానొక సమయమందు అడవిలో చెట్టూ చెట్టూ రాపాడి అగ్ని పుట్టి బాగా ప్రభలమై అడవి చాలా వరకు కాలిపోవును. మరల తనంతటతానే అగ్నియేమియు లేకుండా చల్లారిపోవును. అలాగే యెరుక తనంతటతాను ఆ బయలులో తోచి, అనేక చిత్ర విచిత్రములుగా ప్రబలమై అనేక వికారములు పొంది పొంది తనకుతానే లేకపోవుచున్నది, అనగా ఆ బయలులో

పుట్టుట గిట్టుట అనే సంకల్పవికల్పములనే మహాసముద్రము మధ్యఉన్న యెరుక, బట్టబయలును చూద్దామని దాని పొడగనేసరికి, ఈ యెరుక బయలాంశమై అచలమై యెక్కడా కనిపించకుండా లేకపోయెను ఆ తరువాత తాను బయలై పరిపూర్ణమైయున్నదని భావము.

75 ॥ తనమూలము తలిదండ్రులు - తనవలెనె వారు వారి తలిదండ్రులకున్ - తనవలె నెగాని యన్యము - గనజనన స్థానమొకటి - గలదానతరమా - బ్రహ్మాదుల - కదితెలియతరమా - వినుము యీ బ్రహ్మాండజననామునీ నాయం - దునవైనది దియుగాదని వేరేయింక్కోటి - గలదనతరమా - బ్రహ్మాదుల - కదిదెలియతరమా ॥ 11

తా॥ శిష్యా! తనమూలము తల్లిదండ్రులు, తనవలెనె వారి వారి తలిదండ్రులు మూలమైయున్నారు. అనగా 84 లక్షల జీవరాసులు యందు ఉన్న చైతన్యము, ఒక్కటేగనుక దానికదే పుట్టుచు గిట్టుచు అనేక నటనలు చేయుచున్నది, ఇది మాయని ఎంతవారికి తెలియదు, ఈ ప్రకారముగాక పుట్టుస్థానము యింకో ప్రకారంగా కలదని చెప్పడానికి తరమా. నీ నాయందున గాక యింకోటి కలదని అనడానికి హరిహరబ్రహ్మాదులకైన తెలియబడదు, వినుము ఈ బ్రహ్మాండజననము నీనాయందు అనగా నేను మేనుల వలన ఐనది, అనగా సమస్త జీవులయందు ఆత్మయనే యెరుక వ్యాపించియున్నది, ఇదే ఇన్ని వేషములు వేయుచున్నది, ఇది గాక వేరే ఇంకోటి కలదన తరమా, గనుక నీవు సర్వకాలం బయలై యుండుము అని భావము.

76 ॥ కనరావిదాన్ని శూన్యం - బనియనదగుగాని బయలుననదగదుసుమీ - కనవచ్చుచున్నదిందులో - కనుగొనుటకు యెరుకలేదు - కనుగొనరాదా - యెరుకనె శూన్యమని - యనరాదా - కనవచ్చెనాలేద కనుగొంటిలేదాని - యనరాద భయమేమియను మానించకు మిదుగో - కనుగొనరాదా - యెరుకనె శూన్యమని - యనరాదా ॥ 12

తా॥ శిష్యా! విచారించి చూడగా, యెరుక శూన్యమై కానరాకుండా పోయెను, కాని పరిపూర్ణమనే బయలు శూన్యమా. శూన్యమనరాదు, ఆ బయలులోనే ఈ యెరుక వచ్చుచున్నది, యెరుకను విచారించి చూస్తే కానరాకుండా పోవుచున్నది, విచారించకపోతే కానవచ్చుచున్నది, యెరుకను విచారించి నీవు కనుగొన్నవాలేదా, అర్యా! మీరు చెప్పిన సూచన ప్రకారం విచారించి యెరుకలేదని కనుగొన్నాను, గురుడు యెరుక లేదని అనరాదా, భయమెందుకు, అనుమానించకు ఇదే మార్గం. అనగా బయలులోనే యెరుక పుట్టుచున్నది, కనుక యెరుకను విచారించి నీవు బయలై యుండుము, యిదే మార్గం అని భావము.

**77 ॥ యెరుకబయలందులేమిని - యెరుకను శూన్యంబటంచు యెరిగించ బడెన్ - యెరుగుమిదె ఆకసం - బిట్లెరిగితెయెరుకాక సములు - యేకామౌగదరా - ఆకసమూబయ - లేక మెట్లౌరా - పరిపూర్ణమిదుగొకన్పడు శూన్యమనరాదు - యెరిగుండు మెదిరిస్తె - యిక నా భైజాచేవు యేకమౌ గదరా - ఆకసము బయ-లేకామెట్లౌరా ॥ 13**

తా॥ శిష్యా! యెరుకను విచారించగా బయలులో కానరాకుండా శూన్యమై ఉంటుంది. ఇదే ఆకాశము అనగా పరిపూర్ణములో యెరుకలేదు, యెరుక శూన్యమై యుంటుంది. ఆకాశమన్నా శూన్యమన్నా రెండూ ఒక్కటే, పరిపూర్ణం వేరు ఆకాశం వేరు ఈ రెండూ ఒకటికాదు. పరిపూర్ణమిదిగోచూడు కనబడుచున్నది, శూన్యమని అనరాదు, ఎందుకనగా పరిపూర్ణం శాశ్వతమైనది. సర్వకాలం ఒకే తీరుగా యున్నది, ఈ విధముగా ఉన్నదని ఎరుగుము. ఎదురిస్తే లెంపలు వాయించెదను, గనుక నీవు సర్వకాలం బయలై యుండుము యని భావము.

**78 ॥ కనుపడెడిబయలు లోపల - కనుగొనలేదయ్యెయెరుకగావున శూన్యం - బనవలశెదీన్ని ఆకస - మనవలశెను దీన - విశ్వమాయనోయప్పా - యింతకు వేరే - మాయయేదప్పా - కనుకానె యీ విశ్వమును లేనిదని లెస్స - వినజెప్పనా యెను కనబోకుండనిపోని - మాయనోయప్పా - యింతకు వేరే - మాయయేదప్పా ॥ 14**

తా॥ శిష్యా! మనకు కనుపించే బయలులోపల విచారించి చూడగా యెరుకలేదు. పరిపూర్ణమేయున్నది, గనుక ఈ యెరుకను శూన్యమని అనవలసి వచ్చెను. దీన్ని ఆకాశమన్నారు. ఆకాశమనగా చూచేయెరుక, ఈ ఆకాశమము వల్లనే జగత్తంతా ఉత్పత్తి ఐనది, అనగా మనస్సనే ఆకాశం వల్ల ఈ ఇంద్రియములనే ప్రపంచం ఉత్పత్తైనది. ఈ ఇంద్రియములవల్ల సంకల్పాలు వికల్పాలు కలిగినది. ఇంతకన్నామాయ వేరేలేదు, ఈ మనస్సునే చూచేయెరుక మాయ గనుకనే ఈ యెరుకవల్ల తయారైన జీవుడనే ఇంద్రియ ప్రపంచం, మనస్సు మొదలైనవి ఏమీ కూడా లేదని గట్టిగా చెప్పవలసి వచ్చెను, కనుక ఈ యెరుకను నీవు విడిచిపెట్టి నీవు సర్వకాలం పరిపూర్ణమై యుండవలెనని భావము.

**79 ॥ అహమనదుగదా అచలము - అహమున్నదోలేదో చూడదది నిజమెకదా - అహమును బుట్టించదుగద - అహముదయించేటివరకె - అది వున్నదిగదా - అహమె విశ్వమై - నిల్చిందిగదా - అహమె యీ ముచ్చట్లనన్నింట్నెరుగును గద - అహమెతాలేనాని యరిగీతెసరిగద - అది వున్నదిగదా - అహమె విశ్వమై - నిల్చిందిగదా ॥ 15**

తా॥ శిష్యా! నేననదుగదా బయలనే అచలం, ఈ నేను ఉన్నదో లేదో

ఆబయలు చూడదుకదా, ఈ నేను రాసిక్రతమే ఆ బయలనే అచలం ఉన్నదిగదా, ఈ నేనే జీవితమనే ఇంద్రియ ప్రపంచం ఐనదిగదా. ఈ నేనే ఈ ముచ్చట్లన్నిటిని యెరుగునుగదా, గనుక ఈ నేను తనమూలం తాను ఎరిగితే అనగా నాదు బిందు. కళ ఈ కళే తన స్వరూపం, గనుక ఈ కళను ఎరిగితే నిష్కళతాను అప్పుడు తానేలేనని తనకే తెలుసునుగదా, ఇక ఉన్నదే తాను బయలైన పరిపూర్ణమేనని భావము

**ఆవరణము నాకసము - నిరావరణమునచలమనుచు అనిరిమహాత్ముల్ - ఆవరణము మితిగలిగిన - దావరణము లేంది - యమితమని తెలుసుకోరా - యీ రెంట్నివే - రనికను క్కోరా - ఆవరణమునవే నిరావరణమును జూచి - యావరణమెడలీననా వాలిమాట లేదని కనుక్కోరా - యీ రెంట్ని - వేరని కనుక్కోరా ॥ 16**

తా॥ శిష్యా! ఆవరణమనగా ఆకాశమనే యెరుక. ఈ యెరుక ఇది నాది అదినీది ఇది మంచిది అది చెడ్డది అని సంకల్ప వికల్పములు పొందేది యని తెలుసుకోరా నిరావరణమనగా అచలమనే బయలు. సంకల్ప వికల్పములు లేక ఏ వికారములు లేక అంతటా నిండియున్నది. పరిపూర్ణపరబ్రహ్మము అని పెద్దలు చెప్పియున్నారు. అవరణమనగా ఒక హద్దు అనగా మితములో అణిగియున్న యెరుక. ఈయెరుకే భార్య బిడ్డలతో సంసారం చేయుచూ అనేక వికారములు పొందుచున్నది. కాన ఒక హద్దులో ఉన్నది యెరుక. హద్దులేంది అమితమని తెలుసుకో. అనగా అంతటా నిండి నిబిడీకృతమై సూదిమొన మోపుటకు సందిలేక ఉన్నది పరిపూర్ణం. ఈ రెంట్ని వేరువేరుగా విచారించి తెలుసుకొని ఆచరించి కనవలెను. అనగా వికారములతో ఉన్నది ఆవరణమనే మితమును విచారించుచూ, నిరావరణమైన అచలపరిపూర్ణమును చూడుము. అనగా ఆవరణమును యెరుకను విచారించుచూ నిరావరణమును జూడుము. ఇలా విచారించగా ఆవరణము లేకపోతే ఉన్నది అంతా నిరావరణమే ఉండును. అనగా తాను అచలమైతే ఏ ఊహలు ఏ సంకల్ప వికల్పాలు అవరణము మితము ఉండవని యెరిగి. యెరుకలేని పరిపూర్ణమై యుండుమని భావము.

**81 ॥ ఆకాశము శూన్యంబని - లోకులు మొరబెట్టిదాని లోపవనాదుల్ - ప్రాకటముగ బుట్టినవని - చీకాకుగ జెప్పినారు - ఛీ వినరాదూ - వంధ్యాసంతీ - క్షితిలోన లేదూ - కాకుంటె వినుచోద్యమాకుందేటికి కొమ్ము - లీకాలమునని మేమే కంటి మను మాట ఛీ - వినరాదూ -వంధ్యాసంతిక్షితిలోనా లేదూ ॥ 17**

తా॥ శిష్యా ! ఆకాశమనే యెరుక శూన్యమని లేందని లోకులు చెప్పకొనుచు, మరల ఆకాశములో వాయువు, అగ్ని, జలము, పృథ్వి పుట్టినవని చీకాకుగా చెప్పచున్నారు. ఆకాశమే లేనప్పుడు యివి యన్నీలావచ్చినవి. ఈ మాటలు అబద్ధమే ఛీ ఈ మాటలు వినకుము. గొడ్రాలికొడుకు ప్రపంచంలో లేడుకదా కుందేటి

చెవులు చూచికొమ్ములున్నవని మేము చూచినాము అన్నమాట ఛీ వినకూడదు. ఎందుకనగా లేనిది ఉన్నదని చెప్పినారు గనుక, నేను చెప్పిన సూచన గ్రహించి, ఆచరించి సూచన ద్వారా విచారించి యెరుకను రహితపరచి, నీవు బయలై అచలమై పరిపూర్ణమై ఉండుమని భావము.

**82 ॥ లేనెరుకను బయలందున - లేనేలేదనక యితరులేలపలికిరో - లేనిది కలదని పిదపను - లేనేలేదనుచు సిగ్గు - లేకాయిలీలా - ఛీవినకే -చీకాకు నీకేలా - మేనందశుద్ధముతానల్లుకొని మళ్లి - పూనికడిగిన రీతినౌను శిగ్గికయింత - లేకాయాలీలా - ఛీ-వినకే - చీకాకునీకేలా ॥ 18**

తా॥ శిష్యా! లేనెరుకైన ఈశ్వరతనువును బయలులో లేనేలేదని అనక, ఇతరులు ఉన్నాదని ఎందుకు అన్నారో, అనగా పరిపూర్ణములో లేని యెరుక లేదని వక్కాణించి చెప్పక, లేనిది కలదని తరువాత లేనేలేదనుచు సిగ్గులేక, ముందులేదని తరువాత ఉన్నదని ఈ విధముగా చెప్పిరి గనుక ఛీ. వారి మాటలు వినకు ఈచీకాకు నీకెందుకు, ఎరుక అసలే లేదుగదా. అధ్యారోప అపవాదముగా ఉన్నది. వీరి మాటలు ఎలాగున్నంటే తన శరీరానికి అశుద్ధము రాసుకొని, వాసనవస్తుందని పూని కడిగిన రీతిగా ఉన్నది. లేనిది కలదని తెలిసే తెలియనీ విధముగా ఉన్నది వీరన్నమాటలు గనుక యెరుక లేందేకదా దానిని విడిచిపెట్టి నీవు బయలై సర్వకాలం యుండుము అని భావము.

**83 ॥ అన్నపు సూక్ష్మాంశముమను - సెన్నగనీరంబు ప్రాణ మెరుగుము యీరెం-డెన్నడు కలియవోనాడే - సున్నసుమీ యెరుకమాట - సుగుణ సంపన్నా - కలసుటె యెరుక - సుమి యింతకన్నా - వున్నదెరుక మూలమన్నది వినలేదు-యెన్నాడు యీ భ్రాంతి నిన్నంటనివ్వకు - సుగుణ సంపన్నా - కలసుటె యెరుకసుమియింతకన్నా ॥ 19**

తా॥ శిష్యా! ఓ సుగుణములు గల శిష్యా, అన్నము పృథివి తత్త్వము వలన వచ్చినది, ఆ అన్నము సూక్ష్మాంశము మనస్సు, అనగా ఆకాశము, విచారించి చూస్తే నీరు ప్రాణాంశము, అనగా ప్రాణవాయువు, జలతత్త్వమువల్ల వచ్చినది. ఈ వాయువు ఉశ్వాస నిశ్వాసములుగా సంచరించుచున్నది, ఈ వాయువు ఎంతవరకు ఆడుచుండునో అంతవరకు యెరుక ఉండునని ఎరుగుము, గాన ఆకాశమనే ఆత్మ కంటిలో నుండి సమస్తాన్ని చూచుచున్నది. ఇది ఎంత వరకు చూచుచున్నదో, అంత వరకు యెరుక ఉన్నదని ఎరుగుము. ఇదే యెరుక కలయిక, ఈ యెరుక కలయిక లేకపోవలెనంటే, ఈ చూచే యెరుక కంటిలోనే బయలై యుండాలి, ఆ వాయువు ఉశ్వాస నిశ్వాసములు శమించి అది ముక్కులోనే బయలైయ్యి ఉండవలెను. యివి ఇలా బయలైనప్పుడు, ఈ రెండు కలియవు, అనగా మనసనే యెరుక కంటిలోనే

యుండును మరియు ఉశ్వాస నిశ్వాసములతో సంచరించు ప్రాణవాయువు ముక్కులోనే బయలై యుండును, గనుక ఈ రెండూ కలియలేవు గనుక, యెరుక మాట సున్న, ఈ రెండూ కలసి సంచరించుటే, యెరుకయొక్క నటనలంతా, ఇంతకన్నా వేరే మార్గము యింకొకటిలేదు, అనగా యెరుకకు మూలం యింకో విధముగా లేదు. గనుక ఈ భ్రాంతిని విడిచిపెట్టుము, అనగా యెరుకను విడిచిపెట్టి నీవు బయలై అచలమై సర్వకాలం యుండుము అని భావము.

**విశేషార్థం** : యిందుకు ఉత్తరగీతలో శ్రీ కృష్ణపరమాత్మ, అర్జునా, యెరుక లేకపోవలెనంటె నీవు ఈవిధముగా ధ్యేయవలెను.

శ్లో॥ ముఖనాశికయోర్మధ్యే । ప్రాణ సంచరతేసదా ।
ఆకాశం పిబతే ప్రాణం । నజీవా కేనజీవతే ॥

టీ॥ శ్రీ కృష్ణపరమాత్మ ఓ అర్జునా, నీ ముక్కునకు నోటికి మధ్య ప్రాణ వాయువు ఎల్లప్పుడు ఉశ్వాస నిశ్వాసములో, యెరుక చంచరించుచున్నది, అట్టి వాయువు నీ విచారణ వల్ల ఆకాశ తత్వములో లీనము చేసిన యెడల, జీవుడు లేనేలేడు ఉండుటకు అవకాశమేలేదు. అని శెలవిచ్చినారు. మరియూ ఈ రెండూ యెన్నడు కలియవో నాడే సున్న సుమీఎరుక మాట, అనగా వాయు ఉన్నంత వరకు యెరుక ఉంటూనే ఉంటుంది, వాయువు నశించిన యెడల, యెరుక మాట సున్న. ఐతే వాయువు ఎలా శూన్యమై లేకపోవును, అని విచారించినప్పుడు, వాయువు యొక్క ప్రమాణం ఉశ్వాస 16 అంగుళములు ప్రమాణం క్రిందికి వచ్చినప్పుడు. అది పృధ్విత్వము, మరి 12 అంగుళములు వచ్చునప్పుడు అది జలతత్వము. 8 అంగుళములు ఆడుచున్నప్పుడు అదివాయుతత్వము, ఉశ్వాస ముక్కులోనే అణిగి ఉన్నప్పుడు అది ఆకాశతత్వం, ఈ విధముగా వాయువు ముక్కులోనే శూన్యమై, చూచే యెరుక కంటిలోనే బయలైనప్పుడు, యెరుక మాటసున్న, గనుక నీవు యెల్లప్పుడు బయలై ఉండుమని భావము.

**ఇతి శ్రీ మద్భాగవతకృష్ణ విరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వే యెరుకోద్భవన్నామ పంచమోధ్యాయః భావవిశేషార్థములు**

**సమాప్తము.**



# ☆ 6 .యెరుకను విడిపించుట. 22 ☆

**84 ॥ పిల్లలు తొట్యాకులతో - పిల్లలగావించు పెండ్లిపేరంటంబుల్ - కొల్లలు గజేయు వారల - తల్లులుగని సత్యమనుచు - తలచేరామదినీ - నిను నీవిట్లుదలచరా మదినీ - కల్లసంసారముగని మానవులు సంత - శిల్లగ గురుమంత్ర సిధ్ధులు నిజమాని - తల చేరామదినీ - నినునీవిట్లు - దలుచరామదినీ ॥ 1**

తా॥ శిష్యా! యెరుకను ఏ విధముగా విచారించి విడిచిపెట్టవలయునో చెప్పేదను, చిన్నపిల్లలు తాట్యాకులతో బొమ్మలు తయారుచేసి వాటికి పెళ్ళిళ్ళు పేరంటములు పెట్టి చేయుచు, ఆనందముగా యెంతో సంతోషముగా ఆడుకొనుచుందురు. కాని ఈ పిల్లలు చేసే పనులు వీరుతల్లులుగని ఈ పనులు నిజమని అనుకొందురాయెన్నడు అనుకోరు. మరియు మానవులు కలలోతోచిన శరీరము వలెనే సంసారములు నిజమని ఎంతో సంతోషముగా చేయుచుందురు, కానీ గురుమంత్రసిద్ధులు, అనగా పరిపూర్ణులై మూలంలేని ఈ గర్తెరిగే శరీరాలు ఏమీ లేకయున్నవారు, ఈ మానవులు చేసేపనులు చూచి, ఇవి నిజమని తలంచేరా యెన్నడు తలంచరు, అలాగే నీవు నిన్ను నీకు కలతోచిన శరీరాలు మేలుకుంటే ఏమీ లేనట్లు నీవుకూడా ఎటువంటి వాడనోనేనని భావించుకొని, నీవు సర్వకాల సర్వావస్థలయందు యెరుకను విడిచిపెట్టే విచారణజేసి నీవు బయలై అచలమై యుండుమని భావము.

**విశేషార్థము :** ఉత్తరగీతలో

శ్లో॥ ఖంమధ్యేకురుచాత్మాన । ఆత్మమధ్యేచఖంకురు ।
ఆత్మానాంఖంమయంకృత్వా । నకించిదది చింతయేత్ ॥

శ్రీ కృష్ణ పరమాత్మ - ఓ అర్జునా నీవఖండమవ్వాలంటే ఈ విధముగా విచారించవలెను. ఎలాగనగా నీ ఆత్మయనే చూచే యెరుకను ఆవరణమనే ఆకాశంమధ్య ఉంచి, మరియు ఆకాశమనే యెరుకను ఆత్మ మధ్య ఉంచి, విచారించి అనగా ఈ ఆత్మను ఆకాశంమధ్య ఉంచి, ఆకాశమును ఆత్మ మధ్య ఉంచి, విచారించినప్పుడు, ఒకదానిలో ఒకటి మిశ్రమమై ఏమీ లేక సమస్తం నశించి నీవు అఖండమై ఉంటావు. గనుక నీవలా చేయుము అని భావము.

**85 ॥ మేనెరుకలరెండింటిలో - దానిని యిది దీని నదియు తగస్పజియించున్ - మేనెరుక లివియు మూలము - లేనిదె స్పజనయ్యెననుచు - లేనేలేవంటి - అంటె తప్పు - లేనేలేదంటి - మేనెరుకలిప్పుడు దేనందున్నవో చూచి - లేనిమేనెరుకలలేని వనుచునమ్ములేనేలేవంటి - అంటె తప్పులేనేలేదంటి ॥ 2**

తా॥ శిష్యా! మేననగా 24 ఇంద్రియములతో కూడియుండిన జీవుడు, ఎరుకనగా 25వ దైన ఈశ్వరతనువు, ఈ రెండు దీనివల్ల అది దానివల్ల ఇది అనగా దేహీవలన దేహము దేహము వల్ల దేహి సృజింపబడుచున్నవి. అనగా మేనుకు మూలం ఎరుక యెరుకకు మూలం మేను, ఈ మేనెరుకలు లేకుండా ఈ సృష్టి జరుగదు, అనగా ఒకదాని కొకటి మూలమైయున్నది, కానీ వేరే యింకోటి మూలంలేదు, అని అంటే తప్పులేదు, ఇంకోటి మూల మున్నదంటే తప్పు వీటిని విచారించి చూస్తే యెక్కడా కాన రాకుండా పోయినవి. గనుక ఈ లేని మేనెరుకలు లేనివని నమ్ముము. అనగా

నీవు బయలై పరిపూర్ణమై యున్నదానిలో లేని యెరుక మేను నేనుగాను ప్రకృతి పురుషులుగానూ జగమెరుకలుగానూ తోచుచున్నవేగాని విచారించి నీవులేక చేస్తే నేను మేనులు మొదలుగా కనిపించే జగమెరుకలు ఏమీ లేకుండా పోవును గనుక నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలై అచలమై పరిపూర్ణమై యుండుమని భావము.

**విశేషార్థము** : ఉత్తర గీతలో

శ్లో॥ పుటర్ ద్వయ వినుర్ముక్తో । వాయుర్ యత్ర విలీయతే ।
తత్ర నమస్థ మనః కృత్వా । తం ద్యాయేత్ పార్థ ఈశ్వరం ॥

శ్రీ కృష్ణ పరమాత్మ ఓ అర్జునా నీరెండు ముక్కురంధ్రములనుండి వచ్చుచున్న వాయువు ఎచ్చట లీనమౌచున్నదో అచ్చట మనస్సు ఉంచి విచారించుము అట్లు నీవు విచారించిన యెడల నీ మనస్సు బయలై అచలమై అఖండమై యుంటావు గనుక నీవలా విచారించి బయలై అచలమై అఖండమై యుండుమని శెలవిచ్చినారు.

86 ॥ యెరుక పనిచేయదనకుము - యెరుగుట మరచుటలు రెండు యెవ్వరి పనులో - యెరిగింపుము నా మ్రోలను - వెరువను తప్పితివె దెబ్బ - వేశేను చూడూ - అట్లనకుండా జేశేనునేడూ - వెరపించుడె దెబ్బవేశేననా తండ్రి - యెరిగించి పైమర్మమెరుకాను నేదీశి - వేశేను చూడూ - అట్లనకుండ - జేశేను నేడూ ॥ 3

తా॥ శిష్యా! యెరుక పనిచేయదనకు - ఎరుగుట మరచుటలు ఈ రెండూ ఎవ్వరి పనులో ఎరిగింపుము, అనగా 25వదైన యెరుక ఎరిగేది, 24 యింద్రియములతో కలసి తిరిగేది మరుపు, ఈ యెరుక మరుపులు రెండూ చేసే పనులు యెరుకేగదా, చెప్పుము ఈ యెరుకే యిహపరములను ఎరుగుచున్నది, ఈ యెరుక నిర్గుణమని నిరాకారమని చెప్పక, నేను నీకు చెప్పిన ప్రకారము చెప్పక యింకో ప్రకారముగా చేప్పేవంటే లెంపలు వాయించెదను, గనుక జాగ్రత్తగా చెప్పుము. అనగా యెరుక నిర్వికారమని పరబ్రహ్మమని చెప్పకు, పరబ్రహ్మమైన పరిపూర్ణములో ఈ యెరుక తనకు తానేతోచి, అనేక నటనలు చేయుచున్నది, గనుక వంకర మార్గము చెప్పితే కొట్టెదను, జడిపించుటకే కాని కొట్టెనా తండ్రీ, వెరపించి పై మర్మమెరిగించి యెరుకానునే దీసి వేసేను చూడు, గనుకనే చెప్పిన విధముగా చెప్పుము అని భావము.

87 ॥ లేనికలగలిగినప్పుడు - దానికి దశదిశలయందు తగమొదటకొనన్ - తానంటకున్న మేల్కను - లేనికలే చూచెనేని - లేకాపోవుగదా - కలతే మేల్కలేకాపోదుగదా - లేనెరుకబయలులీలీలాగనికెపుడు - గానవచ్చితె బోధగావాలెననవపుడు - లే కాపోవుగదా - కలతే మేల్క - లేకాపోదుగదా ॥ 4

తా॥ శిష్యా! లేని కలగలిగినప్పుడు, అనగా లేని కలలో తాను ఒక ఆమెను పెండ్లి చేసుకొని పిల్లలను కన్నట్లు సంసారం చేస్తూ వున్నట్లుగా కలలో తోచినది, ఇంతలో తనకు మెలుకువ వచ్చినది, వీడు మంచము మీదనే ఉన్నాడు భార్యాలేదు. పిల్లలు లేరు సంసారం మొదలగుగా గల వస్తువులు యేమీ లేవు. అప్పుడు వీడు యిదంతా కలలేందే ఉన్నట్లుగా తోచినది అనుకొన్నాడు. అలాగుననే తాను బయలైయున్న అచలములో లేని యెరుకనే కల నేను మేనులుగా తోచి ననే కనటనలు గా సంసార సాగరములో ముంచినది. యింతలో యితనికి గురుసూచననే మేలుక జ్ఞాపకంవచ్చి బయలై అచలమయ్యే సరికి, ఈ కలనే యెరుక ఏమీ లేకుండా పోయినది. అనగా ఈ కలనే యెరుకకు మేల్కనేబయలు దశదిశలయందు ఈ కలను అంటకుండా ఎప్పుడూ నిండి యున్నది. గనుక ఈ కలనే యెరుక లేకపోయెను, గాని కలతోమేల్క లేకపోయినదా అది లేకపోలేదు. కారణమేమనగా ఈ కలనే యెరుక దశదిశలయందు నిండియున్నది. పరిపూర్ణము, నాలుగు మూలలు నాలుగు దిశలు పైనా క్రింద అంతటా నిండి నిబడీ కృతమై సూది మొన మోపుటకు సంధిలేక శాశ్వతమై యున్నది, అందువల్ల కలనే యెరుక ఎప్పుడూ లేదని, బయలైన మేల్కయనే పరిపూర్ణము శాశ్వతమైనదని, యెల్లప్పుడూ ఉండేదేనని, నీకెప్పుడు తెలిసితే అప్పుడు బోధకావలెనని అనవు అని భావము.

**విశేషార్థము** : కలనే లేనెరుకకు బయలనే మేల్క దశదిశలయందు నిండి ఈ కలను అంటకయున్నది, ఆ బయలనే మేల్కను కలనే యెరుక ఎప్పుడు చూచినదో, అప్పుడే యెరుకలేకపోయినది. మేల్కనే బయలు లేకపోలేదు, ఆ బయలు అలాగే ఉన్నది. మరియూ తాను గురుసూచననే యుక్తివలన బయలనే మేల్కను పొంది పరిపూర్ణమైయుండును, ఇట్టి-పరిపూర్ణము ఎప్పుడూ శాశ్వతముగా యెల్లప్పుడూ ఉండే దేనని కలనే లేనెరుక ఎల్లప్పుడూ లేనిదేనని. తనకు ఎప్పుడు తెలిసినదో, అప్పుడు అతను బోధ కావాలని వినాలని అనడు ఎందుకనగా తానే బయలై అచలమై పరిపూర్ణమై యున్నాడు. యిక బోధ అవసరం లేదు అని భావము.

ఉత్తరగీత - శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు ఈ విధముగా చెప్పియున్నారు.

శ్లో॥ ప్రాప్తేజ్ఞానేన విజ్ఞానె । జ్ఞేయంచవృదిసంస్థితే ।
లబ్ధిశాంతి పదేదేహీ । యోగోనైవదారణః ॥

ఓ అర్జునా జ్ఞానం ఎప్పుడు ప్రాప్తించినదో అప్పుడు విజ్ఞానము కలిగినది. దాని వలన జ్ఞేయమనే బయలు నీ హృదయములో ప్రకాశించుచున్నది, గనుక ఎల్లప్పుడు బయలై వుంటాము. అందువలనను దేహీ దేహములు రహితమై నిర్మలమై నిరాకారమై నిర్గుణమై సర్వకాల సర్వావస్థలయందు బయలైయుంటే, ఏ యోగ

ములు గాని ఏ ధ్యానములు ఏమీ చేయవలసినపని లేదు అని తెలవిచ్చినారు.

88 ॥ వొంటుకుదాపలబింద్వాం-ట్లండించిన కొలదిలెక్క అధికంబగునా -
వొంటుకువలపల బింద్వాక-టంటించిన లెక్కవుళ్ళక్యాగదనోయా-
వొంటుండిలేం-దౌగదనోయా- తంటాదీరునుచూడుదానివలెనెయెరుక -
కంటబయలును తానుగలిగుండి తనకుళ్ళక్యాగదనోయా-
వొంటుండిలేందౌగదనోయా ॥ 5

తా॥ శిష్యా! గురుమూర్తి శిష్యునికి ఎదురుగా కూర్చుండి శిష్యానీకు ఎదురుగా ఒకటి వేసి దాపల అనగా నీకు యెడమవైపున ఆ ఒకటికి (10...) సున్నాలు పెట్టేకొలది లెక్క పెరుగుచుండును. మరల ఆ ఒకటికి వెలపల అనగా శిష్యునికి కుడివైపున సున్నాపెట్టిన యెడల (0100) లెక్క ఉళ్ళ క్కీగును గదోయీ అనగా ఒకటి వేసిసున్నాలు పెట్టేకొలది (100...) లెక్కపెరుగును. (01000) ఆ ఒకటికి వెలుపల సున్నాను పెట్టిన లెక్క ఉళ్ళక్కగునుగదా. అలాగే యెరుక విచారించిన యెడల అనగా ఆత్మయనే యెరుక నేత్రములో నుండి ఎదురుగా చూచెకొలది దృశ్యములు పెరుగుచుండును ఆ యెరుక పశ్చిమదిశకు చూడగా దృశ్యములన్నీ ఉళ్ళక్యైనవిగదా. మరియు ఆత్మనే యెరుక ఉండీ లేదాయెను అనగా ఒకటి ఉండి లేందయినట్లు ఒకటికి వెలుపల లోపల సున్నాలు పెట్టిపట్టైతే (01000) ఆ ఒకటి ఉండి లేందైనది ఆలాగే యెరుకనే ఆత్మ పశ్చిమవైపుకు ప్రయాణము చేసినప్పుడు అనగా (ఓం) నకు వెలుపల లోపల సున్నాలు పెట్టినట్లైతే (010) ఆ ఒకటి ఉండి లేందైనది ఆలాగే యెరుకనే ఆత్మ పశ్చిమచూపుకు ప్రయాణము చేసినప్పుడు అనగా (ఓం) నకు వెలుపల లోపల సున్నాలుండుట వలన ఓం అని పలుకుటకు వీలు లేదు. అనగా ఆత్మనేఎరుక బయలైనప్పుడు అఖండమై సచ్చిదానంద స్వరూపమై 26వ తత్వమైయున్నదని యెరుకలేని బయలైయున్నందున ఆయాత్మ ఉండీ లేందైనది. యెరుకలేదు గనుక దానిని ఆత్మని గాని యెరుకనిగాని అనుటకు వీలులేనందున బయలన్నారు. అచలమన్నారు. అనగా మన సాంప్రదాయము యొక్క రహస్యము ఇంత గుహ్యంగా ఉన్నదని తెలియవలెనని భావము.

విశేషార్థము : శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు ఈ విధముగా చెప్పియున్నారు అర్జునా నీవు అఖండమై అచలమై యెరుక లేక వుండవలెనంటే ఈ విధముగా చేయవలెను.

శ్లో॥ ఉత్కాహస్తోయదాఖచ్ఛి । ద్రవ్యమాలోఖ్యతాంత్యజేత్ ।
జ్ఞానేన జ్ఞేయమాలోఖ్యం । జ్ఞానం పచ్చాత్ పరిత్యజేత్ ॥

తా॥ ఓ అర్జునా ఒకడు చీకటిలో ఉన్నధనమును తీసుకొనుటకు దీప సహాయము కావలయును గనుక దీపము తీసుకొని వెళ్ళి ఆ చీకటిలో ఉన్న ధనమును

తీసుకొని ఆ దీపము ఇక అవసరము లేదు గనుక అక్కడ దీపము వదిలివేసి ఆ ధనముతో తనపని నెరవేర్చుకొనెను అలాగుననే నీ జ్ఞానముతో జ్ఞేయమగు బయలును సంపాదించి అనగా అర్జునా నీవు జ్ఞానమనే తెలివి చేత విజ్ఞానమును సంపాదించి ఈ జ్ఞాన సహాయము వలన జ్ఞేయమనే బయలును సంపాదించి బధ్ర పరచుకొని ఈ జ్ఞానమును తెలివిని అక్కడనే విడిచి పెట్టి జ్ఞేయమనే బయలుతో నీ పని నెరవేర్చు కోవలెను అనగా అఖండమనే బయలుతో అఖండాను భవరహితం చేసుకొనవలయునని శెలవిచ్చియున్నారు.

**89 ॥ యెరుకొక్కటుండెనేనియు- యెరుకే యీ విశ్వరూపమేర్పడదాల్చున్- యెరుకొక్కటి లేకుండిన-యెరుకైన ప్రపంచమున్న-దెవరెరిగేరికనూ- లేదననైన- నెవరుండేరికనూ-పరిపూర్ణమైనట్టి బయలుండగనిపెట్టి- గురునీవాక్యము బట్టి గురుతూ బోగొట్టితె-యెవరెరిగేరికనూ-లేదననైన నెవరుండేరికనూ ॥ 6**

తా॥ శిష్యా! యెరుక ఒక్కటి ఉన్నదంటే ఈ యెరుకే ఈ విశ్వరూపమైకన పడుచునే యుండును ఈ యెరుక లేకపోతే యెరుక రూపమైన ప్రపంచము ఉన్నదనిగాని లేదనిగాని ఎవరెరిగేరికనూ లేదని ఉన్నదని అనేందుకు యిక యెవ్వరూ లేరుయెరుకలేదు గనుక అనేవారు ఎవ్వరూ లేరు. మరియూ గురు సూచనచే విచారించి పరిపూర్ణమైయున్న బయలును ఉండజూచి ఆ బయలును కనిపెట్టితాను బయలై, గురువాక్యమనే మూలంలేని యీ గుర్తించే గుర్తును రహితము జేస్తే గుర్తెరిగే శరీరమనే యెరుక ఏమీలేకుండగా పావును ఆ తరువాత ఉన్నది పరిపూర్ణమైన బయలై తాను లేక ఉన్నాడని భావము.

**విశేషార్థము** : పరిపూర్ణమైనట్టి బయలుండగనిపెట్టి గురుని వాక్యముబట్టి గురుతుబోగొట్టితె యెవరుండేరికను అనగా గుర్తెరిగే యెరుకలేకపోవలె నంటే గురుకరుణకావలెను. గనుక గురుభక్తి గురుసేవ గురునిష్ట యున్నవారికి గురుమూర్తికి వారిపైన దయగలిగి వారికి గురు సూచననేయుక్తి చెప్పును ఆ యుక్తి వలన విచారణ చేసి. తాను పరిపూర్ణమై బయలౌను ఆ బయలును ఉండజూచి ఈ ఉండజూచిన బయలులో గుర్తెరిగే శరీరమనె యెరుక ఇంకా ఉన్నదా. గుర్తెరుగుచున్నదో లేదో బాగానిదానించి వుండజూచి ఇంకావుంటే అదిలేకుండా పోయేవరకూ విచారించి గురుకరుణవల్ల గుర్తురహితమైతే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదని భావము.

యిందుకు శ్రీకృష్ణ పరమాత్మ అర్జునితో ఈ విధముగా చెప్పియున్నారు

శ్లో॥ ఆకాశం మానసం కృత్వా । మనః కృత్వా నిరాస్పదం ।
నిశ్చలత్వం విజానియాత్ । సమాధి స్తస్యలక్షణం ॥

తా॥ ఓ అర్జునా మనస్సు ఆకాశమువలె చెయ్యి అనగా నీ మనస్సును బయలు చేయ్యుము అప్పుడు ఈ మనస్సనే యెరుకబయలై ఏయాధారములేక నిరాధారమై నిశ్చలత్వము కలుగును అప్పుడు మనస్సనే యెరుకలేదు గనుక నీ సమాధి నిర్మలముగాను నిర్గుణముగాను ఉండుట వలన నీవు అఖండమై అచలమైయేమీలేక పరిపూర్ణమై యుంటావు అని శెలవిచ్చియున్నారు.

**90 ॥ తెలుపు మృదుత్వము మధురము-గల వస్తువు చెక్కెరనుచుగనుగొన్నట్లా-తెలివి శరీర జగంబులు-గల వస్తువు బిందువనుచు-గనుగొనరాదా-నేదెల్పితె - వినినమ్మరాదా-తెలివిచే బయలుండదెలశియా తెలివిని - తెలివి చాతనెపట్టితీశివెయ్యరపొని-కనుగొనరాదా-నేదెల్పితె-వినినమ్మరాదా ॥ 7**

తా॥ శిష్యా! తెలుపు మృదుత్వము మధురము గల వస్తువు చక్కెరని తెలుసుకొన్నట్లు తెలివి శరీరము జగంబులు గల వస్తువు ఆత్మయని తెలుసుకోనుము అనగా జ్ఞాత జ్ఞానము జ్ఞేయము ఈ మూడూ ఆత్మయనే ఎరుకయని యెరుగుము ఈ విధముగా నేచెప్పితే వినినమ్మరాదా గాన ఆ తెలివి చేతనే బయలును ఉండజూచి . నీవు బయలై ఆ బయలులో తెలివి ఏమైనా ఉంటే ఆ తెలివిని తెలివి చేతనే పట్టి తీసి వేయుము తెలివియనగా ఆత్మయనే యెరుక ఆ యేరుకను యెరుకవద్దనే ఉంచి యెరుకను తీసివేయవలయును అనగా నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలై యుండి యెరుక ఏమీ పట్ట కుండా జేసి నీవు బయలై వుండవలెను. అనగా ముల్లును ముల్లువద్దనే ఉంచి ముల్లును తీసివేసినట్లు యెరుకను యెరుకవద్దనే వుంచి యెరుక చేతనే యెరుకను తీసివేయవలెను ఆలాగున యెరుకను తీసివేసిన వెనుక నీవు బయలై అచలమై వుంటావని భావము

**విశేషార్థము** : తెలివిచె బయలుండ దెలసి ఈ తెలివిని తెలివి యొద్దనే వుంచి తీసి వేయును అనగా తెలివనగా జ్ఞానమనే ఆత్మ ఈ యాత్మ ఎక్కడవున్నది అని విచారించినప్పుడు అంగుష్ఠ మాత్రములో అష్టదళ కమల మధ్యమున పీత వర్ణములోపల శ్వేతవర్ణమైనదే తెలివనే ఆత్మ. ఇక్కడవున్న ఆత్మనే తెలివియొద్ద తెలివిని వుంచి దానికతీతమైన బట్టబయలు ఉన్నదని తెలసి ఆ బయలు వుండజూచి అనగా నీవు బయలై తెలివిని తెలివి యొద్దనే వుంచి ఈ తెలివిని తీసివేయుము అనగా ఆత్మ వద్ద ఆత్మను వుంచి. ఆత్మను తీసివేయుము. ఈ ఆత్మనే యెరుకను తీసివేసిన వెనుక వున్నది నీవు బయలైయున్న పరిపూర్ణమే యున్నది. అని శెలవిచ్చినారు. మరియు ఉత్తర గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు ఈ విధముగా చెప్పియున్నారు.

శ్లో॥ ఊర్ధ్వశూన్యం అధః శూన్యం । మధ్యశూన్యం యధాత్మకం ।
సర్వ శూన్యం తదాత్మేతిః । సమాధి తస్య లక్షణం ॥

తా॥ ఓ అర్జునా ఈ ఆత్మనెయెరుక ఊర్ధ్వలోకములో శూన్యమైయున్నది అథో లోకములో శూన్యమైయున్నది. మధ్య భూలోకములో శూన్యమైయున్నది. అనగా ఈ ఆత్మనే యెరుక అన్ని లోకములలో శూన్యమైయున్నది గనుక ఆత్మనే తెలివి యేమీ లేందే సమాధి యొక్క మంచి లక్షణం అట్టి యెరుకయేమీ లేక పోయిన తరువాత నీవు బయలై అఖండమైయున్న పరిపూర్ణమైయున్నావని శెలవిచ్చియున్నారు.

**91 ॥ లేనెరుకబయలు లోపల - తానైతనకేరుపడిన తనమూలమునే-**
**తానెరుగదలచినప్పుడు-తానే-లేకుండు-దృష్టాంతము వినుమిచటా-కలదోవాదె -**
**తనకై తానెచటా - తానైతోచిన కలతనమేల్కగనబోతె-తానేతనకు లేదు**
**తగియున్నదీ - దృష్టాంతము వినుమిచటా-కలదోచాదె-తనకైతానెచటా ॥ 8**

తా॥ శిష్యా! లేనెరుక అనగా 25వదైన ఈశ్వరతనువు ఈ యెరుక 26వ తత్వమైన బయలు లోపల తనంతటతానే యెరుకై ఏర్పడి వచ్చి జగత్తైనది. అనగా ఆ బయలే యెరుకగుచు వచ్చినదని తెలియబడుచున్నది. ఈ యెరుకైవచ్చిన యెరుకే తన మూలము తానెరుగదలచిన అంటే 26వ తత్వమైన బయలనే అచలము వద్దకు వెళ్ళి అక్కడ వున్న అఖండ యెరుకను దర్శించినప్పుడే తన మూలము తానెరుటౌను అనగా అఖండ మండల మండిత హృదయపుండరీక మధ్యస్థ సర్వవ్యాప్త సచ్చిదానంద స్వరూపమైనది అఖండయెరుక. యిదేశుద్ధయెరుక యిదే బయలు యిదే అచలము ఇక్కడకు వెళ్ళి దానిని దర్శించినప్పుడు తనేలేకపోవును అనగా తానేబయలౌను యిందుకు దృష్టాంతము కలవచ్చినది. అకలలో ఏనుగును యెక్కి ఊరేగినట్లు వచ్చినది. యింతలో మేలుకువ వచ్చినది. ఏనుగు లేదు ఊరేగింపులేదు యేమి లేదు. అప్పుడు అతను ఓహో ఇది కల లేనిదే వున్నట్లు తోచినదని అనుకున్నట్లు తనమూలమైన అఖండ యెరుకను ఎరిగేసరికి అంటే మేల్కను ఎరిగేసరికి తాను బయలై తనకు తోచిన యెరుకాలేదు. ఆ జగత్తూలేదు, ఏమున్నదంటే తాను బయలైన అచలమే యున్నది అని ఎరిగితాను తన మేల్కొ నెరిగితాను పరిపూర్ణమైయుండును అని భావము

**విశేషార్థము :** రామ యోగి ఈ విధముగా సెలవిచ్చియున్నారు.

కం॥ బయలు బయలనగ నెరుకే బయలైలో బయలు నిండి బయలాయెనదే
బయలనకుండిన నావలా బయలగునో బయలు కాదో బయలు నేమగునో
పరవశమందీ బయలెట్లగుపడునో- బయలు గాని యెరుక భయములేక పెద్ద
బయలులో కనుమూసి బయలులో కనుతెరువ బయలునేమగునో -
పరవశమందీ బయలెట్లగుపడునో ॥

తా॥ శిష్యా పరిపూర్ణము పరిపూర్ణమనగా యెరుకే పరిపూర్ణమై లోపల వెలుపల నిండి అచలమాయెను అప్పుడు పరిపూర్ణమని నెరుగుట కెవరున్నారు. బయలను శబ్దము కూడా పరవశమందు లయమై బయలగునో బయలుకాదో పరిపూర్ణ మెట్లగుపడును అనగా ఏమీ లేని నిరామయ నిర్గుణతూష్ణీభావము జెందునని భావము.

**92 ॥ చచ్చుట పుట్టుట మేలుక - వచ్చుట గాఢ సుషుప్తి వచ్చుటలీనా - లచ్చముగ సహజమెరుకకు - పొచ్చముయా యెరుక నిల్వబోదు మాయప్పా-అచలముకిట్లు-లేదుగ దప్పా - మచ్చికతో రెంటి మర్మమునీ కిప్పు-డెచ్చుగ దెల్పితినెరుగు-మెరుక నిల్వబోదూమాయప్పా- అచలముకిట్లు-లేదుగదప్పా ॥ 9**

తా॥ శిష్యా! యెరుక పుట్టుట గిట్టుట సుషుప్తిని పొందుట మేలుక వచ్చుట ఈ నాలుగు విధములు యెరుక పొందుట సహజము యెరుకలేకపోయేదే నిలిచియుండదురా తండ్రీ, అచలమునకు అవస్థలు మొదలగు ఈ పాటులేవు గదా తండ్రీ అనగా అచలమునకు అవస్థలు లేవు. రెండో గుణములు ఏమీ లేక అచలమైయున్నది నాయనా ఈ రెంటి మర్మమునీకు యెక్కువగా తెలిపితిని ఎరుగు అనగా అచలం చలించదని యెరుక చలించేదని ఈ పాటు నీకు కుదిరితే నీవు అచలమై యుంటే అనగా యెరుకను రహితపర్చి తానులేకవుండే మార్గములో పడితే, యెరుక నిల్వకుండా పోవునని నీవెరిగి నీవు అచలమైయుండుమని భావము.

**93 ॥ యెరుకనుకలలో పురుషుని-కెరుకే యీ విశ్వమగుచు యేర్పడుకలగా- యెరుక బయలుగని తాలేం-దెరిగిన నెరుక కదిమేల్కయి దినమ్ములెస్సా- యెరుకతో పొందు-వదులాడెపిస్సా- యెరుకానెకలనీకు యెప్పుడుదోచితే-యెరుకాలేందను మేల్కనెరుగు మప్పుడె చాలు-యిదినమ్ములెస్సా - యెరుకతోపొందు-వదులాదెపిస్సా ॥ 10**

తా॥ శిష్యా! యెరుకనే కలలో ఉన్న పురుషునికి ఈ యెరుకే విశ్వరూపమై యార్పడు కలగా అనగా ఈ యెరుక 24 ఇంద్రియములతో కలసి సమస్తాన్ని గుర్తెరుగుచు యిదినాది యిదినీది అని విభజించుచు అనేక దృశ్య ప్రపంచములను యెరుగుచున్నది. విశ్వరూపమై ఏర్పడును కలగా ఈయెరుకె మేల్కనే బయలునుగని తానులేందని ఎరిగి తాను బయలైనదే ఎరుక అదే మేల్కనినమ్ము యెరుకతో పొందు విడిచి పెట్టినట్టు వంటిదే అజ్ఞానమనే చేదస్తము గనుక యెరుకను విడిచి పెట్టి నీవు బయలై యుండవలెను మరియు యెరుకనే కల నీకు ఎప్పుడు తోస్తే అప్పుడే ఈ యెరుక లేందని అమేల్కనే బయలు ఉన్నదని అనగా నీవు బయలై వున్నావని యెరుకలేందని ఎరుగుము చాలు అని భావము.

**94 ॥ చిత్రరువురంగుగోడల -నెత్తరగునదెలశినా వేసివిప్పుడునీ -చిత్రమున జగము నెరుకను - వుత్తబయల్ - నట్ల దెలియు మూహ తోడుతనూ- తెలిసి విడువు- మూహజగములనూ - అత్తెరగునజేస్తె అవాలి మాటాను- యిత్తెరగని తెలియనెవ యుండేరటు మీద- నూహతోడు తనూ -తెలిసి విడువు - మూహజగములనూ ॥ 11**

తా॥ శిష్యా! తెల్లగోడ మీద సీతారామలక్ష్మణులు బొమ్మలను వేసినారు రంగులతోను అనగా ఆగోడ యెప్పుడూ వుండేదే బొమ్మలు రంగులు పొయ్యేవే గనుక చిత్తరవు రంగు గోడల యేవిధముగా నీవు తెలుసు కున్నావో అదే విధముగా నీ విప్పుడు నీ చిత్తమును జగము యెరుక ఉత్త బయలు అట్లే అనగా బయలు శాశ్వతముగా వుండేదేనని జగమెరుకలు నశించిపోయేవేనని తెలుసుకొనుము ఏ తెలివి చేతను తెలుసుకున్నవో, ఆతెలివి చేతనే ఉత్తబయలును ఉండ జూచి అనగా నీవు బయలైయుండుము ఆ తరువాత యిది వున్నది అది లేదని తెలుసుకొనే వా రెవరున్నారు యెవరూలేరని భావము.

95 ॥ పరిపూర్ణములోలేనిదే-యెరుకొక్కటిదోచిత నమయెరిగిన మృషగా-యెరుకే విడుచునదెట్లన-కరములు తమపనులు తామె గడుపూనట్లుగనూ- యిదిగా కుంటె-కలదింక్కోటి వినూ- మరికానిదా మాట మంచిదీ మాటాని-పరిపారి విధమూల పలుకె పలుకులపని-గడుపూనట్లుగనూ-యిదిగా కుంటె-కలదింక్కోటివినూ ॥ 12

తా॥ శిష్యా! పరిపూర్ణములో ఏమీ లేనిదే యెరుకొక్కటి తోచెను. ఆ తోచిన యెరుకను లేదని మృషని యెరిగి తాను బయలైన పరిపూర్ణాన్ని ఉండజూచి తననుతాను చూచేసరికి యెరుకే మీలేక బయలైతాను లేనని తనకు తెలిసి తానేలేకపోయెను. అదియేలాగనగా చేతులు తమ పనులు యిచ్చుట పుచ్చుకొనుట తాముగడిపినట్లుగా మరియూ యెక్కడనైనా దురద వచ్చినప్పుడు మనము చెప్పనక్కర లేకుండగానే తనంతటతాను గోకినట్లుగాను యిదికాదంటే యింకోటివిను! యిది మంచిమాటని యిదికాని మాటని పలికే పలుకులుపని గడిపినట్లు అలాగే యెరుక తనకు తానే లేనని తానుపరిపూర్ణమైనదేవున్నదని గ్రహించెనని భావము.

96 ॥ తలయెత్తిజూడజాలునె- అలచీకటి యెదుట నిల్చియ భాష్త కళనే-కలవచ్చి మేల్కయందున-గల చేష్టలు మొల నిల్చి-గను గొనగలదా- అట్లనె యెరుక-కనుగొన గలదా-యిలలో సద్గురుబోధ నెరిగిననరునిచే-ష్టలుగంటె నుళ్ళక్కి-సద్గురుబోధొట - కనుగొనగలదా-అట్లనె యెరుక-కనుగొనగలదా ॥ 13

తా॥ శిష్యా! చీకటి సూర్యుని యొక్క యెదుట నిలిచి ఆ వెలుతురు తలఎత్తి చూడగలదా చూడలేదు. కారణమేమనగా సూర్యుడు వచ్చే సరికి చీకటి పారిపోయినది. అట్లనే యెరుక కలగని మేలుకున్న తదుపరికలలో వున్న వస్తువులు కనుగొనగలదా యెందుకనగా కలలో భార్యతో యిష్టా విలాసముగా ఉన్నట్లు కల వచ్చినది ఇంతలో మెలకువ వచ్చినది. భార్యలేదు ఏమీలేదు. గనుక మేల్కలో కనుగొనలేదు. ఆ ప్రకారము గానే యిలలో సద్గురుబోధ ఎరిగిన అనగా అచలమై యున్న వాని వద్ద అనగా యెరుకయనే కల మేలుకొని పరిపూర్ణమైన తరువాత ఈ యెరుక నిలువగలదా! అనగా అతడు సర్వకాల సర్వావస్థల యందు యెరుకలేని పరిపూర్ణమై వుంటాడు గనుక వాని చేష్టలుగంటె వుళ్ళక్కి యెరుక అనగా లేకపోవునను భావము.

**97 ॥ అంటదు కలమేల్కనుమే-ల్కంటదు కలనెన్నటికిని కడునిశ్చయమిా-రెంటి క్రియ గుర్తు- బయలుల -రెంటిని రెండంటకుండు-రెండ్రెంటిలోనూ-కలయెరుకాలీ-రెండూ మిధ్యేనూ-దంటాగ మేల్క బయలుంటా వెప్పటి కెరిగి-రెంటూముపై రెంట రెంటీ-కల యెరుకాల-రెండ్రెంటిలోనూ-కల యెరుకాలీ-రెండూ మిధ్యేనూ ॥ 14**

తా॥ శిష్యా! కలమేల్కను అంటదు, మేల్క కలను అంటదు యెన్ని విధముల పరిశోధించి చూచినను ఒకదాని నొకటి అంటదు యిది నిశ్చయము ఆలాగే బయలును యెరుక అంటదు. యెరుకను బయలు అంటదు మరియు మేల్కను కల అంటదు. కలమేల్కను అంటదు. యిది నిశ్చయము ఈ కల యెరుకలు రెండూ లేనివే గనుక కలలేకపోతే మేల్కే ఉన్నది యెరుక లేకపోతే బయలే ఉన్నది గనుక మేల్కబయలు ఎప్పుడూ వుండేవేనని నిశ్చయించుకొని నీవు బయలయ్యి మేల్కలోనే ఉండి కలయెరుకలనుఏమీ లేకుండా చేయవలెనని తెలుసుకొని నీవు సర్వకాలం బయలైయ్యి వుంటే యెరుకలేదని భావము.

**98 ॥ యెరుగదు సుషుప్తిని జాగ్రత -నిరవంద సుషుప్తి రెంటినెరుగును మేల్క-ట్లరయగ బయలెరుకల రెంట్నెరు గదు బయలెరుక-రెంటి నెరుగుచు నుండూ-గురు ముఖమూన -నెరిగి యీ రెండూ- తిరమూగ-యెరుకాను తీశివేశితె జాలు-పరులునేనని యేటి పలుకేలేకుండుని-ట్లెరుగూచునుండూ-గురు ముఖమూన -నెరిగీ యీ రెండూ ॥ 15**

తా॥ శిష్యా! జాగ్రత్తను సుషుప్తిని గాఢ సుషుప్తి యెరుగదు మెలుకువ వచ్చిన తరువాత రెంట్నీ యెరుగును మేల్క! ఆలాగే బయ లెరుకలను రెంట్నీ బయలెరుగదు యెరుక బయలను యెరుకను రెంట్నీ యెరుగును గనుక బయలెరుకలను గురుని ద్వారా గా విచారించి ఈ రెంట్నీ యెరిగి యెరుక లేదు. బయలున్నదని ఎరిగి తాను బయలై యెరుకను మరలా తిరిగి పుట్ట కుండా చేస్తే అనగా తాను సర్వకాల సర్వావస్థల యందు పరిపూర్ణమై యుంటే పరులని నీవని నేనని పలుకే లేకుండునని భావము॥

**99 ॥ సంకల్పము లేనిదెని-స్సంకల్పములోన దోచుచను దోచుచనున్-సంకల్పము తప్పున నిస్సంకల్పమునెరిగి నేని - చనుతా లేననుచూ - నిస్సంకల్ప - మునునిల్చెదనుచూ సంకల్పించుటకింక సంకల్పమేది - నిస్సంకల్పమందిట్లు సంకల్పమెరిగితే-చనుతాలేననుచూ నిస్సంకల్పమును నిల్చెదనుచూ ॥ 16**

తా॥ శిష్యా! సంకల్పములేనిది. నిస్సంకల్పములోన తనకు తానే తయారై సంకల్పము తోచును మరల నశించును మరలతోచును. మరలనశించును, మరలతోచును, మరల లేకపోవును, ఈ సంకల్పించే యెరుకే యెంత త్వరగా నిస్సంకల్పమును యెరిగితే, అంతేత్వరగా నేను లేనని యెరుక తాను లేకపోవును, అనగా తాననే యెరుక లేవని, నిస్సంకల్పమనే బయలు ఉండేదేనని, అనగా సంకల్పించే యెరుకలేందని నిస్సంకల్పమైన పరిపూర్ణమున్నదని యెరుక యెరిగితే,

యెరుకే నిల్వకుండా పోవును, ఇంక సంకల్పించుటకు యెరుకేది, లేదు గనుక నిస్సంకల్పమైన బయలే తానైయుండును, సంకల్పించే యెరుక లేకపోయెను గనుక నీవు సర్వకాలములయందు పరిపూర్ణమై యుండుము అని భావము.

**విశేషార్థము :** తాను బయలైన పరిపూర్ణములో, సంకల్పమనే యెరుక తోచినది, అనగా తాను బయలైయున్నాడు, ఆ బయలులో యెరుకతోచెను, తాను మరల బయలయ్యెను, యెరుక మరలతోచెను, తాను కొంతసేపు అయ్యేక అచేష్టలు చూచి, మరల బయలయ్యెను, కొంతసేపటికి యెరుక మరలతోచెను. ఈ విధముగా తోచేయెరుక బయలు ఉన్నదని యెరిగి, తాను బయలైతే, యిక యెరుకయేది, అనగా ఈ యెరుక యెంతత్వరగా బయలును యెరుగనో, అంత త్వరగా తాను బయలై యుండను, యెరుకే బయలైతే యిక యెరుకయేది, యిక యెరుక లేదు గనుక యెరుకలేని బయలైన పరిపూర్ణమే అంతటా నిండి శాశ్వతమైయున్నదని భావము.

**100 ॥ యెరుక తనకు దావిడిపో - దెరుకను విడిపించలేరు యెవ్వరుధాత్రిన్ -గురు డొకడుదప్ప గురునకు - పరిచర్యయొనర్చిబోధ - పద్ధాతివినినన్ - తిరిగిరాని- పద్ధతిగనినవ్ పరిపూర్ణమెరుకయేర్పరుచనెరుకలేక - హరిని స్వప్నము గన్న కరిమ్రుగ్గినట్లాయీ - పద్ధతి వినినన్ - తిరిగిరాని - పద్ధతి గనినన్ ॥ 17**

తా॥ శిష్యా! యెరుకతనంతట తానుపోదు, ఈ యెరుకను ఈ ప్రపంచములో ఎవ్వరూ విడిపించలేరు, తనకుతాను విడిచిపెట్టదు, శ్రీ సద్గురు దేవులు ఒక్కరుతప్ప, ఆ గురుమూర్తే విడిపించాలిగాని యితరులు ఎవ్వరూ యెరుకను విడిపించలేరు, అందువల్లన ఆ గురుదేవునికి గురుసేవలు చేయుచూ, గురుభక్తి గురునిష్టగలిగి పరిచర్యలు చేయుచుంటే, ఆ గురుమూర్తికి దయకలిగి గురునవాచననే గురియుక్తిచెప్పను. అనగా గురువుగారు చెప్పిన బోధ వినిచూ ఆ గురుబోధలో ఉండే మర్మధర్మములను గ్రహించి, ఆ గురువుగారు ఇచ్చినటువంటి సూత్రమువల్లను, యెరుకను విచారించి, విడిచిపెట్టి తిరిగి పుట్టకుండా వుండేటటువంటి చోటుగని, పరిపూర్ణమై యుండే మార్గమెరిగి, పరిపూర్ణ యెరుక ఏర్పర్చ, అనగా 26వ తత్వమైన పరిపూర్ణ యెరుక ఏర్పాటుచేసి, పరిపూర్ణమైయుంటే. ఈ మలినముతో కూడిన 25వ తత్వమైన యెరుక స్వప్నములో ఏనుగు సింహమును చూస్తూ చచ్చినట్లు అలాగే ఈ యెరుక పరిపూర్ణమును చేస్తే లేకపోవును. అనగా పరిపూర్ణమే తానైయుంటే యెరుక ఏమీ లేకుండా పోవునని భావము.

**విశేషార్థమేము :** యెరుక కూడా పరిపూర్ణమంతటిదె, అందువల్ల సామాన్య గురువులెవరూ, యెరుకను విడిపించలేరని గ్రహించవలెను. ఎందుకనగా యెరుక యొక్క స్వరూపమె బయలాంశమైయున్నది, ఆ బయలును తీసివేసేవారు లేరు, సద్గురుమూర్తియైతే అయనకు తెలుసు, ఈ పరమ రహస్యము, అనగా యెరుక స్వరూపం బయలని, సద్గురువైతే ఆ బయలును బట్టబయలు చేయును, అనగా

అందువల్ల యెరుక కాలిననులకవలె పడని రూపాయవలె నుండును, గనుక యెరుక యొక్క సత్తాయేమీ లేకయే వూహలులేక అశరీరమై అచలమై పరిపూర్ణమైయుండును, అనగా పాలు పెరుగై పెరుగు తరచగా అందులో వచ్చిన వెన్న యెందులోను కలియనట్లు యెరుక యెందులోను కలియకలేకయుండును. అనగా తొండముదిరి ఊసరవెల్లైనట్లు, నక్కముదిరి వరడైనట్లు, యెరుక విచారణ చేయగా చేయగా అఖండమై అచలమై పరిపూర్ణమైయుండెను, అనగా దేన్నీ యెరుగని వునికి కలిగియుండెను, యిదే పరిపూర్ణం, యిందుకు భాగవతుల క్రిష్ణప్రభువు 198వ కందార్థములో గని ఈ రెంట్లో దేన్నీ యెరుగని, ఉనికి గలిగిన యట్టి, ఘనునిసన్నుతి జేయ, జనులాకు శఖ్యమంచనరాదు, వినరాదు, అని శెలవిచ్చియున్నారు. మరియూ శ్రీ కృష్ణ పరమాత్మ ఉత్తరగీతలో అర్జునునితో ఇలా చెప్పినారు.

శ్లో॥ ఊర్ధ్వపూర్ణం మధఃపూర్ణం । మధ్యపూర్ణం యధాత్మకం ।
సర్వపూర్ణం తధాత్మేతి । సమాధి తస్య లక్షణం ॥

ఓ అర్జునా యోగులు ఎలా పూర్ణులైనారనగా ఊర్ధ్వలోకములో పూర్ణమై యున్నది, అధోలోకములో పూర్ణమైయున్నది, మధ్యభూలోకములో పూర్ణమైయున్నది, మరియూ సర్వకాలములయందు సర్వదేశములయందు సమస్త వస్తువులయందు అంతటా నిండి నిబిడీకృతమై పరిపూర్ణమైయున్నదానిని, గురుముఖతా నెరిగి, వారు పూర్ణులైయున్నారని శెలవిచ్చియున్నారు.

**101 ॥ అపరోక్షమౌనె మనుజుల - కు పరోక్షంబైనబయలుగురుకృపలేకన్ - అపరోక్ష మౌను మనుజుల - కు పరోక్షంబైన బయలు - గురుకృపగలుగా - కీలిదేలేని - యెరుకాతా తెలుగా - విపరీతమౌ బుద్ధివిడచినీవెప్పుడు - ఉపచారములు జేయుచుండుము గురువీకి - గురుకృపగలుగా - కీలిదెలేని - యెరుకా తా తెలుగా ॥ 18**

తా॥ శిష్యా! అపరోక్షమౌనా ఈ ప్రజలకు, పరోక్షముగా యెక్కడోయున్న బయలు, మనకు దగ్గరై తెలియవలెనంటే, గురుకృపకావలెను, గురుకృప లేనిదే తెలియబడదు, గురుకృప గలిగితే తెలియబడును, అనగా యెక్కడోయున్న బయలు మనకు దగ్గరై అపరోక్షమౌను, అది ప్రత్యక్షమైతానే బయలౌను, గనుక గురుమూర్తికి సేవలు చేయుచూ గురుభక్తి గురునిష్ట గలిగియుంటే, గురువుగారికి దయగలిగి అతనికి గురుయుక్తి చెప్పును, కీలు యిదే 25వదైన యెరుకయనే ఈశ్వరతనువు పోవలెనంటే, విపరీతమైన బుద్ధి విడచి. సర్వకాల సర్వావస్థలయందు సద్గురుమూర్తికి సేవలు చేయుచూ, ఉంటే నీకీ విషయములన్నీ గురుమూర్తి చెప్పును, గనుక నీవీయన్నీ తెలుసుకొని ఆచరించితే, యెరుక ఏమిలేకుండా పోయే మార్గం నీకు సూచన చేసి, చూపించి గురువుగారు చెబుతారు. అప్పుడు నీవు బయలైయ్యి పరిపూర్ణమౌతావని గ్రహించి, ఆచరించుచు యెరుకను విడిచి పెట్టితే, ఆ పరిపూర్ణం నీకు అపరోక్షమై

ప్రత్యక్షముగా చూచి, నీవే పరిపూర్ణమై యుంటామని భావము.

**విశేషార్థము :** అపరోక్షమంటే దగ్గరౌట, పరోక్షమనగా దూరముగా ఎక్కడో వుండుట, ప్రత్యక్షమనగా సాక్షాత్కారముగా యున్నదానిని చూచుట, వస్తు నిర్ణయమౌట, అనగా ఆ పరిపూర్ణమై యున్న దానినిచూసి, అనగా అపరోక్షమై దగ్గరయున్నదానిని చూచి, యిది బయలు యిది నామరూప క్రియలతోయున్న వస్తువుకాదు, గనుక ఇట్టి బయలును యెరుకలేక సేవించుటే, అనగా యెరుకను విడిచిపెట్టుటయే మనపనియని, యిట్టి స్థితి కలగాలంటే గురుసేవ గురుభక్తి గురునిష్ఠ కలిగి గురువుగారికి పరిచర్యలు చేయ్యాలి అలా చేసిన వానికే పరిపూర్ణ స్థితి కలుగుతుందని గ్రహించుకో, అనగా నీవే యెరుకలేని పరిపూర్ణమై అచలమై యుంటావు అని భావము. ఇందుకు రామయోగి కందార్థము.

కం॥ శ్రీ కృష్ణుడు సనకాదుల కీకాంత మహాసమాధికిదె సూచనగా వైకుంఠమిట్టిదనియు
తారకమును జూపిపోయె ద్వారకాపురికి మౌనులు మోక్షమందిరిప్పటికీ
ఆకరణిసూచన చేగనవలె సింహాలోకమున పంక్తి రాక జనుగతి భ్రాంతి
ద్వార కాపురికి మౌనులు మోక్షమందిరిప్పటికీ ॥

తా॥ సింహమును జూడగ ఏనుగుల గుంపు వెళ్ళిపోయినట్లు శ్రీకృష్ణ పరబ్రహ్మము ఏకాంత మహాసమాధికి సూచనగా సనకాదులకు వైకుంఠ మిట్టిదని చేతులతో చూపిపోయినారు. సనకాదులా సూచనను గ్రహించి భ్రమవిడచి మోక్షమును జెందిరని భావము.

**102 ॥ నేనెవ్వడనను జీవుడు - నేనేనేనను శివుడు యీ రెండనకన్ - తానుండు నచలమీటిని - నేనెరిగరిగినను పైది - నేనెట్లనీనీ - నేననకున్న - తానెట్ల నీనీ - నేనన్నదాంట్ల దెనీనా ప్రసంగాము - తానన్న దాంట్లనే తలపోయ వలెనిట్లు నేనెట్లనీనీ - నేననకున్న - తానెట్లనీనీ ॥ 19**

తా॥ శిష్యా! నేనెవ్వడననును 24 ఇంద్రియములతో కూడియున్న మరుపనే జీవుడు తనకు తానైయున్నాననను అహమనే శివుడుయను ఈశ్వరుడు, ఈ రెంటికీ అతీతమైయున్నది అచలపరిపూర్ణము, వీటినినేనెరిగి, అరిగిన యెరుక లేకపోయిన తరువాత, వీటికి పైగా ఉన్న అచలపరిపూర్ణము. నీవని నేనని యేమి అనదు, జీవేశ్వర్లనే జ్ఞానాజ్ఞానములే నీవని నేనని అవునని కాదని ప్రసంగించును, తనలో తాను తలపోయుచుండును, యిట్టి యెరుక లేకపోయిన తరువాత, తానైన బయలనే అఖండస్వరూపమే తానులేని తానై యున్నదని భావము.

**విశేషార్థము** : మరుపనే జీవుడు యెరుకనే ఈశ్వరుడు అఖండమనే అచలం ఈ మూడెరుకలను ఎరిగి ఆ యెరిగిన యెరుక లేకపోయిన తరువాత తాను బయలై అఖండమైన అచలమై యున్నదని యెరిగి సర్వకాలము తాను లేని తాను పరిపూర్ణమై యుండునని భావము.

**103 ॥ తొర్రలు తొమ్మిదిగలమే -న్నరికి యెకరెంటి లోన-మర్రలు నాల్గున్-డెర్రది తెల్లది నల్లది కర్రది-దానగ్రమందు-గలదొక్క తూటూ - అది యెరుకానె-పులు గుండె చేటూ-కుర్రాగురుబోధనెగొడ్డలిచేబూని-మర్రి పులుగుల రెంట్ని మలచి కొట్టరపోని-కలదొక్క తూటూ అది యెరుకానె-పులుగుండె చేటూ ॥ 20**

*తా॥* శిష్యా! ఈ యెరుకనే మేనికి తొమ్మిది రంధ్రములు గలవు అందులో రెండు నేత్రములు గలవు ఆ నేత్రములలో పంచవన్నెలు గలవు. ఎరుపు తెలుపు నలుపు ధూమ్రము దానగ్రమందు అతి సూక్ష్మముగా ఒక రంధ్రము గలదు ఆ రంధ్రమే ఆకాశము, ఆ ఆకాశములో ఉన్నదే ఆపోజ్యోతనే యెరుక ఈ యెరుకే 25వ తత్వం మరియు ఎరుపు పృధివితత్వం తెలుపు జల తత్వం నలుపు అగ్ని తత్వం ధూ మ్రం వాయుతత్వం ఆ మధ్యనున్న నీలమనే రంధ్రమే ఆకాశతత్వం ఆ రంధ్రములో ఉన్నదే ఆ పోజ్యోతనె యెరుక శిష్యా మూలములేని ఈ గుర్తెరిగె శరీరమేమీలేదనే గురు సూచన ద్వారా అనగా గురుబోధనే గొడ్డలిచే జీవేశ్వర్లను వెనుకకు మలచి పశ్చిమ దిశగా విచారించి జీవేశ్వర్లను రహిత పర్చుము అలాచేస్తే యెరుక ఏమీ లేకుండా పోవును యెరుక పోయిన తరువాత తాను బయలై అచలమై తాను లేని తానై యున్నదని భావము.

**విశేషార్థము** : రాజరాజేశ్వర యోగం

ఈశ్వర ఉవాచ -చక్షుర్మధ్యేస్థితం గుహ్యం ! అంగుష్టే పర్వ మాత్రకం ! తదర్ధం చాపి సర్వార్థం ! తస్మాగ్రే సూక్ష్మకంధ్రువంగు హ్యాద్గుహ్యతమంగుహ్యం ! చక్షు స్థానేషు తిష్టతి. తన్మూర్తి లక్ష్యతే దశ్యం ! ఆపాదతలమస్తకం అచలం నిర్మలం శాంతం. కాయస్థం తేజ ఉచ్యతే అమలం నిర్మలం దేవం ! శూన్యవాపి నిరంజనం తచ్ఛోతిర్విమల స్థానే ! జ్ఞేయం ప్రత్యక్ష గోచరం! పద్మ గర్భంపచ దృష్టంచే! తృముక్తోనా త్రసంశయః రక్తంశుక్లం తథా కృష్ణా! నీలపీతాదిశోభితం త్వన్మధ్యేదర్శితం యేన ! త జ్యోతి ర్బ్రహ్మ కేవలం భృవోస్థానే అధః పద్మ! ద్విదళం తత్ర శోభితం హంక్షం ద్వయక్షరసం యుక్తం! వర్తతే వాయు మండలం తర్మధ్య మంతు జ్యోతిశ్చ బందు రూపం విరాజతే నీలతోయద మధ్య స్థాత్! విద్యుల్లేకేవ భాస్వరా! నీవార శూక తత్తన్వి । పీతా భాన్వన్త్వణూ పమా తస్యాశ్శిఖా యా మధ్యే పరమాత్మావ్యవస్థితా: సబ్రహ్మసశివస్సహరిః స్సేంద్ర సొక్షరః పరమస్వరాట్జ్వలత్కాలాన లాభసా! తటిత్కోటి

సముప్రభాత దూర్ధ్వంచ శిఖాసూక్ష్మం! చిద్రూపం పరమంకళా గురోర్ముఖేనజ్ఞా తవ్యం! అశ్వధానోప లభ్యతే కోటి సూర్యప్రతీకాశం! చంద్రకోటి సుశీతలం యధావేదేన శాస్త్రేన,తథా పశ్యంతి సూరయః, ఆత్మజ్యోతి ప్రభావేన, సోమసూర్యాది భాసతే! అంతర్బహిశ్చతత్సర్వం! వ్యాప్యతే సకలంజగత్, యధోక్తం ద్వాదశాకారం! చక్షుర్ణామేతి కధ్యతే, తన్మధ్యే సర్వసారంచే! దర్మ యిత్యామమునిః, పశ్చాత్ ప్రారబ్ధభోగేషు! నదే హంతరమాప్నుయాత్, సర్వేంద్రియ సమాయుక్తం! సర్వదేహమవాప్నుయాత్. సర్వేంద్రియ సమాయుక్తం! సర్వదేహమవాప్నుయాత్, చిదాత్మా సర్వదేహేషు! వ్యాప్యతే జ్యోతి రూపకం, తజ్యోతిశ్చక్షు రగ్రే చ! గురోర్నేత్రేచ పశ్యతి సముకః సర్వలోకేషు! వేదవేదాంత నిశ్చితం మధి త్యాసర్వశాస్త్రాణీ పార్వత్యాచప్రతిష్ఠితం, కాశీపురని వానస్థో! విశ్వనాథో జగద్గురుః, దేహంతేచో పదిశ్యేత! దక్షిణే కర్ణసంపుటే, రాజరాజేశరం యోగ! శేషమార్గం ప్రశస్యతే, యః పఠేత్ సతతం భక్త్యా! సముక్తోనాత్ర సంశయః ఇతిశ్రీమద్గురు ప్రసాదే రాజరాజేశ్వరీ యోగంసంపూర్ణం

**104 ॥ తనువుతోవొచ్చినయెరుకే - తనువును తనువనుచు తనను తానయెరుగున్ - తనువును బాసినమీదట - తన నాదేహమును రెంట్ని - తానెరుగదెప్పుడూ - అదిగనుకతాలే నేలేదెపుడూ అనుమాన రహితామిందచలమున్నదికంటె - తనమాట తలపోయ తనకెక్కియి తనను - తానెరుగదపుడూ- అదిగనుకాతా - లేనేలేదెపుడూ ॥ 21**

తా॥ శిష్యా! తనువనేజీవుడు 24 యింద్రియములతో గూడుకొని వచ్చి ఇది తనువని మేనని ఎరిగి, 25వ దైన తననునేనని ఎరిగి, యీతమవు తాను ఈ రెంటినీ యెరిగిన యెరుకే! తనువును తనను విడిచి పెట్టిన తరువాత, తనువెరుకల నేజీవేశ్వర్లను, తాను ఎరుగదపుడు, అనగా దేహిదేహములనే తనువును తనను ఎరుగదపుడు. మరియు తాననెయెరుక తనువనేమేను లేనేలేవెపుడు, నీకు అనుమానము రహితమైన తరువాత అచలమున్నది కంటే! అనగా తనకు అనుమానరహితమై తాను అచలమై బయలై యుంటే అపుడు తనమాట తాను చెప్పుకొనుటకు సిగ్గై తనను తాను ఎరుగుటకు తానులేనేలేదెపుడు అనగా తాను సర్వకాల సర్వావస్థల యందు బయలై అచలమై తాను లేని తానై యుంటే యెరుక ఎప్పుడూ లేదని భావము.

**విశేషార్థము :** అచలమున్నది కంటె అనగా కనుటనగా చూచుట చూచుటన గా తాను బయలౌటమై చూచుట యని అర్థము అనగా తాను బయలై అచలమై పరిపూర్ణమౌటయని తెలుసు కోవలెనని భావము.

**105 ॥ ఉప్పెనచే జెడు తరువువా-కప్పుడు విత్తనము పుచ్చునా రెంటికి యీ తిప్పలు దప్పవుధరయే! తిప్పలు తావెరుగ దిట్లు-తెలుసుగదోయీ! తనువెరుకాబయ- లుల నట్లిరుగోయీ-గొప్పైన గురుబోధ చెప్పూనవెరిగియీ-తిప్పాలుగల వాట్సి- తప్పాదీకి తెచాలు-తెలుసూగదోయీ- తను వెరుకా బయలులు- నట్లిరుగోయీ ॥ 22**

తా॥ శిష్యా చెట్టు ఉప్పునీరు తగిలి కూకుడు వేరు కుళ్ళి ఎండిపోయి చచ్చును ఒకప్పుడు విత్తనముపుచ్చి మొలకెత్తిచచ్చును, యీ తిప్పలు చెట్టునకు విత్తనమునకు తప్పవు అనగా చెట్టు విత్తనములకు చచ్చుట పుట్టుట అనే తిప్పలు తప్పవు. భూమి ఏ తిప్పలు ఎరుగదు ఎప్పుడూ ఒకేలాగు వున్నదని తెలుసుకొనుము ఈ లాగుననే తను వెరుకలు రెండూ పుట్టుచున్నవి. గిట్టు చున్నవని ఎరిగి బయలునకు పుట్టుట గాని గిట్టుటగాని  ఈ తిప్పలు యేమీ దానికి లేవు అదిసర్వకాల సర్వింస్థలయందు ఒకే తీరుగా వున్నది. గనుక నీవు సర్వకాల సర్వావస్థల యందు బయలైయుండి ఆ బయలులో పుట్టేగిట్టే తను వెరుకలను తిరిగి పుట్ట కుండా యల్లప్పుడు నీవు బయలై, తను వెరుకలను విడిచిపెట్టే యల్లవేళలయందు ఒకే తారుగా వుండమని భావము.

**విశేషార్థము** : చెట్లు విత్తనములకు చచ్చుట పుట్టుట లనే తిప్పటు తప్పనట్లు తను వెరుకలకు పుట్టు గిట్టుటలనే తిప్పలు తప్పవు మరియూ చెట్టు.విత్తనం పుట్టినా గిట్టినా భూమి యరగనట్టు తను వెరుకలు పుట్టినా గిట్టినా బయలు ఎరుగదు అలాగే నీవు నంకల్పాలు వచ్చినా పోయినా అచలవై బయలై దేనిని ఎరుగక పరిపూర్ణమైయుండుమని భావము.

**ఇతి శ్రీ మద్భాగవతకృష్ణవిరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వేయెరుక**

**మోక్షణనా మషష్టోధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము**



# ☆ 7 .మతాల లక్షణం. 29 ☆

106 ॥ మతములవారలు తమస-మ్మతమైనటువంటి-శాస్త్రమర్యాదలచే-మితమేరు పరుచుకొని బహు-గతులను కలహింతు రట్టి-గతినీకేమిటికీ-చెపలత జెందె-స్థితినీకేమిటికీ ప్రతిలేనియీ బట్ట బయలుండ జూచి సం - తతములే నెరుకలేదనినమ్మిక-వారిగతినీ-కేమిటికీ-చెపలతజెందె-స్థితినీకేమిటికీ ॥ 1

తా॥ శిష్యా! మతములవారనగా ద్వైతులు అద్వైతులు విశిష్టాద్వైతులు శాక్తేయులు గాణప్రత్యులు ఇలాంటి మతములు అనేకమైన మతములు ఉన్నవి. ఈ మతములవారు వారికి సమ్మతమైన శాస్త్రములను తయారు చేసుకొని ఒక హద్దుయేర్పరచుకొని కొన్ని నిమమములు పెట్టుకొని అనేక గతులుగా ప్రవర్తించెదరు వారి గతినీకెందుకు.వారి చెపలతబుద్ధి నీకెందుకు నీవు ప్రతిలేని ఈ బట్టబయలు ఉండజూచి అనగా నీవు బయలైన బయలులో ఏ ప్రతిమలు లేకుండా ఉండజూచి అనగా సంకల్పవికల్పాలు గాని ఏ అపోహలుగాని లేక సర్వకాల సర్వావస్థల యందు నీవు బయలై యుండి ఈ యెరుకను ఏమీ లేకుండా చేసి నీవు లేక యుండుము అని భావము.

**విశేషార్థము :** ప్రతిలేని ఈ బట్ట బయలు ఉండజూచి అంటే తాను బయలైయున్న బయలులో ఎరుక ఏమైనా వస్తున్నదా లేదా యని ఉండజూచి అనగా ఆ బయలులో ఏ ప్రతిమలు లేకుండా మహాతీతమై ఉత్తదైయున్నదా లేక సంకల్పాలు ఏమైనా తోస్తున్నవా లేదా ఉత్తబట్టబయలైయున్నదా లేక ఏమైనా తోస్తున్నవో వుండజాచి నీవు త్రికాలముల యందు బయలైయుండునని భావము॥ మరియు ఈ మతములవారు చెప్పేదేమనగా ఖేచరీముద్ర చెప్పేవారు కొందరు, బూచరీచెప్పేవారు కొందరు, ఈలాగు మధ్యమ శాంభవి షణ్ముఖీ ఈ ముద్ర భావములు చెప్పెదరు, మరొకందరు భ్రూమధ్యస్థానమందు చూడమనియు, మరియు నాశికాగ్రమున చూడమని కొందరు, యీ లాగు అనేక గతులు చెప్పచు చెరిచెదరు వీరందరూ తానుండి విచారించేవారే కానీ, తాను లేక విచారించేవారుకారు, గనుక నీకేచపలతస్థితి అవసరం లేదు, అచల సాంప్రదాయం చలనము లేనిది, యెరుకలేక సేవించే మార్గము, అనగా తానులేక విచారించే విధానము, అది ఎట్లు అనగా, తన్నుతాను చూచినప్పుడు, తాననే తెలివి బయలౌను, యిది గురుసూచననే యుక్తివలన విచారించితే తానులేక బయలై

యుండుసు, అనగా తాను బయలైన బయలులో, యెరుకనే తెలివియేమైనా తోస్తున్నదా లేదా యనివిచారించి, తాననే తెలివిని ఏమీ లేకుండా చేసుకొనే పరిశుద్ధమైన, పరిపూర్ణబోధయని గ్రహించవలెనని భావము.

**107 ॥ ద్వైతాద్వైతవిశిష్టులు - సైతురు వినిసైసరెపుడు సైసక పిదపక్ - సైతురు క్రమమున వేరన - నా తతమతజీవశివులనవి వినబోకూ - నేబోధించి - నది విడబోకూ - పూతామౌ బయలూను పొడజూచి గురునీచె - ద్వైతాద్వైత విశిష్ట ద్వైతాములను మాను - మవివినబోకూ - నే బోధించినది - విడబోకూ ॥ 2**

తా॥ శిష్యా! ద్వైతులు అద్వైతులు విశిష్టాద్వైతులు మనము చెప్పేబోధ వినరు ఏది వింటారనగా జీవేశ్వర్లు గురించి చెప్పితే వింటారు, అనగా జీవుడు వేరు ఈశ్వరుడు వేరు అని చెప్పితే ద్వైతులు వింటారు, అద్వైతులు వినరు, జీవేశ్వర్లు లేరు ఉన్నది అఖండ స్వరూపమే అంటే వింటారు, విశిష్టాద్వైతులు ముందు వినరు ఒప్పుకోరు తరువాత ఒప్పుకుంటారు, గనుక ఈజీవేశ్వర్ల బోధ మనకవసరము లేదు, నేను బోధించిన బోధ నీవు విడిచిపెట్టకని అనగా పూతమౌ బయలును పొడజూచి అంటే నిర్మలమై నిర్గుణమై నిరాకారమై తూష్ణీ భావస్థితిని ఉండజూచి అంటే తాను బయలైన స్థితిని విమర్శించి అనగా ఆస్థితిలో ఏమైనా సంకల్పాలు ఊహలు వస్తున్నావా లేదా అని వుండజూచి ఏ సంకల్పాలు వస్తున్నావంటే మరల బయలై ఏమీ రాకుండా వుండజూచి గురుని ద్వారా ద్వైతము అద్వైతము విశిష్టాద్వైతమును విడిచిపెట్టుము అని భావము.

**విశేషార్థము :** పూతమౌ బయలును పొడజూచి, అంటే గురుయుక్తి వలన తాను బయలైన బయలును విచారించి, ఆ బయలును ఉండజూచి, అంటే ఆ బయలులో వచ్చే ఎరుక మరుపులను ఎరిగి, అవిరాకుండా అనగా ఏ ఆలోచనలు రాకుండా భార్యయని పిల్లలని సంసారమని ఏమీ రాకుండా తాను బయలై యుండటమే బయలును ఉండజూచుటని, ఎరిగి తాను బయలై యుంటే ఏవి రావని భావము.

**108 ॥ కొందరు దశవిధనాదము-లందున సభ పంచకంబునందున చక్రా - లందున లక్ష్యధ్యానం - బందునహంసందు బుద్ధి - నాటింతురోయీ - యోగములందు- నటియింతురోయీ - అంది సిద్ధుల చేతనానందింతురుకొంద - రందారి మనసీబోధందె నీవుండూము నాటింతురోయీ - యోగములందు - నటియింతురోయీ ॥ 3**

తా॥ శిష్యా! కొంతమంది తనలో వున్న దశవిధనాదములను. భేరీ. ఘంటా, కింకిణి, వేణు. చిణీ. ప్రణవనాదము మొదలుగాగల నాదములను వింటూ ఆనందించును. మరికొందరు సభపంచక మందనగా ఆకాశము, వాయువు, అగ్ని,

జలము. పృధివి ఈ పంచభూతములే గొప్పవని వాటిని విచారించెదరు. కొందరు చక్రాలందున అనగా మూలాధార స్వాధిష్ఠాన అనాహత మణిపూరక విశుద్ధ ఆగ్నేయ సహస్రార చక్రములే గొప్పవియని వాటినే విచారించెదరు. కొందరు భ్రూమద్యమందు దృష్టి నిలిపి ధ్యానించుచుందురు కొందరు శ్వాసయందు మనస్సుకలిపి ధ్యానించెదరు. కొందరు మనస్సును సహస్రారమందుంచియోగము చేయుదురు. కొందరు యోగాభ్యాసములు చేసి మరి అఠయోగములు చేసి సిద్ధిబొంది, ఆనందించుచు సంతోషించెదరు. గనుక నీవు ఇవన్నీ విమర్శించి యివన్నీ యెరుకలోనివేయని గ్రహించి, ఈ బోధయందే ఉండుము. అనగా నేచేసిన సూచనద్వారా విచారించి. నీవు బయలైయ్యి రెప్పపాటులో సకంకాలమైనా యేమర్చియుండకుమని భావము.

**109 ॥ కొందరుముద్రలుగనవలెనందురు - మరికొందరధిక మందురు ద్రష్టన్ - కొందరు భజనెలెస్సని - యందురు యివియన్ని - యెరుకె - నని తెలుసుకొనుమీ - నీకివియాల - పనిలేదు వినుమీ - ముందూగ పరిపూర్ణమున్నాదిగని గుర్తు - నెందుండకుండ దాన్నెగరా గొట్టి తెజాలు - నని తెలుసుకొనుమీ నీకివియాల పనిలేదు వినుమీ ॥ 4**

తా॥ శిష్యా! ముద్రలనే యోగములయందు. అనగా భూచరి. కేచరి మధ్యము. షణ్ముఖి, శాంభవి ముద్రలందు కొందరుందురు, మరికొందరు ఆత్మయనే ద్రష్టే గొప్పదని దానియందే యుందురు, కొందరు నామసంకీర్తననే భజనే గొప్పదని ఎల్లప్పుడు భజనే చేయుచుందురు. యివి యన్నియు యెరుకేనని తెలుసుకొనుము. నాయనా వీట్లతో నీకు పనియేమీ లేదు. నీకుముందుగా పరిపూర్ణమున్నదని నీవెరిగి, అనగా గురువుగారు మితములో సూచన జేసిన బయలును గని, గుర్తును యెక్కడా లేకుండా దాన్నియెగరగొట్టుము. అనగా ఆ గుర్తును విడిచిపెట్ట, నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలైయుండుమని భావము.

**110 ॥ దేవుణ్ని నిన్నుయెరుగవు - నీవిప్పటికెట్టివారొనేదెల్పెదవీ - కేవెంత్రిబోధలెందుకు- కావున దేవుణ్నియిదిగొ - కనుగొనవోయీ - నామరూప - కర్మాలేవోయీ - నీవా దేవుని లోన వినులెస్సవెదకిన - న్నావాలి ముచ్చాటనడుగోయి తెల్పెద కనుగొనవోయీ - నామరూపకర్మాలేవోయీ ॥ 5**

తా॥ శిష్యా - దేవుణ్ని నిన్ను నీవెరుగవు. అనగా దేవుడు నామ. రూప, కర్మలు, ఏమీ లేని పరిపూర్ణ పరబ్రహ్మమని నీవు ఎరుగవు. నీవు నామ . రూపములు గల 25వదైన లేనెరుకనే ఈశ్వరతనువని నీవెరుగవు, గనుక దేవుని సంగతి నీ సంగతి నేను చెప్పెదను. నీకామతవములవారు చెప్పేవెత్రి బోధలెందుకు. ఆ బోధనీకవసరములేదు, గనుక దేవుడు యిదిగో చూడుము, పరిపూర్ణమై అచలమై అంతటా నిండి నీకుముందుగా బట్టబయలై 26వ తత్వమై మితములో ఉన్నది.

నీ విచారించి తెలుసుకొంటే. యిదే అంతటా ఉన్న బయలు, ఇదే దైవతత్వం, ఈ బయలులో 25వ దైన లేనెరుకనె ఈశ్వర తనువైన నీవు, ఏలాగున్నావో, విచారించి తెలుసుకొని, నన్నావల ముచ్చటడుగుము నేచెప్పెదను అని భావము.

**విశేషార్థము :** దేవుడనగా తాను బయలైన పరిపూర్ణము, నీవనగా ఆ బయలులో తనంతట తాను ఏర్పడివచ్చిన లేనెరుకనే ఈశ్వరతనువు, గనుక ఆ దేవుడైన బయలులో నీవెలాగున్నావో, విచారించి చూస్తే, ఆ బయలులో తనంతట తానే వస్తున్నది, ఆ వచ్చినదాన్ని విచారించి చూచితే, అనగా దహరాకాశసూక్ష్మ రంధ్రాంతర్గత చిన్మయ కుహర విరాజమానమై సర్వప్రకాశమానమై నిజానంద స్వరూపమైనదే యెరుక. అక్కడకు వెళ్లి దాని మొదలు చూస్తే చూచేది ఏమీ లేక బయలైనది, మళ్లా యెరుకగుచున్నది, మళ్ళా అక్కడకు వెళ్ళి విచారిస్తే, ఈ లేని యెరుక యేమీ లేకపోవుచున్నది. గనుక త్రికాలములయందు నీవు బయలైయుంటే. ఈ లేనెరుక ఏమీ లేకుండా పోవుననని అలా విచారించి. ఆవల విషయము నన్నడుగుమునేను చెప్పెదనని భావము.

**111 ॥ మానవుడు చేయబూనిన - దానినిలో తెరిగి చేయ దగునని మదిలో - నేనెరిగి నీకు జెప్పితి - పూనుము రుచి బుట్టదేని - పోనీనీ మనసూ - రుచిబుట్టితె - పూనూ నీ మనసూ - నేనేమి యనబోతెనీకేమి దోచూనో - లేని నిష్ఠూరాము లేకుండుటే లెస్స పోనీ నీమనసూ - రుచి బుట్టితె - పూనూ నీ మనసూ ॥ 6**

తా॥ శిష్యా! మానవుడు చేయబోయేపని లోతుగా విచారించి చేయవలెనని, అనగా ఈ పరిపూర్ణ బోధవలన జన్మరాహిత్యమౌనని నీకు నచ్చితేనే దీనిని అవలంబించుము, లేని యెడల మానుకొనుమని నేనెరిగి నీకు చెప్పితిని, అది నీకు సమ్మతమైతే చేయుము, సమ్మతము కాకపోతే మానివేయుము. నేనేదో చెప్పెదను, అనగా పరిపూర్ణ బోధ మంచిదని నేను చెప్పెదను. నీకు యింకోటి తోయ వచ్చును, లేని నిష్ఠూరము లేకపోవటమే మంచిది అందువల్ల నీకు ఎలా తోస్తే అలా చేసుకొనుము అని భావము.

**112 ॥ పంచాదశక్షరములప్ర - పంచము తానుద్భవించె ప్రణవాక్షరమం - దంచుశృతు లెన్నెదాన్నెరుకంచని నీవెరిగి యెరుగుమచలాము దీనన్ - నిల్పకు మెరుక-నచలా ములోనన్ - చంచాలమతి చాతచతురాక్షరెక్యావం - చెంచేదవెందుకు యిదినమ్మకె రుగామి - యచలాముదీనన్ - నిల్పకు మెరుక - నచలాములోనన్ ॥ 7**

తా॥ శిష్యా! ఓం కారములో నుంచి వచ్చిన యాభై అక్షరాలు. పంచభూతముల ఈ ప్రపంచమాయెను. అని శృతులు చెప్పుచున్నవి. ఆ ఓంకారమే

ఎరుకని ఎరుగుము, ఈ అచలములో ఆ యెరుకను నిల్పకు, చెంచెలమతి చేత, నీలోవున్న వికారము వలన నీమనస్సు నిర్మలంలేక ఆ ఓంకారమే యెక్కువని అనుకొనెద వెందుకు, దీనిని నమ్మక అచలమైన బయలు ఉన్నదని ఎరిగి, ఈ ఓంకారమైన యెరుకను విడిచిపెట్టి, నీవు అచలమై బయలై యుండుమని భావము.

**113 ॥ యెరుక జడమజడ మిాజడ - మరయగపరి-పూర్ణ మేమియనరానిదియా - యెరుక జగములస్థిరములు - పరిపూర్ణము శాశ్వతపుది - పాటించికనరా - కావారెండీ - పాటీవి వినరా -. గురుముఖమున వీట్నేనరుడూ గుర్తెరుగూనో - తిరిగి పుట్టడు వాడీధరపైమును పటివలె - పాటించికనరా - కావారెండీపాటీవి వినరా ॥ 8**

తా॥ శిష్యా! ఈ యెరుక జడముగాను, అజడముగాను యున్నది, జడమనగా కదలనిది, అజడమనగా కదిలేది, యెరుక ఒకప్పుడు కదలదు, ఒకప్పుడు కదులును. అనగా నాశనమయ్యేది నాశనము కానిదిగాను ఒకొక్క భావములో తెలుచున్నది, పరిపూర్ణములో యివి ఏమియున్నూ లేవని. విచారించి చూడగా పరిపూర్ణము ఏమిా అనదు, ఈ ఎరుక జగత్తులు రెండు అస్థిరములు. పరిపూర్ణము శాశ్వతమైనది, అనగా జీవేశ్వర్లు లేక అచలమైయున్నది, విమర్శించి చూడుము, ఈ రెంట్నీ విమర్శించి గురుముఖంగా ఏ మానవుడైతే వీట్ని గుర్తెరుగునో, వాడు అచలపరిపూర్ణుడై ఉండును, అనగా ఈ యెరుక జగములు ఒకప్పుడూ లేవని, పరిపూర్ణమున్నదని ఎరిగి, తాను పరిపూర్ణమైయుంటే, వాడు ఈ ధరప మునుపటివలె పుట్టడు అని భావము.

**114 ॥ కొందరు భూతములైదిటి - యందున చిత్తంబునుం తురధికములనుదున్ - కొందరు యేమియు లేదనియం - దురు గుర్తెరుగుమిన్ని - యపశబ్దములెరా - యివి నిలువావి - వని తెలియవలెరా - యందారెన్నన్నా వీకెందుకు బయలూను - ముందూగ గని గుర్తునెందుండ నివకవ్వి - యపశబ్దము లేరా యివి విలువాని - వని తెలియవలెరా ॥ 9**

తా॥ శిష్యా! కొందరు పంచభూతములే దైవమని చిత్తమును వాటి మిాదనే యుంచెదరు, యివే అధికమని చెప్పుదురు, కొందరు ఏమిా లేదురా అని అందురు, నా స్తికమతస్తులు దేవుడు లేడు ఏమిా లేదని చెప్పుదురు, యివి యన్నియు గుర్తెరిగినట్లైతే, యివి అన్నియు అపశబ్దములే అబద్ధములే, యివి నిలువవు అని తెలుసుకొనుము, యెందురు యెన్ని విధములు చెప్పిన, అవి నమ్మక ముందుగా బయలున్నది, అనగా యెరుక లేదు బయలున్నదని ఎరిగి, చూచి గుర్తనే యెరుకను యెక్కడా లేకుండా చేయుము, అనగా గుర్తెరిగే శరీరము యేమిా లేక నీవు బయలై ఉండుము, ఉన్నవన్నీ యపశబ్దములేనని అబద్ధములేనని భావము.

**115 ॥ కొందరు కర్మమునే హ - గందురు మరికొందరెక్కు వందురు తనువున్ - కొందరు ప్రాణములధికము - లందురు నీకిట్టివట్టి - యాశాలేమిటికీ - వారితోపొందు - జేశెవేమిటికీ యెందారిమాటాల నెన్నిన ఈ బోధ - కిందివెకాని పైకెక్కేవి గావిట్టి - యాశాలేమిటికీ - వారితో పొందుజేశువేమిటికీ ॥ 10**

తా॥ శిష్యా! కర్మ వలన పుట్టును, కర్మవలన చెడును. అందువలన కొందరు ఈ కర్మమే దైవమందురు. మరికొందరు తనువునే గొప్పగా జూతురు. కొందరు పంచప్రాణములే యధికమని యందురు, యిటువంటి ఆశలు నీకు వద్దు, నాయనా యిటువంటి వారితో నీవు స్నేహము చేయకు. ఏ బోధలైనా ఈ బోధకు, క్రిందివే కాని పైకెక్కేవిగావు, యిట్టి ఆశలెందుకు. వీరితో పొందునీకెందుకు, నీవు బయలై యెరుకను విడిచిపెట్టి, అచల పరిపూర్ణమై యుండుము, అని భావము.

**116 ॥ తనువెరుకలు రెండొక్కటి - యని యనరాదనుచు కొందరందురు భువిలో - తనువెరుకలలో నొక్కటి - గన రాకుంటేను రెండు - గనరావోయన్నా - రెండొక్కాటె - వినరామాయన్నా - అనుమానమికయాల అందారి మాటాలు - వినబోకనే బోదించిన రీతినెప్పుడు - గనరావోయన్నా - రెండొక్కాటె - వినారామాయన్నా ॥ 11**

తా॥ శిష్యా! తనువు యెరుకలు రెండూ ఒకటని అనరాదని, తనువు వేరు యెరుకవేరు రెండూ ఒకటికాదు అని కొందరనెదరు, అలాగైతే తనువును విడిచి దేహిదేహిని విడిచి తనువు ఉండవలెనుగదా, అలాగు యెన్నడు వుండవు, దేహిలేకపోతే దేహము ఎలాగుండును, దేహము లేకపోతే దేహి యెక్కడ వుండును, గనుక రెండూ ఒక్కటేనని తెలుసుకో, దేహి లేక దేహముండదు, దేహము లేక దేహి ఉండదు, ఒకటి లేకపోతే రెండూ వుండవు, గనుక రెండూ ఒక్కటేనని నమ్ము, అనుమానము పెట్టుకోక, అందరిమాటలు వినక, నేను నీకుసూచన చేసిన యుక్తి ద్వారా విచారించి, నీవు బయలై సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై యుండేవిచారణ మానవద్దని భావము.

**117 ॥కన్నుల ప్రక్కలవ్రేళ్లిడి - తిన్నగ భ్రూమధ్యమందు దృష్టినిలిపియం - దున్నదివెన్నెలలో బయలన్నా కనుమందురెరుకె - అది నిలువదోయీ - తనువుతొ బొయ్యేదని - దెలియుమోయీ - యన్ని తనువులు వచ్చి యరిగీనరఘుణ కాక - వున్నా బయలిది జూచి వుల్లక్కొరుకనుమాను - మదినిలువదోయీ - తనువుతొ బొయ్యేదని - తెలియుమోయీ ॥ 12**

తా॥ శిష్యా! కొందరు కన్నులప్రక్కను వ్రేళ్లతో నొక్కి, తిన్నగా భ్రూమధ్య మందు దృష్టియుంచి చూడుము అని చెప్పి, అందుకనుపించె వెన్నెల అదే లోబయలు అని అందురు, కాని అది నిలువదు, తనువుతో పొయ్యేది అని తెలుసుకొనుము,

యెన్ని తనువులు వచ్చినా, యెన్ని తనువులుపోయినా, కదలక మెదలక స్థిరముగా యున్న ఈ బయలును, చూచి విచారించి, నీవు బయలై లేని ఎరుకను విడిచిపెట్టు, అనగా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేకుండా చేసుకొని, నీవు ఎప్పుడూ బయలై యుండవలెనని భావము.

**118 ॥ జనులాత్మాను భవంబై - ననుముక్తిని పల్కిరిట్లు నమ్మకు మెరుకె -కనరా దెచ్చట గురుకృప - నను భవమెవ్వరికి పైన - ఆ మాటనిజమో - అనుభవముళ్ళ - క్కీ మాట నిజమో వినజెప్పుమీ రెండు వివరించి పైమాట - వినినే ముందరిబోధ వినిపింతువే వేగ - ఆ మాట నిజమో - అనుభవముళ్ళక్కీ = మాట నిజమో ॥ 13**

తా॥ శిష్యా! కొంతమంది జనులు ఆత్మానుభవమైతే చాలును, అని చెప్పెదరు గాని ఆత్మసాక్షాత్కారమెవరికి అవదు, అయినా అదే ముక్తి అని పల్కుదురు, ఆత్మ అన్నా యెరుక అన్నా రెండూ ఒక్కటే, సద్గురు కృపచే మేలుకుంటే, ఈ ఎరుకనే ఆత్మ ఎక్కడను కనపడదు, యిక ఆత్మసాక్షాత్కారమెవరికి, ఆ మాట నిజముకాదు, గనుక ఇక ఆత్మయనే అనుభవము ఎవ్వరికి, ఆత్మేలేదుగదా యిక అనుభవమెవరికి, ఆత్మ అనుభవము రెండూ శూన్యమే, రెండూ లేనివే ప్రత్యక్షమను మాట అబద్ధమే గనుక యివి విని కని నాకు చెప్పుము, అట్లు చెప్పినట్లైతే ఆపై విషయము ముందరి బోధ చెప్పెదనని భావము.

**119 ॥ తనను తాగనిన మోక్షం - బని పల్కిరిగాని జనులు అది నమ్మకు మీ - తనను తాబట్టబైటను - గనబోయితె తనకు దానె - కానరాదోయీ - విశ్వము తనకు - కానరాదోయీ - తననుంచైనది గనుక తాను విశ్వము రెండు - గనుపించు టు ళ్లక్కి - గావున తనకుదా - కానరాదోయీ - విశ్వముతనకు - గానరాదోయీ ॥ 14**

తా॥ శిష్యా! తనను తాను చూచుటయె తెలుసుకొనుట అదే మోక్షమని పలికి జనులు, అనగా తాననగా 25వదైన ఈశ్వరతనువు, అది కంటే మోక్షమని ప్రజలు పల్కిరి, యెరుకే తననుతాను బట్టబయలును చూడబోయినట్లైతే తనకుతానే కానరాదుగదా, ఈ విశ్వముకూడా కానరాదుగదా, అనగా తాను బట్టబయలై చూచినాడు గనుక తానులేడు, తన ద్వారా ఐనదిగనుక తాను విశ్వము, ఈ రెండూ కూడా బట్టబయలులో కనుపించవు, గావున ఈ విశ్వము తనువు ఉళ్లక్కి తెలుసుకొనుమని అనగా తాను విశ్వము రెండు లేవుగనుక నీవు సర్వకాలం బయలై యుండుమని భావము.

**120 ॥ మాయగదాలేని యహం - బాయగదా తన్నుదానె అచలముయేర్పాటాయగదా మాయనలేం - దాయగదా మాయచిత్ర - మాయగదోయీ - సంశయమంత - పాయగదోయీ - మాయాసమూలాము మాయజూస్తుండంగ - మాయమై పాయను- మాయాకెయిది చిత్ర - మాయగదోయీ - సంశయమంత - పాయగదోయీ ॥ 15**

తా॥ శిష్యా! మాయయేగదా లేని అహమాయెను, ఈ లేనిమాయ యైనెరుకే, తనకుతానైయున్నది, అచలము ఏర్పాటుగా ఉన్నదిగదా, మాయనగా లేనిదేకదా4, ఈ మాయకు ఇదియంతో చిత్రముగా దోచినది. ఎప్పుడైతే యిట్లు చిత్రముగా తోచినదో, అప్పుడే ఈ మాయ లేందని సంశయమంతా పోయినది, ఈ మాయసమూలముగా మాయ చూస్తుండగానే మాయమైపోయినది అని భావము.

**విశేషార్థము :** మాయనగా లేనిదని అనగా యా - మా - స - మాయ. య - అనగా యావన్తూ, మా - అనగా మాయ అని స - అనగా సమస్తము లేదు, అనగా ఏదైతే లేదో ఏదైతే కానరాదో అది మాయయని అర్థము, అనగా మాయలేందని అర్థమైపోయినది, కాని ఈ మాయ లేనిదే తోచబడుచున్నది, కాని ముందు భవిష్యత్తుల్లో లేదు, వెనుక భూత కాలమందు లేదు, ప్రస్తుతం వర్తమానకాలమందు ఉన్నట్లు కనిపించుచున్నది, ఐనా ఒకప్పుడు ఉండి ఒకప్పుడు లేదు గనుక, ఈ మాయ ఎప్పుడూ లేందని అర్థమైనది, మరియు ఈ లేని మాయ పరిపూర్ణములో తనంతట తానే తోచుచున్నది, విచారించినప్పుడు అనగా తాను బయలైనప్పుడు లేకపోవుచున్నది, అందువల్ల తాను సర్వకాల సర్వావస్థలయందు, బయలై అచలమయ్యే విచారణే చేసినప్పుడు, పరిపూర్ణమయ్యే వుంటాడు గనుక ఈ మాయ ఏమీ లేనని తనకే తెలిసి, ఈ మాయనే యెరుక ఏమీ లేకుండా పోయినది, యిక ఉన్నది అచల పరిపూర్ణమేనని బావము.

**121 ॥ లేనీయహమున్న బయలును - లేని ప్రపంచమును తనను లెస్సగతనలో తాను విమర్శించినయా - లేనివి లేకుండునవల - లేదూయే మాటా - యిట్లననైన - లేదు యేమాట - లేని యహమీ బైట లేనె లేదిది జూచి - లేనిది కలదాని లేని మాటాడేవు - లేదు యే మాటా - యిట్లననైన - లేదు యే మాటా ॥ 16**

తా॥ శిష్యా- లేని అహము ఉన్న యదార్థమైన బయలును, అనగా 26వ తత్వమై అఖండమై బయలు ఉన్నది, అందులో లేని అహమనే నేను యెరుక వచ్చినది, ఈ వచ్చినదాంట్లో లేని ప్రపంచము వచ్చినది, అనగా 24 ఇంద్రియములతో కలిసి తిరుగుచున్న జ్ఞాతే ప్రపంచం, తనలో తాను బాగా విచారించి చూచిన, అనగా తాను బయలై చూచిన, ఈ లేనివి లేకుండా పోవును, బయలే ఉండును, అనగా ఉన్న బయలులో లేని అహమనే నేను జీవుడనే ప్రపంచం తనలో తాను విమర్శించి చూచిన బయలే ఉన్నది, యిట్లు విచారించిన తరువాత లేదు ఏమాటయును, అనగా తనలో తాను విమర్శించుటనగా 25వ దైవ యెరుక తనమూలము తాను ఎరిగినప్పుడు, తానే లేకుండును, అంటే ధహరాకాశ సూక్ష్మరంధ్రాంతర్గత చిన్మయ కుహర విరాజ మానమై సర్వ ప్రకాశమానమై నిజానంద స్వరూప మైనదే యెరుక అక్కడకు వెళ్ళి చూచుటే తనను తాను చూచుట, అలా చూచినప్పుడు తాను అఖండమై అచలమై శుద్ధయెరుకై యుండును, అనగా 26వ తత్వమైన అఖండ పరిపూర్ణమై యుండును,

యిట్లు తాను పరిపూర్ణమై యుంటే ఏమీ అనుటకు లేదు ఏమాట. లేని అహము ఈ బట్టబయలులో లేనేలేదు. ఇది చూచి లేనిది ఉన్నదని లేని మాటలాడకుము అని భావము.

**122 ॥ పరిపూర్ణ మెరుకలెట్టివో - గురుముఖమున రెంట్ని లెస్సగురు తెరిగెరుకన్ - సరి పుచ్చుకొన్న మృషయని - పరిశుద్ధపు బోధయాది - పాటించికనరా - శివరా మూల - పద్ధతి యిదెరా - నరులు కొందరు బల్కి రెరుకానుమ్రింగి యీ - పరిపూర్ణమయ్యేమంచెరు గాక - చెడుటాకై - పాటించికనరా - శివరామూల - పద్ధతియిదెరా ॥ 17**

తా॥ శిష్యా! గురుముఖంగా పరిపూర్ణ యెరుకలను ఏలాంటివో, లెస్సగా విచారించి, అనగా పరిపూర్ణము ఏలాంటిదో, యెరుకనగా ఎటువంటిదో, గురుముఖంగా విచారించి ఎరిగి, అనగా పరిపూర్ణమనగా ఎరుకలేనిది అచలమై చలనము లేక 26వ తత్వమై యున్నది, అందులో లేనెరుక తనంతట తానుగా వచ్చి, చలనముతో ఇంద్రియ ప్రపంచ, మాయెను. అట్టి ఎరుకను విచారించి యెరుక యొక్క మూలమును ఎరిగే సరికి అనగా సముద్రములో వచ్చిన అలలు సముద్రములోనే కలసినట్లు తాను పరిపూర్ణములో తోచి, కొన్ని వికారములు పొంది, తిరిగి ఆ పరిపూర్ణములో లీనమై అచలమై యుండేసరికి, ఈయెరుక ఏమీ కనుపించకుండా పోయినది. అనగా ఎరుకను విచారించి, యెరుకను ఏమీ లేకుండా సరిపుచ్చుకున్న వెనుక, తానైన యెరుక పరిశుద్ధమై పరిపూర్ణమై అచలమై యున్నదని, శ్రీ శివరామ దీక్షితులవారు చెప్పిన మార్గమిదేయని శెలవిచ్చియున్నారు. ఇలా కాకుండా నరులు కొంతమంది యోగాభ్యాసములు జేసి వాయువును కుంభించి యెరుకను మ్రింగి వేసినాము, మేము పరిపూర్ణులమైనామని చెప్పుకొనుచున్నారు, చెడిపోవుట కొరకని భావము.

**123 ॥ బిందువు తనువున బుట్టును - బిందువు తనువింద్రియముల - బృందంబనువుల్- అందముగ గలుగునివిదే - నందున బుట్టినవౌ తెలియ - నజునికి తరమా - మూలములేని - వని తెలుసుకొనుమా - అందుకె బయలున్నదరసి మూలము లేని - బింద్వాది కంబూల పేరూదల్వకు తెలియ - నజునికి తరమా - మూలములేనివని తెలుసుకొనుమా ॥ 18**

తా॥ శిష్యా! బిందువు తనువు వల్ల పుట్టుచున్నది. ఈ బిందువు తనువు ఈ ఇంద్రియముల సమూహము, ఈ నేత్రములు అందముగా గలుగును, యివిదేనందున బుట్టినవౌ తెలియుటకు బ్రహ్మకైనా తరముగాదు, యివి అన్నియు మూలములేనివే అని తెలియనగును, అని తెలుసుకొనుము, అందుకే బయలున్నదని ఎరిగి, విచారించి తాను బయలై, ఈ బింద్వాదిసమూహము పేరు తలంచకుము, అనగా పరిపూర్ణమే అంతటా నిండి నిబిడీకృతమై యున్నది గాని ఎరుక ఉన్నదని అనరాదు వినరాదు, గనుక నీవు సర్వకాలం బయలైయుండుము అని భావము.

**124 ॥ జనులనిరిదేవుడెవరికి - కనరాడని నామరూప కర్మ జననముల్ - గనన తనికి లేవనియా - జనవాక్యము బయలు కెపుడు సహజమౌ వినరా - అనుమానము - ఛాళించికనరా - కని నామ రూపాదికములున్న యెరుకను - వినబోక కనబోక విడిచిపెట్టరపోనీ - సహజమౌ వినారా - అనుమానాము చాలించికనరా ॥ 19**

తా॥ శిష్యా! జనులు అంటున్నారు ఏమని దేవుడెవరికి కనుపించడని, నామరూప కర్మ జననములు, విచారించి చూచిన అతనికి లేవని, ఆ జనులే అనేటటువంటి మాట, ఆ బయలుకే చెల్లును, ఇందులో అనుమానమేమియును లేకుండా, ఈ బయలునుకను, కనుట అనగా తాను బయలౌట, ఇట్లు విచారించి నామరూప క్రియలు గలిగిన యెరుక వినబోకుము కనబోకుము, యిట్టి యెరుకను విడిచిపెట్టు. అనగా యెరుకను లేకుండా చేసుకొన్న పిదప, తాను బయలైన అచలమే యున్నదని భావము.

**125 ॥ అంతట గలదీయెరుకని - యంతోవాదింపుచుందురెరుగని వారల్-అంతట నిం తట గనుపడునంతటిదే కాని యెరుక - అంతట గలదా - అది నిజమైతే -యగు పడ వలదా - అంతాట గల దొక్క అచలమేకా నెరుక - నంతటా గలదాని యన రాదు - వినరాదు - అంతట గలదా - అది నిజమైతే - యగు పడవలదా ॥ 20**

తా॥ శిష్యా! యెరుకను విచారించి ఎరుగని వారు యెరుక అంతటా ఉన్నదని - వాదింపు చుందురు మరియు యెరుక పిండాండములో క్షరపురుషుండైన జీవతనువుగాను, బ్రహ్మాండములో అక్షరపురుషుండైన- ఈశ్వర తనువుగాను, బ్రహ్మాండాతీతములో పరమ పురుషుడుగాను ఉన్నదేకాని, అనగా ఖండాఖండములుగా ఉన్నదేకాని, అంతటా నిండి నిబిడీకృతమై లేదు, అనగా అంతట ఇంతట గనుపడునేగాని అంతటా లేదు, అంతటా నిండియున్నది ఒక్క అచలమేకాని, అచలముకాని ఎరుక చలనముతో యున్నయెరుక -అంతటా ఉన్నదని అనరాదు వినరాదు, అంతటా ఉన్నది శాశ్వతమైనది ఒక్క అచల పరిపూర్ణమే కాని యెరుక అంతటా ఉంటే అది విచారించినప్పుడు కనపడవలయునుకదా గనుక యెరుక లేందని బావము.

**126 ॥ బయలాకసమని కొందరు - భయపెట్టెదరందువలన భయపడకుసుమీ -బయ లందు శబ్దమున్నను - బయలాకశమను చునమ్మ - బడనినీచాతా - శబ్దము లేదీ - భ్రమయందు చాతా - బయలాకాశముగాదు - పరిపూర్ణమనినమ్మి - నయమూగ యెరుకాను నమ్మాక విడిచిపో - బడనీ నీచేతా - శబ్దము లేదీ భ్రమయందు చాతా ॥ 21**

తా॥ శిష్యా! అచలములో చెప్పిన బయలు తెలియక మనకు ఎదురుగా కనుపించే ఈ భూతాకాశమే బయలని చెప్పుచున్నారు, ఈ ఆకాశమైన ఈ బయలుకు శబ్దమున్నది గనుక ఇది పరిపూర్ణముకాదు పరిపూర్ణమునకు శబ్దములేదు. గనుక

ఇది ఆకాశమే అందువలన నీవు బయపడనవసరం లేదు యెందుకనగా బయలులో శబ్దముంటే ఆకాశమనుకో శబ్దము లేకపోతే పరిపూర్ణమనుకో ఈ విధముగా రెంటిని విచారించుము, మరియు బయలనగా శబ్దములేని పరిపూర్ణము అనగా నీవు విచారించి నీవు బయలైనదే పరిపూర్ణముగాని మనకు ఎదురుగా కనుపించే బయలునకు శబ్దమున్నది గనుక యిది పరిపూర్ణంకాదు. నీవు విచారించి బయలైనదే పరిపూర్ణము అనగా యెరుక లేనిది శాశ్వతముగా వున్నది పరిపూర్ణము అందువలన నీవు సర్వకాలము బయలై పరిపూర్ణమై యుండి ఈ ఎరుకను విడిచిపెట్టుము అని భావము.

**విశేషార్థము :** మనకు ఎదురుగా కనుపించే ఈ భూతాకాశమే అచలమని బయలని పరిపూర్ణమని చాలామంది అనుకొనుచున్నారు కాని ఈ బయలు సూచన కొరకే అనగా తాను బయలైన విధానము తెలిసి అతను బయలైయ్యి వుంటే ఈ బయలు లేదు ఆ ఎరుకాలేదు గనుక ఈ బయలుకు ఆ ఎరుకకు ఎంతమాత్రము బేధములేదు, రెండూ ఒక్కటే కానీ తాను బయలై మరల యెరుకవ్వకుండా వుండాలి అనగా తాను బయలై అచలమై పరిపూర్ణమై రెప్పపాటులో సకంకాలమైన ఏమర్చియుండరాదు. అనగా యేవూహ వచ్చి నా ఏ సంకల్ప మొచ్చినా శబ్దమున్నట్లు అనగా ఆకాశమేనని అర్థము నిశబ్దమైనదే పరిపూర్ణం అనగా తాను బయలై మరల యెరుక కలిగినట్లైతే అది ఆకాశమే అయినది అందువల్ల సర్వకాలం శబ్ద రహితమై ఏ వూహలు ఏ సంకల్పాలు ఏమీ లేనిదే బయలన్నా పరిపూర్ణమన్నా అని బావము.

**127 ॥ కలమేల్కలెరుక బయలుల - కిలసామ్యము జేసి చూడు మిభ్రమదొలగున్ -**
**ఫలమేమి పెక్కుచదువుల - వలనను జపయాగయోగ - వ్రతముల వలనన్ -**
**శమదమ మఖ - శతమూలకలనన్ - తలక్రిందుగా బద్ధ తనువునేగా నన్న -**
**కలమేల్కగని తానెక్కడ నిల్వనట్లైనె - వ్రతములవలనన్ - శమదమ మఖ -**
**శతముల్ళకలనన్ ॥ 22**

తా॥ శిష్యా! కలమేల్కలు ఈ రెంటిని. యెరుక బయలులను ఈ రెంటిని, వాటిని వీటిని విచారించి చూచుకో, అనగా కలలో తోచిన శరీరాలు మేలుకొంటే ఏమీ లేవు. అంటే కలలేంది మేల్కవున్నది. ఇలాగే యెరుక చేసిన సంకల్పములు వికల్పములు నీవు బయలైనప్పుడు లేవు, అనగా మేలుకున్నప్పుడు కలలేదు, కలలో తోచిన శరీరములులేవు, అలాగే తాను బయలైనప్పుడు యెరుకలేదు, యెరుక చేసిన సంకల్పములు వికల్పములు లేవు, అనగా కలలేదు మేల్కవున్నది, యెరుకలేదు బయలు వున్నది, ఈ విధముగా విచారించి చూడగా, నీకున్న భ్రాంతి పోయినది. గానీ ఎన్నో గ్రంధములు చదివినా భ్రాంతి పోదు, అందువల్ల ఫలితమే మున్నది, గనుక ఈ చదువులవలన యాగముల వలన యోగముల వలన. వ్రతములవల్ల, శమము దమము యిలాంటివి వందలకొలది చేసినా. ఏమీ ఫలితము లేదు, తలక్రిందుగా బద్ధ. అనగా తలక్రిందకి బెట్టి తపస్సు జేసినా యేమీ ఫలితము లేదు, మరియు తనువునేనుగాను నేను సర్వసాక్షిని అన్నా, ఏమీ ఫలితము లేదు. మరియు

కలమేలుకొంటే కలలో తోచిన శరీరాలు యెక్కడైనా కనిపించినవా, అలాగే యెరుక బయలైతే, అనగా తాను బయలైతే యెరుక యెక్కడైనా కనిపించినదా, కనిపించలేదు, ఈ విధముగా యజ్ఞాలు యాగాలు చేస్తే అవుతాదా, యెన్నడు అవదు, అనగా యెరుకపోతాదా యెన్నడు పోదని భావము, అనగా అఖండ యెరుక వుండేదే మలిన యెరుక ఒకప్పుడు వుండదు. కానీ వున్నట్టు తోచేదే గాని విచారించి చేస్తే ఎన్నడు లేనేలేదని భావము.

**విశేషార్థము :** కలను మేలుకుంటే కలాలేదు కలలో చూచిన వస్తువులులేవు, అలాగే ఎరుక బయలైతే యెరుకలేదు. యెరుకకు తోచిన వస్తువులు లేవు, అనగా తాను బయలైనప్పుడు తానూలేడు తనకు తోచిన వస్తువులు లేవు, మేల్మైన బయలే ఉన్నది, అనగా గురుసూచన ద్వారా విచారించి తాను బయలైతే యెరుక ఏమీ లేకపోయెను, అనగా యెరుకే బయలై పరిపూర్ణమై యుండెనని భావము.

**128 ॥ నీ కలలో నినునన్నును - లోకుల లోకముల జూచిలోపలి భ్రమచే - నా కరుణ బడసిమేలుక - చేకొని కనికలకల్లజేసి - చేరెద వెటకో - సర్వమునీతో చేరీని యటకో - ప్రాకటముగ బట్టబయలెరుక లీరీతి - నీకు దెలిసిన మీద నిలువాక వేవేగ - చేరెదవెటకో సర్వమునీతో చేరీ నియటకో ॥ 23**

తా॥ శిష్యా! నీవు నీ కలలో నిన్నును నన్నును లోకులను చూచి, లోపల భ్రమచేయుట, అనగా అనేక సంకల్పాలు అనేక భ్రమలతో వుండిన నీవు నాదయ వలన ఈ కలను మేలుకొని, అనగా కలనే యెరుక లేందని మేల్కనే పరిపూర్ణమున్నదని తెలుసుకొని, ఈకలను కల్లజేసి చేరెదవు యటకో, సర్వము నీతో చేరును యటకో, అనగా నీవు నీకు తోచిన కలనె యెరుక యెక్కడ లేకుండా పోయెను. పరిపూర్ణమైన బట్టబయలు శాశ్వతముగా ఉన్నదని, యెరుక యెరిగిన, అనగా ఈ రీతిగా నీవు తెలుసుకొనిన మీదట, అనగా నీవు బయలై యెరుక మరుపలు లేనివని నీకు తెలిసిన మీదట. నిలువకుండా పోవును యెటకో, అనగా కలయనే యెరుక మరుపనే జీవుడు సర్వములేకుండా పోయెనని తెలుసుకొని తాను బయలై యుండెనని భావము.

**129 ॥ హరికరనఖముఖవిదళిత - కరిమస్తక గళితమైన ఘనమౌక్తికముల్ - దొరికిన నెరుకలు గురిజలె - ధరియింతురు రెంటివిలువ - తమ రెరుగకనెకా - అట్లనెబోధ-క్రమమెరుగకనె కా - పరిపూర్ణబోధను యెరిగింపుచుండీన - యెరుకాకె-కొందరు మరిగేరీ మర్మాము - తమరెరుగకనెకా - అట్లనెబోధ - క్రమమెరుగకనెకా ॥ 24**

తా॥ శిష్యా! సింహము తనగోళ్ళతో ఏనుగు యొక్క కుంభస్థలమును బ్రద్దలు గొట్టి, మెదడు తినేటప్పుడు దానినోటినుండి జారిక్రిందికి పడిపోవును, మంచి ముత్యములు, ఆ ముత్యములు అడవిలో ఉండే ఎరుకల వాండ్లకు దొరుకును.

కాని ఆ మంచి ముత్యములు యొక్క విలువ, ఆ యెరుకల వాండ్లు యెరుగక, గురు విందపూసలతో కలిపి ధండగా గుచ్చుకొని, మెడలో దరియింతురు, ఈ రెంటి విలువ తెలియకనే కదా, అనగా గురివింద పూసలు యొక్క విలువ ఎంతో, ఆ మంచి ముత్యములు యొక్క విలువెంతో, తెలియకనే కదా గురివిందపూసలనే ఎక్కువగా ధరియించెదరు, అలాగే పరిపూర్ణబోధ చెప్పుచున్ననూ దాని విలువ తెలియకనేకదా, కొంతమంది యెరుక బోధకె మరిగితిరి అనగా పరిపూర్ణబోధ తనను లేకుండా జేసి జన్మరహితము చేసేదనియునూ యెరుకబోధ తనను వుంచి చెప్పేదేనని యును తెలియకనేగదా, యెరుక బోధకె మరిగితిరి, ఈ రెంటి తారతమ్యము విలువ తెలియకనేకదా, యెరుక బోధనె గొప్పగా చూచితిరని భావము.

**విశేషార్థము** : పరిపూర్ణ బోధ యొక్క క్రమమెరుగక యెరుక యొక్క బోధకె మరిగేరు కొందరు ఎలాగనగా పరిపూర్ణ బోధ యొక్క క్రమమనగా పరిపూర్ణ బోధ ఎరిగిన సద్గురు మూర్తిని ఆశ్రయించి ఆయనకు అనుగుణ్యముగా సేవలు జేసి సంతోషము గలిగించి ఆయనవల్ల గురుసూచననే యుక్తి సంపాదించి ఆ యుక్తిని విచారించి తాను బయల్యే విధానము గ్రహించి తాను మరల పుట్టకుండా విచారించి తాను బయల్యే వుండేలాగు విచారించుచూ రెప్పపాటులో సగంకాలమైనా మరువకతాను అచలమై పరిపూర్ణమై యుంటే కలనే ఏరుక ఎల్లప్పుడు వుండదని ఎరుగవలెనని భావము.

**130 ॥ తనువే బహి రింద్రియములో - మనసోప్రాణములో విషయనుమతోనేనం - చని నీవనియన ఏ దియని - యనుమానించెదవదేల - అదిత్రోవగాదు - నీవెన్నాడు - యిది వినలేదా - వినుమీ పరిపూర్ణముగని లేనియామీది - తనువాదికముసు- లేందని గురువిచె దెలియు -మదిత్రోవగాదూ -నీవెన్నాడు -యిది వినలేదు ॥ 25**

తా॥ శిష్యా! తనువని యింద్రియములని మనస్సని, ప్రాణములని విషయములని నేనని నీవని అనునిదియని, అనుమానించుటము నీకెందుకు, అదిత్రోవగాదు, యిది నీవెన్నడు వినలేదు, నేను చెప్పేది వినునాయనా, పరిపూర్ణము అంతటానిండి నిబిడీకృతమైయున్నదాన్ని చూచి తెలుసుకొని, అనగా నీవు బయలైయ్యి అచలమైయ్యి పరిపూర్ణమయ్యి యుండి, లేని తనువాదికములను లేనివని నమ్మి గురుని ద్వారా విచారించి తెలుసుకొని, ఈ తనువాదికములను అన్నింటిని విడిచిపెట్టుమన్ని, అనగా మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు గనుక నీవు బయలై యుండి దీనిని విడిచిపెట్టుమని భావము.

**131 ॥ నినునను ప్రపంచమును జగ - మని యెరిగే యెరుక చాతనవలమును గనుంగొని- వినునను జగమును జగ-మని యెరిగె యెరుకమాను - మమలావివేకా - చాలునీవి క్రమ మెరిగి నాన్నా - నిను నన్ను పైరెండింటిని విశ్వమనక బయలన కుండెదు- న్నా దంచన గుర్తులేకుండు-మమలావివేకా-చాలునీవి - క్రమమెరిగినాన్నా ॥ 26**

తా॥ శిష్యా! నిన్ను, నన్ను జగమని ప్రపంచమని ఎరిగి విచారించి, చలనములేని స్థితిని గని, నినునను జగమని ఎరిగే యెరుకను విడిచిపెట్టుము. మాలిన్యములేని జ్ఞానముగలవాడ. నీవీక్రమము నెరిగి అచలమై యుంటే చాలు. నీవని గాని నేననిగాని విశ్వమనిగాని బయలని గాని ఏ వూహలు లేనిది ఉన్నదనే గుర్తులేక ఉత్తదైబట్టబయలై అఖండానుభవరహితమై అశరీరమై యుండుమనీ భావము.

**విశేషార్థము :** ఇన్నిటిని ఎరిగేయెరుకను మాను, మలినము లేని వివేకము గలవాడ, చాలు నీవీ క్రమమెరిగినాన్క అంటే ఎరిగే యెరుకను విడిచిపెట్టుటయనగా యెరుక యెక్కడ ఉన్నది అని విచారించగా అంగుష్ఠ మాత్రములో అష్టదళ కమలమధ్యమున పీతవర్ణములోపల శ్వేత వర్ణమైనదే యెరుక, అదే మూలములేని గుర్తెరిగే శరీరం, దీన్ని ఏమీ లేకుండా చేయవలెను, అంటే మనం ఆ యెరుక ఉన్న స్థానమునకు వెళ్ళి. ఆ యెరుక మూలము నెరిగితే, ఆ యెరుకకు మూలము లేదు. అనగా బయలైయున్నది. యెరుక యొక్క స్వరూపమె ఆకాశం. ఆయాకాశమునకు బయలాంశమె స్వరూపం. మరియూ 56వ కందార్థములో అఖండం బగు యెరుక రూపు గనరామాతండ్రీ అంటే యెరుక యొక్క రూపము బయలు ఆ బయలునుగను అనగా బయలును గనుట అంటే తాను బయలౌటే కనుటయని అర్థము. అందువల్ల నీవని నేనని ఎరిగే యెరుకే బయలైనది గనుక ఆ బయలుతో యిక దేనిని ఎరుగనిదని భావము.

**132 ॥ ప్రొద్దున నిద్దురమేల్కని - వద్దికియే తెంచి గురుని వక్రజనితమౌ - సుద్దులు మ్రొక్కి - వినుము యే - ప్రొద్దిది బహుముద్దు నుమ్మి - పుట్టినందు లకూ - గురుచరణాము - పట్టినందులకూ - నిద్రామౌ భక్తిచె నీవిట్లు జేసితె - దిద్దితీరిచి బోధతెరువూజూపును నీవు - పుట్టినందులకూ - గురుచరణాము పట్టినందులకూ ॥ 27**

తా॥ శిష్యా! నీవు ప్రొద్దున నిద్దురమేల్కొని అజ్ఞానమును చీకటి నిద్ర ఈ మూడు సమానం, జ్ఞానము మెలుకువ వెలుతురు, ఈ మూడు సమానం. గనుక అజ్ఞానమనే నిద్ర నుండి మేల్కొయనే బయలును పొందవలెను, గనుక నీవు మరువక గురుని యొద్దకు ఏ తెంచి, గురుసేవ భక్తితో చేయుచు, గురువుగారికి అనుగుణ్యముగా కావలసిన సేవలు నీవు చేయుచుంటే, గురువు గారికి నీయందు కరుణ గలిగి, గురుబోధనే సూచనజేసి, ఆగురుయుక్తి చెప్పును. దాని వలన నీకు సమస్తమూ తెలియబడును, అనగా గురుత్వమును చూచి, గురుమూర్తి చెప్పిన గురుబోధను శ్రద్ధగా విని, ఆ బోధ యొక్క సారాంశము గ్రహించి. నిముషమైనా మరువక విచారించుటే ముద్దు, యిదే నీవు పుట్టినందులకు, గురుచరణములు పట్టినందులకు, గురుభక్తి గురుసేవ గురునిష్ట ఏ ప్రొద్దుమరువకుండా, యిట్లు నీవు చేయుటవలన, గురు బోధయొక్క మరుగు తెరవు జూపునునీకు అనగా నీవు

సర్వకాలం బయలై యుంటావు అని భావము. యిందుకు రామయోగి కందార్థము

కం॥ తెలవారి నిదురమేల్కని - సలలిత నిజవస్తుజనిత స్వానుభవోక్తుల్ - తెలియుచు మదిసత్కుశలత - గలిగి ప్రవర్తించు జన్మ - గలిగినందులకూ సద్గురు పదము పట్టినందులకూ - కలకలేని భక్తి సలిపి నీ విటుశాయ - తెలిపిన మద్బోధ ఫలము నీకు జూపు గలిగినందులకూ - సద్గురు పదము పట్టినందులకూ ॥

తా॥ శిష్యా! నీవు సద్గురుపాదము పట్టినందుకును, జన్మమెత్తినందుకును, తెల్లవారగనే నిదురలేచి, పరిపూర్ణస్వానుభవమును దెలియుచూ, కలంకములేని గురుభక్తిని గలిగియుంటే, నేను నీకు జేసిన పరిపూర్ణ బోధ, ఫలమును బొందెదవని భావము.

**133 ॥ గురుడు పరిపూర్ణమునుజూ - పెరుకను లేందనుచు దెల్పియిక దల్చకు మం - చెరిగించక విడిపోవునె - యెరుకనరులే సాధనములు - యన్నిజేసిననూ - లక్ష్యముద్ర - లెన్ని జూచిననూ - హరిహరబ్రహ్మామరాసుర ముఖులైన - ధరణీసురాద్యష్ట దశ జాత్యుద్భవులాను - యెన్నిజేసిననూ - లక్ష్యముద్ర - లెన్నిజూచిననూ ॥ 28**

తా॥ శిష్యా! 25వదైన ఈశ్వర తనువైన యెరుక రహితమైన తరువాత, వున్న అచలపరిపూర్ణమును గురుడు జూపించి, యీ యెరుకను యికదలంచకు, దానిని విడిచిపెట్టుము, అని సద్గురుమూర్తి సూచన జేసి గురుయుక్తి చూపించి, చెప్పకపోతే నరులు ఎన్ని సాధనలు చేసినా, లక్ష్యముద్రలు ఎన్ని జూచిన, యెరుక విడిచిపెట్టదు, అనగా గురుయుక్తి ద్వారా విచారించి, తాను బయలై యుంటేనే, యెరుక విడిచిపెట్టునుగాని, లేకపోతే ఎటువంటి వారికైనా యెరుక విడిచిపెట్టదు, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులైనా, ముప్పైమూడుకోట్ల దేవతలైనా, ఎవరికైనా యెరుక విడిచిపెట్టదు, సద్గురుమూర్తి జూపిచెప్పనిదే యెరుక విడిచిపెట్టదు, సద్గురుమూర్తి చెప్పిన గురుసూచననే యుక్తద్వారా విచారించి, యెరుకను ఏమీ లేకుండా చేసుకొన్నవారికే, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేకుండా పోయి విడిచిపెట్టునని భావము.

**విశేషార్థము :** సద్గురుమూర్తి అయితే గురుసూచన చేసేసరికి తాను బయలై పరిపూర్ణమై యుంటాడు. యెరుక యేమి లేక పోవును గనుక సశ్శిష్యుడైతే యెరుకను యింక తలంచడు అనగా యెరుకను యిక పుట్టకుండా విచారించును. అనగా యెరుక ఒకప్పుడు పుట్టినా వెంటనే తాను బయలౌను ఇలా విచారించును. ఈ విచారణ రెప్పపాటులో సకం కాలమైనా యేమర్చియుండుడు అందువల్లతాను పరిపూర్ణుడై యుంటాడని భావము. యిందుకు రామయోగి కందార్థం

కం॥ యెరుకచే పరిపూర్ణమునిది - యెరుగుండు మటంచు చూపి - యెరుకను తనచే బెరికి కడవైచిబ్రో చెటి - గురుడే సద్గురుడు కానీ కుంభినీలోనూ - యెరుకను నిల్పే గురుడెందుకికనూ - స్థిరముగ నిజదివ్య కరకమలమందున- యెరుక దొలిగించేటి- బిరుదు గట్టిన - గురుడే కుంభినీలోనూ - యెరుకను నిల్పే గురుడెందుకికేనూ ॥

తా॥ శిష్యా! పరిపూర్ణమిట్టిదని చూపి యెరుకను అంకురము లేకుండా పాగొట్టే బిరుదును కరమందు గట్టిన గురువే సద్గురువుగాని యెరుకను బోధించే గురుడెందుకు పనికిరాడు, అట్టి వారి సాంగత్య మెన్నటికిని, కూడదు వారు చెప్పే మాటలను వినకూడదని భావము.

**134 ॥ బలధనవిద్యాధైర్యం - బులు చక్కదనంబు సత్యబుధ్యాద్యుతులనే - కలలో యివి లేని మను-ష్యుల జగమును తనను తాను - జూచి మానవుడూ - మేల్కొనెనేని - చూడాలేడొకడూ - కలమేల్కొ లెరుక బయలుల కట్ల జతగూర్చి - కలయెరుకలను దేశికులచె - ఏడితెజాలు - చూచి మానవుడూ - మేల్కొనెనేని - చూడాలేడొకడూ ॥ 29**

తా॥ శిష్యా! బలము ధనము విద్య ధైర్యము చక్కదనము సత్యబుద్ధి జగము తనను తాను కలలోచూచి మానవుడు యివన్నీ నిజమనుకున్నాడు ఈ కలమేలుకుంటే ఈ కలలో చూచినవి ఒకటీచూడ లేకపోయెను ఓహో యిది కలని అనుకున్నాడు మరియు కలమేల్కొయెరుక బయలు అట్లు జత చేసి తెలుసుకొని అనగా యెరుక ఎన్నో విధములుగా తోచేను ఆ యెరుక మేల్కొనే బయలును చూచే సరికి తాను బయలైయుండెను గనుక కలయెరుకలను సద్గురుని ద్వారా విచారించి తాను బయలై యెరుకను విడిచిపెట్టితే చాలు, యెరుక ఏమీ లేకుండా పోవునని భావము.

**విశేషార్థము :** కలలో చూచిన వస్తువులు మేలుకున్న తరువాత ఆ కలలో వస్తువులు ఒకటి కనుపించలేదు, అలాగే యెరుక తోపించిన వస్తువులు తాను మేల్కొన్న బయలులో ఒక వస్తువు కనుపించలేదు. అనగా కలమేల్కొ యెరుక బయలు యివి విచారించి చూడగా మేల్కొలో కలలేదు, బయలులో యెరుక లేదు, గనుక సద్గురుమూర్తి ముఖతావిచారించి కలయెరుకలను విడిచిపెట్టితే తాను పొందిన మేల్కొయను బయలే యున్నదని భావము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే సకల మత లక్షణన్నామ సప్తమో ధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము**



# ☆ 8 .పరిపూర్ణ బోధ. 26 ☆

135 ॥ యీ ఉత్తబట్ట బయలును నీవిప్పుడు వుండజూచి నిజముగ యెరుకన్ - నీవని
నేనని జగమని - భావింపుము పిదపదీన్ని - బాయుమని శమున్ - నిజముగదీన్ని-
బాయక నిశమున్ - శ్రీవని తేశరాజీవ సంభవ భవ - దేవేంద్రాదుల నింకసేవించు
తలుపేల - పాయూమ నిశమున్ - నిజముగ దీన్ని బాయకనిశమున్ ॥ 1

తా॥ శిష్యా! నీయాత్మనె యెరుక ఉత్తదై బట్టబయలై యున్నదో లేదో ఆ స్థితిని వుండజూడుము, ఆ స్థితిలో యెరుక ఎలా ఉన్నదో, సంకల్ప వికల్పములు తోపించుచున్నదో, లేక వూరుకున్నదో, లేక నీవని నేనని ఎరుగుచున్నదో, దానిని బాగా విచారించి ఎరిగి, దానిని విడిచిపెట్టుము, యెరుకను విడిచిపెట్టకపోతే నీకాస్థితి కుదురదు, గనుక నీవు ఉత్తబట్టబయలై అచలమై చలనము లేని స్థితిని విడిచి పెట్టకుము, సర్వకాల సర్వావస్థలయందు ఈ స్థితిలో ఉండవలెను. అలా ఉండక సర్వకాలముల యందు యెరుకతోనే ఉండిన యెడల నీకాస్థితి కుదరదు. గనుక యిక నీవు బ్రహ్మ విష్ణు మహేశ్వరులని గాని ముప్పై మూడు కోట్ల దేవతలని గాని ఎవరిని సేవించ వలసిన పనిలేదు, ఆ తలంపునీకెందుకు, నీవు సర్వకాల సర్వావస్థలయందు, యెరుకను విడిచిపెట్టి, నీవా స్థితిని విడిచిపెట్టకు, యిక యెరుక మాట తలంచకుమని భావము.

**విశేషార్థము** : ఈ ఉత్తబట్టబయలును నీవిప్పుడు ఉండజూచి, అంటే నీ ఆత్మ అయిన యెరుక ఉత్తదైనాదా, లేదాయని నిదానించి నిలభూడవలెను, అనగా సంకల్ప వికల్పములు పొందుచున్నాదా లేక నీవని నేనని ఎరుగుచున్నదా, వూరుకొని ఉత్తదైయున్నదా, అని నిలచూడవలెను, మరిసంకల్ప వికల్పములు పొందుచుంటే, నీవు మరల బట్టబయలు అవ్వవలెను, యెరుక పుట్టకుండా వుండవలెను. గనుక నీవెప్పుడు. బట్టబయలై ఇట్లు చేయవలెనని భావము. యిందుకు రామయోగి 85వ కందార్థం

కం॥ బట్టబయలందు నిప్పుడే ఘట్టిగనీవుండి - లెస్సకని యెరుకలెసన్ బుట్టును
నీవని నేనని గుట్టుగ నీవెరిగి యెరుక కోల్పెట్టు తండ్రీ - యామరకుమీ పట్టు
మా తండ్రీ మట్టులేని బ్రహ్మ విష్ణీశులను గొల్చు - నట్టి వింభ్రమ లెల్ల చిట్టచివరకు
నంటి కోల్పెట్టు తండ్రీ - యామరకు మీ పట్టుమా తండ్రీ ॥

తా॥ శిష్యా! తనయా నీవిప్పుడే పరిపూర్ణము నందుండి, పుట్టునవి గిట్టునవి దేహి దేహములేనని ఘట్టిగా తెలుసుకొని, ఎరుకను పొగొట్టుము, ఈ పట్టునే మరవద్దు, బ్రహ్మ విష్ణు రుద్రాదులను గొల్చుభ్రమలను బొత్తిగా విడిచిపెట్టి, యూరకుండుమని భావము.

136 ॥ లేదనకు మున్నదదుగో - నే దెలిసితిననకు దీన్ని నీ వెరిగేవా - కాదదినీచే దెలి యను - యెదిర తన్మాత్ర సమితి యీ బట్ట బైటా - దీనికి సాటి - దేది యెవ్వేటా- వాదేలనే నెరుకతే దీన్నిగనిపెట్టి - పోదట్టు - మెరుకనం - కేది బట్ట దువాలు- యీ బట్టబైటా - దీనికి సాటి - దేదీ యెవ్వేటా ॥ 2

తా॥ లేదనకుము వున్నదదిగో మనకు ఎదురుగా మితములో వున్నబయలు చూడుము యింత మాత్రమున తెలిసినదనుకోకు దీన్ని విచారించినీ వెరిగేవా యిది కాదు నీ విచారించితే నీకు తెలియును నీకు తెలిసిన బట్టబయలుకు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములున్నవాలేవు కాని యెరుక ఆ బట్టబయలులో తోస్తూనే ఉంటాది దాన్నీ వెరిగేవా నాకు తెలిసిపోయినదనుకోకు నీవాస్థితిని వదిలిపెట్టకు నీవాలా విచారించుచుంటే నీకు తెలియబడి ఉత్తబట్ట బయలైయ్యి అచలమై వుంటావు చలనము లేని స్థితికి తన్మాత్రలున్న వా ఆ బట్టబయలుకు సాటైనదియింకోటివున్నదా నీకు నాకు వాదమెందులకులే నెరుకనే ఈశ్వరతత్వముతోనే దాన్ని కనిపెట్టి అలా విచారించితే నీవ ఖండమై అచలమై వుంటావు యిది పోయేదికాదు యిది శాశ్వతముగా వుండేదే ఒట్టు ఈ లేనెరుక వుండేదికాదు పోయేదే యీ బట్టబయలుకు యింకేదీ పుట్టదు గనుక నీవు సర్వకాలం బయలైయుండుము చాలు అని భావము.

**విశేషార్థము :** ఈ అఖండ స్వరూపమైన యెరుకను లేదని యనకు బయలైయున్నది అదుగోచూడుము నాకు తెలిసినదనకు దీన్ని నీవెరిగేవా నీ విచారించి తెలుసుకుంటే అది బయలై అచలమై పరిపూర్ణమై నీకు తెలియబడును ఆ తెలిసిన బయలకు తన్మాత్రలున్నవా బట్టబయలుకు తన్మాత్రలు ఎన్నడులేవు దీనికి సాటైనది యింకోటున్నదా ఏదీలేదు వాదమెందుకు 25వ తత్వమైన లేనెరుకతో దాన్ని కనిపెట్టిచూడు ఈ యఖండ యెరుక పోదువట్టు లేనెరుక యికపుట్టదని నీవు సర్వకాలం బట్ట బయలైయుండుము చాలు అని భావము. యిందుకు రామయోగి కందార్థం

కం॥ లేనిది యెతుకనకిదిగో - నేనిప్పుడు తెలిసి తనకు నీవెరిగేవా - కానగరాదని
నీచే కానగ వచ్చేది బయట కనుపడవలదా - లేనిదిగనుక లేనెలేదుగదా-
పూనియెదిరించకు దేని నెంచకు యెరుక మానినవే జోలిమానీ మింతే చాలు
కనుపడవలదా - లేనిది గనుక లేనే లేదు గదా॥

తా॥ శిష్యా! పరిపూర్ణము లేదని చెప్పవద్దు వున్నదదిగో చూడుము నాకు తెలియునని చెప్పకుము నీకు తెలియుట కది సాధ్యపడదు దానియందు శబ్దము గాని స్పర్శముగాని రూపముగాని రసముగాని గంధముగాని యింకా రజో గుణముగాని సత్వగుణముగాని తమోగుణముగాని మితిమీరలుగాని లేని దిగనుక దానికి సాటి యేమున్నది దానికి సాటిలేదు శుద్ధ యెరుకచే నట్టి పరిపూర్ణమును దర్శించి నీ మాయ

ఎరుక నెక్కడను నుండనీయక పారదోలుము నిన్నునే వృత్తియునంటనేరదని భావము.

137 ॥ కనవచ్చి యిట్టి దట్టిది - యనియనరాకుండు బయలు నదె కనుగొను మీ - కనరాకపోతె శూన్యం - బనుమిట్టిది యట్టి దనుచు - పలుక వచ్చిననూ - యెరుకదాంట్లో - పలకి జొచ్చిననూ - వినుమా బయలును - నీరేమనినా నొప్పె దగ - నొప్పను నీ మాటనునే - జెప్పిన రీతి గనవస్తె - పలుక వచ్చిననూ యెరుక - దాంట్లో పలికే జొచ్చిననూ ॥ 3

తా॥ శిష్యా! నీకు బయలు కనవస్తాదికాని యిట్టిదని అట్టిదని అనరాకుండా ఉండేదే బయలు, దాన్నెకనుగొనుము నేచెప్పిన ప్రకారంగా కనరాకపోతే శూన్యమను లేదా నీవు బయలైన స్థితిలో, యిట్టిదని అట్టిదని పలుకవచ్చిననూ, ఎరుక దాంట్లో పలుకవచ్చిననూ, వినుము బయలును నీవేమనినా నేనొప్పుకోను, అసలే ఒప్పుకోను, నీవు విచారించే విచారణ నేచెప్పిన రీతిగా విచారించి బట్టబయలై అచలమై ఉంటే యెరుక అందులో పలుకవస్తే నన్ను అడుగుమని భావము.

138 ॥ కనవొచ్చు బయలులేదని - యనవచ్చునెయిట్టి దట్టిదనవచ్చునెఛీ - యనరాదు యెరుకకెన్నడు - కనుకనెయీ బయలు - యెల్లకాలముంచుందీ - దీనందెరుకే- కాలాము లేందీ వినుమీ - లేనెరుకాను విచరించ - శూన్యమౌ- అనుమాన మేమె రుకగను - విశ్వమట్టిదే - కాలాముంచుందీ - దీనం దెరుకే - కాలాములేందీ ॥ 4

తా॥ శిష్యా! నీకు బయలు కనవచ్చును, లేదని యనవచ్చునా, అనగా కనరాదని యనవచ్చునా, యిట్టిది అట్టిది అని అనవచ్చునా-ఛీ-యనరాదు ఎరుక యెన్నడు లేదు, గనుకనే ఈ బయలు సనాతనమైనది యెల్లకాలములయందు ఒకే తీరుగా యున్నది, దీనియందు యెరుక ఏకాలములోను లేదు. వినుములేనెరుకనే 25వ తత్వాన్ని విచారించగా శూన్యం, ఏమీ లేదు విశ్వము కూడా అట్టిదే, నీకేమైనా అనుమానముంటే విచారించి చూడము, యిందులో తోచిన 24 ఇంద్రియములనే ప్రపంచం అసలే లేదని భావము.

139 ॥ పరిపూర్ణమనినయెట్టిదౌ - యెరిగెదనని యెరుక బైటకేగిన యెరుకె - యెరుకకు శూన్యబయ్యెను - యెరుకను జన్మించినట్టి - ఈవిశ్వమంత - యెరుకవలెనె - యేమీ లేదంతా - యెరుకావుండంగానె యెరుకా విశ్వములులే - వెరుకా కెయిది జూడయెంతో వింతై తోచె - యీ విశ్వమంతా - యెరుకవలెనె - యేమీ లేదంతా ॥ 5

తా॥ శిష్యా! ఈశ్వర తనువైన యెరుక పరిపూర్ణమైన 26వ తత్వం ఎలాగున్నదో చూద్దామనే ఉద్దేశముచేత బయలుదేరేసరికి తనకు తానే ఏమీ లేకపోయినది అనగా పరిపూర్ణాన్ని చూద్దామనేసరికే యెరుకలేకపోయినదంటే యెరుకేమైనదని విచారించేసరికి

యెరుకకు యెరుకే శూన్యమై ఆయెరుకవల్ల వచ్చిన జగత్తుకూడా యెరుకతోనే పోయెను. యిదంతా విచారించిచూచితే యెరుక యెక్కడికి వెళ్లెను యేమైనది అంటే యెరుక బయలైనదని యెరుకే యెరిగి నేను లేను నావల్ల వచ్చిన జగత్తులేదు ఆహా ఇది ఏమిచిత్రముగా యున్నదనియు అనగా పరిపూర్ణాన్ని చూద్దామనే సరికే నేను బయలౌచున్నానని ఎరుక కెరుకే ఎంతో ఆశ్చర్యపడినది ఓహో నేను ఉండగానే నేను నా చిత్రములు యేమీ లేకుండా పోయినవియని యెరుకే ఎరిగి లేకపోయినదని భావము.

**విశేషార్థము :** యెరుక పరిపూర్ణాన్ని చూద్దామనే సరికే, యెరుక లేకపోయెనంటే, యెరుకే బయలైనది, అంటే ఈ బయలే అఖండయెరుక ఇదే శుద్ధ ఎరుక ఇదే అచలము యిదే సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణము, అందువల్ల యెరుకే పరిపూర్ణమౌచున్నదని తెలుసుకొనవలెను, అనగా యెరుకే గురుసూచన ద్వారా విచారించిచూస్తూ, పరిపూర్ణమౌచున్నది, విచారించకపోతే యెరుకగుచున్నది, విచారిస్తే, పరిపూర్ణమగుచున్నది, అందుకే పరిపూర్ణములో తోచిన యెరుకను లేనెరుకని చెప్పి యున్నారు, గనుక యెరుకలేందని పరిపూర్ణం ఉన్నదని తెలియబడుచున్నది, అని భావము గనుక యెరుక ఒకప్పుడు లేదని పరిపూర్ణమే ఉన్నదని భావము.

**140 ॥ గురుమూర్తిజూపకున్నను - పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షమగున్ - గురుమూర్తి జూపెనేనియు - పరిపూర్ణము తనకులెస్స - ప్రత్యక్షమౌరా - చూస్తునెయెరుక - పారిపోవునురా - యెరుకాబోయినవెనుక - యెవరాప్రత్యక్షాని - యెరిగిట్టిదట్టి - దంచెరిగెవారటుమీద - ప్రత్యక్షమౌరా - చూస్తునె యెరుక - పారిపోవునురా ॥ 6**

తా॥ శిష్యా! 26వ తత్వమైన పరిపూర్ణాన్ని, గురుమూర్తి శిష్యులకు అనుగ్రహించి చూపించకపోతే, యెన్నటికి ఆ పరిపూర్ణం తెలియబడదని, యిట్టదని గ్రహించలేరని ఎరుగవలెను, గనుక ఆ సద్గురుమూర్తి శిష్యునియందు ఉండే ప్రేమచేత ఆ పరిపూర్ణాన్ని సూచనజేసి గురుయుక్తిద్వారా చూపించినప్పుడు, ఆ శిష్యునికి ప్రత్యక్షముగా తెలియబడుచున్నది, అనగా తానుబయలైన పరిపూర్ణం బుజు అవ్వుచున్నది, ఆ బుజువైన పరిపూర్ణాన్ని, అలాచూస్తూ వుండగానే ఆ యెరుక మరుపులు రెండూ లేకపోయినవి, ఈ యెరుకమరుపులు లేకపోయిన తరువాత, ఉన్నదంతా పరిపూర్ణపరబ్రహ్మమే యున్నది, ఇక యేమీలేదు గనుక ఆ పరిపూర్ణాన్ని ఎరిగే వారెవరు, లేరని భావము. *

**విశేషార్థము :** సద్గురువైతే పరిపూర్ణాన్ని చూపించగలడు, అనగా పరిపూర్ణుడై యున్నగురుడైతే, తాను పరిపూర్ణం ఎలా అవ్వాలి, అంటే గురు సూచనచే శిష్యుడు తన మొదలు తానుచూడవలయును, తాననెయెరుక ఆత్మ స్వరూపమైయున్నది, ఆత్మ ఆకాశ అంశం అయి ఉన్నది. అనగా ఆకాశం బయలాంశంమై శూన్యమై యున్నది, ఈ విధముగా సమస్తము శూన్యము చేసి, తాను బయలాంశమైనప్పుడు,

తన్ను తాను చూచినట్లు, అనగా తనమొదలు తాను చూచుటె బయలవటము, ఈ బయలులో ఏమీ పుట్టకుండా వుండుటే బట్టబయలు, ఇట్టి ఉత్త బట్టబయలు అయినవారే సద్గురువులు, యిదే మొదటి మంత్రమైన ద్వాదశిచెప్పినది, యిందులో తోచేదే లేనెరుక, యిదే శోడషి, ఈ యెరుక లేందే పరిపూర్ణం అని భావము.

141 ॥ పరమపదమనిన బయలన - గురుగుహ్యమనంతమనిన గోప్యంబనినన్ - పరిపూర్ణమచలమనినను - తిరమనగాబట్ట బయలు - తెలియుమాయప్పా - యీ తెలిసిన - తెలివి మానప్పా - యెరుకానెరుగని దన్న నెరుకామీరినదన్న - యెరుకా మరుపులు లేని పరవస్తువనబయలె - తెలియుమాయప్పా - యీ తెలిసిన - తెలివిమానప్పా ॥ 7

తా॥ శిష్యా! పరమపదమన్నా బయలన్నా గురుగుహ్యమన్నా అనంతమన్నా గోప్యమన్నా పరిపూర్ణమన్నా అచలమన్నా తిరమన్నా బట్టబయలన్నా యివి యన్నియు పరిపూర్ణమునకు పరియాయ నామములు, (పేర్లు) అని గ్రహించుము, తండ్రీ నీవుయే తెలివి చేతనైతే యివియన్నీ తెలుసుకున్నావో, ఆ తెలివిని లేకుండా చెయ్యుము తండ్రీ, అనగా 25వ దైన ఈశ్వరతనువును లేకుండా చెయ్యుము తండ్రీ, ఈ యెరుకను లేకుండా చేయటము ఎట్లనగా, తనమొదలు తానెరుగవలెను, తనమొదలనగా తనమూలము తానెరుగవలెనంటే, ఆకాశమైన బయలును ఎరుగవలెను, అలా ఎరిగితే తాను బయలైను, అనగా యెరుక పోయిన తరువాత తానైనబయలే యున్నది, ఈ బయలు యెరుకను ఎరుగదు, ఈ యెరుకకు పైన మీరియున్నదన్నా, యెరుక మరుపులు లేనిదన్నా, తాను బయలైయున్నదే యని గ్రహించవలెనని భావము.

**విశేషార్థము** : బయలన్న అఖండమన్న అచలమన్నా పరిపూర్ణమన్న యివియన్నీ సచ్చిదానంద స్వరూపమైన శుద్ధయెరుకపేర్లు యిదే శుద్ధ తెలివి ఈ తెలివిచేత యివి యన్నీ ఎరిగేవు గనుక యీ తెలివిని లేకుండా చేయవలెనంటే ఈ యఖండమైన బయలులో తోచేవి సంకల్పములుగాని వూహాలుగాని ఏమీ లేక అఖండానుభవరహితమై యున్నదే అవంగ్మానస గోచరమనునదే శుద్ధ నిర్గుణమైన పరిపూర్ణం, ముందు చెప్పినవి అనగా బయలన్నా అచలమన్నా పరిపూర్ణమన్నా యివి సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణం, వెనుక చెప్పినది సచ్చిదానంద స్వరూప రహితమైన పరిపూర్ణము, యిది. పరమరహస్య మెవ్వరెరుగరు దీనిన్ అని శెలవిచ్చియున్నారు అని భావము. మరియు యిలాంటి విషయములు ఈ గ్రంథములో ఎన్నోచోట్ల చెప్పియున్నారు, ఈ గ్రంథకర్త, అవినాకు తెలుసున్నంతవరకూ, విప్పి విడదీసి వ్రాసినాను, యిందులో కొన్ని విషయములు కొంతమందికి తెలియకపోవచ్చును. అంత మాత్రమున ఏదో వ్రాసినారులే అని నిరసనజేసి వదిలివేయక, మీకు తెలియని విషయములు, అక్కడ మార్కుపెట్టుకొని తెలిసినవారి యొద్దకు వెళ్ళి, మీకు తెలిసే

వరకూ అడిగి తెలుసుకోవలయును. అనగా ముందు తన గురువు యొద్ద తెలుసుకోవలెను, నీ సందేహం తీరకపోతే. యింకా మహాపెద్దలు వద్దకు వెళ్ళి తెలుసుకోవలెనని భావము.

**142 ॥ బట్టబయలనుచు దీనికి - మొట్టమొదల్ పేరు లేదుముదమున యెరుకే - పుట్టిపేర్పెట్టి దీనిని - పట్టుకలవ్వాడలేక - పారిపోవునురా -కనరాదిందు- దూరా నేరదురా - పుట్టిచచ్చును మళ్ళి ఋట్టిగిట్టుచు ఋట్టు- నిట్టి తిప్పలనొందు యెరుకె బయలును జూస్తె - పారిపోవునురా - కనరా దిందు - దూరానే రదురా ॥ 8**

తా॥ శిష్యా! ఈ బట్టబయలకు మొట్టమొదటపేరు లేదు. ఈ బట్టబయలులో నుంచ ఎరుక వచ్చి, దీనికి బట్టబయలని పరిపూర్ణమని పేరుపెట్టెను. కాని ఆ బట్టబయలులో ఈ ఎరుక నిల్వలేకపారిపోవుచున్నది. యెక్కడ నైనా దూరినదేమోయని చూస్తే యెక్కడాకానరాకుండాపోయినది. అనగా యీ యెరుక ఏమైనదంటే ఎరుక బయలైనది. ఈ యెరుక బయలులోనే పుట్టి బయలులోనే గిట్టును, అనగా ఈ ఎరుక యొక్క పని పుట్టుట గిట్టుట మళ్ళీ పుట్టుట గిట్టుట యిట్టి తిప్పలు నొందె ఎరుకే ఆ బయలును చూస్తే. ఏమీ లేకుండా పోవునని భావము.

విశేషార్థము : ఈ బట్టబయలుకు మొదటపేరులేదు. ఈ బట్టబయలులో నుండే యెరుకవచ్చి, దీనికి బట్టబయలని పేరుపెట్టి ఆబయలును పట్టుకొనుటకు అనగా దానిని తెలుసుకొనుటకు ప్రయత్నం చేసేసరికి ఈ యెరుక బయలైనది. అనగా ఆ బయలు వద్ద ఉండుటకు అక్కడ నిలువలేక పారిపోయినది. అంటే యేమైనదని విచారించితే ఎందులోను దూరినట్టు కనిపించలేదు. మరియేమైనదని చూస్తే ఆ యెరుక బయలైనదని తెలిసినది. ఈ బయలులోనే పుట్టుచున్నది గిట్టుచున్నది మరల పుట్టుచున్నది. మరల గిట్టుచున్నది॰యిట్టి తిప్పలు పొందే ఎరుకే బయలును చూస్తే అనగా తాను బయలై అచలమైయుంటే ఎరుక ఏమీ లేకుండా పోయెననని భావము.

**143 ॥ వినుమునేననుచు యెరిగే - తనువందునలేక బయలుతానిండినదౌ - కనుగొను మదికనుగొని - యీతనువును విడనాడుమింతె - తడువేలనోయీ - యీపనికింక- గడువేల నోయీ - అనుమానముంటెనీ వరయీము శివరాము - లను దీక్షతులు జేసెన చల(గ్రంథమునంత - తడువేలనోయీ- యీ పనికింకగడువేలనోయీ ॥ 9**

తా॥ శిష్యా! వినుము నేను నేననుచు ఎరిగే తనువనే ఎరుక బయలులో లేదు. ఈయెరుకలేని బయలే అంతటా నిండినిబిడీకృతమైయున్నది. అనగా నేనునీవని ఎరిగేయెరుక ఉన్నంతవరకూ, నీకీ బయలు తెలియబడదు. గనుక నీవు యెరుకనే

తనువును విడిచిపెట్టుము, అనగా ఈ బయలనే అచల పరిపూర్ణము అంతా నిండిములు గ్రుచ్చుటానికి సందులేకయున్న పరిపూర్ణాన్ని కనుగొని, ఎరిగి నీమనస్సులో బాగా దృఢపర్చుకొని ఈశ్వరతనువును విడిచిపెట్టుము. ఈ పనికి గడువెందులకు, రేపనిమాపని అనకు వాయిదాలు వేయకుము. ఈ ఎరుకను తక్షణమె విడిచిపెట్టుము. నేచెప్పిన మాటకు నీకేమైనా అనుమానముంటే, శ్రీ శివరామదీక్షితులవారు వ్రాసిన బృహద్వాసిష్టమను అచలగ్రంథము నంతా చూడుము. ప్రతీ పేజీలోనూ రెప్పపాటులో సగంకాలమైనా యేమర్చిఉండవద్దని. మరియు మూలంలేని ఈగుర్తెరిగే శరీరం ఏమీ లేదని. కోటి మాటలకు యిదే జ్ఞాపకముంచుకోమని బావము.

**విశేషార్థము :** వినుమునేననచు ఎరిగే తనువందున లేక బయలు తానిండినదౌ. కనుగొని మదికనుగొని. ఈ తనువును విడనాడు, అనగా ఎరిగే తనువనే యెరుకలేంది, అనగా యెరుకలేని బయలు కనుగొని చూచి తెలుసుకొని, మనస్సులో బాగా దృఢపరచుకొని, అనగా తాను బయలైన అచలపరిపూర్ణమును. తనమనస్సులో బాగా దృఢనిశ్చయము పొంది అనగా తనమూలము తాను చూచేసరికి తానే బయలైనాడు, ఆ బయలును విచారించగా. చలనములేని అచలపరిపూర్ణమై యున్నాడు. యిది తనమదిలో బాగా దృఢము చేసుకొని. తనువనే యెరుకను విడిచిపెట్టి. తాను అఖండానుభవరహితమై, పరిపూర్ణమై, ఊహారహితమై, శరీరములేని అశరీరమై యున్నాడని భావము.

144 ॥ దేహాకారముగానిది - యహాహంభావంబులేవి దఖిల జనులుదా - సోహంసోహంబనినను - మోహము జెందనిది బైలు - మొదలెరుగవలెరా - యెరిగినయెరుక - తుదకరుగవలెరా - కోహంకస్త్వం బాని కూతాలు గూసేటి - దేహిదేహములను తెలియానియా బైలు - మొదలెరుగవలెరా - యెరిగిన యెరుక- తుదకరుగవలెరా ॥ 10

తా॥ శిష్యా! నీవు బయలైన బయలే అంతటా వున్నబయలు, దానికి దేహకారములేదు, దానికి అహంబావములు లేవు, అది ఏమోహము జెందనిదే దైవస్వరూపమని వ్రజలంతా నమస్కారములు చేయుచున్నను, నాకు నమస్కరించుచున్నారని ఆ బయలు ఎరుగనే ఎరుగదు, అట్టి బయలు మొదలెరుగవలెను. అనగా నీ స్వస్వరూపమైన బయలును సద్గురుని ద్వారా నీవు విచారించి ఆ బయలు మొదలు ఎరుగవలెను, అనగా నీ స్వస్వరూపమైన బయలు చూచుటయే బయలు మొదలెరుగుట. ఈ ఎరిగిన యెరుకే తుదకు ఏమీ లేకుండా అరాయించిపోవలెను. అనగా 24 యింద్రియములు రహితమై 25దో దైన ఈశ్వరతనువనె యెరుక ఏమి లేకుండా శూన్యమై. ఉత్తబట్టబయలై యుండవలెను, మరియు సోహంసోహంబని జపముచేసే దేహిదేహములను, అనగా నేనే బ్రహ్మము బ్రహ్మమేనేను అని అనుకొనే అహం, ఏమీ అన్నా మోహము జెందనిది బయలు

అనగా ఏమీ ఎరుగనిదే ఈ బట్టబయలని భావము.

**విశేషార్థము :** దేహకారముగానిది అహంభావములు లేనిది బయలు మొదలెరుగవలెరా, అంటే తాను బయలౌటము ఎరిగి యెరుక తుదకరుగవలెరా అంటే కడకు యెరుక ఏమీ లేకుండా పోవలెను, అనగా తాను బయలైయుంటే యెరుకతోచును ఈతోచే యెరుక అదాయించి పోవలెను అనగా యెరుకను విచారించుటలో ఏమీ లేకుండా శూన్యమైపోవలెను అలా యెరుక శూన్యమైపోతే యిక ఉన్నది ఉత్తది బట్టబయలై అశరీరమై పరిపూర్ణమై యుంటాడని భావము.

**145 ॥ యేవస్తువు చాతనుదా - నావిర్భవమొందు దేహమను తరువరయన్ - ఆ వస్తువె దానికి - త్రైవెలయును దాన్నెసాక్షి ద్రష్టానికనుమీ - యెరుకయిదే న్వష్టము వినుమీ భావించిచూడుమీ - బట్టబయలను భూమి - యావిత్తు చెట్టున్న దరయాదవిత్తానే ద్రష్టానికనుమీ - యెరుకయిదె - న్వష్టము వినుమీ ॥ 11**

తా॥ శిష్యా! ఈ దేహిదేహములు దేనివల్లవృద్ధి చెందుచున్నవో, ఆ వస్తువేదీన్కి విత్తనము, ఈ దేహిదేహములేచెట్టు, ఈ విత్తనమే సాక్షి, యిదే ద్రష్ట యిదే 25వ దైన ఎరుక, యిది యదార్థం, విచారించి చూడు, బట్టబయలు అనగా ద్రుష్టయనే సాక్షివల్ల, దేహమనే వృక్షము వృద్ధియైనది, భూమి ఆ విత్తును చెట్టును ఎరుగునా ఎరుగదు, అలాగే ఈ బయలు దేహిదేహములను ఎరుగదని భావము. *

**146 ॥ యేపరిపూర్ణముమేనికి - లోపల వెలినిండియుండు లోపములేకన్, ఆ పరిపూర్ణమె జగతికి - లోపల వెలినుండుదానిలోనె వున్నవిరా.- పై రెండెవ్వి లేవి వెన్నకురా, యీ పూర్ణ బోధచే పై ప్రపంచ శరీర - రూపములెడబాపు మీ పట్లనె దానిలోనె వున్నవిరా - పైరెండెవ్వి - లేని వెన్నకురా ॥ 12**

తా॥ శిష్యా! 26వో దైన అచలపరిపూర్ణము, 25వో తత్వమైన ఎరుకకు, లోప వెలుపల నిండినిబిడీకృతమై, ఎలోపములేక ఉన్నది, ఆ పరిపూర్ణమె 24 యింద్రియములతో కూడియున్న జగత్తుకు, లోపల వెలుపల నిండియున్నది, అట్టి పరిపూర్ణములోనే, ఈ నేను మేను లనే జగత్తు దానిలోనే ఉన్నవి, 26వో దైన పరిపూర్ణ బోధచేపై ప్రపంచశరీరములను, విడిచి పెట్టుము, అనగా 24 ఇంద్రియములతో కూడియున్న ప్రపంచమును 25వో దైన ఈశ్వరతనువు, ఈ రెంటికీ అతీతమై నీవు బట్ట బయలై పరిపూర్ణమై యుంటేనే, ప్రపంచ జగములు విడిచిపెట్టినవాడు అని భావము. *

**విశేషార్థము : రామయోగి కందార్థం**

కం॥ పరిపూర్ణమెరిగితనువే - పరిపూర్ణంబగుచు - యెరుకపరిపూర్ణం బై - పరిపూర్ణ మెట్లెరుంగును - పరిపూర్ణము యెరుకలేని పరిపూర్ణమందూ, భ్రాంతి రహిత పరిపూర్ణ మందూ - పరిపూర్ణాచల బోధాపారావారములోన పరధర్మనా పేక్ష - పరులెవ్వరుందురీ పరిపూర్ణ మందూ భ్రాంతి రహిత పరిపూర్ణమందూ ॥

తా॥ శిష్యా! ఎరుక రహితమైన, పరిపూర్ణమందు, పరిపూర్ణ మిట్టిదని తెలిసికొని శరీరమే, పరిపూర్ణమై. యెరుక అచలరూపమైనప్పుడు, పరిపూర్ణమెట్లెరుంగును, అచలబోధయను అంతులేని మహాసముద్రమునందు, పరమ పదాపేక్ష గల వారెవరుందురు, లేరు అని భావము.

ఇందుకు అచలబోధ శిఖామణిలో 14వ పేజిలో

లోకమందు ఒక వస్తువును, ఒక వస్తువు గుర్తెరుగునా, అలాగుననె పరిపూర్ణమై బ్రహ్మమైన తెలివిని, రెండవది యేది గుర్తెరుగును, మూర్ఖులు వాస్తవమని నమ్ముచున్నారు, గాని వున్నది ఒక్కటే వస్తువుగదా, ఒక వస్తువును ఒక వస్తువు గుర్తెరుగునా, అనే వివేకము లేదు, లోకమందు అన్నిటిని గుర్తెరిగేవి కన్నులు, అయినప్పటికిని కన్నులు అన్నిటిని గుర్తెరుగుగాని, వాటిని అవి గుర్తెరుగనేరవు, అలాగుననే ఒక జ్ఞానము ఒక జ్ఞానమును గుర్తెరుగనేరదు, జ్ఞానములేక తనను తాను గుర్తెరుగుతాడా, అంటారు, యిక ముక్తి యేలాగు అనగా చూచుచుండగా బాహ్యాభ్యంతరములయందు వున్న పరిపూర్ణమును చూచించి తనను లేకుండా జేసినవాడేసద్గురువు, ఏ కులమువాడైనా వాడే పరశివ స్వరూపుడు, యిదే నిచ్చయము, అన్యులు గురువులుగారు, ఈ సాంప్రదాయము దొరికేది కష్టము, భ్రాంతి లేని మార్గము యిదే ఇతరములన్నియు, భ్రాంతికి మూలము, సర్వకాలము తనను లేకుండా జేసిన వాడే గురువు, ఇదే సత్యము, యిదే స్వతఃసిద్ధము, యిదే అనుభవనిరసనము.

**147 ॥ యెరుకనగా యెరుగేటిది - మరుపనగా యెరుక తనను మరచుట మీరెంటెన్నరుగనిదె బయలిదిసీ - నెరిగెరు కనుమరుపునిప్పు - డెరుకాదెవిడరా - వీడితెపైమా - టెరిగె దెవ్వడురా - యెరుకె పరిపూర్ణమం - చెదిరించి వదిరేవు- పరిపూర్ణమైతె - చూపరబయలందున దాన్ని - యెరుకాదెవిడరా - వీడితెపై మాటెరిగెదెవ్వడురా ॥ 13**

తా॥ శిష్యా! ఎరుకనగా ఎరిగేది, యిదే ఈశ్వరతనువు మహాకారణశరీరము, మరుపనగా స్థూలసూక్ష్మకారణ శరీరములుమూడు మరుపు, యిదే జీవతనువు ఈ యెరుక 24 యింద్రియములతో తిరుగుతు, నేను జీవున్నే యనుకొని, 25వ దైన యెరుక మాట మరచినది, మరియు సుషుప్తిలో మరచినది, అలాగే సమాధిలో కూడా

మరచినది, యివి అన్ని యెరుకేనని ఎరుగు, ఈ రెంటినీ ఎరుగనిదే బయలు, యిది నీవు ఎరిగి, మరుపనగా ఏదో ఎరుకనగా ఏదో బాగా విచారించి యెరుకచేతనే గ్రహించి, యెరుకతోనే యెరుక మరుపులను విడిచిపెట్టవలెను, అలాగు విడిచిపెడితే, యెరుకను విడిచిపెట్టుట అనగా తనమూలము తాను. ఎరిగి తాను బయలైతే యెరుకను విడిచిపెట్టిన ట్లైను అపై మాట ఎరిగేదెవరు 25దో దైన ఈశ్వర తనువైన యెరుకనే. పరిపూర్ణమని ఎదిరించి చెప్పుచున్నావు, ఈ యెరుక పరిపూర్ణమైతే 26రో తత్వమైన ఆ బయలందున చూపర యెరుకను యెరుకలేదు గనుక, తాను పరిపూర్ణమైయున్నారని భావము.

148 ॥ లేదన్నను కనుపడుగద - నేడెలిసితినని బయటనే నిల్వగదా - నే దీని వెనుకగదనా - కేదీ మూలంబు యిదిగా - దికలేదెచ్చోటా - కనుకనె వుళ్ళ - క్కినేనన్నాటా - యేది లేదిదిదప్పు నే దెలియనిదియని తాదెలుసుకొని యెరుకె- తనను విడితేజాలు - యికలేదెచ్చోటా - కనుకనె వుళ్ళక్కినేనన్నాటా ॥ 14

తా॥ శిష్యా! లేదనినను కనుపడునుగదా, విచారించి గురుమూర్తిద్వారా చూచితే పరిపూర్ణము ఉన్నట్లుగా నీకు కనుపించున్నదిగదా నేడెలుసుకున్నాను, అంటే నేను బయలులో నిల్చుటకు తావులేదుగదా, పరిపూర్ణం నేను అనునది వెనుకగదా నాకేది మూలము యిదిగాదు, యికలేదు ఎచ్చోటను, గనుకనే వుళ్ళక్కినే నన్నాట, యేదీలేదు, ఈ పరిపూర్ణము తప్ప, నే తెలియనిది అనితాను తెలుసుకొని, తన్నుతాను విచారించియెరుకె తనను తాను విడిచితే చాలను వున్నదంతా పరిపూర్ణము అని భావము.

149 ॥ సత్యమగుబట్టబయలున - సత్యంబగు యెరుక నెరిగి సద్గురుకృపచే - సత్యముగా దని యెరుకను - సత్యముగా నమ్మివుంటె - చాలుచాలన్నా - వానితోటి - సాటెవ్వరన్నా - నిత్యనిత్యములానె - నిర్ణాయమెరుగాక - నిత్యుడై యుండేటి నిజబోధగలిగితె - చాలు చాలన్నా - వానితోటి సాటెవ్వరన్నా ॥ 15

తా॥ శిష్యా! సత్యమైనది బట్టబయలని, అనగా తాను బయలైయున్న బట్టబయలు సత్యమని, ఆ బయలులో వస్తూపోతూయున్న, యెరుక అసత్యమని, లేనిదని ఎరిగి, సద్గురు కృపచే ఈ లేనెరుక సత్యముగాదని, సత్యముగా నమ్మియుంటే చాలుచాలన్నా, అనగా లేని యెరుక అసత్యమైనదనినమ్మి, తాను బయలైన బట్టబయలే యదార్థమని నమ్మి, ఆ బట్టబయలును సర్వకాల సర్వావస్థలయందు విడిచిపెట్టకుండా వుంటే, వానితోటసాటి యెవ్వరూ లేరు, నిత్యమని అనిత్యమని ఎరుగక, నిత్యానిత్యములకు అతీతమైయున్న నిజమైన పరిపూర్ణబోధ నెరిగితే, అనగా

అఖండానుభవ రహితునకు సాటి ఎవ్వరూ లేనేలేరని భావము.

**విశేషార్థము :** గురుకరుణచే తానుబయలైన బట్టబయలు, సత్యమైనది సత్యమైనది, శాశ్వతమైన పరిపూర్ణమనినమ్మి, ఆ బట్టబయలులో తోచే లేనెరుక అశాశ్వతమైనదని, ఒకప్పుడు లేందని, అనగా కలలోతోచిన శరీరాలు ఏలాగూ అలాగే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు అని నమ్మి నిత్యము అనిత్యములనే రెంటిని ఎరుగక, అంటే నిత్యమైనది బట్టబయలు, అనిత్యములనే రెంటిని ఎరుగని వునికి, వూహారహితమైన పరిపూర్ణ పరబ్రహ్మమని, యిదే అఖండానుభవ రహితమైన అచలపరిపూర్ణమని భావము.

150 ॥ పరిపూర్ణములో దోచిన - యెరుకే కలలేని యెరుకనెరిగి మృషనియీ - మరుగె రుకకెరుక దెల్పిన - యెరుగుటమె - మేల్కొనుమ్మి - యిదియామారకుమీ - సద్గురు వాజ్ఞ కెదిరీమీరకుమీ - యెరుక యీరీతిగ - యెగిరీపోయిన వెనుక - పరిపూర్ణ మొకటుండు - పలుకొరా దెట్లందు - నిదియామారకుమీ - సద్గురు వాజ్ఞ - కెదిరి మీరకు మీ ॥ 16

తా॥ శిష్యా! పరిపూర్ణములో తోచిన యెరుకే కల లేని యెరుక అనగా తాను బయలైన పరిపూర్ణములో తోచిన యెరుకే, కలలేని యెరుకని ఈ లేనెరుకను ఎరిగి, మృషని అనగా లేందని, ఈ యెరుక లేకపోయిన తరువాత, ఉన్నది పరిపూర్ణమేనని, ఈ మరుగు యెరుకకు యెరుకజేసిన, ఆ యెరుక యెరగటమే మేల్కొయిది యామర్చి యుండవద్దు. సద్గురు వాజ్ఞ ఎప్పుడు జవదాటవద్దు. ఈ విధముగా జేసి నీవు లేనెరుకను లేకుండా చేసి, ఉన్న పరిపూర్ణాన్ని సర్వకాల సర్వావస్థలయందు విడిచి పెట్టకుండా ఉంటే యిక ఎరుకేది. యెరుకలేని పరిపూర్ణమే యున్నదని నీవెరిగితే అనగా యెరుక యీ రీతిగా లేకపోయిన తరువాత, పరిపూర్ణమొక్కటే యున్నది అనగా తాను బయలైయున్న దొక్కటే యున్నది, దానికి పలుకులేదు తలంపులేదు, యెరుకే ఏమీ లేదని భావము.

**విశేషార్థము :** పరిపూర్ణములో తోచిన యెరుక పరిపూర్ణమేయనియు సముద్రములో తోచిన కెరటములు సముద్రమే యనియు బంగారములో తోచిన వస్తువులు బంగారమేయనియు అలాగే పరిపూర్ణములో తోచిన యెరుక పరిపూర్ణమేయని అనగా కలలేని యెరుకని ఎరిగి యీ మరుగు యెరుకకు యెరుకజేసిన యెరగటమే మేల్కొ, అనగా పరిపూర్ణము తానే ఐనప్పుడు యెరుక లేదు గనుక యెరుక ఈ రీతిగా లేకపోయెను గనుక తాను పరిపూర్ణమైన దొక్కటే వున్నది యెరుక లేని పరిపూర్ణమైయున్నవానికి పలుకేరానది భావము.

151 ॥ తిప్పలగురాకపోకల - నెప్పుడు తానెరుగనట్టి యాబయలందున్- తప్పక తనకై తానే - తప్పున గనవచ్చియెరుక-తాగానరాదూ- బయలున్నాది-తనకెరుకలేదూ-యెప్పుడు బయలున్నదెరిగితాలేనట్టి-చొప్పున సద్గురు బోధ చొప్పున దెలిసితె-తాగానరాదూ - బయలున్నది-తన కెరుకలేదూ ॥ 17

తా॥ శిష్యా! బయలుకు రాకడపోకడలనే తిప్పలు ఎప్పుడూ లేవు అటువంటి బయలులో ఎరుక తనకుతానే వచ్చుచు తానకుతానే లేకపోవుచున్నది. అనగా యెరుకకు రాకపోకలనే తిప్పలు తప్పవు బయలున్నది తానెప్పుడూ ఎరుగదు యిట్టి ఎరుక ఎప్పుడూ బయలున్నదని సద్గురుమూర్తి చెప్పిన ప్రకారం తానెరిగితే అనగా బయలున్నది ఎరుక లేదని ఎప్పుడూ యెరిగితే అప్పుడే యెరుకలేకపోవుచున్నదని భావము.

152 ॥ అన్నము శుక్లంబగురస -మున్నతిగా రక్తము గుననౌ కచో రెండున్ - పన్ను గగలసిన మేనని -యెన్న బడున్ యెరుకగల్గి - యిదెమాయనుమ్మీ - మూలములేనిదిదె నీవునమ్మీ -యున్నావు పరిపూర్ణమున్నది గనిలేని దెన్నడులేదని యెరిగితే చాలు- గుర్తదెమాయనుమ్మీ మూలములేని -దిదెనీవునమ్మీ ॥ 18

తా॥ శిష్యా! అన్నాంశమైన ది శుక్లము నీరాంశమైనది రసము అనగా శోణితమును అతిగా రక్తమై ఈ శుక్లశోణితములు రెండూ సమ్మేళనమై మేనగుచున్నది ఈ అన్నాంశము నీరాంశమే యెరుక అగుచున్నది అందుకే మేను ఎప్పుడు తోచుచున్నది ఎరుక అప్పుడే తోచుచున్నది యిదియే మాయమూలములేనిది యిదే దీనినే నమ్మియున్నావు గావున పరిపూర్ణమునుగని అనగా అచలమై అంతటా నిండి నిబడీకృతమై పూర్ణమై నీవు బయలైయున్న దానిని చూచి ఈ మూలము లేని గుర్తెరిగె శరీరము ఎప్పుడూ ఏమి లేదని ఎప్పుడూ మ రువకుండాఎరుక యుంటే చాలును అని భావము.

153 ॥ కనకమనభూషణంబులు - యినుమన శస్త్రాదికం బులిత్తడియనినన్ - గనుగొన పాత్రలు గను పడు-తనువననవయములన్ని -తగదొంతియనినా - కుండలు భూత -తతిజగత్తనినా - వినుమట్ల యెరుకన్న వివరించతత్వాలు -మను సందు గట్టి గమరువాకు మీమాట- తగదొంతి యనినా కుండలు భూత- తతి జగత్తనినా ॥ 19

తా॥ శిష్యా! బంగారము అనగానే వస్తువులనిన్ని యినుము అనగానే శస్త్రములు మొదలైనవని ఇత్తడి అనగానే పాత్రలు అనిన్నీ తెలుసు కొనుము అట్లే తనువు అనగా యింద్రియవయములనిన్నీ దొంతలు అనగా కుండలు అని భూతసముదాయమనగా జగత్తని ఇట్లే యెరుకనగా తత్వములు అని గ్రహించుకొనుము నీమనస్సులో ఈ మాట మరువకుమని భావము.

**154 ॥ పొరలరటిదుంపయనినను - తరువులు వనమనిన, రవలు - ధారుణియనినన్ - గిరియనిన రాళ్ళుబట్టలు ధరముళ్ళియనవి తత్వ - తతియెరుకంచనినా - లేనిదెయెరుక స్థితి లెస్సకనినా యెరుకాశేసిన విశ్వమెరుక వంటిదె బయలు - సెరుకా గుర్తెరిగి తానేగితెసరి -తత్వతతి యెరు - కంచనినా - లేనిదె యెరుక - స్థితి లెస్సకనినా ॥ 20**

తా॥ శిష్యా! యింకను ఎరుక ఎటువంటిదనగా పొరలు అనగా అరటి దుంప పొరలు అని, చెట్లు అంటే వనమని, రవలు అంటే భూమియని, గిరి అనగా పర్వతము అని, ముళ్ళియ అంటే బట్టలు మూట అని, తత్వములు అంటే యెరుక అని, లేనిది ఈ ఎరుక స్థితి లెస్సకనిన, అనగా ఒకో పొరొకోపొర తీసి వేస్తే అరటి బొంద ఏది, ఒకో చెట్టు ఒకోచెట్టు తీసివేస్తేవనమేది, ఒకోరవ్వ ఒకోరవ్వ తీసివేస్తే భూమి ఏది, ఒకోరాయి ఒకోరాయి తీసివేసితే కొండేది, ఒకో బట్ట ఒకో బట్ట తీసివేస్తే మూటేది, అలాగే ఒకోతత్వం ఒకో తత్వం తీసి వేస్తే ఎరుకేది. ఎరుక లేకపోతే ఉన్నది బయలేగదా, ఈ ఎరుక లేని బయలును యదార్థముగా చూచినప్పుడు అక్కడ ఎరుక ఏమీ లేదు అన్నస్థితిని లెస్సగా కనిన అనగా నీవు బయలైన ఈ ఎరుకతోటేవిశ్వమంతా లేకపోయినది. గనుక ఈ బయలను ఎరుకచూచి గుర్తెరిగితే అనగా ఎరుక బయలును గుర్తెరుగుట అంటే యెరుక బయలౌట ఎరకే లేకపోవును యెరుకలేకపోయిన తరువాత వున్నది బయలేనని భావము.

**155 ॥ పెనుమాయెను జూడుము యిదె-జనకుని జఠరంబువలన జననీ గర్భం-బునజొచ్చి మారురూపున -జని యించును నవయువములు-జనితామైభవినీ - వినుకను తిను మూర్కొను వచ్చును చనీ-దినదిన మభివృద్ధ్యైదిని చే బయలును-గనియామాయల మల్లికథమాయించుము పోని- జనితా మైభువినీ-విను కను తిను-మూర్కొని వచ్చును చనీ ॥ 21**

తా॥ శిష్యా! పెను మాయ అంటె ఈ దేహము ఎరుక రెండూ ఒక పర్యాయమే వస్తాది, ఒక పర్యాయమేపోతావి. ఈ దేహమే పెనుమాయ ఇది జనకుని యొక్క జఠరంబువలన జననీ గర్భమున జొచ్చి నవయవములతో మారు రూపముగా కన్పించుచున్నది యిది విను కను తిను మూర్కొనునుచనునూ దినదినం అభివృద్ధియై ఈ శరీరము అనే ఎరుకచేత బయలును గని అనగా తాను బయలైనటువంట స్థితిని తాను లేక చూచి యిన్ని మాయ అనగా తనకు మూలమైన ఆకాశమనే బయలను చూచేసరికి అనగా నీ మూలము నీవు చూచే సరికి తానే బయలైయ్యెను అప్పుడూ ఈ మాయలమల్లి కథ ఏమి లేకుండాపోయెను. గనుక నీవు బయలై అనగా మాయలతో ఉన్న మల్లియను ఎరుకను ఏమి లేకుండా చేయుమని భావము.

156 ॥ పెట్టియలోపలిగారడి - చెట్టు పయన్ గానవచ్చి చెట్టున జూడన్ - గట్టు పయదోచువిది - కనుకట్టు సుమీ దీనివలనే గనుపించు నెరుకా - అంతలొ యెచట - గనుపించదెరుకా - దిట్టామౌ బోధాచేపట్టీ - యెరుకను తిరిగి - పుట్టాకుండగదాని - పుట్టీ ముంచుము లేందె - గనుపింపునెరుకా - అంతలో యెచట - గనిపించదెరుకా ॥ 22

తా॥ శిష్యా! గారడీవాడు పెట్టెలో మనిషిని ఉంచి, ఈ పెట్టెలో ఉంచిన వానిని పిలిస్తేవాడు, చెట్టు మీదనుంచి గట్టుమీద నుంచి వచ్చునట్లు మరలకనుపించును. ఇదికనుకట్టుగావున ఇట్లే యెరుక కూడ, ఈ కను కట్టువలెనె కనుపించును, అంతలోనె సంకల్పించును. మరల పుల్లమ్మ ఏది అనును. అంతలో నెల్లమ్మ ఏది అనును. అంతలొనె మరల కనుపించదీ ఎరుక, దిట్టమౌ బోధచే పట్టి, ఎరుకను తిరిగి పుట్టకుండా, దాన్ని పుట్టి ముంచుము. అనగా గురుమూర్తి గురుసూచన జేసి, ఆ గురియుక్తివలన, గురుస్వరూపమైన బయలును చూపించి ఈ బయలులో తోచేఎరుకను, మరల పుట్టకుండా. నీవు బయలై సర్వకాల సర్వావస్థలయందు, దీనిని ఉత్తబట్టబయలు చేయుటయే ఎరుక తిరిగి పుట్టకుండా దన్నా పుట్టిముంచుము. అంటే నీవెప్పుడూ ఈ ఉత్తబయలై ఉండడమే. ఎరిగే దాన్ని పుట్టి ముంచుట అని భావము.

విశేషార్థం : యిందుకు ర్గామ్మయోగ్గి కందార్థం

కం॥ యెరుకను కలవంటిగా - గురుముఖమున నెరుగ్గబయలు - గురుతగుపడునా- గురిగుర్తులికనుగననే - మరికలలోనైన యెరుక మాటదలచకురా - భ్రాంతికి మూల పీఠకమిదెరా - మాటిమాటికి యెరుకతోటి ప్రస్తాపమిా - పూటతో నిల్పిపై బాటలో సేరియామాట దలచకురా - భ్రాంతికి మూల పీఠకమిదెరా ॥

తా॥ శిష్యా! గురు బోధవలన యెరుక, కలవంటిదని తెలియగా, పరిపూర్ణ మిట్టిదనే గుర్తు తెలియును, గురిగుర్తులను విడిచి, కలలోనైనను నెరుకమాట తలచవద్దు, భ్రాంతికి మూల పీఠమిా యెరుకే గనుక, నెరుకప్రస్తాపన ఈ పూటతో నిల్పి, పరిపూర్ణమందు జేరి, యెరుక మాట తలచవద్దని భావము. ఇదియె అఖండ భ్రమవిసర్జన ప్రకరణములో భ్రాంతియనే యెరుక సర్వాబద్ధమను దృష్టాంత తృతీయ బోధ సమాప్తము.

157 ॥ నేననని బ్రహ్మలోపల - లేనిదె సంభవము నొంది లీలతనకుదా - మేను జగములై వెలసెను - నేనది మృగజలము రీతి నిజముగాదనుచూ - లోకులనేటి - గజిబిజి వినుచూ - మానాసమునవారి మాటకామోదించి - దానికిబోధాకుతగునంచువిన జేస్తి - నిజముగా దనుచూ - లోకులనేటి - గజిబిజి వినుచూ ॥ 23

తా॥ శిష్యా! నేను అనని బ్రహ్మలో లేనిదే ఎరుక మేనుజగములై వెలసెను,

అనగా ఈనేను అనునది లేక ఉత్పత్తి అయ్యే మేను నేను జగత్తులుగ పరిణమించినది, గావుననేను అది మృగజలముగా, యండమావులలోని నీరువలె, లేనిదే ఉన్నట్లుతోచుచున్నది. అని భావించి అది నిజముగాదురా అని లోకులు అనుకునే గజిబిజిమాటలు విని, మనస్సునందు వారిమాటలకు ఆమోదించి అనగా దేవునికి నామరూపములేవని, యెవరికి కనిపించదని. అందరికి ఒక్కడే ... మాటలు దానికి దీనికి తగును అంచువినజేస్తిని. అనగా లోకులు అనే మాటలు, పరిపూర్ణ బోధకు సరిపోవును గావున ఈ లేనెరుక ఏడనులేదని భావము.

**158 ॥ కలనెడబాసిన మనుజులు - కలలోపలి పనులుచే యకల వారననా - కలవారుగారు వారల - వలెయెరుకను గురునిచేత - వదలెరుకలోనా - గలపనిచేయ - వలదె రుకలోనా - కలవారంచనినేటి పలుకుటమరయాక - పలికినవారికి తెలిగాదు పాపము - వలదెరుకలోనా - గలపని చేయు - వలదెరుకలోనా ॥ 24**

తా॥ శిష్యా! యెరుకను విడిచిపెట్టి, బయలనేమేల్కలో ఉండి,మామోలు ప్రజలు చేయుచున్నట్లు తానుకూడా కలలో పనులు చేయుచున్నను కలలో పనులనగా తాను అన్నము తినుట, తాను మంచినీరు త్రాగుట, తాను దొడ్డికి వెళ్ళుట, వగైరా పనులన్నీ చేయుచున్ననూ, కలలో వారుకారు. ఎందుకనగా వారు తానులేక చేయుచున్నారు. అనగా గురువుగారు చేసిన సూచనయనే యుక్తివలన తాను బయలై యుండెను. అందువల్ల కలలోవారు కారు. గనుక వారి వలెనె గురునిచేత ఎరుకను విడిపించుకొని, అనగా గురుసూచననే యుక్తి సంపాదించుకొని, బయలై తాను లేక ఉండి కలలో పనులు చేయవలెను. కలనగాలేనిదే, కల ఉన్నట్లు కనుపించుచున్నదంటే భార్యతో సంసారము చేస్తున్నట్లు కలవచ్చును. ఆకలమేలుకొనే సరికి, భార్యాలేదు. సంసారములో గన్నవస్తువులేవు. ఓహో యిది కలలో ఉన్నవారనిగాని మేల్కలో ఉన్నవారని గాని, విచారించక గురుసూచనపొందక గురుయుక్తి సంపాదించక ఎరుకను విడిచిపెట్టక, పలికిన వారికి యెరుక తెలుగదు. పాపము, ఈ ఎరుక విడిచిపెట్టదని భావము.

**159 ॥ గుడమేమధురము మధురమె - గుడమాగుడము ధురము గొనకొని తెలుతన్ - బొడమిన దేదనసరిగా-బొడమిందొకటేగ - రెండుపోయినట్టికదరా - తనువెరుకాలి-లైనట్టి కదరా - పొడజూచిబయలునిప్పుడె మేనెరుకలజేలి - విడరాలేనివె రెండు-పెడచా బెట్టకవిను - పోయినట్టికదరా - తనువెరుక - విట్టైనట్టికదరా ॥ 25**

తా॥ శిష్యా! బెల్లమెతీపి తీపే బెల్లము, ఈ రెండూ ఏలా వచ్చినవో, యని విచారించి చూడగా, రెండూ ఒక్కసారే పోయినవి. అనగా యిందులో ఒకటి లేకపోతే రెండోది కూడా దానితోనే పోయినది, అలాగే తనువెరుకలలో రెండూ ఒక్కసారే వచ్చినవి. ఒక్కసారే పోయినవి. అనగా ఎరుకలేకపోతే తనువప్పుడేపోయినది. గనుక ఎరుకలేని

వరకూ అడిగి తెలుసుకోవలయును. అనగా ముందు తన గురువు యొద్ద తెలుసుకోవలెను, నీ సందేహం తీరకపోతే. యింకా మహాపెద్దలు వద్దకు వెళ్ళి తెలుసుకోవలెనని భావము.

**142 ॥ బట్టబయలనుచు దీనికి - మొట్టమొదల్ పేరు లేదుముదమున యెరుకే - పుట్టిపేర్పెట్టి దీనిని - పట్టుకలవ్వాడలేక - పారిపోవునురా -కనరాదిందు- దూరా నేరదురా - పుట్టిచచ్చును మళ్ళి ఋట్టిగిట్టుచు ఋట్టు- నిట్టి తిప్పలనొందు యెరుకె బయలును జూస్తె - పారిపోవునురా - కనరా దిందు - దూరానే రదురా ॥ 8**

తా॥ శిష్యా! ఈ బట్టబయలకు మొట్టమొదటపేరు లేదు. ఈ బట్టబయలులో నుంచ ఎరుక వచ్చి, దీనికి బట్టబయలని పరిపూర్ణమని పేరుపెట్టెను. కాని ఆ బట్టబయలులో ఈ ఎరుక నిల్వలేకపారిపోవుచున్నది. యెక్కడ నైనా దూరినదేమోయని చూస్తే యెక్కడాకానరాకుండాపోయినది. అనగా యీ యెరుక ఏమైనదంటే ఎరుక బయలైనది. ఈ యెరుక బయలులోనే పుట్టి బయలులోనే గిట్టును. అనగా ఈ ఎరుక యొక్క పని పుట్టుట గిట్టుట మళ్ళీ పుట్టుట గిట్టుట యిట్టి తిప్పలు నొందె ఎరుకే ఆ బయలును చూస్తే, ఏమీ లేకుండా పోవునని భావము.

విశేషార్థము : ఈ బట్టబయలుకు మొదటపేరులేదు. ఈ బట్టబయలులో నుండే యెరుకవచ్చి, దీనికి బట్టబయలని పేరుపెట్టి ఆబయలును పట్టుకొనుటకు అనగా దానిని తెలుసుకొనుటకు ప్రయత్నం చేసేసరికి ఈ యెరుక బయలైనది. అనగా ఆ బయలు వద్ద ఉండుటకు అక్కడ నిలువలేక పారిపోయినది. అంటే యేమైనదని విచారించితే ఎందులోను దూరినట్టు కనిపించలేదు. మరియేమైనదని చూస్తే ఆ యెరుక బయలైనదని తెలిసినది. ఈ బయలులోనే పుట్టుచున్నది గిట్టుచున్నది మరల పుట్టుచున్నది. మరల గిట్టుచున్నదిఇయిట్టి తిప్పలు పొందే ఎరుకే బయలును చూస్తే అనగా తాను బయలై అచలమైయుంటే ఎరుక ఏమీ లేకుండా పోయెననని భావము.

**143 ॥ వినుమునేననుచు యెరిగే - తనువందునలేక బయలుతానిండినదౌ - కనుగొను మదికనుగొని - యీతనువును విడనాడుమింతె - తడువేలనోయీ - యీపనికింక- గడువేల నోయీ - అనుమానముంటేనీ వరయీము శివరాము - లను దీక్షతులు జేసెన చలగ్రంథమునంత - తడువేలనోయీ- యీ పనికింకగడువేలనోయీ ॥ 9**

తా॥ శిష్యా! వినుము నేను నేననుచు ఎరిగే తనువనే ఎరుక బయలులో లేదు. ఈయెరుకలేని బయలే అంతటా నిండినిబిడీకృతమైయున్నది. అనగా నేనునీవని ఎరిగేయెరుక ఉన్నంతవరకూ, నీకీ బయలు తెలియబడదు. గనుక నీవు యెరుకనే

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైతరహిత పరమతత్వే పరిపూర్ణ
బోధేనామష్టమో ధ్యాయః భావ విశేషార్థములు
సమాప్తము



# ☆ 9 .గురుమంత్ర ప్రతాపం. 27 ☆

161 ॥ యెరుగననేటిది యెరుకే - యెరుగుదునని తనను పరులనెరిగెదెరుకే - యెరుగ
నెరుంగదుననుదా - నెరుగుచు నుండేటిదెరుకే - నిరుపాముబుద్ధీ - నీవెరుగిది-
నిగమప్రసిద్ధీ - గురుమంత్రమనియేటి గృద్ధలితోటియా - యెరుక కూకుడువేరు-
నెరిగిత్రవ్వితెచాలు - నిరుపాముబుద్ధీ - నీవెరుగిది - నిగమ ప్రసిద్ధీ ॥ 1

తా॥శిష్యా! ఎరుగనటువంటి అఖండయెరుక, ఎరిగే యెరుక ఈశ్వరతనువు, ఎరిగీ ఎరుగని యెరుక జీవతనువు, ఈ ఎరుక మూడు విధములు దీనిని నీవెరుగుము. అనగా అఖండమే శుద్ధ యెరుకని, ఈ అఖండములో తోచే జీవేశ్వర్లే మలినమైన లేనెరుకని నీవెరుగు ఏ ఉపమానములు లేని బుద్ధిగల వాడా, ఈ యెరుక నిగమములకు ఆగమములకు ప్రసిద్ధమైన తత్వమని నీవు తెలుసుకొనుము, మరియు గురుమంత్రమనే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేదనే మంత్రము అభ్యానములో నిత్యము జపము చేయుచూ బయలులో యెరుక పుట్టుచు గిట్టుచున్నదని గ్రహించవలెను, అభ్యాసాతీతములో గురువుగారు చేసిన సూచన ద్వారా విధారించి, తాను బయలవటము, మరల యెరుకవటము గ్రహించి విచారించవలెను, ఆ రూఢములో బయలై యెరుకవకుండా వుండడం, అనగా యెరుకైతే మరల వెంటనే బయలవటము, ఈలాగు విచారించవలయును, ఆరూఢా తీతములో తాను బయలై సర్వకాలం అచలపరిపూర్ణమై, యెరుక ఏమీ లేక యుండవలెను, యిదే గురుమంత్రమనే గుద్దలితో యెరుక కూకుడు వేరు నెరిగి, త్రవ్వితె చాలు అంటే, ఈ విధముగా విచారించితె చాలు అని అర్థము. కూకుడు వేరు అనగా అఖండ యెరుక, ఈ అఖండములో నుండి ఖండా ఖండములనే జీవేశ్వరులు వేర్లుగా, పలవలు, చిలవలుగా అనేకమైన సమూహం వెలసెను, ఈ వృక్షమునకు, అఖండమే కూకుడు వేరు, ఈ వేరును నరుకుట యనగా అభ్యాసము అభ్యాసాతీతము ఆరూఢము ఆరూఢాతీతము అనే, గృద్ధలితో నరికి, ఈ యెరుకనే చెట్టును సమూలముగా పడగొట్టినప్పుడు, అనగా జీవేశ్వర్లు అఖండము యొక్క అనుభవము రహితమై ఏమీ లేకుండా వుంటే, మొత్తం చెట్టు అంతా ఎండిపోయినట్లు, నీవు అఖండ యెరుకై

ఈ ఖండాఖండములనే జీవేశ్వర్లు పుట్టకుండా, నీవు విచారించినప్పుడు, నీకు అఖండాను భవరహితమగును. అనగా ఊహారహితమై అశరీరమగును, యిదే కూకుడువేరు నరికే విధానము అనగా నీవు సర్వకాల సర్వావస్థలయందు, మూలంలేని యీ గుర్రెరిగే శరీరం యేమీ లేకుండా వుండేలాగు, అనగా యొరుక ఏమీ లేకుండా పోయే కొరకు, రెప్పపాటులో సగం కాలమైనా మరువక. యిలా విచారించుచుంటే నీవు బయలై అచల పరిపూర్ణమై యుండునని భావము.

**విశేషార్థము** : పంచయోధ్యాయం 32పేజీ దీక్షితీయంలో

పుట్టనీ చావనిది సకల దేశాలయందు సమస్తమైన వస్తువులయందు జ్ఞాన కర్మాలు యేమీలేక, కర్మాలకు కారణమనే జ్ఞానం శూన్యమై, జగత్తు వున్నది లేనిది యెరుగక, నిత్యః సర్వగతఃస్థాణుః అచలః సనాతనః అయింది. యీ బట్టబయలే కాని, మరోటికాదు. మూలంలేని యీ గుర్రెరిగే శరీరం యేమీ లేదని దృఢం వుంటేచాలు, సర్వకాలం ఒక్కతీరే, పరిపూర్ణం తనకు తానే స్వతః సిద్ధమైయున్నది, గనుక ప్రయత్నం లేదు. యేది ప్రయత్నం చేయబోతుందో అదే యేమీ లేదు, మూలంలేని యీ గుర్రెరిగే శరీరం యేమీలేదు, రెప్పపాటులో సగం కాలమైనా మరువక వుండవలె వుండకపోయేనా అందరివంటి భ్రాంతుడే అవుతాడు, యీ రుచి అబ్బి సదాదృఢం వున్న కొద్ది అనాయాసం, మూలంలేని యీ గుర్రెరిగే శరీరం ఆవరణంవలె ఉన్నది, గురువాక్యం చేత సకల భ్రాంతి రహితం అవుచున్నది, వున్నప్పుడు గురువాక్యం చేత కనుక్కునేనా, వాడు ధన్యుడు, వున్నప్పుడు కనుగొనక పోయేనా అన్నిటి వంటి వాడే, శరీరంలేని గురుసాంప్రదాయం అరుదు, అని శెలవిచ్చి యున్నారు.

**162 ॥ యొరుకే చదువుల జేసును - యొరుకే వినుచదువు, సొరుకనెరుకే తిరమంచెరిగించును శంకించును - యొరుకే కొవకేమిలేక - యేగునేయన్నా - బయలేచదువు - యెరుగాదేయన్నా - యొరుకేయన్నటికైన - పరిపూర్ణమున్నాదం- చెరిగితాలేనాని యెరిగి తెవిలు వాక - యేగునేయన్నా - బయలె చదువు - యెరుగాదేయన్నా ॥ 2**

తా॥శిష్యా! యెరుకే చదువులను జేసును. అనగా కవిజేయును, తెలుసుకొనును యెరుకే వినును, చదువును. యెరుకే యిది నిజమని యిది అబద్ధమని ఎరిగించును శంకించును, యెరుకేతుదకు ఏమీ లేకపోవుచున్నది, అనగా యెరుక యిట్టిదని తెలసిన మీదట లేకపోవుచున్నది. బయలు ఏ చదువు ఎరుగదు, యెరుకెన్నటికైనా, పరిపూర్ణమున్నదని ఎరిగితాలేనని ఎరిగితే, నిలవకుండా పోవునని, అనగా తాను బయలైనటువంటిదే, పరిపూర్ణమని గ్రహించినట్లైతే, ఈ యెరుక ఏమీలేక పోవుచున్నదని భావము.

**163 ॥ చూపులలో గల వస్తువు - చూపులగను వస్తువులును చూపులు గూడన్ - తేపకు యెరుకని తెలియుము, చూపులు - లేనట్టిబయలు - చూచేదింకేమి - యెరుకే లేదు - తోచేదింకేమి - దీపమువలె కనుపాపాలగలవస్తువె - పరమాత్మాని చూపితే యెరుకాయ - చూచెదింకేమి - యెరుకెలేదు -తోచేదింకేమి ॥ 3**

తా॥శిష్యా! చూపులలో గల వస్తువు ద్రష్టని. చూపులు కనుగొను వస్తువులు దృశ్యములు అని. చూపులుగూడి చూచిన దృక్కు అని, యెరుకని తెలియుము, చూపులు యెరుగునట్టి బయలును, చూచేది యింకెవరు. యెరుకేలేదు, గనుక తోచేది లేదు, దీపమువలె కనుపాపలలో గలవస్తువే, పరమాత్మ అని చూపితె యెరుకైనదిగావున యెరుకేలేదు. గనుకనీవు బయలై యుండి, యెరుకను విడిచిపెట్టుము, తోచేది యింకేమి లేక పరిపూర్ణమే యున్నదని భావము.

**విశేషార్థము :** రామయోగి కందార్థము

కం॥ యెరుకనుకలవంటిగా - గురుముఖమున నెరుగబయలు గురుతగుపడునా - గురుగుర్తులికనుగననె - మరికలలోనైన యెరుక మాట దలచకురా - భ్రాంతికి మూల పీఠకమిదెరా - మాటి మాటికి యెరుకతోటి ప్రస్తావమిా - పూటతో నిల్పిపై బాటలో సేరియామాట దలచకురా - భ్రాంతికి మూల పీఠకమిదెరా ॥

తా॥శిష్యా! గురుబోధ వలన యెరుక కలవంటిదని తెలియగా, పరిపూర్ణమిట్టిదనే గుర్తులను విడిచి కలలోనైనను నెరుకమాట తలచవద్దు, భ్రాంతికి మూల పీఠమిా యెరుకే గనుక, నెరుక ప్రస్తాపన ఈ పూటతో నిల్పి, పరిపూర్ణమందు జేరి. యెరుక మాట తలచవద్దని భావము. ఇదియే అఖండ భ్రమ విసర్జన ప్రకరణములో భ్రాంతియనె యెరుక సర్వాబద్ధమను దృష్టాంత తృతీయ బోధ సమాప్తము.

**164 ॥ శతపత్రాప్తుని పొడగని - యతిరయమున తిమిర మణగియగుపడదెట్ల - ట్ల తులితగురుకృప గలిగిన - మతిమంతులజూచి యెరుక - మరినిల్వబోదూ - సంశయమునీ - మదినిల్వరాదు - శ్రుతులందు స్మృతులందు - యితి హాసము లయందు - సతతాము శ్రమపడి వెతకినయా - యెరుక - మరి నిల్వబోదూ - సంశయమునీ - మది నిల్వరాదూ ॥ 4**

తా॥శిష్యా! శతపత్రాప్తుడు అనగా సూర్యుడు సూర్యుడు వచ్చు చున్నాడనే సరికి, అతి వేగంగా తిమిరము అనగా చీకటి తనకు తానే లేకపోవుచున్నదెట్లో, అట్లే ఎక్కువైన గురుకృప బొందినవారిని చూచి, అనగా గురుభక్తి గురుసేవ గురునిష్ఠ వలన గురుకరుణచే గురుసూచన పొందిన వారిని చూచి. అనగా ఇట్టి బుద్ధిమంతులను

చూచి, ఈ ఎరుక అట్లే నిలువకపారిపోవును, అనగా గురు సూచనవల్ల గురుస్వరూపము నెరిగి ఆ గురు స్వరూపమెతానైన వారిని చూచి, ఎరుకనిల్వదు. యిక నీకు సంశయము మనస్సులో ఉంచుకొనవలదు. గావున వేదములయందు వేదాంగములయందు యితి హాసములయందు సతతము శ్రమపడి, వెదకినగాని ఆ యెరుక బయలైనవారి ఎదుట నిల్వదు. అని భావము.

**విశేషార్థము : రామయోగి కందార్థము**

కం॥ వినుమానసదేహేంద్రియ - ఘనతరకర్తృత్వ సహితగతుడై తదపేక్షను గోరకఖిల సత్క్రియ - లోనరగ తాజేసిచేయు - నొల్లనటులుండూ - నతఠొక బ్రహ్మవిదుడై తానుండూ, కనిచేసేపనులైన - తనయాత్మ సాధనకను కూలముగ జేసి పనికిరాని విశేయ - నొల్లనటులుండూ । నతఠొక బ్రహ్మవిదుడైతానుండూ॥

తా॥శిష్యా! బ్రహ్మవిదుడు బ్రహ్మవేత్తయయ్యును సర్వప్రపంచంబును బ్రహ్మ స్వరూపముగా బావించుచు దేహేంద్రియాదులకు గల కర్తృత్వమును తనపై మోపుకొనక, ప్రతిఫలమును గోరక నిత్యనైమిత్తిక కర్మలను జేయుచు పుత్ర మిత్ర కళత్రాదులయందు వైరాగ్యముగలవాడయ్యును. యదృఛ్ఛాలాభముగా దొరికిన ధనముతో వారికి పోషింపుచుండును, ఆత్మయందు తృప్తిచెంది, ఆత్మ స్వరూపా వలోకనముచే సంతసింపుచూ, ఎన్నికార్యములు చేయుచున్నను తనయొక్క స్వస్వరూపమైన పరిపూర్ణమందే సర్వదా నొప్పి ఉండునని భావము.

**165 ॥ ఎరుకే కోశములైదెరు - గెరుకే భూతములనెరుగు నెరుగును సర్వం - బెరుకే యెరుకనెరుంగును - యెరుకను గుర్తెరుగ వేరే - యెరుకావున్నాదా - వున్నదంటె- నరకామెకాదా నిరతాముగురుసేవ పరతంత్రులగుచుత - త్కరుణాకు పాత్రులై- యెరుకమాలిన వారి - కెరుకావున్నాదా - వున్నదంటె - నరకామెకాదా ॥ 5**

తా॥శిష్యా! ఈ ఎరుకే కోశము లైదునెరుగును, అనగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములు అయిదు ఈ ఐదింటిని ఎరుక ఎరుగును. ఎరుకే భూతములు అనగా ఆకాశము వాయువు, అగ్ని జలము వృధ్వి ఈ ఐదింటిని ఎరుగును సర్వము కూడా ఎరుగును ఈ ఎరుకే ఎరుకనెరుంగును అనగా అఖండమైన శుద్ధ యెరుకను ఎరుగును. ఎరుకను గుర్తెరుగుటకు వేరే ఎరుక ఉన్నాదా అంటే నరకమే అనగా అఖండ యెరుక గాక యింకో వేరే యెరుక ఉన్నదన్న వారికి నరకము తప్పదు నిరతాము గురుసేవ పరతంత్రులగుచుతత్కరుణకు పాత్రులై ఎరుక మాలిన వారికి ఎరుక ఉన్నదా అనగా అచలమనేగురు స్వరూపాని నిరంతరము గురు సేవ సేయుచు అనగా ఆత్మావలోకన చేయుచు అచలమైయుండె పరతంత్రము చేయుచు పరతంత్రమనగ అఖండఎరుకలో

ఈశ్వరతనువనే యెరుకను లీనము జేయుచు తాను లేక యున్నవానికి అచలమైయున్నవాన్కి ఎరుకయున్నదన్న ఉన్నదంటే నరకామేకాదాయను భావము

**విశేషార్థము :** నిరతాముగురుసేవ పరతంత్రులగుచు యెరుక మాలిన వారికి యెరుకయున్నదా వున్నదంటె నరకామేకాదా నిరాతముగురుసేవ అనగా అఖండస్వరూపమును సేవించుట పరతంత్రులగుచు అంటే అఖండస్వరూపములో ఈశ్వరతనువైన యెరుకను లీనముచేయుటే పరతంత్రం. యెరుకమాలినవారికి యెరుక యున్నదా అనగా యెరుకను ఈ విధముగా విడిచిపెట్టిన వారికి యెరుకయున్నదా లేదు అని అర్థము అఖండ స్వరూపమైన అచలమును యెరుక లేక సేవించే పరతంత్రం చేయుచూ యెరుకను అచలములో లీనము చేయుచున్న అనగా నిరంతరము పరతంత్రునకు యెరుక ఏమి లేనిదై జెప్పను నీటిలో నీరు కలిపి నీరైనట్లుగా యెరుక అచలమగును అనగా యెరుక అచలములో లీనమై అచలమే యుండునని భావము.

**166 ॥ గురు మంత్రముచే విలువని -యెరుకను పరిపూర్ణమనుచు నెరిగి నిరతమున్-యెరుకైయుండినవారల - తెరువిక నీకేల-వట్టిదిజోలిమానూ-యెరుకలేని - యాజోలిబూనూ-గురునీ చె పరిపూర్ణమరసియా తెలిసిన -యెరుక నెన్నటికీవిడెరుగా కుమిదివట్టి-దీ జోలిమానూ-యెరుకలేని యాజోలిబూనూ ॥ 6**

తా॥శిష్యా! గురుమంత్రమనగా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరము యేమీలేదు అనేదే గురుమంత్రం ఈ మంత్రముచే లేకపాయే యెరుకను పరిపూర్ణమనుచు నెరిగి నిరంతరం యెరుకైయున్నవారితో స్నేహము మానుకొనుము ఈ యెరుకవట్టిది దీనినే పరిపూర్ణమనినమ్మి సర్వకాలం యెరుకైయున్నవారి మార్గం నీకెందుకు, యిదివట్టిది ఈ జోలిమాను యెరుకలేని యాజోలిపూనుకొనుము, గురుమూర్తిద్వారా విచారించి గురుకరుణచే పరిపూర్ణమెరిగి ఈ ఎరిగిన యెరుకను ఎన్నడూ ఎరుగను అనగా ఏ తెలివిచేత తెలుసుకొని పరిపూర్ణమైనావో ఆ తెలివిని ఎరుగకు అనగా యెరుకను ఎన్నడు ఎరుగకుండా యెరుకను విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము :** రామ యోగి చెప్పిన గురువాక్యం

శిష్యా! సర్వమును గుర్తెరిగెడి యీ శరీరం మేమిలేదు దీని నెప్పుడును మరువవద్దు అంతకంటె నెక్కువ లేదు ఈ శరీరం నమ్మవద్దు కలలో తోచిన శరీరములు మేలు కొనునప్పుడు లేవనే నిశ్చయముండవలెను ఇదే భ్రాంతి రహితము ఇదియేషోడశాక్షర బ్రహ్మవిద్య దీనినెప్పటికివి జ్ఞాపకముంచుకొనుము మూలము లేని గుర్తెరిగే శరీరం యేమీలేదు. అనువాక్యములో మూలములేదు అనునదే మొదటి సూచన అనగా

**శ్లో॥ అమూలం చాప్య సత్యంచ । అకార్యం కారణాత్మకం ।**
**భ్రాంతి స్మృతి భ్రమాకారం । తత్రభ్రాంతిస్తు లక్షణం ॥**

తా॥ యెరుక మూలములేనిది అసత్యమైనది కార్యకారణ రహితమైనది భ్రాంతి స్ఫూతి - భ్రమలేయాకారముగా గలదియై యున్నదనిభావము ఈ యర్థములో ఎరుకకు మూలం లేదనే భావము సిద్ధాంతమైనది అని శెలవిచ్చియున్నారు.

**167 ॥ లేనికలదే చినప్పుడు - లేనివిచిత్రంబులన్ని లేక నెతేచున్ - లేనికలమేలుకొన్నను- లేనవిచిత్రములు తాను లేకాపోవుగదా - అనుమానాము - లేదిందువినరా - లేనెరుక యూరీతిగానె బయలును జూస్తె - తాను తన చిత్రములు - పూనెందునిలచుండ - లేకపోవుగదా - అనుమానాము - లేదిందువినరా ॥ 7**

తా॥శిష్యా! లెనికల గలిగినప్పుడు లేని చిత్రంబులన్ని లేకనేతోచును, అనగా ఎరుకేకల ఆకలయే లేని యెరుక. ఈ యెరుక లేని కలకన్నప్పుడు, లేని వేకలగాతోచుచుండును. అనగా ఈ యెరుక ఎప్పుడైతే తోచినదో అప్పుడే ఈ లేనికలలో చిత్రవిచిత్రంబులు నీకు లేకనేతోచును. ఈ లేనికల మేల్కొనినదైతే ఈ లేని చిత్రవిచిత్రంబులు తాను లేకపోవును. అనుమానమేమిలేదు. ఈ లేని యెరుక ఈ రీతిగా బయలును చూస్తే అనగా తాను బయలైన బయలును అవలోకన జేసి చూస్తే, తాను తన చిత్రములు వెంటనే ఎందున నిలవకపోవును అని భావము.

**168 ॥ మరణసుషుప్తుల జెందిన - పురుషుడు మేల్కొనినవాడు భువితదితరుడౌ - పురుషుడు కలగనువాడని - యెరిగుండుము - మొదటి యతడెరుగాడిరెంటి్ని - రెండో పురుషు - డెరుగు నీ రెంటి - యిరువురొక్కటె సుమ్మి తిరిగీ పుడుదురు వీరె - గురునిచె మేల్కొంటె - తిరిగి పుట్టనెపుట్ట - డెరుగాడిరెంట్ని - రెండ పురుషు - డెరుగూనీ రెంటీ్ని ॥ 8**

తా॥శిష్యా! మరణసుషుప్తులు జెందిన పురుషుడు అనగా మరణించినవాడు సుషుప్తి జెందినవాడు, వీరిద్దరిది ఒకటే స్థితి, వీరు ఏమీ ఎరుగనివారు, అనగా మరణించిన సుషుప్తిజెందిన వీరిది ఒకటే స్థితి, మేల్కొనినవాడు వారికి యితరముగా వున్నవాడు కలగనువాడని యెరుగుండుము, అనగా మేల్కొనినవాడు వచ్చేవారిని పొయే వారిని మరణించిన వారిని నిదురించువారిని, అందరినీ ఎరుగును వీడు, రెండవవాడు, మొదటివాడు, వాడ్ని ఎరుగడు, ఇతరము ఎరుగడు, రెండవ పురుషుడు వాడ్నీ ఎరుగును, ఇతరముగా వున్నవారిని ఎరుగును, కాని ఇరువురు ఒకటే. వీరిద్దరు కూడా తిరిగి జన్మించేవారే, వీరేగురుని ద్వారా విచారించి మేలుకుంటే, అనగా తాను బయలై అచలమైయుంటే తిరిగి పుట్టనే పుట్టరు అని భావము.

**విశేషార్థము :** నిర్వికల్పసమాధిలో వున్నవారైనా, యోగాభ్యాసములు చేయువారైనా, సుషుప్తిలో వున్నవారైనా, ఎవరైనా గాని తిరిగి జన్మించేవారే, వీరే సద్గురుమూర్తికిఅను

గుణ్యముగా సేవలుజేసి, గురుకరుణ పొంది గురుసూచననే యుక్తి సంపాది మేలుకుంటే. అనగా ఆ సంపాదించిన యుక్తి ద్వారా విచారించి తాను బయలై అచలమైయుంటే, తిరిగి జన్మించక జన్మరహితులౌతారు. ఎందుకనగా సమాధిలోనుండి మెలుకువ వచ్చిన తరువాత సంకల్ప వికల్పములు పొందుతారు, అలాగే వాచార్థముగాబయలని అచలమని పరిపూర్ణమని మాటలు చెప్పటయే గాని, బయలును ఎరుకను ఎరిగిగని ఈ రెంట్లో దేన్నీ యెరుగని వునికి తెలియనివారు, ఎన్నిమాటలు చెప్పినా ఎన్ని వేషములు వేసినా వీరు జన్మరహితులుగారు, జన్మమెత్తేవారే. జన్మరహితులెవరనగా 198 కం॥ ధ్వని మొదలగు తన్ మాత్రలు అను కందార్థములో చెప్పినట్లు విచారించినవారే జన్మ రహితులు, తిరిగి పుట్టనివారని భావము.

**169 ॥ యెరుకే యెరుకకు కొడుకులు - యెరుకే తలిదండ్రి యెరుక కెరుకే యితరుల్- యెరుకే యెరుకకు మూలము - యెరుకకు మూలంబు బయలం - చెట్లందు వోయీ - యెరుకే యెరుక - కేమి లేదోయీ - యెరుక లేని వుత్త పరిపూర్ణమును జూచి - యెరుకె తాలేనని - యెరిగిపోయితెపై - మాటెట్లందువోయీ యెరుకే యెరుక - కేమీ లేదోయీ ॥ 9**

తా॥ శిష్యా! యెరుకకు యెరుకే కొడుకులు, తల్లిదండ్రి యెరుకే యెరుకకు ఇతరములు యెరుకే, యెరుకే యెరుకకు మూలము, యెరుకకు యెరుకే ఏమీ లేదు. యెరుక లేని ఉత్త పరిపూర్ణమును జూచి. అనగా తాను బయలైన అచలమును జూచి, ఎరుక తాను లేనని యెరిగి పోతే; యెరుక అచలమునుజూచి అంటే తాను అచల మైతే, యెరుకేది లేదని అర్థమైనది ఆపైమాట పలుకులకెట్లు అని భావము.

**170 ॥ గురుతనుకలలోనారీ - నరులూరికె వచ్చి పొంది నయముగసుతులన్ - వరకన్నియలను గాంచియు - గురువరుచే మేలుకొంటె - గురుతుండదన్నా - ఆపైమాట - నెరిగెదేదన్నా - యెరుకొక్కటుంటెనే యేర్పాటు లుండును - యెరుకొక్కటె గితె - యేర్పాటు తోసేటి - గురుతుండదన్నా - ఆపై మాట - నెరిగెదేదన్నా ॥ 10**

తా॥ శిష్యా! గురుతు అనేకలలో నారీనరులు ఊరకే వచ్చి, క్రీడించి కుమారుళ్ళను కుమార్తెలను కన్నట్లుగా కలవచ్చినది, ఇది గురువరుచే మేలుకుంటే, తాను బయలై గురుతేలేదు, ఆపై మాట నెరిగేది ఏమున్నది. యెరుక ఒకటి యుంటేనే ఈ ఏర్పాట్లన్నీయు జరుగును, ఎరుకలేకపోతే ఏర్పాటు చేసే వారెవరు లేరని భావము.

**విశేషార్థము :** గురుతనేకలలో భార్యతో కాపురము చేస్తున్నట్లు కొడుకులను కుమార్తెలను కన్నట్లు కలవచ్చినది, ఇతడు గురువుగారిచే మేలుకుంటే, గురుతుండదన్నా, అనగా

గురుసూచనయనే యుక్తిచే విచారించి మేలుకొండే. గురుతనేకలలేదు, అనగా తానుపొందుచున్న కలలేకపోయేసరికి, తాను బయలై అచలమై యుంటేను, అందువల్ల గురుతులేదు, గురుతు పొందేకలలేదు, తాను అచల పరిపూర్ణుడై యుండేనని భావము.

యిందుకు పండిత శివానందస్వామి ఎరుక దేహవైలక్షణ నిరసన ప్రకరణము - 51వ పేజీలో చచ్చినవానికి దేహమ్మున్నదని తోచలేదు, వానికి రెండున్నూ లేవు. వాడుమేల్కొన్నవాడు. యెరుక వున్నవానికి. సమస్తమున్నవి, మీరు కలలోనివారు వాని దగ్గరకుపోయి అడిగితే, వాడు చెప్పునా ? కలలోనివానికి మేలుకున్నవాని వర్తమానము తెలియదు, గనుక ప్రకృతితో కూడా పురుషుడుపోయెను, గనుక దేహిదేహములు రెండును ఒక్కటే, దృగ్దృశ్యములు రెండున్నూ యేకమే, జగద్బ్రహ్మలు రెండున్నూ ఏకమే ఆ ఒకటికూడా మూడు కాలములు యందూ లేదు, మూడవస్థలయందూ లేదు, చేసిననూ చూచిననూ వినిననూ తినిననూ కనిననూ పండుకొనిననూ యిదే యిదియే కాలమందునూ లేదు.

**171 ॥ నిను నను నివుకలగాంతువు - నినునను కలలోన - గాంతునేనొకవేళన్ - నినునను నివు నేననునిను - గనుగొనగా గలమె - మేలువినా మీదటనూ - గురుబోధట్ల - వినినా మీదటనూ - మునుపుగలిగిన యెరుక - మొదటికినిలువాదు - నిను నన్నునేనన్ను నిను నీవెరుగుట మెట్లు - కనినా మీదటనూ - గురు బోధట్ల - వినిన మీదటనూ ॥ 11**

తా॥శిష్యా! నిన్ను నన్ను నీవు కలలో చూచెదవు, నిన్ను నన్ను కలలోన నేను ఒకవేళ చూచెదను, నిన్ను నీవు నన్ను నేను నీవు నన్ను.నేను నిన్ను, మేల్కవచ్చిన మీదట చూడగలమా, అలాగుననే గురుబోధ అటుల విన్నతరువాత, మునుపున్నఎరుక మొదటకే నిలువలేకపోవును. అనగా ఈ మేల్కయనే స్థితి కలిగి, తాను బయలైన తరువాత, ముపుగలిగిన యెరుకేదిలేదు. గనుక నిన్ను నన్ను నను నిను ఎరిగేది లేదు గదా, అందువల్ల ఒకరినొకరము ఎట్లు చూడగలము, చూడలేమని భావము.

**విశేషార్థము :** కలకన్నప్పుడు కలలోన వస్తువులు నిజమని భావించును, ఆ కలమేలుకున్నప్పుడు. కలలేదు కలలోగన్న వస్తువులు లేవు, అని తెలిసింది, అలాగే గురుబోధవల్ల యెరుకయనే కలమేలుకున్నప్పుడు, యెరుకేది, మేల్కయిన పరిపూర్ణమె వున్నది. అనగా తాను బయలైన పరిపూర్ణమే యున్నది అని భావము.

ఇందుకు అచలబోధ శిఖామణిలో 122వ పేజీలో అలాగుననే పరిపూర్ణ భావమును తెలిసితే భ్రాంతి పుట్టదు, లేకపోతే భ్రాంతి చెడదు, యిది పూర్వము

స్వతఃసిద్ధము అని పరిపూర్ణమును చూపించి భ్రాంతి బాపి విద్యావిద్యలుమాపి తనను క్షణమాత్రములో లేకుండా చేయును పరమగురుని యొక్క అనుగ్రహము గలిగితే అనిర్వాచము అనామయ అచలసిద్ధి నొందును అని శెలవిచ్చియున్నారు.

**172 ॥ విను నీవు నన్ను నేనును - నను నివు నేనిన్ను యెరిగినదె కలయిదితా - తననెరుగని దానిని గని - తన కలిమిమృషనుచు దెలసి - తానేగెనేని - అది మేల్కవలి - దాన్నెవ్వాడెరిగీనీ - నను నీవు నేనిన్ను బోధ - వినిపింఛువిను మాని - యనుటాకిద్దరికిపుడు - మునుపున్న యెరుకేది - తానేగెనేని - అది మేల్కవలి - దాన్నెవ్వడెరిగినీ ॥ 12**

తా॥శిష్యా! నిన్ను నీవు నన్ను నేను ననునీవు నిను నేను ఎరిగినదేకల, యిది తనను తాను తెలియని దానిని తెలుసుకొన్నట్లైతే, తనకున్న యావత్తుతాను, మృషయని తెలిసి తానులేకపోయినట్లైతే, అదిమేల్క, తాను పరిపూర్ణమౌట. దీనికి ఆవలి విషయం యిక ఎవరికి తెలుసును, నన్ను నీవు నిన్ను నేను బోధ వినిపించు మనడము మీరు వినమనడము, అనుటకు మునుపున్న యెరుకేది, మనయిద్దరికి యెరుక యుంటేనేగదా, ఏమైనా ఏర్పాట్లు చేయును, యెరుక లేదు గనుక ఏమీ లేదని భావము.

**విశేషార్థము** : ఈ కలను పొందే యెరుక, తనను ఎరుగని పరిపూర్ణమును చూచి, అనగా తాను పరిపూర్ణమౌట ఎరిగి, తనవల్ల కలిగిన జగత్తంతా లేని కలయని యెరిగి, తాను లేకపోవటమే మేల్క, అనగా తాను పరిపూర్ణమౌటము, అట్లు తాను పరిపూర్ణమైతే, ఆ తరువాత అనగా ఆ లీలలు ఎరిగేవారు ఎవ్వరున్నారు. ఎవ్వరు లేరని భావము యిందుకు రామయోగి కందార్థం

కం॥ ఉదయలయాదులనెరుగక - నుదయలయాదులను జూడనొల్లకనెదుటన్ - కదలక మెదలక నిలచిన దదిగోరా బట్టబయలల్లదిగోరా తండ్రీ - యెరుకచే. నెరుగవలెరా మా తండ్రీ మొదటి దేశికునోట - తుదముట్టే మాటా నెమ్మది దెలసి యెరుకను వదలిపెట్టే - బాటలిదిగోరా తండ్రీ - ఎరుకచే నెరుగ వలెరా మా తండ్రీ ॥

తా॥శిష్యా! పుట్టుచావులనెరుగక నెదురుగా కదలక మెదలకుండ నిలచియున్న బట్టబయలు యిదే యెరుకను వదలిపెట్టే బాటయైన పరిపూర్ణమదిగో చూడుము, దీనిని శుద్ధమైన యెరుకచే తెలిసికొనినా యెరుకను వదలిపెట్టుమని భావము.

**173 ॥ తిమిరారియందు లేనిదె -తిమిరము తనుదానె వచ్చితే జోనిధియా - తిమిరారి యునికి గనుగొని - తిమిరము తానిలువనట్లు - తెలుసుకోరాదా - బయలెరుకాల- తెలసి యా మీదా- భ్రమరూపమైనట్టి బ్రహ్మాండమెరుకాల - భ్రమదీసివేసితె భ్రాంతి బుట్టదుమళ్ళి - తెలుసుకోరాదా - బయలెరుకాల - తెలిసీయా మీదా ॥ 13**

తా॥ శిష్యా! తిమిరమనగా చీకటి. తిమిరారి అనగా సూర్యుడు. చీకటిలేనిదే దానికదే వచ్చి కమ్ముకొనును. తేజస్సుతో యున్న సూర్యుని యొక్క ఉనికి తెలుసుకొన్నంత మాత్రముచే, ఆ చీకటినిలువలేక పారిపోయెను. అట్లే బయలు యెరుకలను తెలుసుకొనరాదా ? అనగా బయలందు లేనిదే యెరుక తనకు తానే వచ్చి, బయలును ఎరిగి యెరుక నిలవకుండా పారిపోవును, మరియు భ్రమరూపమైన బ్రహ్మాండ మెరుకల భ్రమదీసివేస్తే అనగా ఈ రెంటికీ అతీతమైన తాను బయలైతే, భ్రాంతి పుట్టదు. మళ్ళీ తిరిగి పుట్టదని భావము.

**విశేషార్థము :** సూర్యునియందు చీకటిలేనిదే తనకుతానే వచ్చి, సూర్యుని తేజస్సు సూద్దామనేసరికి, నిలవకుండా పోయినట్లు, బయలులో యెరుకలేందే తనకు తానే వచ్చిన యెరుక, బయలును చూద్దామనేసరికి, నిలువకుండా యెరుకలేకపోయెను, అనగా తాను బయలవుదామనే సరికే యెరుక నిలువకుండా పోవును, కానీ ఆ బయలులో మరలతోచును, తాను మరల బయలైతే యెరుక నిలువకుండా పోవుచున్నది, ఈలాగు విచారించుచుంటే కొన్నాళ్ళకు ఎరుక నశించి, బయలు తిరముగా నిలుచునని భావము. ఇందుకు రామయోగి కందార్థము

కం॥ ఖండాఖండములొందక - నిండిన పరిపూర్ణ మెరిగి నెరిగెరుకనుదా - ఖండించి
చిజ్జడంబుల దండిగ పరిపూర్ణమెరుగనుండువారెవరూ - మండితముగను -
నిండువారెవరూ - యెండలోపలనున్నదండి చీకటిచాటు - మొండిదేహము
లేక.యుండునట్లనె చూడు. ముండు వారెవరు - మండితముగను -
నిండువారెవరూ ॥

తా॥శిష్యా! అఖండమైనటువంటిదియు. (అనగా భావింపరానిదియు) సర్వ దిశలయందు నిండియున్న ఈ పరిపూర్ణమును తెలసుకొనుము. చిద్రూపముగాను జడస్వరూపముగాను, (శరీరాత్మల రూపముగా) పరిణమించియుండునీ లేని యెరుకను పారదోలుము, అట్లెరుకపోయిన పిమ్మట. పరిపూర్ణము నెరుగువారెవరుండురు, అనగా పరిపూర్ణమొక్కటియే. అంతటా నిండి అనంతమైయుండును. ఎండయందు చీకటిదాగి యుండి కనపడనటుల పరిపూర్ణమందు శరీరాత్మలు దాగియుండి, కనబడకుండా పోవును.

174 ॥ లేదులేదనుచు యెందరు - వాదించిన లేకపోదు పరిపూర్ణముదా - పోదుపోదనుచు నిల్చిన - పోదవియను కోకు - యెరుక - పోనెపోచుండీ - గట్టిగలేచి - పోనెపోచుండీ - వాదబేధములేని వారీ చెయెరుకాది - పాదూ పెకలించేటి పద్ధాతి నెరిగితె- పోనేపోచుండీ - గట్టిగా లేచి - పోనేపోచుండీ ॥ 14

తా॥ శిష్యా! పరిపూర్ణములేదులేదు అని ఎంతమందివాదించినా లేకపోదు, 25వ దైన ఎరుకను ఎంతమంది ఉన్నదని నిలిపిన అది ఉండేదికాదు, పోయేదే నిజముగా పోయేదే, ఎలాగంటే వాదబేదం లేనివారిచే, ఎరుకయొక్క ఆదిపాదులు పెకలించేటి, అనగా సచ్చిదానంద స్వరూపమైన అఖండెరుకను, రహితపర్చే పద్ధతి నెరిగితే, అనగా అచలములో యెరుకను లీలనముచేసే, పద్ధతి నెరిగిన, అచలమే తానై అందులో ఎరుక పుట్టకుండా, తానెపుడూ అచలమై పరిపూర్ణమైయున్నవారికి, అఖండానుభవరహితమై, ఎరుకలేక ఉంటారని భావము.

**విశేషార్థము** : రామయోగి కందార్థము

కం॥ నిజముగ నిలువని తనువులు - నిజముగ మన మెంతవరకు - నిలుపవశంబౌ నిజపరిపూర్ణ ప్రభగురు, నిజదేహము నీవటంచు నెరిగితే సరిరా - యెరిగే వ[illegible] గజిబిజిగదరా - అజభవాదులు నైనని జరుగు - ప్రభగని విజనదేశములలో, సుజనులై తను మహిమ నెరిగితే సరిరా - ఎరిగేవరకు గజిబిజి గదరా ॥

తా॥శిష్యా! నిలవకుండా పొయ్యే మాయాశరీరములను, మనమెంతవరకు నిలుపశఖ్యమగును, నిలుపుటకు వశముగాదు. బ్రహ్మ, విష్ణు, శివులైనను, గురు స్వరూపమైన పరిపూర్ణమే తమ నిజదేహమని, తెలుసుకుంటే చాలును, ఈ మర్మము తెలిసేవరకు చిక్కుగానుండును, గాన పరిపూర్ణమే నీ శరీరమని నమ్ముమని భావము.

175 ॥ మేనెరుకలరెంట్లో నొక - దానినియెడబాసిచేయ తరమా పనులన్ - మేనికి యెరుకకు గావున - మేనన యెరుకెరుకయనిన - మేనాని యెరుగూ - యీ రెంట్ని - నివునేనాని యెరుగూ - యెరగినీట్లతొ బయలు నెరిగీ - మేనెరుకాల - తిరిగి చూడకు చూస్తె - గురునిపాదములాన - మేనానియెరుగూ - యీ రెంట్ని - నివు నేనానియెరుగూ ॥ 15

తా॥ శిష్యా! మేనెరుకల రెండింటిలో, ఒకట విడిచి, యింకొకటి పనిచేయలేదు,అనగా మేను అనినా నేను అనినా ఒక్కటే, దానికిది దీనికది జత, మేనుని విడిచి నేను, నేనును విడిచి మేను ఏ పనిచేయజాలదు, గావున మేననినను నేనునినను యెరుకే, నేను మేను యనిననూ ఒకటే, ఈరెంట్నీ నీవు నేను అని తెలుసుకొనుము, యిట్లు యెరిగి, వీటితోనే బయలును ఎరిగినట్లైతే, యెరుకతోనే

యెరుక, బయలులో ఏమీ లేదని ఎరిగినట్లైతే, ఎరుక కానరాకుండా పోవును, తాను బయలైయుండును. గావున ఈ నేను మేనులను విడిచిపెట్టి, తిరిగి చూడకు, చూస్తే గురుని పాదము తప్పినట్లే అని భావము.

విశేషార్థము : రామయోగి కందార్థం

కం॥ తెలిసివిచారించితె తనతెలివంతట నిండియున్న తెలియగవలెపో - యిలక్షేత్రా క్షేత్రజ్ఞులు - కలకాలములేని గతిలో కడకుపోవలదా - తెలిసేకలసే నెల వెరుగవలదా తడిలేని తీర్థము - పొడిలేని ప్రసాదమెడలేక గురునిచే బడసినద్గతిలోన - కడకుపోవలదా తెలిసే కలిసే నెలవెరుగవలదా ॥

తా॥ శిష్యా! చక్కగా విచారించితే, తెలివి అంతటా నిండియున్నట్లుండ వలెను, ఎప్పటికిన్నీ దేహిదేహములు లేకపోవలెను, సద్గురుమూర్తి చేత, తడిలేని తీర్థమును పొడిలేని ప్రసాదమును, గ్రహించి, పరిపూర్ణమును జెందవలెను, తడిలేని తీర్థమనగా బోధామృతము, పొడి లేని ప్రసాదమనగా, అఖండమైన పరిపూర్ణమని భావము.

**176 ॥ మరుపుసుషుప్తియుమూర్ఛయు - మరణంబు సమాధియనుచు మానవులెరుకన్- దొరిగిన నొరునిశరీరము - నెరిగెదరానరుడు - మేనునెరుగాడేయన్నా - తన నైన తా - నెరుగాడేయన్నా - యెరుగాకుండితె యేమి తిరిగిపుట్టుచునుండు తిరిగి పుట్టడువాడె - గురుబోధ గలిగితె - యెరుగడోయన్నా - తననైన తానెరుగడోయన్నా ॥ 16**

తా॥ శిష్యా! మరుపులోవున్నవాడు సుషుప్తిలో ఉన్నవాడు మూర్ఛలో ఉన్నవాడు మరణించినవాడు సమాధిలో ఉన్నవాడు ఈ ఐదుగురు యొక్క స్థితి సమానమే గనుక, వారి శరీరమునే వారెరుగరు, ఇతరమును అసలే ఎరుగరు, ఏమీ యెరుగకుండిన, మరల పుట్టుచు గిట్టుచునే యుందురు, వీరే, సద్గురువును ఆశ్రయించి గురుబోధనెరిగితె, అనగా గురుని ద్వారా గురుస్వరూపము యొక్క బోధవిని, ఆ సూచన గ్రహించి, ఆ గురుస్వరూపము తానయ్యే మార్గమునెరిగితే, అనగా తాను బయలై అచల పరిపూర్ణమైయుంటే, తిరిగి పుట్టనే పుట్టరు అని భావము.

విశేషార్థము : రామయోగి కందార్థం

కం॥ యిది తెలిసినవారు మహా - పదసింహము వంటివారు **భ్రాంత్యాక్షానా** - స్వదకరి సంఘములాదలిన నొదిగిన భయమేమి గలుగు - నుత్తము - కెదుటా ఏమనినా తప్పే తప్పులచటా - యిదియే । సర్వానర్థములకు మూలము గనుక నెదురేమి మాట్లాడ - గదియ బోవుటతప్పు నుత్తముకెదుటా - ఏమనినా **తప్పే తప్పులచటా**॥

తా॥ తడిలేని తీర్థమును, పాడిలేని ప్రసాదమును, విచారించిన పరిపూర్ణులు సింహము వంటివారు, అట్టివారి ముందర భ్రాంతిలో బడి కొట్టుకొనే జ్ఞానులను ఏనుగుల గుంపులెన్ని వచ్చినా, పరవాలేదు, వారి ముందర ఏమి మాట్లాడిన తప్పు, మాట్లాడిన దానితో గూడా ఏమీ లేదు గనుక వారితో ఎదిరించి మాట్లాడుట, సర్వానర్థములకు, కారణమని భావము.

**177 ॥ పరిపూర్ణ మెరుకలివియని- యెరుగని బయలందు లేని యెరుక తనకుదా- నరు దెంచిట గురుశిష్యుల -తెరగున మాట్లాడిరెంట్ని - దెలిసి తాజనునూ -ఆ పైమాట- పలికెదేదికనూ - అరమారలేకనే - నెరిగించినట్టియా - గురుబోధ పాత్రుల నెరుగాక తెలిపేవు - తెలపి తాజనునూ - ఆపై మాట పలికేదేదికనూ ॥ 17**

తా॥ శిష్యా! పరిపూర్ణమెరుకలు యివియని ఎరుగని బయలందు, తనకుతా వచ్చి అనగా పరిపూర్ణమనగా ఎటువంటిదో ఎరుకనగా ఎటువంటిదో ఈ రెంట్నీ ఎరుగని బయలులో, ఈ లేనెరుక తనకుతానే బయలు దేరి వచ్చి. అనగా జీవేశ్వర్లుకు అతీతమై అచలమై పరిపూర్ణమై ఏమీ ఎరుగని బట్టబయలులో. ఈజీవేశ్వర్లనే ఎరుక తనకుతానే ఆకాశమై, ఆకాశములో మనస్సు కల్పింపబడి, ఆ మనస్సు యొక్క ప్రేరేపణవల్ల, గురుశిష్యులుగా, సంభాషించుచు. దీన్ని గ్రహించి తెలుసుకొని, నేను లేని దానినే అని ఎరిగి, లేకపోయెను. ఆపై మాట పలికేవారెవరున్నారు. నాయనా ఎరుకమరుపులు లేని అచల పరిపూర్ణమును నీకు ఎరిగించితిని, ఇట్టి గురుబోధను అపాత్రులైన, అనగా సచ్చిదానంద స్వరూపమైన శుద్ధయెరుకయనే అఖండయెరుకను ఎరుగని వారికి, ఎరిగించకుమని భావము.

**విశేషార్థము** : రామయోగి కందార్థము

కం॥ ఈ బోధ సరిసమానము - నే బోధలుగావటంచు నేయుపదేశ ప్రబలికుడైన - గురునిచేనే బోధను వింటిదాని నీకు దెలిపితి రాదుష్టులకిదియు కాబట్టునటరా- యే బోధగురువైననీ బోధ నివ్వక సర్వబద్ధమగు యెరుకాలా బోధ దెలుపుదురు నీకు దెలిపితిరా - దుష్టులకిదియు కాబట్టునటరా ॥

తా॥ శిష్యా! ఈ బోధకు సమానమైన బోధనే బోధయు కాదని, నా అచల గురువుచేత విన్నానో, నా బోధను నీకు తెలియజేసితిని, దుష్టులగు నీచులకీ బోధ కాబట్టదు, సాధారణముగా లోకమందే గురువైనా నీ బోధనివ్వక, సర్వాబద్ధభ్రమ రూపకమైన, యెరుక బోధే జేయుదురని భావము.

**178 ॥ మరుపుసుషుప్తి - మరణముల్ - పరిపూర్ణమంబునకు సాటిపరచియెరుకకున్ - మరియాది మేల్కొపుట్టవు - విరుదెరగుల నెరిగియెరుక - నెగరజిమ్మోయీ - ఆపైనుండె - దెంగెడెట్లోయీ - గురుమంత్రమిదె సుమ్మి మరువాకయే ప్రొద్దు స్మరణజేసితివేవి - తిరిగి పుట్టవుపివి - ట్లెగరజిమ్మోయీ - ఆపైనుండె - దెంగెడెట్లోయీ ॥ 18**

తా॥ శిష్యా! మరుపుసుషుప్తి మరణం ఎలాంటివో, పరిపూర్ణం కూడా అలాంటిదని తెలుసుకో, ఎరుక ఆదిలో యలాగున ఉన్నది, పుట్టిన తరువాతను ఎలాగునున్నదో, మేల్కలో ఎలాగునున్నది, విచారించిచూడు, ఆదిలో ఆకాశమై యున్నది, అందులో సృష్టెయ్యి పుట్టినది, అనగా సినిమా తెరపై బొమ్మల్లాగ తన సృష్టంతా చూపించినది, మరల మేల్కొనేసరికి ఆకాశమైనది, అనగా సినిమా తెరమీద మొదట ఏమీ లేదు..ఇదే ఆకాశము, అందులో ఎరుక తనకు తానే వచ్చి, ఆ తెరమీద అనేక చిత్రవిచిత్రమైన బొమ్మలు చూపించినట్లు, ఈ లేనెరుక అనేక సంకల్ప వికల్పములతో అనేక చిత్ర విచిత్రములైన ఈ దృశ్యప్రపంచమంతా చూపించినది, మేల్కొనే సరికి, ఆకాశమై బయలై యున్నది, అలాగే సినిమా చూచిన తరువాత ఉన్నది ఉత్తతెరే, అనగా పరిపూర్ణాన్ని విమర్శించి చూస్తే ఏమీ లేకఉత్తదైయున్నదని ఎరిగి, ఆ తరువాత ఎరుకను విచారించి చూచితే, ఆదిలో ఏమీ లేదు, మేల్కలో ఏమీ లేదు, ఈ మధ్యలో తన చిత్రవిచిత్రాలన్నీ చూపించుచున్నది, యిరుదెరగుల విచారించి చూస్తే, యిది బయలైయున్నది, అదీ బయలై యున్నది, ఈ మధ్యరకంగా కనుపించే ఎరుక ఏమీలేందేకదా, దీన్ని లేకుండా చేస్తే, ఉన్నది బయలేకదా, ఈరకంగా ఎరుకను లేకుండా చేస్తే ఆపైన మాట్లాడేవారెవరున్నారు, ఎరిగేదేమున్నాది మూలంలేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదనే మార్గమిదేనని భావము.

**విశేషార్థము :** రామయోగి కందార్థము

కం॥ అవికృతపరబయలు -లోబయ - లవలీలగ జూచి జూచియాచూపులో - చూపవ శీకృతమగునిద్రలో - తవిలిననిర్ని ద్రగనుటే తత్వ దర్శనమూ - యిది సర్వవిరహిత సుఖప్రదమూ - ప్రవిమలాఖండ శ్రీ శివయోగ చలభావ - వివరణా వరణ భూ వలయా నిర్వ్యాపక - తత్వదర్శనమూ - యిదే సర్వవిరహిత సుఖపదమూ ॥

తా॥ శిష్యా! వికృతి రహితమైన పరిపూర్ణమందు, పరిపూర్ణమును చూడగా, ఆ చూపులో చూపులీనమై, వ్యాపకరహితమై సుఖమును జెందుటే, పరిపూర్ణత త్వ దర్శనము, యిది సర్వరహిత సుఖమునిచ్చు, శివరామ దీక్షితుల వారి అచల దర్శన, తత్వమని భావము.

**179 ॥ క్షితిలోన నరుడు పక్వా - న్నతతిని దిని కక్కి మరల నాకు నెయతి సం-స్మృతి విడిచి తిరిగి పూనునె - వితరణశా లిచ్చిన ట్టి - విశ్రామడిగినె - సత్యవాది - సత్యాముడిగినె - ప్రతిలేని గురుబోధ స్థితి జెందియెరుకాని - గతి సంగ్రహించాడు- కృత కృత్యుడిచ్చిన - విశ్రామడిగినే - సత్యవాది - సత్యాముడిగినే ॥ 19**

తా॥ శిష్యా! భూమి మీద మనుజుడు, ఉడికిన అన్నము తిని కక్కి మరల ఆ అన్నమును నాకునా, నాకడు యతితన సంస్కృతి విడిచి మరల పూనునా పూనడు.

వితరణ శాలి యిచ్చిన విత్తము ధనము. మరల అడుగునా అడుగడు, సత్యవ్రతము గలిగినవాడు సత్యము మానునా మానడు, అట్లాగుననే ప్రతిలేనిఈ గురుబోధ అనగా ఏ ప్రతిమలు లేని పరిపూర్ణబోధ స్థితి చెందిన మనుజుడు. అనగా తాను బయలైయుంటే ఏరూపములు కనుపించవుగనుక, ఎరుకను ప్రేమించడు, ఎరుకను విడిచిపెట్టును. కృతకృత్యుడు యిచ్చిన విత్తము ధనము అడుగడు -

**విశేషము** : ఏ ప్రతిమలు లేక ప్రతి రహితమైయున్నవాడు. ఎరుకను యెరుగడు, అనగా యెరుకలేక ఉత్తబట్టబయలై **ఉన్నది వున్నట్లు వున్నవునికి** గలవాడు. యెరుకను యెరుగడని భావము.

**180 ॥ మరుపన తొలిమేనులుమూ - డెరుకననాలవ శరీర మిారెండొకటే - పరిపూర్ణ మవలిదీవలి - యెరుకను గురువాక్కుచేత - యెగరాజమ్మిననూ - పోవును లేని- దెరిగెడేగిననూ - యెరిగేది లేకుండు - యేమొ ఆవలిజాడ - నెరిగెవారెవరింక - యింతెచాలెరుకాను - యెగరాజమ్మిననూ పోవును - లేని - దెరిగేదేగిననూ ॥ 20**

తా॥ శిష్యా! మరుపనగా స్థూల. సూక్ష్మ, కారణ శరీరములు మూడు, ఎరుకనగా మహాకారణ శరీరము. ఈ రెండూ ఒక్కటే. పరిపూర్ణం ఆవలిది, అనగా 24 ఇంద్రియములతో కూడియున్నది స్థూల శరీరము, దీనికన్నా లోపలయున్నటువంటిది సూక్ష్మ శరీరము. ఈ సూక్ష్మ శరీరం కన్నా లోపల ఉన్నటువంటిది కారణ శరీరం, ఈ కారణ శరీరం కన్నా లోపలయున్నది మహాకారణ శరీరం, ఇది ఎరిగె ఎరుక. దీనికన్నా లోపల ఉన్నటువంటిది అచల పరిపూర్ణము. అనగా ఒకదానికన్నా ఒకటి అంతరంగా లోపల ఉన్నవికాని బహిర్గతంగా లేవు అందువల్ల మనకు బహిర్గతముగా కనుపించేటటువంటి. ఈ భూతాకాశం అచలములో చెప్పిన బయలుకాదు, గనుక ఈమరుపు మూడు శరీరములు. ఎరుక నాలవ శరీరము వీటిని రహిత పర్చిన యెడల ఉన్నది అచల పరిపూర్ణమే ఎరిగే ఎరుక ఏమీ లేదు, గనుక ఎరిగేది లేకపోతే ఏమో ఆవలిజాడ. అనగా ఎరుక ఏమీ లేకపోయిన తరువాత. ఉన్నది బయలని గాని అచలమనిగాని పరిపూర్ణమనిగాని, ఎరిగేదేమీ లేదని, మిగిలి శేషించి యున్నదే అఖండాను భవహితమైన పరిపూర్ణమని భావము.

**181 ॥ నానావిధావయవములు - నానా విధనామ రూప నటనలు మాయల్ - నానా విధాల వూహలు -.నేనను యెరుకందెయిన్ని- విబిడామైయుండూ - బయలును గనతా - విలువ లేకుండూ - నేనూ మేనీ రెండు నేనెనేలేకుంటె - మేనూ లేదిది లేకనేవిల్పెదెట్లిన్ని - విబిడామైయుండూ - బయలును గనతా - విలువాలేకుండూ ॥ 21**

తా॥ శిష్యా! నానారకములైన అవయవేములు, నానా రకములైన నామ, రూప, నటనలు, మాయలు, నానారకములైన ఊహలు, నేననే ఎరుకయందే నిండియున్నవి, యెరుక యీ బయలును గన్నట్లైతె, అనగా నానావిధ ఊహలు నానా విధనామ రూపములు యున్నియిమిడి ఉన్నటువంటి, ఎరుక బయలును చూస్తే, అనగా తాను బయలైనదాన్ని ఉండజూస్తే ఈ యెరుక కానరాకుండా పోయినది, గనుక నేను మేను ఈ రెండూ, నేను లేకుంటే మేను అనేది లేదు, ఈ మేను లేక నేను నిల్చేది ఎట్లు, అనగా తాను బయలై పరిపూర్ణమైయుంటే ఎరుక ఇన్నిటిని తీసుకొని ఏమీ లేకుండా పోయినదని తెలియవలెను అని భావము.

**విశేషార్థము :** రామయోగి కందార్థం

కం॥ బయలంతర్బాహ్యాదుల - బయలందియు బాహ్యాదృశ్యభ్రమవిడచి - మహా బయలై బయలను మాటయులయమైతానచలమయ్యే - లక్ష్యార్థమిదెరా- గురు కీలకమిదె తెలుసుకోరా - కయిపుకు దిరిన మీది వయిపులో జూడు నిశ్చయము గనున్నదా - బయలునీలోనా లోలక్ష్యార్థమిదెరా - గురుకీలకమిదె తెలుసుకోరా॥

తా॥ శిష్యా! ప్రపంచ భ్రమయను కైవులేని పైవైవులో జూడుము, నిశ్చయముగా పరిపూర్ణము నీలోనాలో నంతటా నున్నది చూడుము, పరిపూర్ణము వెలుపల లోపల అంతటా పరిపూర్ణమై పరిపూర్ణమనె మాటకూడా లయమై, అచలమయ్యే లక్ష్యార్థమిదెయిదే గురుకీలకమని భావము,

**182 ॥ జగముల వలన పంకల్పము - జగమా సంకల్పమునను జనియించునువే - రగుపడదు - జన్మమందిరమగుపడదెడబాసివిల్వ - వారెండెన్నటికీ - బయలును- గనినీ - వీరెంట్నెన్నటికీ - యికదల్పబోకూము - యివిబుట్టుటుళ్ళక్కి - మృగ జలమగుపడ్డ మిధ్యం చెరిగిన మాడ్కి - యీ రెండెన్నటికీ - బయలును గనినీవీ - రెంట్నెన్నటికీ ॥ 22**

తా॥ శిష్యా! జగమువలన సంకల్పము సంకల్పము వలన జగత్తు ఉదయించుచూ యుండును జగమనగా ఇంద్రియ ప్రపంచము. సంకల్పమనగా జ్ఞాతయనే యెరుక ఈ యెరుక వలనే ఇంద్రియ ప్రపంచమనే జగత్తు గలిగినది వీటికి, వేరే జన్మమందిరము కానుపించదు యివి ఒకదానిని విడచి రెండవది యుండదు. గనుక నీవు బయలును చూచి దెలుసుకొనిన అనగా తాను బయలై అచలమై యున్నదాన్ని వుండచూచి ఈ రెంట్నీ యికయెన్నదూ దల్పబోకుము, యివి పుట్టట ఉళ్ళక్కి, యెట్లనగా మృగజలము అనగా యండమావులలోని నీరు, విచారించి చూచినవారికి లేనట్లుగా ఈ జగత్తును సంకల్పమును విచారించి చూచితే నీవు బయలైన అచలమే యుండును, గనుక యెరుకను యిక దల్పకు విడువుమని భావము.

విశేషార్థము : రామయోగి కందార్థం

కం॥ యిదియే దుఃఖ విహీనము - యిదే ద్వంద్వాతీతమఖిల మిదెయద్వైతంబిదె జ్ఞానకర్మరహితము బిదెనీవును నేను లేనిదిదియే రా తండ్రీ - భ్రాంతి రహితమి దియేమాతండ్రీ - యిదెయప్పటివలెనిదె యున్న - దిదెయున్నదిదె యున్నట్లె యున్నదెరా పరిపూర్ణము యిదియేరా తండ్రీ భ్రాంతి రహిత మిదియే మా తండ్రీ॥

తా॥ శిష్యా! యిది సుఖదుఃఖ విరహితమై ద్వంద్వ రహితమై జ్ఞానకర్మ రహితమై నీవు నేనను భ్రాంతి లేనిదియై యెప్పటివలె నున్నది, ఉన్నది యున్నట్లే ఉన్నదియిదియేరా పరిపూర్ణము, ఇది శ్రీ శివరామ దీక్షితులవారిచే, నాంధ్రబాషయందు తర్జుమా చేయబడిన, ఇరువది యొక్క అచలశంకాసూచనల ప్రకరణము సంపూర్ణము.

183 ॥ పరిపూర్ణమనెటి పల్కు - యెరుకను బల్మాక్షర ములకెచ్చటగనినన్ - తిరమైయున్నది కనుగొని - యెరుకను బల్మాక్షరముల - వికగట్టిపెట్టూ - యెవరికి దెలియ -దిది మూల గుట్టూ, గురుమూర్తి కరుణాచె -యెరిగి తెల్పితినేని - పరిపూర్ణ బోధను- పరులజెప్పిన బోధ - వికగట్టిపెట్టూ - యెవరికి దెలియ- దిదిమూలగుట్టూ॥ 23

తా॥ శిష్యా! పరిపూర్ణమనెటి పల్కు, యెరుకను బల్మాక్షరములు ఎచ్చట గనినన్ అనగా ఈ ఎరుక పరిపూర్ణం పరిపూర్ణమనుచు పలుకుచున్నది ఆ పలికినదే పరిపూర్ణము పరిపూర్ణము అని వ్రాయుచున్నది ఏ గ్రంథములో చూచిన యెక్కడ చూచిన పరిపూర్ణము అనే ఉన్నది అనగా ఈ అక్షరములన్నీ జగమెరుకలని గ్రహించవలెను. గనుక ఈ ఎరుకకు అతీతమై అచలమై బయలై స్థిరమైయున్నది చూచి, కనుగొని, నీవు బయలై ఎరుకనేటి బల్మాక్షరములు, యిక కట్టిబెట్టు, అనగా జగముఎరుకలను విడిచిపెట్టుము, అనగా పరిపూర్ణము పరిపూర్ణము పలుకుచూ వ్రాయుచూ యున్న ఎరుకలను, యిక విడిచిపెట్టుము, అనగా అఖండానుభవ రహితమై, అచల పరిపూర్ణమై యుండుము, ఇది ఎవరికి తెలియనటువంటి మూలగుట్టు, పరమరహస్యం, గురుమూర్తి కరుణచే నేనెరిగి నీకు చెప్పితిని, యిక పరులు చెప్పిన బోధ పరిపూర్ణ బోధ ఆరెండూ కట్టిబెట్టుమని భావము.

విశేషార్థము : రామయోగి కందార్థం

కం॥ కోరికెనిదురలో - నిదురన - కూరుకుపాటొందిదాని కూరుకులోనే - పారెటి భూరిని రామయపారావారంబుగనుటే బ్రహ్మదర్శనమూ - ఇది గనుపైనలేదు సంశయమూ - చెరిదీనిపొందువారితో - నితరులెవ్వారుసాటిరారు, వారు వారిలోగనుట బ్రహ్మదర్శనమూ, ఇది గనుపైన లేదు సంశయమూ ॥

తా॥ శిష్యా! విదురలో విదురవగా కూకురుపాటు జెంది, ఆ కూకురు పాటులోనే అఖండ నిరామయుమై, తూష్ణీభావమును జెందుటే, పరిపూర్ణ బ్రహ్మదర్శనము, ఈ సుఖము నీకు, సంశయముండదు. తూష్ణీభావమనగాయే స్ఫురణయు లేక, నిరామయుగా నుండుట,యని భావము.

184 ॥ చూపించజూపరానిది - చూపించితి దాన్ని వుండజూచినవుగదా - చూపించజూచె నిదిదీ - న్నే ప్రొద్దికదల్చబోకు - మిదెగురుబోధా - నిన్నంటాదు - నితరమె బాధా - నాపాపనాకూనవా చిన్ని నాయన్న - నా పెన్నిధానామ నారత్నముల కొండ - యిదెగురు బోధా - నిన్నంటాదు - నితరమే బాధా ॥ 24

తా॥ శిష్యా! చూపించ చూపరానటువంటి, గురుస్వరూపమనే పరిపూర్ణమును నీకు సూచన జేసి చూపించితిని, అనగా నీవు బయలైయ్యే, విధానమునీకు చూపించితిని, దాని వలన నీవు బయలైతి విగదా. యిక చూచే యెరుకను చూడకుము, పరిపూర్ణమనే దానిని నీవు ఉండజూచితివి గదా. నేను చూపిస్తే నీవు చూచావు, అనగా ఏద్వైతే చూచినదో, దానిని విడిచిపెట్టుము. యిక దానిని తలంచకు, యిదే గురుబోధ. ఈ ప్రకారముగా నీవు విచారించితే, యితరమైన ఏబాధలు నిన్నంటవు, నా పాప నాకూన నాచిన్ని నాయన్నా నాపెన్నిధానమూనారత్నముల కొండా అని భావము. యిందుకు రామయోగి కందార్థం

కం॥ చూపీచూపనియర్థము - చూపించితి చూడు మిదిగొచూచితివిగదా - యీపట్టులోనీ రెంటిని - కాపట్యములేక విడిచికదిలేవామీదా - కదిలేదంతా పాపమేకాదా - చూపులోపలునున్న ప్రాపుగంటివిగదా - చూపించచూచే దీన్నే ప్రొద్దుదలపాకు - కదిలేశా మీదా - కదిలేదంతా పాపమే కాదా ॥

తా॥ శిష్యా! చూపీచూపకుండా యుండు పరిపూర్ణమును చూపించితిని చూడుము, ఈ పట్టుదలతో కపటములేకుండా ప్రకృతి ద్వయదోషములనే యెరుక మరుపుల్లను రెంటిని విడిచిపెట్టుము. యిక మీద కదిలేవు సుమా, కదిలేదంతా పాపమేనని భావము.

185 ॥ నామమురూపము నటన - స్తోమము బయలందు లేదు చూడుము నీవా - నామము రూపమునటన - స్తోమము యెరుకందుగలదు చూడుమి నిజమూ - బయలెరుకాల చూచి చూడకుమూ - వేమారు నేనెంత వినజెప్పినా గాని - యీ మార్గమె తప్ప-యికలేదు రెండోది చూడుమి నిజమూ బయలెరుకాల - చూచి చూడకుమూ ॥ 25

తా॥ బయలుకు నామము, రూపము, నటన, స్థామములు ఏమీ లేవు చూడుము నీవానామము రూపము నటన స్థామములు ఎరుకందు కలవు చూడుము నిజము, బయలెరుకల చూచి చూడకుము, అనగా నీవు బయలయ్యి ఎరుకను చూడకుము, అనగా నీకు మితములో చూపించిన బయలు చూచి, ఆ బయలులో వచ్చిపోయ్యే ఎరుకను చూచి. ఆ బయలులో బయలుగా ఉన్ననిన్నును ఎరుకను. రెంట్నీ విడిచిపెట్టి, తాను లేని తానై యుండవలెను, నాయనా నేను ఎన్నిసార్లు చెప్పిన, ఈ మార్గం యిదే అనగా అభ్యానము అభ్యాసాతీతము, ఆరూఢము, ఆరూఢాతీతములుగా విచారించి, తానులేని తానై, అఖండానుభవరహితమై, యుండ దమేగాని యింకో మార్గం లేదు అని భావము. యిందుకు శ్రీ రామయోగి కంథార్థం.

కం॥ యింతకు నదికములేదిక, యింతే పరిపూర్ణ చూచనింతేనని, యేకాంతమున గురుడు దెల్పిన వింతేనిలోనాలో మర్మమింతేరా తండ్రీ, నిజ ప్రభమెంతకంతేరా తండ్రీ, యెంత చెప్పదు దీని కంతు ముట్టదు నెచట, నంతర్వాహ్యత లేని సంతాతాచల భావమింతేరా తండ్రీ, నిజప్రభయెంతకంతేరా తండ్రీ ॥

తా॥ శిష్యా! నాముద్దుల కుమారా, యింతకు నదికములేదు, నీలో నాలో నుండు మర్మమింతే, పరిపూర్ణ సూచనింతకంటే నేమిలేదు, అంతులేనిదీనిని గురించి యెంతని చెప్పెదును. సత్యమైన అచలభోగము నుండే, ఆలోచన నిదియేనని భావము.

**186 ॥ గురుడుగురుబోధ శిష్యుని - కెరిగించెటివేళ్ళ శిష్యుడెరిగెటివేళ్ళన్ - యిరువురు వైశ్వానరక -ర్పూరముల పలె వెలిగియవల - పొడజూపరోయీ - అట్లనేనీ - విక్కడ దెలియుమోయీ - పరిపూర్ణమెరుకాలనెరిగి - యామిదట - యెరుకానువిడచూటె - గురుబోధం చెరుగూను - పొడజూవరోయీ - అట్లనెనీవిక్కడ దెలియుమోయీ ॥ 26**

తా॥ శిష్యా! గురుమూర్తి శిష్యునకు గురుబోధ కెరిగించెటివేళ, అనగా ఆగురుస్వరూపమనే బయలును సూచనజేసి చూపించగా, ఆశిష్యుడు గురువుగారు చేసిన సూచన గ్రహించి, ఆ గురు స్వరూపమనే బయలును తానుచూచేటయంలో, తాను బయలైయుండగా. ఆ గురువుగారు అంతకుముందే గురుస్వరూపమనే బయలైయున్నారు, గనుక గురుశిష్యులిద్దరు ఒకే స్వరూపమై యున్నారు. ఏలాగంటే అగ్ని కర్పూరములు రెండూ వెలిగివెలిగి యాకమైకదకు ఏమీలేకపోయినట్లు. ఈ గురువుగారు శిష్యునకు కనుపించుటలేదు, ఆ శిష్యుడు గురువుగార్కి కనుపించుటలేదు, అనగా ఆ గురుశిష్యులిద్దరూ పరిపూర్ణమైయుండెను, అనగా పరిపూర్ణమెరుకల నెరిగి ఎరుకను విడిచిపెట్టి ఏమీలేక తాను లేనితానై అఖండానుభవ రహితులై యున్నారని భావము.

**విశేషార్థము :** గురుడు శిష్యునకు గురుస్వరూపమనే పరిపూర్ణస్థితిని చూచించి చేసిన సూచన, ఆ సమయము శిష్యుడు గురువుగారు చేసిన సూచననే యుక్తి గ్రహించి విచారించే సమయమున గురుశిష్యులిద్దరు కర్పూరము అగ్ని కలసి యాకమై వెలిగి, వెలిగి, ఏమీ లేకుండా బూడిదైపోయినట్లు, అలాగే గురుశిష్యులిద్దరు పరిపూర్ణస్థితిని బొంది, తపునికిలో యెరుక ఏమీ లేకుండా శూన్యమై, అనగా అగ్ని కర్పూరమువలె మూలములేని గుర్తు ఎరిగే శరీరము, ఈ రెండూ ఏకమై కలసి వీటిలో సారం, రహితమైయ్యే వరకూ, పరిపూర్ణ స్థితియనే యునికిలో వుండి, విచారించుట వలన ఎరుక శూన్యమైయేమీ లేకుండా, అగ్ని కర్పూరము బూడిదయైనట్లు, యెరుక ఆ బూడిదవలె అయిపోయినది, అనగా ఆ బూడిదలో సారం ఏమీ లేదు, గనుక మరల అంటించినా, అంటుకోదు వెలగదు, కారణమేమనగా, అందులో వున్న సారమంతా అయిపోయినది, గనుక అంటుకోదు, వెలుగదు, అలాగే ఎరుకలో వున్న ఎరుగుటయనే ఈశ్వరతనువు మరుచుటయనే జీవతనువు రెండూకాలిపోయిన నులకతాడువలె, శూన్యమూ అనగా ఆకాశమనే బయలైయేసత్తా లేక ఏమీలేని బూడిదవలె పరిపూర్ణమై యున్నది, అనగా వున్నది వున్నట్లు వున్నది, అనగా పరిపూర్ణం ఎలా వున్నదో అలాగే వున్నదని తెలియవలెను, ఎందువల్లనంటే కాలిపోయిన నులకతాడు-వుండవలెనే వున్నది, కానీ మంచమును నేసుకొనుటకు పనికిరానట్లు యెరుక పరిపూర్ణవునికిలో కాలిపోయి శూన్యమై ఏసత్తా లేకుండా అయిపోయినది. గనుక వుత్తదై బట్టబయలై యున్నది అని ఎరుగవలెను, యిలా కాకుండా వచార్థముగా ఎన్నిబోధలు విన్నాయేమీ ఫలితము లేదు, నిర్ణయార్థముగా ఆ రూఢా తీతముగా చెప్పే గురువైతే, పరిపూర్ణం ఉన్నట్లు సూచన ద్వారా చూచించి, యెరుకను యేమీ లేకుండా జేసి తనను పరిపూర్ణనిగా చేయును, యిందుకు శ్రీ చిన్మయ విలక్షణ స్వామి టీకె వెంకటాచార్యులు వారు రచించిన కందార్థం.

కం॥ పరమెరిగిన గురువరుచే - మరిశిష్యుడు బోధగొన్నమార్గమెరుగునూ పరమెరుగని
గురువరుచే - మరిశిష్యుడు బోధగొన్న - మార్గమెరుగదురా మార్గమెరుగని -
బోధలెందుకురా - పురుషుడు లేనట్టి పొలతిసంతానము - మరిగలుగనట్లుగా-
పరిపూర్ణమెందుండు మార్గమెరుగదురా - మార్గమెరుగని - బోధలెందుకురా ॥

తా॥ శిష్యా! పరిపూర్ణ బోధ యెరిగిన గురువుగారి వద్దకు చేరి శుశ్రూషలు చేసి ఉపనయనము నొంది గురుసూచన ఎరిగి విచారించిన మార్గం తెలియబడును అలా కాకుండా పరిపూర్ణబోధ ఎరుగని గురువుని చేరి ఎన్ని సేవలు చేసినా ఈ మార్గం తెలియబడదు, ఈ మార్గం తెలియని బోధలు గురువుగారు ఎన్నిచెప్పిన శిష్యుడు ఎన్ని విన్న విషయం తెలియబడదు, ఎలాగనగా పురుషుడు లేకుండా ఇద్దరు స్త్రీలు కలసి ఎన్ని విధములుగా ప్రయత్నించినా సంతానం కలుగనట్లు పరిపూర్ణ

బోధను పొందలేరు అని భావము. యిందుకు శ్రీ రామయోగి కందార్థం

కం॥ ఇదె సర్వభోగ సమరస, మిదె సర్వాఖండ మచలమిదె పరిపూర్ణం - బదెమద్గురు పాదద్వయ మిదెరా ననుగన్నతండ్రీ ఇకనేమీ లేదు - యేమీ లేదనేదేమీలేదూ- అదియిదియను బేదమొదలి లోపల వెలిలో - ముదురులేతలు లేనిని దురలో నిదురింప - నికయేమీ లేదూ యేమీలేదనేదేమీలేదు॥

తా॥ శిష్యా! సర్వభోగసమరస మనినను అఖండమనినను మచలమనినను పరిపూర్ణమనినను నాగురుపాదములనినను నీ పరిపూర్ణమే, ఇకనేమీలేదు, యేమీ లేదనే మాటకూడా నేమీలేదు, ఇదియను బేధము నొదలి లోపలావెలుపలా అంతా నీవేయై, అనగా నచలమై నిదరలో నిదిరింపుము, అనగా నున్మనిని జెందుమని భావము.

187 ॥ సతికౌంగిట తత్పతి - తత్పతి - కౌంగిట సతియుజేరి పవళించికలన్ - మృతిజెంది మేలుకొనిసు -స్థితులై యొకరొకరికట్టి - చేష్టాదెల్పుదురా - సిగ్గెడలియా చేష్టానిల్పుదురా - ప్రతిలేనిగురుబోధ స్థితి జెంద్యట్లనె సం- తతతిరిగి లేనెరుక - గతియిట్టిదని దాని చేష్టాదెల్పుదురా - సిగ్గెడలియా - చేష్టానిల్పుదురా ॥ 27

తా॥ శిష్యా! రాత్రి పరుండేటప్పుడు భార్యకౌంగిట భర్త భర్త కౌంగిట భార్య పరుండి అనేకకళలు పొందుచూ అలసి నీర్సపడి, కొంతసేపటకి నిద్రపోయి, కొంతసేపటికి మెలుకువ వచ్చిన తరువాత, ఒకరు నొకరు చూసుకొని సిగ్గుపడి, వారిద్దరూ చేసిన చేష్టలు, ఇలాంటివని చెప్పుకున్నారా, సిగ్గుచేత చెప్పుకోలేనట్లు ప్రతిలేని గురుబోధ స్థితి చెంది, ప్రతి రహితమనగా తాను పొందిన స్థితిలో ప్రతిమలుండవు ఏ ఊహాలుండవు అనగా తాను బయలై అచలమై ప్రతిరహితమై గురుస్వరూపమనే పరిపూర్ణ స్థితిని బొంది, తానులేస్తే తానయున్నవారికి, అనగా అఖండాను భవరహితమై ఉనికి గలవానికి, ఈలేనెరుక గతియిట్టిదని, దాని చేష్టలు యీలాటివని, తాను ఎరుగునా, ఆ ఉనికిలో ఉన్నవారు యిటువంటిది ఎరుక అని చెప్పునా, చెప్పనే చెప్పరని భావము.

**విశేషార్థము** : గుంహ్యాద్గుంహ్య-ప్రకరణ పండిత శివానందస్వామివారు ఏ-తీరుగా యుండునంట శృతి

శ్లో॥ ఏ తత్పస్యతిచక్షుభ్యాం తత్తదాత్మేతి భావయా ।
యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాంతత్తదాత్మేతి భావయా ॥
శ్లో॥ మనోగ్వాంచయద్ఘ్రాహ్యంతత్తదాత్మేతి భావయా ।
దేహీజాత్యాది సంబంధాతత్తదాత్మేతి భావయా ॥
సర్వాశ్రయం సమన్వితా, వేదశాస్త్ర పురాణానిపాదపాంశుఅవత్యజా.

తా॥ శిష్యా! పరిపూర్ణుడు ఏతీరుగా యుండునంటే చక్షువులచేత చూస్తూయున్నా తాను బయలయ్యే యుండును. కర్ణములతో వినుచున్న తాను బయలయ్యే యుండను. జంహతో సమస్త రుచులు తినుచున్నా, తాను బయలయ్యే యుండును, దేహసంబంధమైన రోగములు, బాధపడుచున్నా తాను బయలయ్యే యుండును. మనస్సుచే అనేక వాంచలు సంకల్పించినా, తాను బయలయ్యే యుండును. యివి అన్నియు తాను పరిత్యజించికని గ్రుడ్డు, వినిచెముడు, చెప్పక చెప్పినవాడు, చెయ్యక చేసినవాడు వానియునికి వర్ణించుట అగోచరము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ వివరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వగురుమంత్ర పతాపం నామనవమోధ్యాయః భావ విశేషార్థములు సమాప్తము**



## ★ 10 .బోధ దృఢీకరణ. 5 ★

**188 ॥ రానిదిపోనిదిబయలని - లేనిది యీ యెరుక యనుచు లెస్సగ దృఢమౌ - దానుక నీవీమంత్రము - మానక జపి యింపుచుండు - మానీతిశాలి - లేనిదిలేదు - మరువాకీ జోలీ - లేనిదిలేదాని - పూనినిశ్చయమైతె - తానొక్కటుండునుగాని యట్లనవిను - మానీతి శాలీ - లేనిదిలేదు - మరువాకీజోలీ ॥ 1**

తా॥ శిష్యా! నీవు బయలైయున్న అచలమునకు, రాకడాపోకడా లేదని మరియు జననమరణములు లేవనియు. అనగా సంకల్పవికల్పములు లేవనియు, నీవు గ్రహించి. ఈ లేనెరుక ఒకప్పుడూ లేదని. నీకు బాగా అనుభవమయ్యేవరకు, నీవు బయలయ్యే స్థితిని విడిచిపెట్టకుము. ఈ ఉత్త బట్టబయలు ఏమీ లేదను, మంత్రమును ఈ మూలములేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదని నీకు నిశ్చయమైతే, అద్వైదసైన బయలు ఒక్కటేఉంటాది. గనుక నీవు నిద్ర వచ్చేవరకు, అహంచచ్చేవరకు నీవు బయలైయుండాలని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఈ బోధ బాగా దృఢీకరణ స్థితికలవానికి, అనగా అభ్యాసము అభ్యాసాతీతము ఆరూఢము ఆరూఢాతీతులకు యెరుకరాకడాపోకడలు నశించి, సర్వకాలం తాను బయలై అచల పరిపూర్ణమై యుండును, అనగా రానిది పోనిది బయలనగా యెరుక రాకపోకలు నశించి తాను బయలవ్వాలంటే ఆరూఢా తీతునకే చెల్లును, రాకపోకలు లేని బయలు తానైయుండవలెనంటే నిర్ణయార్థపరుడే, జనన మరణములు లేని బయలైయుంటాడు, అట్టివానికి యెరుక ఏమీలేకుండా పోవును, ఎరుకలేకుండా పోయే కొరకు, ఈ మంత్రం సర్వకాలం జపించుట, అనగా సర్వకాలం

బయలై అచలపరిపూర్ణమైయుండుమని అర్థం అలా సర్వకాలం పరిపూర్ణమైయుంటే ఎరుకపుట్టనే పుట్టదు అట్టి లేనెరుక పుట్టకుండా ఉండడమే లేనిది లేకుండాపోతే. ఉన్నది పరిపూర్ణమే ఉండునని భావము.

**189 ॥ ఉన్నది పరిపూర్ణములేం -దెన్నటికి యెరుకయనుచునిది దృఢమౌదా - కెన్నుమునే బోదించిన - తిన్ననియీ బోధ - శిష్యతిలకా మరువకు మీ - సుజనుల మైాల- పలుకా వెరువకుమీ - నిన్నుకుమతులు వచ్చినీలో తడిగితెవారి - కెన్ని విధము లనీ - వెరిగింపకిది శిష్య - తిలకామరువకుమీ - సుజనుల మైాల - పలుకావెరువకు మీ ॥ 2**

తా॥ శిష్యా! నీవు బయలైన పరిపూర్ణము ఉన్నదని - బాగా దృఢ నిశ్చయము పొంది అందులో వచ్చే పొయ్యే యెరుక ఉత్త బట్టబయలై, నీలేనెరుక యన్నదులేనిదే ఈ ఎరుకయని, యిది దృఢమయ్యే వరకూ, నేను సూచన చేసి చూపించి ఆ స్థితిని, ఎన్నడు విడిచిపెట్టకుము, ఇదియదార్థమైన బోధయని మరువకుము, బుద్ధిమంతుల యొక్క స్నేహము వదలిపెట్టకుము. నాయనా దుర్మార్గులైన నరులు, ఇతరమతస్థులు. ఈ బోధ చెప్పమని, ఎన్నో రకములుగా నిన్ను ప్రార్థించెదరు, కాని వారికీ బోధయన్నదూ చెప్పవద్దు, ఈ మాట మరువకు, నీవు సర్వకాలం పరిపూర్ణమై యుండుమని భావము.

విశేషార్థము : శిష్యా! నీవు బయలైన పరిపూర్ణం అంతటా నిండి యున్నపరిపూర్ణం రెండూ ఒక్కటే, అనగా లేనెరుకైన నీవు లేకపోయిన తరువాత, ఉన్నది ఆ పరిపూర్ణమే, యింకొకటిలేదు, నీవైన ఎరుక లేకపోవుట మనగా, నీవు బయలవటమేలేక ఉండుటయని అర్థము, గనుక నీవు బయలైన పరిపూర్ణం, సర్వకాల సర్వావస్థలయందు, ఉన్నదని దృఢనిశ్చయంపొంది, నీవు యెల్లప్పుడు పరిపూర్ణమై యుండవలెను, యెరుక ఒకప్పుడూ ఉండకూడదు. అనగా త్రికాలములయందు, యెరుకలేక సేవించవలెను. అలా ఉన్నప్పుడు, యెరుక ఏమీ లేకుండా పోవును, అనగా పరిపూర్ణమే యున్నది. యెరుక యన్నదూ లేదు అని దృఢమయ్యే వరకు, ఈ విచారణ మానకుము. దుర్మార్గులు ఎవరైనా యీ బోధచెప్పమని ఎంత పీడించినా వారికి చెప్పకు సుమా, సన్మార్గులకు చెప్పుము, శిష్యతిలకమా, ఈ మాట మరువకుము, ఉన్నది ఉన్నట్లు ఉంటే లేనిది లేకుండా పోవును, గనుక ఉన్నది పరిపూర్ణమేయని భావము.

**190 ॥ పరిపూర్ణము నెరుకనునే - నెరిగించితినీవు రెంటి నెరిగితివిగదా - యెరుకనుగురు దక్షిణగా - మరివేగిర మివ్వవట్టీ - మాటలేమిటికి - యెరుకతొయింక - కూటమేమిటికి - పరులు నేనవియేటి భావము భావమే - నిరతము ఒకరీతి నిలచుండుమిక వట్టిమాటలేమిటికి యెరుకతొ యింక కూటమేమిటికి ॥ 3**

తా॥ శిష్యా! నేను సూచన చేసి నీవు పరిపూర్ణమయ్యేమార్గమును ఎరిగించితిని. గదా అందులో వస్తూపోతూయున్న లేనెరుకను లేకుండా పోయే విధానమును నీకెరిగించితిని గదా. ఆ రెంటినీ నీ వెరిగితివిగదా. ఆ బయలులోవచ్చే పొయ్యే లేనెరుకను గురుదక్షణగా ఇప్పుడే ఇచ్చివేయుము. వట్టి మాటలు ఎందుకు. ఆ యెరుకతో నీకు పనేమున్నది. పని లేదు గనుక. ఆ యెరుకను గురుదక్షణగా యిచ్చివేయుము. పరులు నేను అనే భావము విడిచిపెట్టి, ఏ భావము లేని ఉత్త బట్టబయలై నిరంతరము ఒకే తీరుగా. నీవు పరిపూర్ణమై ఉండుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! అంతటా నిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణమును నీకు సూచించినాను నీవైన లేనెరుక లేకపోయె మార్గం. సూచన జేసి చూపించితిని. నీవిచారించగా యెరుక లేకపోయెనుగదా, యెరుకపోయిన తరువాత ఉన్నది ఉన్నట్లు ఉంటే పరిపూర్ణమేగదా. ఈ రెంట్నీ నీవెరిగితివిగదా, యిక ఎరుకను గురుదక్షణగా ఇప్పుడే ఇమ్ము, వట్టి మాటలతో ప్రయోజనములేదు, యెరుకతోయింక కలిసి ఉండవలసిన పని నీకు ఏమీ లేదు. ఎందుకనగా యెరుక లేక సేవించే మార్గంనీకు. దృఢమైనది గనుక. యెరుకతో పనిలేదు గనుక. యెరుకను తొందరగా గురు దక్షణగా ఇచ్చివేయుము, నీవు యెరుకలేని పరిపూర్ణమై యున్నావుగనుక. యెరుకై ఉన్న పరులు అని గాని ఇతరులు అని గాని నీవని నేనని ఈ భావములు అన్నీ అభావాముచేసి. యే భావములేక నిరంతరం ఒకేరీతిగా పరిపూర్ణమై సర్వకాల సర్వావస్థలయందు. త్రికాలములు యుండుమని భావము.

**191 ॥ పరిపూర్ణమెరుకలివియని - గురువరుడెరిగించి యెరుక కూటమి మాన్పన్ గురువు కు గురు - వెవరనుటకు మరి శిష్యునికింకనోట-మాట వెళ్ళినా - పోయిన యెరుక- మళ్ళీ మళ్ళీనా - గురుశిష్యులనియేటి - గురుతెన్నడెరుగాక - నిరతాము యొకరీతి నిలచున్న బయలందు - మాటవెళ్ళినా - పోయిన యెరుక మళ్ళీ మళ్ళీనా ॥ 4**

తా॥ శిష్యా! నీకు అంతటా నిండియున్న పరిపూర్ణాన్ని ఎరిగించినాను మరియు నీవు బయలై ఉండే పూర్ణాన్ని ఎరిగించినాను. అందులో వస్తూ పోతూయున్న ఈ లేనెరుకను లేదని ఎరిగించితిని. ఈ రెంటి సంగతి గురువుగారు చెప్పి ఎరుక ఏమీ లేకుండా పోయేలాగున. ఎరుకను విడిపించి లేనీయెరుకను విడిపించిన తరువాత. యెరుకలేని స్థితిలో ఉన్నాడుగనుక, గురుస్వరూపమైన పరిపూర్ణాన్ని. పైన ఏమున్నదని అడుగుటకు. మరి శిష్యునకు నోటమాటవచ్చినదా. పోయిన యెరుక మళ్ళీ వచ్చెనా. రాలేదని భావము.

**విశేషార్థము :** శిష్యా! నీకు అంతటా వున్న పరిపూర్ణాన్ని నీకెరిగించితిని నీవైన యెరుక బయలైయుండే మార్గం నీకెరగించితిని. ఈ రెండూ ఒకటే గనుక యెరుకతో కలిసివుండె పని నీకు లేదు గనుక, యెరుకలేని పరిపూర్ణం నీవైయున్నావు గనుక, అట్టి పరిపూర్ణ

స్థితిలో యున్నవానికి. గురువనిగాని శిష్యుడనిగాని గురువుకు గురువెవరినిగాని నోటమాట వచ్చెనా. పోయిన యెరుక మళ్ళీ వచ్చునా, యికరాదని అర్థము, గనుక గురువు శిష్యుడు అనే గుర్తుయన్నదు ఎరుగక నిరంతరము ఒకే రీతిగ నిలచి, తాను బయలై యున్న స్థితియందు మాటవచ్చెనా. పోయిన యెరుక మళ్ళీ వచ్చునా, రాదుగనుక నీవైన యెరుక బయలైన పరిపూర్ణమూ యుండుము, ఎందుకనగా నీవైన బయలులో నీవైన యెరుక పుట్టుచున్నది. ఆ యెరుకను బయలు చేయుచున్నాడు గనుక బయలు అంటే అఖండ యెరుక. అనగా శుద్ధయెరుకే. బయలన్నా అచలమన్నా పరిపూర్ణమన్నా శుద్ధయెరుకే. ఎలాగంటే తాడేపాముగా తోచుచున్నది, అలాగే బంగారమె వస్తువులైనట్లు సముద్రమెకెరటములైనట్లుగా బయలే ఎరుకగుచున్నది, యెరుకే బయలౌచున్నది. పరిపూర్ణం వేరు, ఎరుకవేరు అని అనకూడదు రెండూ ఒక్కటే ఉన్నది, పరిపూర్ణమె యెరుక ఒకప్పుడు లేదు, ఉన్నట్టుతోచు చున్నది. యిందుకు దీక్షితీయం బ్రాంతి రహిత ప్రకరణములో 61వ పేజీ కొసను పరిపూర్ణం వేరే శరీరం వేరే ఉన్నదని యెటువంటి పశువైనా అనడు పరిపూర్ణ వస్తువు ఒక్కటే వున్నది మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అని రెప్పపాటంత సేపు మరువక వుండవలె ఉండకపోయెనా యెంత ప్రజ్ఞావంతున్నీ మోసపెట్టుచుంది. మరియూ మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదని ఎన్నికోట్లు చేస్తే అంతదృఢం, వున్నదానికి యిది విరోధి, గనుక దీనిని కూకుడు వ్రేళ్లతో తీసివేయవలె. యిది అభ్యాసమైన కొద్దీ సుఖదుఃఖరహితమౌచున్నది, యెప్పటి పరిపూర్ణం యెప్పటివలెను వుంచుంది, పరిపూర్ణం ఏ తీరుగా వున్నదో ఆ తీరుగా వుండవలె. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని, సకల క్రియలు ఏసినా అది క్రియాశూన్యంకాదు. యిది పరమ రహస్యం యిదే మహాగురుగుహ్యం, యెంత వారికీ శక్యంకానట్లే వుంచుంది. యిందుకు వేమనార్యులు వాక్యార్థానుభవ శిరోమణి 35వ పేజీలో

ఓ చదువరులారా, పరిపూర్ణం వేరే శరీరం వేరేయున్నదని యెటువంటి పశువైనా అనడు, పరిపూర్ణవస్తు ఒక్కటేను తప్ప రెండవది లేదు సుమా ? యిదే ద్వాదశాక్షరీమంత్రము దీనిని జ్ఞాపకముంచుకొనవలయును, ఈయనుభవమే గంజాం జిల్లా బరంపురం నివాసుడగు తారకబ్రహ్మను భవియగు శ్రీ పూడిపెద్ది సాంబశివరావు కన్నది, యిదే గరువాక్యము, యిదే వేదాంతము, చైతన్యమే పరబ్రహ్మమనువాడు దొంగ వేదాంతినుమండీ.

అందుకే పెద్దలు వున్నది వున్నట్లు వుండడమె పరిపూర్ణం, అనిన్నీ పరిపూర్ణం ఏతీరుగా యున్నదో ఆ తీరుగా వుండడమే పరిపూర్ణం మరియు పరిపూర్ణమునకు వేరుగాకుండా వుండడమే పరిపూర్ణం. దీక్షితులవారు ఏమీ లేని బట్టబయలులో ఏమీ లేక వుంటే విచారణకు ఫలం. అని తెలిచ్చి యున్నారు యింత విచారణ

స్థితిలో యున్నవానికి. గురువనిగాని శిష్యుడనిగాని గురువుకు గురువెవరినిగాని నోటమాట వచ్చెనా. పోయిన యెరుక మళ్ళీ వచ్చునా, యికరాదని అర్థము, గనుక గురువు శిష్యుడు అనే గుర్తుయన్నదు ఎరుగక నిరంతరము ఒకే రీతిగ నిలచి, తాను బయలై యున్న స్థితియందు మాటవచ్చెనా. పోయిన యెరుక మళ్ళీ వచ్చునా, రాదుగనుక నీవైన యెరుక బయలైన పరిపూర్ణమూ యుండుము. ఎందుకనగా నీవైన బయలులో నీవైన యెరుక పుట్టుచున్నది. ఆ యెరుకను బయలు చేయుచున్నాడు గనుక బయలు అంటే అఖండ యెరుక. అనగా శుద్ధయెరుకే. బయలన్నా అచలమన్నా పరిపూర్ణమన్నా శుద్ధయెరుకే. ఎలాగంటే తాడేపాముగా తోచుచున్నది, అలాగే బంగారమె వస్తువులైనట్లు సముద్రమెకెరటములైనట్లుగా బయలే ఎరుకగుచున్నది, యెరుకే బయలౌచున్నది. పరిపూర్ణం వేరు, ఎరుకవేరు అని అనకూడదు రెండూ ఒక్కటే ఉన్నది, పరిపూర్ణమె యెరుక ఒకప్పుడు లేదు, ఉన్నట్టుతోచు చున్నది. యిందుకు దీక్షితీయం భ్రాంతి రహిత ప్రకరణములో 61వ పేజీ కొసను పరిపూర్ణం వేరే శరీరం వేరే ఉన్నదని యెటువంటి పశువైనా అనదు పరిపూర్ణ వస్తువు ఒక్కటే వున్నది మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అని చెప్పపాటంత సేపు మరువక వుండవలె ఉండకపోయెనా యెంత ప్రజ్ఞావంతున్నీ మోసపెట్టుచుంది. మరియూ మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదని ఎన్నికోట్లు చేస్తే అంతదృఢం, వున్నదానికి యిది విరోధి, గనుక దీనిని కూకుదు వ్రేళ్లతో తీసివేయవలె. యిది అభ్యాసమైన కొద్దీ సుఖదుఃఖరహితమౌచున్నది, యెప్పటి పరిపూర్ణం యెప్పటివలెను వుంచుంది, పరిపూర్ణం ఏ తీరుగా వున్నదో ఆ తీరుగా వుండవలె. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేదని, సకల క్రియలు ఏసినా అది క్రియాశూన్యంకాదు. యిది పరమ రహస్యం యిదే మహాగురుగుహ్యం, యెంత వారికీ శఖ్యంకానట్లే వుంచుంది. యిందుకు వేమనార్యులు వాక్యార్థానుభవ శిరోమణి 35వ పేజీలో

ఓ చదువరులారా, పరిపూర్ణం వేరే శరీరం వేరేయున్నదని యెటువంటి పశువైనా అనదు, పరిపూర్ణవస్తు ఒక్కటేను తప్ప రెండవది లేదు సుమా ? యిదే ద్వాదశాక్షరీమంత్రము దీనిని జ్ఞాపకముంచుకొనవలయును, ఈయనుభవమే గంజాం జిల్లా బరంపురం నివాసుడగు తారకబ్రహ్మను భవియగు శ్రీ పూడిపెద్ది సాంబశివరావు కన్నది, యిదే గరువాక్యము, యిదే వేదాంతము, చైతన్యమే పరబ్రహ్మమనువాడు దొంగ వేదాంతినుమండీ.

అందుకే పెద్దలు వున్నది వున్నట్లు వుండడమె పరిపూర్ణం, అనిన్నీ పరిపూర్ణం ఏతీరుగా యున్నదో ఆ తీరుగా వుండడమే పరిపూర్ణం మరియు పరిపూర్ణమునకు వేరుగాకుండా వుండడమే పరిపూర్ణం, దీక్షితులవారు ఏమీ లేని బట్టబయలులో ఏమీ లేక వుంటే విచారణకు ఫలం. అని శెలవిచ్చి యున్నారు యింత విచారణ

# ☆ 11 .బోధ స్థితి పురుష లక్షణము. 6 ☆

**193 ॥ గురుడచలచలములను తన - కెరిగించిన శిష్యుడెరిగి యెరుకై యుండన్ - యెరుకను విల్వకుమనినను - యెరుకను విడనాడిశిష్యు - డెట్లుండునంటే - అట్లనెనింకెట్లుండునంటే పురుషుడు లేనట్టి పాలతిసౌందర్యాము - మరిమరి కలిగుండి - మరి లేనట్లనియంటి - యెట్లుండునంటే - అట్లనెనేనింకెట్లుండునంటే ॥ 1**

తా॥ శిష్యా! సద్గురుమూర్తి తన శిష్యునకు, ఇది అచలమైన బయలు, ఇందులో వస్తూపోతాయున్న చలనముతోయున్న లేనెరుక అని శిష్యునకు ఎరిగించితె, ఆ శిష్యుడు రెంటిని యెరిగి అఖండమైన ఎరుకై యుండగా, ఆ ఎరుకను నిల్పకు అనిన, శిష్యుడు విని అఖండ ఎరుకను విడిచి ఉన్న శిష్యుడు, ఏలాగున్నాడనగా, భర్త లేని స్త్రీ యొక్క సౌందర్యము ఎలాగున ఉన్నదో అలాగున అనగా భర్త లేని స్త్రీకి పసుపు కుంకుమ, గాజులు, బొట్టు, మంగళసూత్రము ఈ ఐదులేనట్లుకాని ఇతరమైన పొదరు బంగారుగాజులు వగైరాలున్నవను ఆ శిష్యునకు ఎరుక ఏమీలేదుగనుక, శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు ఈ ఐదులేవు. అఖండ ఎరుకలేక అఖండానుభవరహితమై పరిపూర్ణమై, లేని ఎరుకనే లేని తెలివున్నదని తాను లేకవున్నాడు అని భావము.

**విశేషార్థము :** శిష్యా! గురుడచలచలమును తనకెరిగించి, శిష్యుడెరిగి, అఖండ ఎరుకైయుండగా, ఆ ఎరుకను విడిచిపెట్టుమని చెప్పగా, అఖంత ఎరుకను విడిచిపెట్టి ఎలా ఉన్నాడనగా, అఖండానుభవ రహితమై, తన్మాత్రలు లేక, పురుషుడు లేని స్త్రీయలా ఉండునో, అనగా విధవరాలకు మంగళసూత్రము పసుపు కుంకుమ గాజులు బొట్టు వగైరాలు ఐదు ఉండవు. అలాగే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేక, అఖండములో ఉండే ఖండాఖండము యావత్తూ రహితమై, తాను లేని తానై పరిపూర్ణమైయున్నాడని, అనగా తొండముదిరి ఊసరవెల్లైనట్లు, నక్కముదిరి వరదైనట్లు, అఖండమైయుండె విచారణ బాగా వృద్ధమై, అఖండానుభవ రహితమై, తూష్ణీభావము జెంది ఉన్నాడని భావము. యిందుకు రామయోగి కందార్థం

కం॥ ఎరుకను మరచిన - వెనుకను - నిదువుగ తను వున్న కార్యమెవరితోజేయున్ - మరిదంపతులిరువురిలో మీరలను భోగించుభర్త మరణించియున్నా - సంసార భారకులెవ్వరున్నా, పురుషుడు లేనట్టి తరుణి జీవించిన, కరణిగానీ - పూర్వసరణిభోగములెట్లు, మరణించియున్నా - సంసారభారకులెవరున్నా ॥

తా॥ శిష్యా! లోకమందు భార్యభర్తలలో భర్త మరణించిన, సంసారమును భరించువారెవరు - యెవరును లేరు, పురుషుడులేని భార్య, జీవించినట్లుగానే, యెరుకను విడిచిన వెనుక, శరీరమున్నను ఎవ్వరితో కార్యములు జరుపును. యేమియు ప్రయోజనములేదని భావము.

యిందుకు పండిత శివానందస్వామి - అచల బోధ శిఖామణిలో 665వ పేజి యెరుక అనగా దృశ్యరూపము, దృక్కుకు నామరూపములు లేవు, లేనిదే లేదుగనుక అదిలేకపోతే దాని చేతతోచబడిన ప్రపంచంలేదు, లోపలను లేదు, బయటను లేదు. ఎక్కడను లేదు. గనుక అదిలేకపోయెను. ఉన్నదన్న వారు పశువుల అని తెలు॥.

**194 ॥ యెరుకను విడనాడినయా - పురుషుని స్థితియెట్టిదనిన పొందుగవినుమీ - సరిపడుసరిపడదనకన్ - సరిగా వర్తింపుచుండు సమరసబుద్ధిన్ - కర్యాములందు- సహజప్ర-వృద్ధిన్ - పంపరి విధముల పరువులు బెట్టడు - మరి వైరాగ్యముచేత మానుకొనుండాడు - సమరసబుద్ధిన్ - కార్యములందు - సహజ ప్రవృద్ధిన్ ॥ 2**

తా॥ శిష్యా! ఎరుకను పూర్తిగా విడిచిపెట్టిన తరువాత, అనగా అఖండాను భవ రహితమైతాను లేని తానైయున్న, ఆ పురుషుని యొక్క స్థితి ఎలాగున్నదో, విను, రాగద్వేషములు మొదలగు ద్వంద్వములులేక, ఎలాగుంటే అలాగు సరిపోతాడు. అనగా ఇది సరిపోలేదనిగాని ఇది సరిపోయిందనిగాని యిది ఎక్కువనిగాని, యిది తక్కువనిగాని వైరాగ్యమేమియును అనక, సమరసముగా ఉండి, యెదటివారి ఏమండీ అంటే, ఈయన ఏమండీ అంటాడు, వారు ఏమంటే అదే అంటాడు. ఎవరు ఏలాగంటే అలా సరిపోతాడు, యిదే సమరసబుద్ధి. కార్యములందు పెళ్ళి కార్యముగాని, గురుపూజాకార్యక్రమంగాని, అది ఎలా చెయ్యాలో అలాగే, డబ్బు ఎక్కువ తక్కువ అని అనకుండా, కార్యములలో ఏ లోటూ రానివ్వకుండా, సాహసముగా చేయును, అనవసరమైన పరువులు పెట్టడు, అవసరమైనది మానడు. వాడు ఎరుకలేని పరిపూర్ణమైయుంటాడు,అని భావము.

**విశేషార్థము :** 67వ పేజీ దీక్షితీయములో మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు. ఈ గురువాక్యం దృఢమై సదాతానులేకుండా ఉండవలెను, నేను లేదనడమే దృఢము, తాను లేకపోవడమే పరిపూర్ణము, ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు అని తెలవిచ్చియున్నారు.

**195 ॥ అనహంకారుడనిమిషుడు -గనుకనె విశ్వం బనేటి కలగా నడహం-బనువాడుసని మిషుడుగా-వున విశ్వం బనెడిస్వ-ప్నోద్యోగముబూనీ- చేయుచుయా-వృద్యో గాము మానీ- యను నీస్వప్నోద్యోగమునకు నేకారణ-మని తానని మిమడెన్నడనుకోడీ మాటనుద్యోగాము బూనీ-చేయుచుయావృ-ద్యోగాము మానీ ॥ 3**

తా॥ శిష్యా! అహంలేనివాడు అనిమిషుడు అనగా రెప్పపాటులేని వాడు గనుక సర్వకాల సర్వావస్థలయందు తాను లేక ఉంటాడు గనుక లేని యెరుకనేవి శ్వము తాను గనుక ఉంటాడు సనిముషుడు అహమనే లేని యెరుకతో నుండి ఈ విశ్వమనే స్వప్నోద్యోగమి పూని చేయుచుండుసు అనగా ఈ కలలోపనులే చుయుచుండెను అనిముషుడు ఈ కలమేలుకున్నవాడు అనగా 25వదానికి అతీతమె తాను బయలైయున్నాడు గనుక కలలో పనులు చేయక ఈ కలకునే కారణమని యెన్నడూ అనుకోడు గనుక ఈ అన్నింటికి అతీతమై పరిపూర్ణమైయుంటాడు అని భావము.

**విశేషార్థము** : శిష్యా! అనిమిషుడు రెప్పపాటు లేనివాడు అనగా రెప్పపాటున్నంతసేపైనా మరువక లేనెరుకనే స్వప్నము ఎరుగక ఈ యన్నిటికి అతీతమై అచలపరిపూర్ణమై అహము లేక ఉంటాడు వీడు అనహంకారుడు అహమనే నిమిషుడు లేనిరుకతోయున్నవాడు ఎరుకనే స్వప్నోద్యోగము పూనిచేయుము అనగా వీడు యెరుకతో ఉండి చేయువాడు నిమిషుడు. అహములేనివాడు యెరుకనువిడిచి చేయువాడు యె రుకలేనివాడు వీడులేకయున్నవాడు వాడు యెరుకతో ఉండి ఉన్నవాడు అనగా యెరుక ఉండి యెరుకతో చేయువాడు అహమనే వాడు వీడు అన్ని పనులుపూనికొని నేను గనుక ఈ కార్యము చేయగలిగితిని యింకొకడైతే ఈ కార్యం చేయలేడు అని అనుకొనేవాడు సనిమిషుడు వీడు కలకనే వాడు ఈ కలయనే స్వప్నోద్యోగము మేలుకొని ఈ కలకు నేను కారణముకాదని ఈ కలను యన్నడూ యెరుగక తాను లేక అహములనేవాడు సనిమిషుడు అనహంకారుడు అని భావము. యింద్యుకబలరామపండితుల వారి ద్విపదార్థదర్యులతో

కం ॥తెలిసిన వారికి తెలియని వారికి-యిలను బేదంచేమికలదంటి వేని మూలమేమి లేనిదియెరుకయాని-తెలివిచేతను దీన్ని తీసివేసిన వెనుక -కలదంతటాను తానే ఘనమైన బట్టబయలూ కలదూబేదంబు యింతి యే - యరుకనే తెరా కలదూ చేదంబు యింతియే॥

అని శెలవిచ్చియున్నారు.

**196 ॥ కలమేలుకొన్న పురుషుడు-కలలో పలిబహము లెరుక గలిగుండగనే-తిలకింపలేవు గురుకృప-తెలివొందిన వాని కింక-తిప్పాలున్నావే-తెల్పర కొద్దిగొప్పాలున్నావే-తలిదండ్రిదొరదాతకులదైవమూప్తులు-కలబాందవులు దేశికులనినమ్మి తెయింక తిప్పాలున్నావే-తెల్పర కొద్ది గొప్పలున్నావే ॥ 4**

తా॥ శిష్యా! ఈలెనురుకనే కలమేలుకున్న పురుషుడు అచలమనే పరిపూర్ణమై ఉంటాడు గనుక కలలో ఉన్న వస్తువులు అనేకములుగా ఉన్నతాను చూడడు ఏకారణము చేత అనగా గురుకృపచే మేలుకున్నవాడు గనుక అనగా గురుసూచననే

యుక్తివలన పరిపూర్ణమనే మేల్కకనిన వాడు గనుక ఈ కలలో తిప్పలు అతనకు లేవు యిదిచిన్నది అని అది పెద్దదని కొద్ది గొప్పలు లేక తల్లి దండ్రి దొర దాత కుల దైవ మాపులు వీరంతా కలలోని వారని తెలుసుకొని సద్గురువులే బంధువులు దైవస్వరూపులు దేశికులని నమ్మిమేలు కొన్నవారికి ఏ తిప్పలు లేనని భావము.

**విశేషార్థము :** శిష్యా! కలమేలుకున్నవానికి కలలో ఉన్నవేమికనిపించవు అలాగే గురు కృపాకటాక్షముచే మేలుకొని తెలివితేటైనవానికి అజ్ఞానముతో కూడియున్నయెరుకనేకల ఆ ఎరుక చేష్టలు యేమిలేక తాను ఈ తిప్పలన్నిటికి అతీతమైన అచల పరిపూర్ణమై యున్నాడు కొద్ది గొప్ప తల్లి దండ్రి కులదైవబంధువులే యివి అన్నికలలోనివే సద్గురువే బాంధవులని నమ్మిన వానికి ఆ గురుకరుణచే ఎరుకనశించి తరువాత తను ఉత్తదై పరిపూర్ణమై అఖండాను భవరహితమైయుంటాడని భావము ఇందు పండిత శివానందస్వామి అచల బోధశిఖామణిలో 80 పేజీలో

కలలో ఒక పురుషుడు వచ్చి వానిని నీవు యవరని అడిగితే నేను యేమి లేనివాడునని అనగానే నీపేరు యేమని అడుగగా నాపేరు పరమపురుషుడనె నేను బ్రహ్మమును అన్నివేదశాస్త్ర పురాణములన్నియు నేనే పుట్టించినాను నా యందే జీవేశ్వరాది ప్రపంచము కల్పితము అయినవి అన్నియు నేనే అయినాను . నాకంటే వేరే అని అంటూయున్నారు జహర్లక్షణము అజహర్లక్షణము జహదాజహర్లక్షణము స్వరూప లక్షణములచేతనే ముందు కానట్టుగాను ఈ వేళ అయినట్టుగాను చెప్పలేదనెనను.

రజ్జు సర్పవత్‌గా జీవుడు నేనుగాను నేను బ్రహ్మమును అన్నిను నా చిత్రము నాకే తెలియదు శంకరబాష్యవార్తిరాదులు రామానుజాష్యము నీలకంఠబాష్యములు అన్ని ఉపనిషద్వాక్యములు నేనే బ్రహ్మమునని పంచభూతి సాక్షినని చెప్పినవి నేనే సచ్చిదానంద సద్రూపమని యోగులు అంతర్యమందును శాస్త్రాకారులు వాక్యములచే తనునన్నే బ్రహ్మమని చెప్పెదురు.

ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు సమస్తమునేనే యేమతమునకు తగినట్టుగా ఆ మతమునకు చెప్పిన దీనినే ప్రకృతి విడిచితే నాపుట్టుకలేదు రెండూ ఒక్కటే అచలబోధనన్ను అణచివేయుచున్నది.

మరియూ 82వ పేజీ నిర్భయలైతేనే కాని నిశ్చయముకాడు చూచెబయలే చూపురూపు మాసితే బట్టబయలైన పరశివతత్వము యిదేనిరహంకారస్థితి శాఖా వర్గరహిత వృక్షవత్.

**197 ॥ ఈరీతి స్థితిగలిగిన -నేరుపుశాలి తరజనుల నిందా స్తుతులన్-తారేగి చేయ డెన్నడు -వారలు మరిచేసిరేని-వలదానియనడూ -చెవియొగ్గి -కావలెనని వినడూ- వారు మీ వారు మా వారు వీరను కొంచు-సారేకు వీధిలో పోరాడెవారిని-వలదా నియనడూ -చెవియొగ్గి-కావలెనానివినడూ ॥ 5**

తా॥ శిష్యా! పరిపూర్ణస్థితిలో ఉన్నవాడు బాగా దృఢస్థితిని పొంది అనుభవమైనవాడు ఇతరజనులు కొంతమంది నిందించిన కొంతమంది పొగిడిన యవరిని ఏమి అనక యన్నడూ ఆగొడవ అతనికి ఉండదు ఎవరైనా చేసినా కాదని అనడు చెవియెగ్గి వినడు కావలెనని ఆ గోడవకు వెళ్ళడు వారు మావారు వీరు మీవారు అని వీధిలో పోరాడే వార్ని వలదానియనడు అనగా ఊరుకోమని అనడు కారణమేమనగా వాడు పరిపూర్ణడై అశరీరమై యన్నడు గనక ఏ గోడవకు వెళ్ళడు అని భావము.

**విశేషార్థము :** అచలబోధశిఖామణిలో బయలులో చూచి బయలులో లేక బయలు కావలె యిది కాకపోతే రెండవదివున్నది అది తాను కాకకావలె తాను కాకవుండే అంతా పరిపూర్ణమే తాను లేకపోతే తలచేదేలేదు అదిగాదు యిదిపోదు ఇదిలేకుంటే అంతా పరిపూర్ణ పరమార్థమే యుండును యిదే గురువాక్య దృఢము

**198 ॥ ధ్వనిమొదలగు తన్మాత్రలు-గనుగొనగా లేశ మైనగా న్పించనిచో-టును బట్టబయలు గాగని-ధ్వని ముఖతన్మాత్రలున్న-దాన్నెయెరుగకనూ-గనియీరెంట్లా-దేన్ని యెరుగకనూవునికిగలిగిన యట్టి-ఘనుని సన్నుతిజేయ-జనులాకుశక్యమంచరాదు- వినరాదు-దాన్ని యెరుగకనూ-గనియీ-రెంట్లో-దేన్ని యెరుగకనూ ॥ 6**

తా॥ శిష్యా! శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముతో కూడియున్న 25వదైనలేనెరుక లేకపోయిన తరువాత ఉన్న చోటె 26వ తత్వాన్ని బట్టబయలు గా చూచి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముతో గూడియున్నలేనెరుకను ఎరుగకను గని యీరెంట్లో దేన్నీ ఎరుగకనూ. అనగా అక్కడ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములేని బట్టబయలును ఎరుగక, అనగా విడిచిపెట్టి, ఇక్కడ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముతో కూడియున్న ఎరుకను ఎరుగక, అనగా విడిచిపెట్ట, ఈ రెంటినీ విడిచిపెట్టి, తరువాత ఏది శే[illegible] యున్నాదో అదే ఉనికి, అనగా బట్టబయలనిగాని, లేని ఎరుకనిగాని, ఏ ఊహలు లేక, ఏ లక్ష్యా లక్ష్యములుగాక, ఏమీ లేనిదేదో అదే ఉనికి, అట్టి ఉనికిలో [illegible] అనగా ఇట్టి ఊహాతీతులై యున్న, మహానుభావులను, ఈ ప్రజలు ఎవరూ కూడా [illegible] ఉనికి యిట్టిదని తెలుసుకో లేనటువంటిది. ఒకవేళ ఎవరైనా ఇటువంటి స్థితిలో ఉన్నారని అంటే ఆ మాట వినగూడదనే భావము.

**విశేషార్థము** : శిష్యా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేని చోటు బట్ట బయలుగాగని, అనగా చూచి అంటే తానుపొంది అనగా ఏమీ ఎరుగని స్థితిని పొంది అనగా సుషుప్తివలె ఉన్నస్థితిని పొంది, అనగా అట్టి అఖండ ఎరుకను బట్టబయలుగాగని, అక్కడ తన్మాత్రలున్న యెరుకను యెరుగక, అంటే ఆ సమాదినిష్టలో ఏశబ్దములు లేక, స్పర్శయైనా ఎరుగక, రూపములైన ఏ ప్రతిమలులేక, రస సంబంధమైన ఏ రుచులను జింహ కోరక, గంధములనెడి త్రివిధవాసనలను పొందక, అనగా ఏమీలేని ఉత్తబయలైయున్న దాన్ని ఎరుకను, ఎరుగకను, ఈ విధమైన స్థితినిపొంది, గని ఈ రెంటిలో దేన్నీ యెరుగకను అంటే బట్టబయలై అచలమై అఖండమైయున్న శుద్ధ ఎరుకను ఎరుగక. మరియు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముతో కూడియున్న మలిన ఎరుకను ఎరుగకను, గని ఈ రెంట్లో దేన్నీ ఎరుకనూ, అంటే యీ రెంట్నీ విడిచి పెట్టిన, అనంతరమున, శేషించియున్నదేయునికి, అదే అఖండానుభవరహితమని అర్థము. ఇట్టియునికి గల వానిని ఈ ప్రజలు వానిని గుర్తించలేరని ఒకవేళ ఎవరైనా యిట్టి స్థితిలో ఉన్నారని అంటే, ఆ మాట వినకూడదని, ఎందుకనగా అది పట్టు విడుపులు లేనిది గనుక ఈ వాచార్థ పరులకు ఈ స్థితియనే ఉనికి. యిట్టిదని తెలియబడదు ఎందుకనగా మనకు ఎదురుగా కనుపించే భూతాకాశమె పరిపూర్ణమని అచలమని అనేవారికి ఈ మార్గమైన విచారణ ఏమీ తెలియబడదని ఎరుగవలెను అని భావము. యింద్కు పండిత శివానందస్వామి అచలబోధ శిఖామణిలో

సమాది అనగా సమం అనగా అచలమందు ధీ అనగా బుద్ధి అనగా సమస్తమందు అచలము ఉన్నదని తెలిసి, యేదియు పొక యింకోటికాక తాను లేక ఉండడమే సమాధి, సమంధీ సమాధి, ధీ, బుద్ధి సమసెను, అనే నిశ్చయమే సమాధి, మమకారం వదలెను. ధి, బుద్ధిచేత అనగా తానులేను, అచలము ఉన్నదన్నదే సమాధి, అన్యమైనది సమాదికాదు, అన్యమున్నదనే దానిని గుర్తెరగడము సమాదికాదు, కాక ఉన్నదే సమాది, అన్యము ఉన్నదన్నది లేక పావడమే సమాది, ఉన్నదన్నది లేదన్నది యేమీలేదు. అచలము తప్ప రెండోది యేమీలేదు.

మరియు శ్రీధరస్వామి కృతనిర్వాణ ద్వాదశ శ్లోకములలో 12వ- శ్లోకము

శ్లో॥ సదా అద్యాంతరహితం । అంతర్బాహ్యవివర్జితాత్ ।
సదా సుషుప్త్యవస్థేస్థే । శాంకానాస్తికదాచన ॥

తా॥ శిష్యా! నీ వెల్లప్పుడూ ఆది అంత్యములు లేక, అంతరమందుగాని, బాహ్యమందు గాని, మధ్యమందుగాని, ఊహారహితుడవై యుండవలెను, గనుక నీవు త్రికాలముల యందు ఆత్మావలోకన చేయుచు, సుషుప్త్యా వస్తలో ఉన్నట్లు,

నీవా పరిపూర్ణ ఉనికిలో ఉంటే అఖండానుభవరహితమై ఏశంకలు లేక భ్రాంతి రహితుడవై అశరీరివై పరిపూర్ణ పరశివుడవై లేక ఉంటావు అని తెలవిచ్చియున్నారు.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే బోధస్థితి పురుషలక్షణ న్నామ ఏకాదశో ధ్యాయః భావ విశేషార్ధములు సమాప్తము.



# ★ 12 .బోధపుటన లక్షణం. 14 ★

199 ॥ నామాట లెస్సవినుమా - సామాన్యంబనుచు జూడజనదీబోధన్ - ప్రేమాతిశయ మునంగని - వేమారిది గురునినోట - వినవలె సుమ్మీ - నిత్యము జదువు - కొనవాలె నమ్మీ - నామరూపక్రియనటనలు గలిగిన - దేమివస్తువౌదా న్నియెటు- నిల్వనివ్వాదు - వినవాలె సుమ్మీ - నిత్యము జదువు కొనవలెనమ్మీ ॥ 1

తా॥ శిష్యా! నా మాట బాగా విను సామాన్యమనుకోక ఈ బోధయిది ఎక్కువైన,ప్రేమతో, వేయిమారులైనా సద్గురుముఖతా విన్నదేమరల వినవలయును, ఇది గురుమూర్తి నోటి వెంబడి చెప్పిన యుక్తులు సూక్తులు అన్ని విన వలయును, నిత్యము చదువుకొనవలయును, విచారించుచు గురుయుక్తిచే నీవు బయలైతే నామము, రూపము, క్రియ, నటనలు గలిగినది ఏమి వస్తువౌ, అనగా 25వ దైన ఎఱుకైన దానిని నిల్వనీయదు, ఆ ఎరుకలేకపోతే, నీవు పరిపూర్ణమై యుంటావు అని భావము.

**విశేషార్ధము** : శిష్యా! ఈ అచలబోధ సామాన్యమైనదని నీవెన్నడు అనుకోకు, కారణమేమనగా నీవు బయలై అచలమయ్యే విధానము ఏమతములోను లేదు, అనగా ద్వైతములోగాని అద్వైతములోగాని విశిష్టాద్వైతములోగాని, నీవు లేక ఉండే విధానములు లేవు, యేమతమైనా తానుండి చేసేవేగాని, తాను బయలై లేక చేసే మతములు ఏవీలేవు, మన అచల సాంప్రదాయములోనే, తాను బయలై అచలమై లేక ఉండి తాను అన్నిపనులు చేసుకొనే అచలబోధ, సామాన్యమైనదని యన్నడు భావించకు, నీవు అతిభయభక్తులతో గురుమూర్తికి సేవలు చేయుచుంటే, ఆయనకు దయగలిగి నీకు గురుసూచనసే యుక్తి చెప్పి, నీవు బయలయ్యే విధానము నేర్పి నిన్ను చలనములేని అచలునిగా తయారుచేయును, అనగా సద్గురు మూర్తి అయితేనే,

అంటే ఆయన పరిపూర్ణుడై యున్న గురుడైతేనే, నిన్ను పరిపూర్ణునిగా తయారుచేయును, అంతేగాని మనకు ఎదురుగా కనుపించే ఈ భూతాకాశమే బయలని, అచలమని, చెప్పే గురువులైతే నిన్ను పరిపూర్ణునిగా చెయ్యలేరు, యిలాంటి వారం తావా చార్థపరులే, యిలాంటి వారు వల్ల కారు, పరిపూర్ణులైన సద్గురులైతేనే, నిన్ను పరిపూర్ణునిగా చేయగలరు, యిది యదార్థం, నా మాట నమ్మండి, నాయనా యీ సాంప్రదాయము చాలా పవిత్రమైనది, మన పెద్దలంతా యెన్నో మర్మధర్మములు మనకు తెలియజేసిరి, ఈ అచలబోధ చాలా గుహ్యాద్గుహ్యముగా చాలా రహస్యముల కన్నా రహశ్యమైనది, గనుకనే వారు ఎన్నో యుక్తులుగా సూక్తులు గాను తెలియజేసినా, మనకు తెలియబడుట లేదు ఎందువల్ల ననిన మనపూర్వజన్మ సంస్కారము వల్ల, మన తెలివి ఎంతైతే ఉన్నదో, అంతే అర్థమౌచున్నది ఎలాగనగా యిది పరమ రహస్యమెవ్వారెరుగరుదీనిన్॥అని॥శెల॥రుగనుక దానికై వచ్చిన వానికే, ఈయచలబోధ తెలియబడుచున్నది, కానీ గొప్పకోసం డాంబీకులకు, డంబా చారులకు, అనే కవికారములు పొందేవారికి, నాకే తెలుసుననే అహంబావులకు, అనగా తెలియనిదే తెలుసునని చెప్పే మూర్ఖులకు. యిది తెలియబడేదికాదు. మరి ఎవరికి తెలుసుననగా, రజోగుణ తమోగుణంవిడిచి, పెట్టి కేవలము సత్వగుణము గలవారైతే, తనను పరిపూర్ణునిగా, చేయలేని గరువుని విడిచిపెట్టి, తనను బయలయ్యే యుక్తియనే గురు సూచనజేసి, పరిపూర్ణునిగా తయారుజేసి. అఖండాను భవరహితునిగా చేయగల. సద్గురు మూర్తిని వెదకి వెదకి, మాయగురువులను, తెలియనిదే తెలసుననే అహంకారులను విడిచి పెట్టి. యే గుణములేని శుద్ధ నిర్గుణసంపన్నులై, తానేలేని తానై, ఉత్తబట్టబయలై పరిపూర్ణులై యున్న సద్గురుమూర్తిని, ఆశ్రయించితే, ఆయన గురు సూచన జేసి ఆ గురుయుక్తిలోయున్న మర్మ ధర్మములు, అన్నీ తెలిసే లాగు చెప్పును. అనగా అంతట ఉన్న పరిపూర్ణాన్ని నీ జ్ఞాననేత్రమునకు చూచించి నిన్ను నీలో ఉన్న జీవేశ్వర్లను మొత్తం ఏమీ లేకుండా జేసి, నిన్ను ఉత్తబట్టబయలైన పరిపూర్ణునిగా జేసి, ఈయచల బోధ గురువుగా తయారుచేయును, ఈ సోది చెప్పే గురువులు అలా చెయ్యలేరని భావము.

**200 ॥నే మొదట నిన్నుగనుగొని - యేముక్కలునీదు చెవులో యిమిడిస్తినోసి - వాముక్కల**
**మూడింటిని - యేమాత్రము మరువకుండ - యీ బోధనిస్తి - అంత కెయింత-**
**గా బోధజేస్తి - ప్రేమతో జదువుమి - దేమారకెప్పుడు - కామితార్థమునిచ్చు**
**పోమీ యింటికి దీవిం - చి బోధనిస్తి - అంతకె యింత - గా బోధజేస్తి ॥ 2**

తా॥ శిష్యా! నేను ముందుగా నీవు నా దగ్గరకు రాగానే. నీకు ఏ ముక్కలు మూడు, అనగా ద్వాదశి, షోడశి. పంచదశి ఈ మంత్రములు నీ చెవిలో చెప్పితిని, ఈ మూడు మంత్రములే కందార్థములు 290 లో కూడా యిమిడి యున్నవి, జాగ్రత్తగా

చూడుము, యివి మరువకుండా యుండే నిమిత్యార్థమైనీకు. ఈ బోధను యిచ్చితిని, అందుకే ఇంతగా బోధించితిని, ఇవి ఎక్కువైన ప్రేమతో. చదువుకొనుము, నీవే, కామితార్థములకు ఆసించి వచ్చితివో, అది నీకు సిద్ధించును. అనినేను దీవించి ఈ బోధనీకు తెలియజేసితిని, గనుక మీ యింటికి వెళ్ళమని భావము.

విశేషార్థము : శిష్యా! నేను నీకు మొదట చెప్పినవి, ఏమిటనగా, ద్వాదశి షో డశి, పంచదశి ఈ మూడు మంత్రములు చెప్పియున్నాను, అనగా ద్వాదశియంటే, నీలో యున్న జీవేశ్వర్లు వగైరాలు అన్నీ రహితమైన తరువాత, ఉత్తద్దె ఏదైతే శేషించియున్నదో, అదేద్వాదశాక్షరీ మహామంత్రము. అదే అచల పరిపూర్ణము, అందులోనుండి వచ్చేదే లేనెరుకనే, సంకల్పవికల్పములు పొందేదే. జీవేశ్వర్లనేషోడశాక్షరీ మహామంత్రము, మరియూ ఈజీవేశ్వర్లు వీటివల్ల వచ్చిన జగత్తు ఇవన్నీ కలలో తోచినట్లు తోచిన ఎరుక, మేలుకొంటే ఏమీ లేనట్లుగా, అనగా కలలో తోచిన శరీరాలు యెలాగూ అలాగే, యిది పంచదశి మహామంత్రము. అనగా కలలో తోచిన శరీరాలు ఏలాగున ఏమీ లేవో, అలాగు మూలం లేని ఈగుర్తెరిగే శరీరం యేమీలేదు. ఈ ఉత్త బట్టబయలు యేమీలేదు, అనగా ఈ మూడు ఎరుకలు లేకపోయిన తరువాత, అంటే జీవగుణములు ఈశ్వరగుణములు, అఖండ ఎరుక దోషములు లేకపోయినతరువాత, యేది శేషించి యున్నదో, అదే అఖండాను భవరహితం, అదే శుద్ధనిర్గుణతత్వం, అదేఅచల పరిపూర్ణ పరశివతత్వం, అలా విచారించి పరిపూర్ణమై యుంటావని, దీవించి, నీ కోరిక నెరవేరును, మీ యింటికి వెళ్ళు, నేను చెప్పవలసినది, నీవు వినవలసినది యిక యే మీలేదు అని భావము.

**201 ॥ అన్నము దిన్నను ఆకలి - తిన్నగనీరంబు ద్రావ తృష్ణయు రోగం - బెన్నగ
ఔషధసేవను - జన్నక్రియన్ యెరుక నిల్వ - జాలదయన్నా - ఈ బోధనే-
చాలాతోవిన్నా - క న్నులతో జూచి కడముట్ట జదివిన - విన్నెన్నటికి యెదుట
నిలచుండికనుగొన - జాలదోయన్నా - యీ బోధవి - చాల తోవిన్నా ॥ 3**

తా॥ శిష్యా! అన్నము తినినట్లైయితే ఆకలి దీరినట్లును, నీరు త్రాగినట్లైతే దప్పిక పోయినట్లును, ఔషధము సేవించుటవల్ల రోగముపోయినట్లుగా, ఈ క్రియలన్నీ పోయినట్లుగా యెరుక నిల్వజాలదు, ఈ పరిపూర్ణ బోధ విన్నట్లైతే, ఎరుక నిల్వకుండా పోవును, నేత్రములతో ఈ 290 కందార్థములు కడవరకు చదివి. విమర్శించినట్లైతే, ఈ యెరుక ఎప్పుడు నీ యెదుట, నిల్వ జాలదు అని భావము.

విశేషార్థము : శిష్యా! ఔషధము సేవించిన రోగముపోయినట్టు, ఈ అచలబోధనీచెవుల తో విన్న, కన్నులతో చూచి అనగా గురువుగారు చూపించిన సూచన నీవు కన్నులతో చూచి, అనగానీవు పరిపూర్ణమైతే ఉన్నది ఉన్నట్లు ఉంటే, మన యెదుట ఉన్న బయలు

వలె నీవు బయలైతే, ఎరుకయన్నదూ నీ యెదుట, నిలచి ఉండకుండాపోవును అని భావము.

**202 ॥ జనన మరణ ప్రవాహము - న ణచును యీ బోధ పట్టుడని సాధువులిచ్చిన - నొల్లకుండి వారలు - జనినపుడాబోధ మీద - జనియించిప్రేమా - వెదకెదరట్టి- జనచేష్టలేమా - యనితెలిచి నీకు నే వినజెప్పవలసెనీవును యీ బోధను వల్లననకు దొరుకదు మళ్ళి - జనియించి ప్రేమా - వెదకెదరట్టి - జనచేష్టలేమా ॥ 4**

తా॥శిష్యా! జననము మరణము అనగా పుట్టుట గిట్టుట అనే ప్రవాహములు ఎటువంటి వారికి తప్పుటలేదు, తప్పవు, (జాతస్యమరణం ధృవో) అన్నట్లు పుట్టిన ప్రతివారు చావవలసినదే, అట్టి ఈ ప్రవాహమును, లేకుండా చేస్తుంది ఈ బోధ అని, ఎవరైనా పెద్దలు వచ్చి చెప్పితే అప్పుడు మనం వినము, వారు వెళ్లిపోయిన తరువాత, ఆ బోధ మీద జ్ఞానం పుడుతుంది, వారు పోయిన తర్వాత మనకెట్లు దెలుసును, అందువలన నేనీకు చెప్పవలసివచ్చినది, ఇట్లు పెద్దలు మనకు చెప్పినపుడు వద్దనకని మీకు నేను వినజెప్పవలసెను అని భావము.

**విశేషార్థము :** శిష్యా! జనన మరణ ప్రవాహమనగా, సంకల్ప వికల్పములు, ప్రవాహము, నణచును యీ బోధ, అనగా గురువుగారు యిచ్చిన సూచన విచారించిన, అనగా చూచే దాని మొదలు చూచిన, చూపులేదు, చూపులేకపోతే, యెరుకలేదు, యెరులేకపోతే, దానివల్ల కలిగిన సంకల్ప వికల్పమనే ప్రవాహమురద్దు, చిజ్జడ కల్పన రహితమని భావము.

**203 ॥ మరుపుకు తన్మాత్రలుగల - వెరుకకు తన్మాత్రలున్న వీ రెండొకటే - పరిపూర్ణమునకు లేవని -పరిపూర్ణము యెరుకగాదు - మరుపుగాదోయీ - వెతికినదీవి సరిదిలేదోయీ- పరిపూర్ణమెరుకాల పరిశోధించి గ్రంధము - రచించినీ కిప్తిమరువక చదువెరుక- మరుపుగాదోయీ - వెతకినదీవి - సరిదిలేదోయీ ॥ 5**

తా॥శిష్యా! యింద్రియములు 24 గలిగిన జీవలక్షణమైన ఈ మరువు దేహములోను తన్మాత్రలున్నవి, 25వదైన సర్వజ్ఞత్వ లక్షణమైన ఈశ్వరతను దేహములోను తన్మాత్రలున్నవి. ఈ రెండూ ఒకటే, యివి పరిపూర్ణమందు లేదు, పరిపూర్ణము ఎరుకను పరిశోధించి, ఈ గ్రంధమును రచించినీకు యిస్తిని, మరువక చదువుము అని భావము. *

**విశేషార్థము :** శిష్యా! పరిపూర్ణగ్రంధము చక్కగా చదువుము దానిలోని భావము నీకే తెలియును, బయలు నీకు తెలియబడినప్పుడు అనగా నీవు బయలైతేనే నీకు బయలు తెలియబడును, నీవు బయలవకపోతే, బయలు బయలు అని వాచార్థముగా అను

కుంటమేగాని, బయలు సంగతి నీకు తెలియబడదు, బయలు నీవైతేనే యెరుక లేకుండాపోవును, గాని ఈనీవు బయలవకపోతే, యెరుకపోదు, ఎరుకలేదని వాచార్థముగా అనుకుంటమెగాని అంతమాత్రమున ఎరుకలేకపోదు గనుక నీవు శ్రద్ధగా చదువుము, పరిపూర్ణము ఎరుక మరుపులకు అతీతమైనది, గనుకనే పరిపూర్ణ మెరుకను పరిసోదించి గ్రంథం, రచించి నీకిస్తి చదువు అని భావము. యిందుకు వేమనార్యుల వారు ఇలా చెప్పియున్నారు.

కం॥బయలందు పుట్టుసర్వము ।
బయలందే లియ్యమౌను బ్రహ్మాండంబుల్ ।
బయలే తానని తెలిసిన ।
బయలందే ముక్తి బట్టబయలగువేమా ॥

బయలు తానేయని చెప్పియున్నారు మరియూ శివరామ దీక్షితులవారు దీక్షితీయములో సమాధినిరసన ప్రకరణలో 162వ పేజిలో 23వ పంక్తి.

గురువు - ఓయీ బట్టబయలని యనుట ఎందుకనగా సూచనకు అనుటయేగాని ఎరుకపోయినపిమ్మట బయలు ఎక్కడగలదు, బయలని అనుకునేవారు ఎవరుగలరు. యెరుకే బట్టబయలనును ఈ యెరుక ఆ బట్టబయలు రెండూ సమానమే యెంత మాత్రం బేధములేదు, యెరుక ఉన్నంత వరకే పరమని అనవలసివచ్చెను, గాని యెరుకపోతే పరమని ఎవరందురు అని శెలవిచ్చియున్నారు. మరియు 166వ పేజిలో 12వ పంక్తి.

ఈ ఉత్త బట్టబయలును ఎవరెరుగుదురు, కేవలాత్మ ఈ ఉత్తపరము, ముంజేతికంకణమువలెనగుపడును, ఈ కేవలాత్మ గజ్జెలు కట్టుకొని ఆడేదికాదు, ఈ ఉత్తబట్టబయలు యేమీ లేదని ఎరుగవలెను, ఈ ఉత్త బట్టబయలును గుర్తెరిగిన యడల, ఈ ఉత్త బట్టబయలువలెనే మనస్సుకూడా ఉండును, ఈ ఉత్త పరమును దెలిసినవారు పరిపూర్ణులే, ఈ పరిపూర్ణమును ఎంతవరకు నెరుగరో అంతవరకు నరకము తప్పదు, ఈ ఉత్తబట్టబయలును యెరుక యెరుగనేరదు, ఈ కేవలాత్మను ఎరుగుటయనగా, యెరుకలేకపోవుటయని యర్థము, ఇది పరిపూర్ణమని అందరితో చెప్పగూడదు, ఈ రహస్యము అందరికి మనస్సునకు పట్టదు మహాగూఢమైనది, అని శెలవిచ్చియున్నారు.

అయ్యా ఇంతలోతు విచారణ తెలియక మనయెదురుగా ఉన్నది బయలని కొంతమంది చెప్పుచున్నారు, కొంతమంది శాస్త్రం ప్రకారం ఎక్కడో ఉన్నదని చెప్పుచున్నారు. ఈ వాచార్థపరులకు ఈ జన్మలో ఆపరము తెలియబడదు, ఎవరికైనా సద్గురువు లభించితేనే ఆపరము తెలియబడునుగాని, వాచార్థపరులకు తెలియబడేది కాదు. యిది అచలఋషి సాంప్రదాయమని ఎరుగరు, గనుక ఈ తిప్పలు తప్పవు అని భావము.

**204 ॥ అందముగా సద్గ్రంథము - చందము వినిపింతుదాన్ని చదివిన వినినన్ - ముదుగ బయ లెరుకైయే-సందునలే నెరుకలేక -జనవలె సుమ్మీ-అదెయిది - విని చదువు మీ నమ్మీ - యెందూకు నీకింక -యితర శాస్త్రముల జోలం-దుగుర్తుండి పోదది గాన యీ యెరుక - జనవలెసుమ్మీ - అదె యిది విని చదువు మీ నమ్మీ ॥ 6**

తా॥శిష్యా! అందముగా సద్గ్రంథము ముందుగా చెప్పుచున్నాను, యివి వినినట్లైతే ముందుగా బయలు ఎరుకై అనగా తెలియబడి, లేనెరుకనగా ఈ తెలుసుకొనే తెలివి పరిపూర్ణమై, ఆ బయలులో కానరాదు, యిది ఈ సాంప్రదాయప్రకారం, మితమును ఎక్కువకాలం సాధిస్తేనే తెలుస్తుంది, ఇతరులకు తెలియదు, యిది ముందుగా అభ్యాసంచేస్తే బయలు ఎరుకై ఎరుక బయలు అవుతుందిగనుక, ఏసందున లేనెరుక లేకపోవలెను, అదెయిది నీవు చదువు మీ నమ్మి నీకింక యితర శాస్త్రముల జోలి అవసరము లేదు, ఇతర శాస్త్రములలో గుర్తు ఉంటది. ఈ బోధ యందు గుర్తు నిల్వదు, గావున దీనిని చక్కగా విమర్శించు. ఎరుక నిల్వకుండా పోవును అని భావము.

**విశేషార్థము** : శిష్యా! ముందుగా అచలపరిపూర్ణ గ్రంథము చక్కగా దానిలో భావము వినిపించెదము. బయలు నీకు తెలియబడి, అనగా నీవు బయలైతేనే నీకు బయలు తెలియబడును. యీ బయలవకపోతే, బయలు బయలు అని వాచార్థముగా అనుకుంటమేకాని. బయలు సంగతి నీకు తెలియబడదు, బయలు నీవైతేనే యెరుక యెందునాలేకుండా పోవును, గాని నీవు బయలవకపోతే, యెరుకపోదు, ఎరుకలేదని వాచార్థముగా అనుకుంటమెగాని ఎరుకలేకపోదు. ఈ వాచార్థపరులు తాచెర్థకోతి వనమంతా - చెరిపినట్లు అందర్నీ చెరుపుచున్నారు, ఇది అచల ఋషి సాంప్రదాయమని ఎరుగక ఈ తిప్పలు తప్పవు అని భావము.

**205 ॥ చక్కెర మొక్కకలోకులు - చక్కెర మాధుర్య మెరుగ - జాలరటువలెన్ - మక్కువతో విని చదువక - చక్కగ గ్రంథార్థమెరుగ - జాలేరజనులూ - కావున నీవు - చాలించి పనులూ - చొక్కామీ గ్రంథాము - చూడూమి కొనవెళ్ళ - యిక్కాడి తాజన్మ మెత్తావు సరి - తెలియజాలేరజనులూ - కావున నీవు - చాలించిపనూలూ ॥ 7**

తా॥శిష్యా! చక్కెర తినకుండా చక్కెరలోని మాధుర్యమును గ్రహించలేనట్లు, ఈ ప్రకారంగా విని ఈ గ్రంథమును చదివినవారికే, గురునిద్వారా తెలుసుకున్న వారికే, ఆ పరిపూర్ణము తెలిసునుగాని, తదన్యులకు లభ్యంకాదు, అందుకే మక్కువగా విని చదివినట్లైతే ఈ గ్రంథము యందు లోపలయున్న గూఢార్థము తెలియగలరు, గావున యితరములైన పనులన్నీ చాలించి,మొదటి నుంచి చివరి వరకు, నీవు చదివి విన్నది విచారించి ఆచరణలో పెట్టినట్లైతే, ఆ పరిపూర్ణము నీకు తెలిసి నీవే పరిపూర్ణుడవై, యిక్కడతో యిక జన్మమెత్తవు అని భావము.

**206 ॥ గూడార్థమెరిగి సతతా - రూడుండైన తదుగ్రం - థరుచి గొనడు భువిన్ - గాఢత రజ్ఞానంబున - మూఢుండైయున్నవాడు - మొదటికె వినడూ - సుజనులపాదముద మొప్పగనడూ-వాడు వీడన రానివాడే గ్రంథము విని - వాడు నిశ్చయమిట్టి-వార్త లెరుగని వాడు-మొదటికె వినూడూ - సుజనుల పాద - ముదమొప్పగనడూ ॥ 8**

తా॥శిష్యా! గూడార్థము బాహ్యార్థము అనగా అంతరార్థము తెలిసి, ఎల్లప్పుడు ఆరూఢ స్థితిలో యున్నవానికి, గ్రంథాభిలాషయుండదు, అసలు ప్రపంచమేమో పరమార్థమేమో తెలియని వానికి, ఈ గ్రంథ పరిచయమక్కరలేదు, విజ్ఞాన వంతులును జూచి ఓర్వలేడు, వాడు వీడన రాని మధ్యనున్న వానికే ఈ గ్రంథ పరిచయము కావలెను. యిది నిశ్చయమైన వార్త, యిది తెలియనివాడు, చెవియొగ్గి వినడు అని భావము.

**విశేషార్థము :** శిష్యా! గూడార్థమెరిగి సతతారూఢుండైనతడు గ్రంధరుచి గొనడు, భువిన్ గూఢార్థమనగా తాను సర్వకాలములయందు అఖండమై యుండేలాగు విచారించే ఆరూఢా స్థితిలో వుండేవానికి, మంచి అనుభవం కలవాడై యుండగలుగును. అట్టి వానిని కొన్నాళ్ళకు, అఖండానుభవ రహితమౌను, యిట్టి అఖండానుభవ రహితమై సతతారూఢుండైనతడు, అనగా సర్వకాలములయందు అట్టి ఉనికిలో ఉన్నవానిక, గ్రంథాభిలాషగాని ఏ అభిలాష ఉండదు, గనుక దేనిని కోరడు, ఎందుకనగా ఈ కోరి కలుకోరే ఎరుకమ్మగారు వెళ్ళిపోయెను, గనుక ఏమీలేని ఉత్త బట్టబయలై పరిపూర్ణమై యుంటాడని భావము.

**207 ॥ తాబేటి తలపుచేతను-తాబేల్పిల్లలక్షుదార్తితల గుట తెలియన్-తాబేటి గర్భమందున-తాబేలై పుట్టకున్న - తరమాయి తరులకూ - సద్గురుబోధ - ట్లరయని తరులకూ-యే బాధలెరుగాని యీ బోధగలవారి - చే బోధబడయాక - చేకొనదలచితె - తరమాయి తరులకూ - సద్గురుబోధ - ట్లరయా నితరులకూ ॥ 9**

తా॥శిష్యా! క్షుద అనగా ఆకలి - తాబేలు యొక్క తలపుచేత, తాబేటి పిల్లల యొక్క ఆకలి దీరినట్లు అనగా తాబేలు తలపుచే తాబేలు పిల్లల ఆకలి తీరుట తెలియాలి అంటే ఆ తాబేలు గర్భమందున జనించితేనే తెలుస్తుంది. కాని ఇతరులకు తెలియబడదు, అలాగే ఈ బోధ తెలియాలంటే, ఆ గురు గర్భనితులకే దీనిలోని యదార్థం తెలుస్తుంది, కానీ యితరులకు తెలియదు, యేబాధలు ఎరుగని సద్గురువులచే, ఈ బోధ తెలుసుకొనక, ఇంకోరకంగా తెలుసుకుందాము అంటే యిది తెలియబడదు, అని భావము.

**విశేషార్థము :** శిష్యా! తాబేలు తలపుచేత, తాబేలు పిల్లలు ఆకలితీరుట తెలియవలె నంటే, తాబేలు గర్భమందు పుట్టవలెను, అలాగే సద్గురు బోధ తెలియవలెనంటే,

వారిని ఆశ్రయించి వారి బిడ్డ అయిన వారికి తెలుసును, ఏమి తెలుసునంటే ఏ బాధలు లేనియీ బోధ, అంటే అన్ని బాధలకు మూలమైన యెరుక లేకపోతే, ఏ బాదలు వుండవు, కారణమేమనగా, యెరుకలేకపోయిన తరువాత, ఉన్నది పరిపూర్ణమేకదా, తాను పరిపూర్ణమై యుంటే ఏ బాధలు వుండవు, అన్ని బాధలకు మూలమైనది యెరుకేనని భావము.

యిందుకు పండిత శివానందస్వామి అచలబోధ శిఖామణిలో 66వ పేజీలో యెరుకనగా దృక్కురూపము, దృక్కుకు, నామ రూపములు లేవు, లేనిదే లేదు గనుక అదిలేకపోతే దానిచేత తోచబడిన, ప్రపంచం లేదు, లోపటను లేదు బైటను లేదు, యక్కడను లేదు, గనుక అది లేకపోయెను.

మరియూ 93వ పేజీ - గురువు - ఓయీ ! నీవు లేకపోతే నీవే పరిపూర్ణుడౌ

మరియూ 95వ పేజీ లేని యెరుక బయలైనవారికి, ఏమీలేదు - లేక ఉన్నదే దృఢము సర్వకాలం ఏకతీరే, పుట్టినను గిట్టినను, బట్టబయలే స్వతఃస్సిద్ధము అని శెలవిచ్చియున్నారు.

**208 ॥ ఈ తాపేక్షను మనుజులు - నూతిదరింజేరి నిల్చి నోట గొలిగిన - యీ తేలవచ్చు వారికి - చేతులతో నీళ్ళ - మీద - చేరీయీదకనూ - మునునేర్పిన - వారీ దింపకనూ యీ తీరుగనె దేశికేంద్రుడు దెల్పక - చాతుర్యమున బోధ సాధించ నయ్యాన - చేరి యీదకనూ - మునునేర్పిన - వారీదింపకనూ ॥ 10**

తా॥శిష్యా! ఈత యందుండబడే ప్రేమచే. నూతివద్దకు వెళ్ళి నాకు ఈతరావాలి నాకు ఈతరావాలి అంటే, ఈత వస్తుందా రాదు, ఈతరావాలి అంటే ముందుగా అది తెలిసినవారు, చూచించి ఈదించవలెను. తాను నీటిమీద చేతులతో ఈదుచూ నేర్పవలెను, ఈ పద్ధతిగానే దేశిక స్వామి చెప్పకుండా, ఈ బోధసాధించుదామంటే అది ఎంతచేసినా సాధ్యంకాదు, అనగా తెలియబడదు, తెలుసుకొనలేరు, ముందుగా పరిపూర్ణుడైయున్న గురువువద్దకు చేరిన, ఆయననేర్పితే పరిపూర్ణుడౌను అని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఈతరావాలంటే ముందుగా ఈత నేర్చుకొన్నవారి యొద్దచేరి ఈత నేర్పుమంటే, ఈత చక్కగా నేర్పును, అలాగే ముందుగా పరిపూర్ణుడై సర్వకాలములయందు, పరిపూర్ణుడై వుండనేర్చిన గురువైతే, అట్టి సద్గురువుని ఆశ్రయించినవారిని, చక్కగా తయారుచేసి, పరిపూర్ణునిగా తీర్చిదిద్దును, అప్పుడు వాడు పరిపూర్ణుడై సర్వకాలము ఉండగలుగుతాడు అని భావము.

**209 ॥ ప్రవిమలచిత్తుడు శిష్యుడు - సవినయమున దేశికునకు శరణాగతుడై - త్రివిధ ప్రసాదముల గొని - భవనాశస్థితులు లేవి - పద్ధతివినినన్ - తిరిగిరాని - పద్ధతిగనినన్ - భువిలో వాని సాటి బోల్పనెవ్వరులేరు - అవిరాళ్ళ భక్తినీవారీతి నుండేవీ పద్ధతివినినన్ - తిరిగిరాని - పద్ధతిగనినన్ ॥ 11**

తా॥శిష్యా! ప్రవిమలచిత్తుడు, అనగా హృదయ మాలిన్యములేనివాడు సవినయముగా, దేశికస్వామికి శరణుజొచ్చినవాడై, త్రివిధ ప్రసాదములును గైకొని, అనగా గురుపాదోదకం ఒక ప్రసాదం, గురుమూర్తి భోజనం చేస్తుండగా యిచ్చినది రెండో ప్రసాదం, గురుభుక్త శేషం మూడవ ప్రసాదం, యిది వాచార్థం, ద్వాదశి షోడసి, పంచదశి మూడు మంత్రములు, త్రివిధ ప్రసాదములు, లక్ష్యార్థంగా తీసుకొని, భువనాశము లేని, బోధయొక్క పద్ధతి యొక్క స్థితిని, విన్నట్లైతే మరియూ తిరిగిరాని పద్ధతి యొక్క స్థితి గనినట్లైతే, వానిసాటి ఈ భూమి యందు ఎవ్వరూ లేరు, నీవు విరామములేని భక్తిగలవాడవు, గనుక నీవు ఆ రీతిగా చేయుమని భావము.

**210 ॥ ఉపనయనముగాదిదెశా - నుపనయనము మీది చదువులమాటనుగొనినన్ - విపరీత మగునుదానను - చపలుడు బ్రాహ్మణుడుగాడు -చర్చించి చూడ శూద్రుడు వాన్ని యర్చించరేడా-నుపమాచెబోధల్ల ఊహించి నిక్కిటి-కపటాచిత్తుడు సాధుగణమూతో నమమౌనె - చర్చించిచూడా - శూద్రుడు వాన్ని యర్చించరేడా ॥ 12**

తా॥శిష్యా! ఉపనయనము కానిదె, అనగా జ్ఞాననేత్రమనే మూడో నేత్రమును గురువుగారు చపించుటే, శిష్యుడు చూచుటే, ఉపనయనము, ఈ విధముగా ఉపనయనము కాక, దీనికి మీదుగా మాట్లాడితే, విపరీతమౌను, అందువల్ల వాడు చెపలుడు, బ్రాహ్మణుడుగాడు, విచారించి చూడగా శూద్రుడు వాడ్నీ పెద్దలు విశ్వసించరు, అలాగే ఈ సాంప్రదాయము, యొక్క సూచన గురువు ద్వారా నెరుగక ఉపమానముచేత, అనేక రకములుగా చెప్పచూ, నాయంతటి వాడు లేడని నిక్కుచు, నీల్గుచున్న కపట చిత్తుడు, అనగా ఈ సాంప్రదాయము నాకు ఏమీ తెలియదని తెలుసుండి, కపట చిత్తముతో తెలిసినట్లు చెప్పచుండును, సాధువులైన సజ్జనులు, అనగా యెరుకను విడిచిన సన్మార్గులు అయిన వారితో, వీడు సాటికాడని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఉపనయనమనగా యింకోనయనము, అనగా మూడవ నేత్రమైన జ్ఞాన చెక్షువు, అనగా యీ మాంస చెక్షువులైన ఈ నేత్రములు కావు, అజ్ఞాన చెక్షువు గురువుగారు మనయందు ఉండే ప్రేమచేతమనకు, చెప్పాలనే ఉద్దేశము కలిగి అగురు సూచననే గురుయుక్తి చెప్పి చూచించును, దానిని సర్వకాలములయందు సర్వావస్తల యందు శ్రద్ధాభక్తులతో ఆచరించిన యెడల, తాను బయలై అచలమై పరిపూర్ణుడౌతాడు, అనగా ఎరుక లేని స్థితిని పొంది సర్వకాలం ఆ ఉనికిలో ఉంటాడు, యిట్టి బ్రహ్మజ్ఞానముగలవాడే బ్రాహ్మణుడు యిట్టి బ్రహ్మజ్ఞానం సంపాదించకుండా యీ స్థితికిపైన, ఉపమానములతో పుస్తకములు చదివి ఎన్నో విధములుగా, వాచార్థముగాను చెప్పచుండును, కానీ అతనిని విచారించి చూడగా శూద్రుడు, బ్రాహ్మణుడుకాడు, అనగా బ్రహ్మజ్ఞానమైన స్థితి లేనివాడు, అనగా సద్గురునివల్ల జ్ఞాన

నేత్రమనే, మూడవనేత్రము పొందినవాడు, నాకే తెలుసుననే అహంకారముతో, నిక్కుచూ నీల్గుచూ అనేక వికారములు పొందేవాడు, సజ్జనులైన సాధువులతోటి, సమానమౌనా? వీడుకపట చిత్తుడు, విపరీతముగా చెప్పేవాడేగాని బ్రహ్మజ్ఞానికాడు, అనగా బ్రాహ్మణుడైన బ్రాహ్మణుడుకాడని భావము.

**211 ॥ మంత్రముచే సంతెల్లగు - తంత్రము లేకున్న కాదు తంత్రము చేతన్ - మంత్రము లేకను వడుగిల - మంత్రము తంత్రంబురెండు - మరిగూడుకొనీ - కార్యములన్ని - జరిగించుపూనీ - మంత్రతంత్రములాలో మర్మాముగురుడెరుగు - మంత్రతంత్రము లాలో మరుగెరుగుగురునిచే-మరిగూడుకొని కార్యములన్ని-జరిగించుపూనీ ॥ 13**

తా॥శిష్యా! మంత్రములచేత ఈ పనుల వ్వవు, తంత్రము లేకపోయిన ఈ పని అవ్వదు, తంత్రము చేత మంత్రముచేత వడుగు చేయవలెను, అనగా మంత్రమనగా వేదపఠన, తంత్రమనగా 5 సంవత్సరములు బాలుడు, వాని తల్లిదండ్రులు, కొబ్బరికాయలు, బియ్యము, పసుపు, కుంకుమలు, ఆకులు, చెక్కలు, జంధ్యము, నూతన వస్త్రములు వగైరా తంతులన్నీ ఉండి, వేద పఠనయనే మంత్రములు చదువుచుంటే, ఒడుగు అగును, ఈ ప్రకారముగా మంత్ర తంత్రములవలన కార్యములన్నీ చేయవచ్చును, మరియూ మంత్ర తంత్రములలో ఉన్న మరుగు, సద్గురుమూర్తి ఎరుగును, అట్టి సద్గురుమూర్తి వలన, ఈ మరుగులు యెరుగవలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! మంత్రముచే ఎరుకలేకపోయె పనిపూర్తి అవదు, తంత్రం కూడా ఉండవలెను, తంత్రమనగా యెరుకలేకపోయేపని, అనగా యెరుకను యెరుకే చూచితే, అనగా తన్ను తాను చూచితే, యెరుక ఏమీ లేకుండా పోవును, యెరుకయేమీ లేదనేదే వాచార్థము, అనగా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం, ఏమీలేదు వాచార్థముగా అనుకొనుట మరియు ఈ ఉత్తబట్టబయలు యేమీలేదు, అనే ద్వాదశియే అనగా ఉత్తదే బట్టబయలై ఏమీలేకయున్నదే ద్వాదశి యిదే లక్ష్యార్థం, గనుక నీవు ద్వాదశియై ఉండవలెను, గనుక ఈ మంత్ర తంత్రములు రెండూ కూడుకొని, ఈ ఎరుక లేకుండా పోయేపని పూర్తి చేయును, గనుక ద్వాదశి షోడశి మంత్రతంత్రములు మరుగు గురుమూర్తి ఎరుగును గనుక సద్గురునిచే ఈ మరుగు ఎరుగవలెనని భావము.

**212 ॥ సంకల్పాదికగుణముల - సంకులమీయెరుక - యందు సమకూడుండున్ - సంకల్పాదిక గుణముల సంకులమ చలమునజాడ - జాడాలేదన్నా - యీరెంటికీ- యీడుగా దన్నా-కొంకకయీ రెంట్ని-గూర్చి గ్రంథము జేస్తే - సంకోచింపక జదువు- శంకబుట్టదు శంక - జాడా లేదన్నా - యీ రెంటికీ - యీడుగా దన్నా ॥ 14**

తా॥ శిష్యా! సంకల్పాదికగుణములు, అనగా సంకల్పము వికల్పము కోరికలు వికారములు మొదలైన యావత్తు గుణములు, ఎరుక యందు యిమిడియుండును,

ఈ సంకల్పాది గుణసంకులము, అచలమునందు చూడ, ఎచ్చటను లేవు, ఈ రెంటికి ఈడు సరిపోదు, జంకులేకుండా ఈ రెంట్నీ విచారించి, నేను ఈ గ్రంథము రచించి నీకు యిచ్చితిని, సంకోచింపకుండా శ్రద్ధగా చదువు, విచారించుము, ఇక నీకు శంకబుట్టదు అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే బోధ పఠన లక్షణం నామ ద్వాదశోధ్యాయః భావ విశేషార్ధములు

సమాప్తం



## ☆ 13 .భద్రాద్ర్యంకితం. 8 ☆

**213 ॥ అలభద్రావచలమనిన బ - యలుగాగుర్తెరుగ వలయు యెరుకను విష్ణుం - దులదోచి గురునిక్రృపచే - విలువక విష్ణేగిరిపోతె - నిశ్చాయమదెరా - కృష్ణదాసు - నిశ్చాయమిదెరా - యిలమీదయెవరైనా - యీ కందార్ధములోపలి గూడార్ధము దెలియ - భ్రమను జెందరువారు - నిశ్చాయమదెరా కృష్ణదాసు - నిశ్చాయమిదెరా ॥ 1**

**తా॥శిష్యా!** అలభద్రాచలమనిన బయలుగా గుర్తెరుగ వలయు. అనగా భద్రమై అచలమై పరిపూర్ణమై యున్నదే భద్రాచలమని, ఆ భద్రాచలమే బయలని, గుర్తెరిగి, ఎరుకనే విష్ణువు, ఆ బయలులో దోచెను, అనగా లేనెరుకనే విష్ణువనే ఎరుకతోచెను, సద్గురు మూర్తి కృపచే ఆ బయలులో తోచిన ఎరుకను విచారించి, దానిమూలము ఎరిగితే, అనగా బయలును ఎరిగి తాను బయలైతే, ఈ విష్ణువనే లేనెరుక లేకపోయెను, ఇదే నిశ్చయము. క్రష్ణదాసు నిశ్చయమిదెరా, ఈ ప్రపంచములో ఎవరైనా ఈ కందార్ధములోపలి గూడార్ధము, అనగా ఈ మంత్రముల యొక్క రహస్యము తెలుసుకుంటే, భ్రాంతి రహితమౌను, యిదే నిశ్చయము, క్రష్ణదాసు, నిశ్చయమిదెరా, యని భావము.

**విశేషార్ధము :** శిష్యా! భద్రమై అచలమైయున్న బయలులో, లేనెరుకనే విష్ణువు ఆ బయలులో తోచెను. శ్రీ సద్గురుమూర్తి చెప్పిన సూచననే సూత్రముచే విచారించగా విష్ణువనే లేనెరుక లేకపోయెను, యిదే నిశ్చయము, శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువు నిశ్చయమిదే గనుక ఈ ప్రపంచములో యెవరైనా ఈ కందర్ధములోపలి, గూడార్ధమెరిగితే, గూడార్ధమనగా తాను బయలై అచలమై పరిపూర్ణమై యుండుటే గూడార్ధము, ఇట్లుంటే భ్రాంతి రహితమై, యెరుకలేక యుండునని భావము.

**214 ॥ భాగవతులనారాయణ - యోగికి జానకియనేటి యువిదామణికిన్ - బాగుగ పుత్రుడనైన భూ - భాగమునన్ కృష్ణననుచు - ప్రభవించినానూ - అనంతికి - ప్రభువునైనానూ - నాగురువు కృపచేత నయమైన యీ బోధ - నే గంటికన్నంత నీకు దెల్పుటకిట్లు - ప్రభవించినాను - అనంతికి - ప్రభువూనైనానూ ॥ 2**

తా॥శిష్యా! శ్రీ భాగవతులనారాయణయోగికి, జానకి యనేటి దంపతులకు పుత్రుండనై భూభాగమున పుట్టితిని, కృష్ణభట్టు అను నామముతో, ఈ అనంతికి ప్రభువునైనాను. నా గురువుగారి దయతో - నాకు దెల్పిన ఈ బోధ, నేదెలిసినంత నీకునేను దెల్పుటకు ఇట్లు ప్రభవించితిని, అనంతికి ప్రభువునైతినను భావము.

**215 ॥ దేశాటనంబుజేసితి - వ్రాసితి గ్రంధములుకొన్ని వరగురుశిష్యుల్ - జేసేటి చర్చవింటిని - రోసితి మోక్షాద్యపేక్ష - రూఢిగవినుమీ - నీవిట్టియా - రూఢాతగనుమీ - దేశికుదయ బుట్టి జేసి శుశ్రూషచే - దేశముగొని యుపదేశా మిచ్చితి మెచ్చి - రూఢిగవినుమీ - నీవిట్టియా - రూఢాతగనుమీ ॥ 3**

తా॥శిష్యా! నేను అనేక దేశములు తిరిగితిని, నేనేకొన్ని గ్రంధములను వ్రాసితిని, గురవులు శిష్యులు చెప్పుకునే బోధ విన్నాను, ఇక మోక్షమనే అపేక్షవదలితిని. నీవు శ్రద్ధగా వినుము, నీవు కూడా యిట్టి ఆరూఢస్థితియే పొందుము, ఎట్లనగా దేశికునకు దయపుట్టే లాగున నేను శిశ్రూషజేసి వారిచే యుపదేశము పొంది, నీకు ఈ బోధ ఉపదేశించుచున్నాను, మెచ్చిగావున యిట్టి ఆరూఢతను నీవు కూడా పొందుము అని భావము.

**విశేషార్థము** : శిష్యా! కొన్నిదేశములు తిరిగితిని, కొన్ని గ్రంధములు వ్రాసితిని, గురుశిష్యులు చేసే చర్చలువిన్నాను, మోక్షమనే అపేక్షవదులుకున్నాను, నీవు కూడా ఈ విధముగా చేయవలెను, సద్గురుమూర్తికి దయపుట్టేలాగు, గురుభక్తి గురుసేవ గురునిష్టగా అన్ని పనులూచేసెను, వారికి నాయందు దయబుట్టినాకు ఉపనయనము చేసి, అనగా గురు సూచనజేసి, ఆ మర్మధర్మములు జెప్పినట్లు నీకునేను ఉపనయనము చేసి అవియన్నియు చెప్పితిని, గనుక నీవు సర్వకాలం బయలై యుండుమని భావము.

**216 ॥ హటమునకుటిలాత్మునిజం - పుటకైభటకోటి కొజ్ఞ - భూపతియిడినన్ - భటులటు పలెజేసెటిలో - పటకుటిలుడుబడినపాట్లు - పాటించికనునా - అట్లనెగురుని - నేటాతావినెనా - యిటువంటి బోధానుయెటువంటినరుడైన - అటువెనుక తనచేష్ట లెటువంటివోవాటిన్ - పాటించికనునా - అట్లనెగురునినేట తావినెనా ॥ 4**

తా॥శిష్యా! ఒక దుర్మార్గునికి, ఉరిశిక్ష రాజుగారు విధించి, భటులకాజ్ఞయిచ్చారు, ఆ ప్రకారం భటులు చేసే లోపల, ఈ కుటులుడు తానుచేసిన పనులన్నీ తలంచు

కొనునా తలంచడు నేను చచ్చిపోతాను యిక బ్రతుకలేను, నాకు ఆయువు సరిపోయినది, అన్నది ఒక్కటే తలుస్తాడు అట్లాగుననే సద్గురుమూర్తి బోధ జేసి స్థితి కుదిరిన తాను అచలమైన పిమ్మట, తాను చేసిన పనులు ఏమియూ గుర్తించుకొనడు, నేను యింతక్రితము ఇలా చేసేననడు, ఏమియూ గుర్తించుకొనడు, యిటువంటి బోధను విన్నాక తాను పరిపూర్ణ స్థితిలోనున్న వానికి, ఆ తరువాత తనచేష్టలు ఏమియూ తలంచుకొనడు, వాటి జ్ఞాపకమే యుండదు, తాను బయలై అచల పరిపూర్ణమై యున్నాడు గనుక అవి పాటించదని భావము.

**విశేషార్థము** : శిష్యా! కుటులుని భటులు ఉరితీసేలోపల, తాను చేసిన పనులు తలంచక, నన్ను ఉరి తీసివేస్తారు, నేను చచ్చిపోతాను, అనే తలంపుతప్ప, రెండోది ఏమీ లేనట్లు, సద్గురుమూర్తి ఉపనయనము చేసి, గురుబోధనే సూచనచేసి, ఆ పరిపూర్ణాన్ని దర్శింపచేసిన తరువాత, ఆ శిష్యుడు పరిపూర్ణుడై యుండగా తాను అఖండానుభవరహితుడై యుండునేగాని, ఇతరమైనవి యేమీ ఎరుగడని భావము.

**217 ॥ సకలజనుల సమ్మతిగా - నొకరైనను నడుపలేరు - సుర్వీస్థలిపై - మకరాంకజనని జనకా - ద్యకళంకులలోను నేనీవననేమి గణనా - బోధందితర - జనులేమి గణనా - వికలామానసుడనై వెతనొందబోకునీ - వకుటిలభక్తుడవని తెల్పితీ బోధ- వననే మీ గణనా - బోధందితర - జనులేమి గణనా ॥ 5**

**తా॥**శిష్యా! సకలజనులకు యిష్టుడయ్యి ఎవ్వరునడువలేరు, ఈప్రపంచములో, ఎందుచేతననగా మన్మదుని తల్లిదండ్రులైన లక్ష్మీదేవి, మహావిష్ణువులైన వారే, రాక్షసులకు విరోదులు మరియు బ్రహ్మ విష్ణు మహేశ్వరులే అందరికీ సమ్మతముగా నందున యిక నేనూ నీవు ఒక లెఖ్ఖా, బోదందు అనగా ఈ పరిపూర్ణ బోధయందు, కొందరికె యిష్టముగా నుండును, మరికొందరికి అయిష్టముగాన, ఇతరజనులేమి గణనా, అనగా అందరికి ఇది ఇష్టముగాదు, ఇట్లు ఇష్టపడలేదు, వారు అని, సంసయముగలవాడవై బాధపడకుము, బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులైన వారే లెక్క లేనప్పుడు, మనము ఒక లెఖ్ఖా, నీవు కుటిలము లేని భక్తుడవని నీకు పరిపూర్ణ బోధ అనగా, నీవు పరిపూర్ణుడై యుంటే సుఖము కలుగజేసేది నీకు దెల్పితిని, సంసయముంచకుము, దీనియందే అనగా ఆ స్థితి యందే నీ మనస్సుంచుము, అని భావము.

**విశేషార్థము** : నీవు కుటిలము లేని భక్తుడవని, మంచి నడనుడులు గలవాడనని, గురుభక్తి గురుసేవ గురునిష్ఠ గలవాడవని, నీకీ పరిపూర్ణ బోధ చెప్పితిని, అనగా నీవు

సర్వకాల సర్వావస్థలయందు, పరిపూర్ణుడవై అఖండాను భవరహితుడవైయుండే పరమ సుఖదము. కలుగజేసితిని. గనుక నీవు త్రికాలములయందు, అట్టి ఉనికిలో ఉండుమని భావము.

**218 ॥ బలధనవిద్యలు దుష్టుల - కిలగల్గిన నొరుల నొంతురీర్ష్యమునన్ - బలధనవిద్యలు శిష్యల - కిలగలిగిన నొరుల బ్రోతు - రెంతో మోదయినా - నీవీరెంటి - నెరిగిమోదమునా - కలలో ననైన దుష్టులచెంతజేరాకు - మెలమిశిష్టుల చెంత - కలనైన వదలాకు - యెంతో మోదమునా - నీవీ రెంటినెరిగీ మోదమునా ॥ 6**

తా॥శిష్యా! బలము ధనము విద్యదుజ్జనులకు కలిగినట్లైతే అందరిని ఎన్నో బాధలు పెట్టి, వానిని నానా దుర్భాషలు ఆడుచు దూషింతురు, ఆ బలము ధనము విద్య సుజనులకు కలిగినట్లైతే, యిలలో అందరిని ఎంతో ప్రేమతో వారిని బాగుగా చూచును, నీవు ఈ రెంట్నీ ఎరిగి సంతోషముతో నుండి, దుష్టులను కలలోనైనా తలంచకు. వారి చెంతకు చేరకు, సజ్జనుల యొక్క స్నేహమును కలలోనైనా విడువకుము, నీవు సర్వకాలములయందు పరిపూర్ణ ఉనికిలో ఉండుమని భావము.

**219 ॥ అందమగు స్వాతి వర్షపు - బిందువులెందెందు బడునొపృధివినిత - ద్బిందువులు పాధివశమున - జెందును తగునామరూప - చేష్టాదికమునూ - అట్లనే నీవు - జెందె విన్నియునూ - మందితో జతగూడ మాట్లాడినంతలో - అందూకె నహవానమరయూము తగుదాన్ని - చేష్టాదికమునూ అట్లనెనీవు - జెందెవిన్నియునూ ॥ 7**

తా॥శిష్యా! అందముగా స్వాతి వర్షపు బిందువులు, ఎందెందు పడునో అందందు ఆయానామ రూపములు చెందును, అనగా ముత్య్య పుచిప్పలోపడిన చినుకు ముత్య్యమెయగును, అట్లు నీటియందు పడిన చినుకు నీరే యగును, అలాగే అవి ఉపాధిని బట్టి, పిలువబడును, అందుకే నీవు యివన్నీ చెందెదవు ఎట్లనగా ఎవరితో సహవాసము చేయుదురో ఆయా గుణములేనీకుఅబ్బును, ఏ గుణములు అబ్బకుండా యుండాలంటే ఏమీ కాని బయలుతోనే సహవాసము చేయుము అనగా నీవు కూడా ఆ బయలును సర్వకాలం విచారించితే అట్లే బయలై యుందువు అని భావము.

**220 ॥జారులకు లోకులందరు - జారులవలె తోచపడుట సహజగుణంబౌ - చోరులకు సకల జనములు - చోరకులని మదికి దోచుటనికీ సహజమురా - అట్లనె - దుష్టాత్మునికీ సహజమురా సారాములేని సం - సారాబ్ధిదాటించు వారిని తమవంటి వారీగ గనుటట్టి - వునికీ సహజమురా - అట్లనెదుష్టాత్మునికి సహజమురా ॥ 8**

తా॥ శిష్యా! జారులకు లోకమందందరు జారులనియే తోచబడును, చోరులకు సకల జనంబులు చోరులని తోచుట సహజమే. అట్లాగునే దుష్టాత్మునకు అందరు దుష్టులని తోచబడుట సహజమె, సారములేని ఈ నిస్సారమైన సంసారాబ్ధిని క్షణములో దాటించువారిని తమవంటి వారిగా గనుట, నైజము అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వే అంకితన్నా మత్రయోదశోధ్యయః భావ విశేషార్థములు
సమాప్తము



## ★ 14 .గురుని లక్షణం. 11 ★

**221 ॥ బయలెరుకలు శిష్యునకున్ - దయతోగురుడెరుక జేసి తరువాతను సం - డియమేమి లేక యెరుకన్ - నయమున విడిపించుగురుడు - నయశాలిగాదా - నీమదికిది - నాటెనలేదా - భయభక్తి గురుసార్వభౌముని సేవ - నిశ్చయముగ జేసితె - జయమందెదౌ గురుడు -నయశాలిగాదా - నీమదికిది - నాటెనలేదా ॥ 1**

తా॥శిష్యా! సద్గురుమూర్తి శిష్యుని మీద ప్రేమచేత, నాయనా నీవు బయలైనదే అచలం, అందులోనుంచి వచ్చేదే లేనెరుక, ఈ రెంటినీ నీవెరిగితివి కదా, ఈ లేనెర మూలమైనటువంటిదే. అఖండ యెరుక, ఈ అఖండ ఎరుక ఉన్నంతకాలం ఇందుల ఉత్పత్తి, స్థితి, లయములు జరుగుచునే ఉంటాయి గనుక, నీవు ఈ యఖండ ఎరుకను రహిత పర్చిలేకుండాలి, అనగా ఈ లేని ఎరుక మూలమునకు నీవు వెళ్ళిదాని మూలము అఖండ ఎరుకని ఎరిగి, ఈ యఖండ ఎరుకకు మూలములేదని యరగటమే, అఖండ ఎరుక రహితపర్చుటయిదే తానులేక ఉండుట,ఈ విధముగా ఎరుకను విడిపించిన వారే, నిజమైన సద్గురు సార్వభౌములవారు, నాయనా యిది నీ మనస్సునకు అత్తినదా, భయభక్తులతో గురు సార్వభౌముని సేవ నిశ్చయముగ జేసితె, అనగా గురుభక్తి గురుసేవ గురునిష్టి గలిగి, గురుసేవ జేసితె, ఈ యెరుకను విడిచిపెట్ట గలవని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవు బయలై యెరుకలేయున్న పరిపూర్ణం, యెరుకనగా నీవు బయలైన పరిపూర్ణంలో తోచిన లేనెరుక, ఈ యెరుక నీవు బయలై పరిపూర్ణమై యుండకపోతే, అదితోస్తూనే యుండును, గనుక నీవు సర్వకాల సర్వావస్థల యందు బయలై పరిపూర్ణమై యుంటే, అఖండాను భవరహితమై, అనగా శుద్ధనిర్గుణ తత్వమై

యుండగలుగుతావు. అలా ఉంతగలిగినప్పుడు, ఎరుక ఒకప్పుడు లేక, ఉన్నది ఉన్నట్లు ఉండెదవు. అనగా ఉన్న దానికి వేరుగాకుండా ఉంటావు, అంటే ఏమీ లేని బట్టబయలులో యేమీ లేక ఉంటావు, ఈ విధముగా గురుదేవుడు శిష్యునకు దయతో బయలెరుకలను యెరిగించి, ఏ సంశయము లేకుంగా జేసిన సద్గురుడు, అనగా ఎరుకను ఏమీ లేకుండా జేసి సందేహము లేకుండా భ్రాంతి రహితము జేసిన సద్గురువు, ఉత్తమోత్తముడనియు మరియూ ఇలా చెప్పక వాచార్థముగా బయలున్నది, ఎరుకలేంది, అని చెప్పే గురువుల్లు సద్గురువులు కారని, భావము.

**222 ॥పదిరెండక్షరములుగల - పదమలమంత్రార్థమెరిగి సద్గురు కృపచే - పదియా రక్షరములగల-యదియెట్టిదో తెలిపెనేని యతడెసద్గురుడూ-యివిరెండెరుగ-నత డేడిగురుడూ - మొదటిది పరిపూర్ణమును దెల్పునెరుకాను -తదనంతరపుది బోధను శేయునివిదెలిపె -నతడెసద్గురుడూ యివి రెండెరుగ నతడేడిగురుడూ ॥ 2**

తా॥శిష్యా! పన్నెండు అక్షరములుగల ద్వాదశి యొక్క మహామంత్రార్థము నెరిగి, అనగా ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేక ఉన్నదె, అఖండ ఎరుకని ఎరిగి, సద్గురు కృపచే యిందులో ఉత్పత్తి స్థితి లయములు పొందుచున్న లేనెరుకను ఎరిగి, అనగా 16 అక్షరములుగల మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదనే షోడశాక్షరీ మహామంత్ర మని ఎరిగినవారే, సద్గురువులు, ఈ రెండు మంత్రములు ఎరిగిన వారు ఏరీ, అనగా ఎరిగినవారు లేరు, ఎరిగితెలేరు, మొదటిది పరిపూర్ణమును తెలియజేయు చున్నది, రెండది ఎరుకన్ను బోధింపుచున్నది అని భావము.

**విశేషార్థము** : శిష్యా! ద్వాదశాక్షరీ మహామంత్రము యొక్క అర్థము ఎరిగిన అంటే, అఖండమై అచలమై శుద్ధమైయున్న యెరుక, ద్వాదశియని ఎరిగిన, అనగా ఈ శుద్ధయెరుకను అఖండ పరిపూర్ణమని, ఎరిగిన, యిందులో తనంతటతానుగా లేకతో చినలేని మలిన యెరుకే, షోడ శాక్షరీ మహామంత్రమని ఎరిగిన, అనగా 26వ తత్వమైన పరిపూర్ణమే ద్వాదశాక్షరీ మహామంత్రమని ఎరిగి, ఇందులో తోచిన 25వ తత్వమైన ఈశ్వరతనువే లేని ఎరుకని ఎరిగి ఈ ఎరుకే 24 ఇంద్రియములతో కూడి కలిసి తిరిగినప్పుడు, మరుపనియు, ఈ ఎరుక మరుపులే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేదనేదే, షోడశాక్షరీ మహామంత్రమని ఎరిగిన, అనగా ద్వాదశిలో షోడశియున్నదని, షోడశాక్షరీ మహామంత్రమని ఎరిగి, ద్వాదశియై యున్నప్పుడు, షోడశియేది, గని ఈ రెంట్లో దేన్నీ ఎరుగని ఉనికి గలిగినప్పుడు, యేది ఉన్నదో, అది

గమనించనవాడే సద్గురుడు, అదిగమనించిన వాడులేడు, అనగా యింతలోతు విచారించని వారు సద్గురువులు కారని భావము.

**223 ॥ఆ మంత్రయుగము దెల్పెద - నేమముతో దలపు ముత్తదీ బట్టబయల్ - యేమి లేదని పల్కిన - యీ మంత్రమేద్వాదశాక్ష - రింకోటి వినుమీ - యెప్పుడు నోట- యివి మరువకను మీ - యీ మూలంలేని - గుర్తెరిగె శరీరాము - యేమి లేదని యంటె - యిదెషోడశాక్షరి - యింకోటి వినుమీ - యెప్పుడు నోట - యి విమరవకును మీ ॥ 3**

తా॥శిష్యా! ఆ ద్వాదశియొక్క రహస్యమును చెప్పుచున్నాను వినుము, దీనిని జాగ్రత్తగా పాటించుము. నాయనా నీవు ఉత్తదైబట్టబయలై ఏమీ లేక ఉంటేయిది అఖండ ఎరుక, యిదే పరిశుద్ధమైన ఎరుక యిదేశుద్ధనిర్గుణమైన యెరుక, యిదే ద్వాదశాక్షరీ మహామంత్రము యొక్క రహస్యము, రెండోమంత్రము షోడశి యొక్క రహస్యమును జెప్పెదను వినుము, ఆ ద్వాదశిలో నుండి తనంతట తానుగా వచ్చి, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరము ఏమిలేక ఉన్నదే, షోడశాక్షరీ మహామంత్రము యొక్క రహస్యం, అనగా ఈ రెండు మంత్రములు ఏమియు లేకుండా చేసుకొని ఉండాలని చెప్పుచున్నది, అనగా ఆ యఖండ ఎరుకలో తనంతటతాను కల్పింపబడి మూలములేకనే వచ్చి గుర్తెరిగే శరీరమై ఎరుగుచున్నది, గనుక ఈ మూలంలేని గుర్తును ఎరిగే శరీరమును ఎరిగితే ఏమిలేదు, యిదే షోడశాక్షరీ మహామంత్రం యొక్క రహస్యం, గనుక సర్వకాల సర్వావస్థలయందు కూడా, మూలంలేని ఈ గుర్తును ఎరిగే శరీరంయరగట మేనీ పని, అనగా నీవు ఉత్తబయలై యుండే పనే త్రికాలమందు నీవు చేయవలెను, అలాచేస్తే ఏమిలేదని భావము.

**విశేషార్థము** : శిష్యా! ద్వాదశాక్షరీ మహామంత్రార్థం యేమనగా నీవు ఉత్తబట్టలైయేమి లేక ఉత్తదైయుండమని చెప్పుచున్నది ద్వాదశి, అనగా నీవు ఉత్తదైబట్టబయలై అచలమై పరిపూర్ణమై యుండమని చెప్పినదే ద్వాదశాక్షరీ మహామంత్రము యొక్క అర్థము యిట్టి ద్వాదశిలోనుండి తనంతట తానుగా వచ్చినదే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని, చెప్పుచున్నదే షోడశాక్షరీ మహామంత్రార్థం, అనగా మూలంలేని యీ గుర్తు ఎరిగే శరీరం యేమీ లేకుండా వుండవలెనని చెప్పుచున్నదే షోడశాక్షరీ మహామంత్రముయొక్క అర్థము, గనుక ఈ రెండు మంత్రములు చెప్పినట్లుగా నీవు సర్వకాల సర్వావస్థల యందు ఏ మరపాటు లేక శ్రద్ధగా నామముతో, పాటు

పడవలయును. గనుక యిట్టి ఆ చరణలేకుండా అనగా విచారించకుండా, అనగా ఇట్లు పాటు పండకుండా, ఈ ఉత్తబట్టబయలు యేమీలేదు. ఈ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదు, అని వాచార్థముగా ఎన్ని సంవత్సరములు నీవుచేసినా, యేమీ లేకుండా ఎరుకపోదు. నీవు బట్టబయలు అవలేవు, గనుక సద్గురువును, ఆశ్రయించి ఆయన చెప్పిన ఉపనయనమనే సూచనచే, అనగా జ్ఞాననేత్రముచే వచారించి, నీవు బయలై అనగా ద్వాదశియై, ఆ ద్వాదశిలో వచ్చే షోడశిని గురుముఖతా విచారించి షోడశిని లేకుండా చేసుకుంటే, ద్వాదశియై యుంటావని భావము.

**224 ॥తొలుమంత్ర పర్థమెక్కడ - కలదోయని వెతకనేల కలదంతటయా - పలి మంత్రపర్థమెక్కడ - గలదో యని చూడనేల - కాదా చూచేది - వినేది యనేది తినేది - అలతొల్తదాన్ని నీవవలోకనము జేసి - కలకాలమెరుకాలుగల దాన్ని విడువెరుక - గాదా చూచేదీ - వినేదియనేది తినేది ॥ 4**

తా॥శిష్యా! తొలిమంత్రమనే ద్వాదశి యొక్క అర్థం, యక్కడాయని చూడనవసరములేదు, నాయనా నీవు బయలై అంతటా నిండిని బిడీకృతమైయున్నదే, ద్వాదశి, రెండోమంత్రము యొక్క అర్థం, యక్కడాయని చూడనేల, ఈ ద్వాదశిలోనుంచి తనకు తానే లేనెరుకై వచ్చి, అనగా విచారించిన ద్వాదశియై, విచారించకపోతే షోడశియై, మరియు నేత్రము దగ్గరకు వచ్చి చూచున్నది శ్రోత్రము దగ్గరకు వచ్చి వినుచున్నది, వాక్కు ద్వారాగా మాట్లాడుచున్నది, చర్మము ద్వారాగా వేడి చలువ తెలుసుకుంటున్నది, ఈ లేనెరుకను, విడిచి పెట్టుము, అనగా మొదటి దైన ద్వాదశి అంతటా నిండిని బిడీ కృతమై అఖండమై అచలమై ఉన్నదానిని, విచారించి, అనగా సర్వకాలము అవలోకనచేసి, నీవే పరిపూర్ణమై, కలకాలము నిన్ను బాధించేటటువంటి, ఈ లేనెరుకను విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! మొదటి మంత్రమైన ద్వాదశి అర్థమే మనగా, ఎక్కడాయని యతకనవసరము లేదు, ఉత్తదై బట్టబయలై పరిపూర్ణమై శాశ్వతమై అంతటానిండి నిబిడీ కృతమై ఒకే తీరుగా ఉన్నదే ద్వాదశి, అట్టి ద్వాదశిలోనుండి తనంతటతానుగా వస్తూపోతూయున్నదే షోడశి, అనగా ద్వాదశిలో షోడశియున్నది, షోడశిలో ద్వాదశియున్నది. విచారించినప్పుడు ద్వాదశియగుచున్నది. విచారించనప్పుడు షోడశియగుచున్నది, మరల విచారించితే ద్వాదశియగుచున్నది. అనగా తాను ద్వాదశి యైనప్పుడు, నిర్మలము గాను తానె విచారించకపోతే షోడశియైనప్పుడు, 25వ తత్వమై,

ఎరిగేది చూచేది వినేది అనేది తినేదిగాను ఉండి, అనేక వికారములు పొందుచున్నది. ద్వాదశియైనప్పుడు, 26వ తత్వమై అచలముగాను బయలుగాను శుద్ధ నిర్గుణముగాను ఉంటున్నది, గనుక ఎరుకను విడిచి పెట్టినటులైతే, వున్నది తానైన పరిపూర్ణమేనని భావము.

**225 ॥ఇది దప్పయేమిలేదని - మొదటిది మొరబెట్టు చుండుముదమున వినుమా - యిది యేమిలేదు - పొమ్మని - వదలక రెండేది లెస్స - వదరూచుండుసురా - బయలెరుకాలవిది నిశ్చయమురా - అదిగానవీ రెంటి నరసి నీవిప్పుడు విదితాముగా రెంట్ని - విడరామంత్రములిట్లు - వదరూ చుండుసురా - బయలెరుకాల - విది నిశ్చయమురా ॥ 5**

తా॥శిష్యా! ఈ ద్వాదశి తప్ప రెండోది ఏమీలేదని. మొదటి మంత్రం చెప్పుచున్నది. రెండోమంత్రము ఈ లేనెరుక ఏమీలేదని, ధృఢముగా చెప్పుచున్నది, అనగా ఉన్నది ద్వాదశి, లేనిది షోడశియని తేలినది. గనుక ఈ రెంటినీ విచారించి, అనగా ద్వాదశి అంతటా ఉన్న అఖండ ఎరుకని, అందులో ఉత్పత్తి స్థితి లయములు పొందే శోడశి లేని యెరుకయని, ఈ రెంట్నినీవు విచారించి, ఎరిగి ఈ రెంట్నీ విడిచిపెట్టు, ఆ తరువాత శేషించి యున్నదేదో ఉన్నది అదే ఉత్త బట్టబయలై యున్నదని భావము.

**విశేషార్థము** : శిష్యా! ద్వాదశి తప్ప రెండోది ఏమీలేదని, మొదటి మంత్రము చెప్పుచున్నది, అనగా నీవు బయలై అచలమైయున్నది తప్ప, రెండవదనేది ఏమీ యికలేదు, యిట్టి అచలమై బయలైయున్న దానిలో నేను ఏమీలేనని షోడశి తోచిన లేనెరుకే షోడశిచెప్పుచున్నది, గనుక ఈ లేనెరుక, అనగా 25వ దైన ఈశ్వర తనువనే యెరుక, ఈ యెరుకే 24 ఇంద్రియములలో కలిసినప్పుడు. మరుపనే జీవుడన్నారు. ఇదే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీలేదనేదే, షోడశియనే రెండో మంత్రం, ఈ మంత్రము యేమని చెప్పుచున్నది, నేను ఏమీలేను, అని ఆ షోడశేచెప్పుచున్నది. గనుక ఈ యెరుకయనే ఈశ్వరతత్వం, మరుపుయను జీవితత్వం. ఈ షోడశిలేనప్పుడు, యిక ఉన్నది ద్వాదశియను 26వ దైన అచలపరిపూర్ణమే యున్నది. యిది పవిత్రమై పరిశుద్ధమైయున్నది, యిదే అఖండాను భవరహితం, యిది అందరికి తెలియబడేదికాదు, ఎందుకనగా 24 ఇంద్రియములకు విలక్షణమైనది 25వ దైన ఈశ్వర తనువు. దీనికి అతీతమైనది సచ్చిదానంద స్వరూపమైన శుద్ధఎరుక. ఇది పరిపూర్ణమై ఈ మూడు యెరుకలు రహితమైన తరువాత శేషించియున్నదే, అఖండాను భవరహితమైన పరిపూర్ణం, ఇంతలోతు విచారించినవారికే తెలియబడును, గాని యితరులకు తెలియబడదని భావము.

యిందుకు శ్రీ శివరామదీక్షితులవారు భ్రాంతి రహిత ప్రకరణములో
101 పేజి సప్తమాధ్యాయము

శ్లో ॥ సంయోధ్యంచవివేకన । జ్ఞాన మితిప్రవర్తతే ।
క్షేత్ర జ్ఞాఖ్య జీవోపాధి । విలయేసతి కేనలోభవతి ॥

తా॥ అదేతత్వాతీతం అనే సొజ్ఞ తత్వాతీతం ఇరవై ఆరోది అదే శరీరంలేనిది, అదే పుట్టని చావనిది అదే మొదలు కొనలేనిది అదే రాకడా పోకడాలేనిది తనుకు తానే స్వతః సిద్ధమై చలించకయున్నది సర్వకాలం ఏక ప్రకారమే శరీరం లేనిది గనుకనే సకలదేశములయందు మోక్షభ్రాంతి లేక ఒక్కటైనా వికారము లేక ప్రవేశింపక వెళ్ళిపోక పెద్దగట్టు కదలకయున్నట్లు సర్వత్రాదట్టముగా యున్నది. యెడతెగకయున్నది అందరికీ అది కావలెనని అపేక్షకద్దు అందరూ నాయం దేవుండి నన్ను కనుక్కోలేరు. జగత్తు స్వరూపమే తత్వాతీతం మహాగుహ్యం పరమ గుహ్యం అందుకే ద్వైతాద్వైత రహితమైన పరమ తత్వం అని శెలవిచ్చియున్నారు.

**226 ॥పరిపూర్ణమిదిగోయిదిగో - యెరుకని చూపించిలేని -యెరుకను లేందం- చెరిగించిన గురుడేసరి - యెరుకనునిల్పెటి గురుడు - యెందూ కొయన్నా -తద్భోధ -వీకెందు కోయన్నా - శరణన్న వారి మస్తక మందు చెయి బెట్టి - తిరమూగరెుుకాను తీసివెయ్యని వాడు - యెందూ కోయన్నా - తద్బోధవీ - కెందుకోయన్నా ॥ 6**

తా॥శిష్యా! పరిపూర్ణమిదిగోయిదిగోయని అఖండయెరుకను చూపించి లేని ఎరుకైన 25వ దానిని ఏమిలేకుండా చేసిన వారే సద్గురువులని ఈ లేనెరుకను నిల్పి చెప్పినవారు సద్గురువులు కారు అటువంటి గురువుల బోధనీకవసరము లేదు యనిమనము ఒక గురువును ఆశ్రయించి వారికి తను మనోధనములు ధారబోసి సేవజేయుచున్న శిష్యునకు అభయ మిచ్చి ఎరుకను తిరగి పుట్టకుండా తీసివేసిన గురువు సద్గురువులని స్థిరముగా ఎరుకను తీసివేయనివాడు ఎందుకు అటువంటి వార్ని విడిచిపెట్టుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! పరిపూర్ణమిదిగొయిదిగో యెరుకను చూపించి అనగా సచ్చిదానంద స్వరూపమైన యెరుక పరిపూర్ణమైయున్నదని యిట్టి అఖండమైన శుద్ధ యెరుకలో ఖండాఖండములైన జీవేశ్వర్లు అనే యెరుకమరుపులు కలుగుచున్నవి నీ విచారించి చూస్తే సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణమేయున్నది జీవేశ్వర్లు ఏమిలేదు యిది ఒక పరిపూర్ణం మరియు ఈ సచ్చిదానంద స్వరూపమైన శుద్ధయెరుక రహితమైనదే అసలు పరిపూర్ణం అనగా అఖండాను భవరహితమైన పరిపూర్ణమిది గనుక పరిపూర్ణమిదిగొ యిదిగో యెరుకను చూపించి అంటే అభ్యాస అభ్యాసాతీతములలో అఖండ ఎరుకే పరిపూర్ణమైయున్నది యిదే సచ్చిదానంద స్వరూపమైన పరమపురుషుడు

ఇది రహితమై లేక యున్నదే అఖండాను భవరహితమై యున్న పరిపూర్ణం యిది తానసేతెలివి రహితమై వూహకూడా లేని పరిపూర్ణము యిది అవగ్మానస గోచరమైన పరిపూర్ణమైన పరశివతత్వం యిదే కేవల అమల నిర్గుణా తీతమైన నిష్ఠతి యోగిక పరిపూర్ణపరాకాశము యిదే శరీరరహితమైన అశరీరం ఇంత విచారణ చేసిన వారికి ఈ పరిపూర్ణం తెలియబడును గాని ఇతరులకు తెలియబడదు అనగా ఇంతలోతు విచారించిన వారికే యెరుక పూర్తిగాపోయి పరిపూర్ణమై యుంటారు ఇట్లు ఎరుకను పూర్తిగా తీసివేయక వాచార్థముగా యెరుకతో పరిపూర్ణమున్నది ఎరుక ఏమి లేదు అని చెప్పే గురుబోధవినగూడదు శరణన్న వారి మస్తకమందు చేయిబెట్టి తిరముగా అంటే ఎరుక మళ్ళీ పుట్టకుండా యెరుకను పూర్తిగా తీసివేయని గురువు ఎందుకోయన్న అట్టి గురువుల బోధ వినకు వింటే అట్లు విన్నవారంతా చెడిపోతారని భావము.

యిందుకు పండిత శివానంద స్వామి గుర్తెరిగే శరీరనిరసన ప్రకరణలో

శిష్యా! సాందీపుల వంటి గురువు కావలెను కృష్ణస్వామి వంటి శిష్యుడు దొరికితే ఆ వెర్రి తిరుగుతుంది. ఈ అక్షర పరబ్రహ్మమును ఈ శరీరమందు లేకుండా ఎవ్వరు చేతురోవారే సాందీపులు ఇద్దరుకు ప్రపంచము ఉన్నదనే ఎరుక లేదు లేదనే ఎరుకలేదు అలాగే ఎవ్వరు చూచనైతే వారల్లా అటువంటి వారే గురువాక్యముచేత బ్రాంతి లేని వారికి నిద్ర లేదు బ్రహ్మానుభవము లేదు సర్వకాలం ఒక్కతీరే నేను ఏమిలేదు నీవు ఏమిలేదు కోటి చెప్పినను నీవు లేని తరువాత ఏదియున్నదో అదే ఉండజూచి అదే బయలని నిశ్చయించుకొని అదే అంతానని అభ్యాసము చేయవలెను. అది అఖండాను భవరహితమౌను వినకనే వినేవాడు కనకనే కనేవాడు తలచకనే తలిచేవాడు ఇట్టి అనుభవము గల పురుషుడే అచల స్థితిగలవాడు ఈ పురుషుడు సంకల్పత్యాగుడు గనుక చేసినా చేయనివాడే చేయకున్ననూ చేయనివాడే యగును గాని యిది తెలియరాదు యిందుకు యోగ్యుడు కావలయును యుక్తిలేని యుక్తి గనవలెను సాధన లేని సంగతి తెలియవలెను షోడశాక్షరి కృష్ణ స్వామికే ఎరుక శ్రీ ధరస్వామికే ఎరుక. లేని వారిని తెలుసుకొనడము దుర్లభము అంతవారే తెలుసుకొనగలరు అంతవారికే ఎరుకలేదు అని భావము.

**227 ॥ పరిపూర్ణబోధనెరిగిన - గురువరుచే బోధగొన్న గొప్ప ఫలంబా - పరిపూర్ణ బోధనెరుగని - గురువరుచే బోధ గొన్న గొప్పా ఫలమౌనా - అది యెట్లన్న కూడిన రతిలోనా - పురుషునిచే సంతుసొలతిబడయును ఖడయు - తరమౌనవారికి - తమవంటి వారిచే - గొప్పాఫలమౌనా అది యెట్లన్న - కదిరతిలోనా ॥ 7**

తా॥ పరిపూర్ణబోధ ఎరిగిన సద్గురు మూర్తిని ఆశ్రయించి ఈ పూర్ణాబోధ తెలుసుకుంచే గొప్ప ఫలితము లభించును పరిపూర్ణబోధ ఎరుగని గురువును ఆశ్రయించిన పరిపూర్ణబోధ తెలుసుకొనిన గొప్ప ఫలితము లభించదు అది ఏలా గంటే పురుషుని వల్ల సంతానము ఆడవారికి కలుగును ఆడవారు ఆడవారు కలసిన సంతానము కలుగనట్లు పూర్ణబోధ తెలియబడినదని అనగా గురువుకు తెలియని విద్య శిష్యునకెట్లు తెలియును అని భావము.

**విశేషార్థము :** శిష్యా! పరిపూర్ణవిద్య పూర్తిగా గురువు వల్ల నేర్చుకొని తయారైన సద్గురు మూర్తిని ఆశ్రయించిన శిష్యునకు పరిపూర్ణమయ్యే సూచన జేసి చూచించును ఆ శిష్యుడు ఆ సూచన ప్రకారము విచారించి పరిపూర్ణుడగును అట్లు పరిపూర్ణబోధలో తయారవని వాచార్థబోధ జెప్పే గురువును ఆశ్రయించిన ఆ గురువు వాచార్థమైన బోధనే చెప్పును గాని పరిపూర్ణబోధ చెప్పలేడు గనుక ఈ శిష్యుడు కూడా ఆ వాచార్థమే నేర్చుకొని వాచార్థముగా పరిపూర్ణమున్నది యెరుకలేనిది అని అనుకొనును గాని తాను పరిపూర్ణుడవలేడు. ఎలాగంటే పురుషుడు స్త్రీ యిద్దరు కలసిన సంతానము కలుగును అలా కాకుండా ఇద్దరు ఆడవారు కలిసిన సంతానము కలుగనట్లు గురువుకు తెలియదు ఇతనికి తెలియదు గనుక శిష్యుడు పరిపూర్ణుడు యన్నటికి కాలేడు అని భావము. యింద్కు చిన్మయవిలక్షణస్వామి టీకి వెంకటాచార్యులవారు రచించిన కందార్థం.

కం॥ పరమెరిగిన గురువరుచే - మరి శిష్యుడు బోధ గొన్న - మర్గమెరుగునూ
పరమెరుగని గురువరుచే - మరి శిష్యుడు బోధ గొన్న - మార్గ మెరుగడురా -
మర్గామెరుగని - బోధలెందుకురా - పురుషుడు లేనట్టి పొలతి సంతానము -
మరి గలుగనట్లుగా - పరిపూర్ణమొందడు మార్గ మెరుడగురా - మార్గమెరుగని-
బోధలెందుకురా ॥

తా॥ శిష్యా! పరిపూర్ణ బోధ ఎరిగిన గురువు గారి వద్దకు చేరి శిశ్రూషలు చేసి ఉపనయనము నొంది గురు సూచన ఎరిగిన మార్గం తెలియబడును అలా కాకుండా పరిపూర్ణబోధ ఎరుగని గురువుని చేరి ఎన్ని సేవలు చేసిన ఈ మార్గము తెలియబడదు ఈ మార్గం తెలియని బోధలు గురువుగారు ఎన్ని చెప్పిన శిష్యుడు ఎన్ని విన్న విషయం తెలియబడదు ఎలాగనగా పురుషుడు లేకుండా ఇద్దరు స్త్రీలు కలసి ఎన్ని విధాలుగా ప్రయత్నించినా సంతానము కలుగనట్లు పరిపూర్ణబోధను పొందలేరు అని భావము.

**228 ॥పరిపూర్ణబోధనెరుగని - గురుశిష్యులు బోధ కొరకు కోరపనిబడున్ - గురువర్యునొకని మరలను - హరువరమున బుట్టినట్టి - యా శిఖండికిని - భార్యైనట్టి - యబల తండ్రికినీ - వరుల నిద్దరినిదేవలెని - యల్లుడు నేను - వరియింతుమని చెప్ప - వనిత నంపినయట్ల - యా శిఖండికినీ - భార్యైనట్టి - యబలా తండ్రికినీ ॥ 8**

తా॥శిష్యా! పరిపూర్ణబోధ నెరుగని గురుశిష్యులు పరిపూర్ణబోధకొరకు ఎంత్రో ప్రయత్నము చేయుచు సద్గురు మూర్తిని ఈ గురు శిష్యులిద్దరు ఆశ్రయించినారు అనగా ఈశ్వరుని వరము వల్ల పుట్టిన శిఖండికి 18 సం॥లు వయస్సు వచ్చిన తర్వాత మగవాడౌతాడని వరమిచ్చెను అతనికి ఈలోగా మగవాడవకుండా పెండ్లి చేసినారు యిద్దర్ని గర్భాదానం గదిలోకి పంపినారు కాని ఇద్దరు ఆడవారె గనుక భార్య నామగనికి యింకో మగాడు నాకొక మగనిని తీసుకురమ్మని తండ్రికి జాబువ్రాసి పంపినట్లు ఈ పరిపూర్ణబోధ ఎరుగని గురు శిష్యులిద్దరకూ పరిపూర్ణబోధ నెరిగిన గురువులు యిద్దరు కావలసివచ్చెనని భావము.

**విశేషార్థము** : శిష్యా! శిఖండీ ఆడదే తన భార్య అదదే గదా అందువల్ల తన తండ్రికి జాబు వ్రాసి పంపెను ఏమని అంటే నాకొక మొగనిని నా భర్త కొక మొగనిని తీసుకు రమ్మనమని వ్రాసినట్లు గాను పరిపూర్ణబోధ ఎరుగని వాచార్థబోధ చెప్పేటువనే గురు శిష్యులకు యిద్దరు గురువులు కావలసి వచ్చెను అంటే గురువు ఒక గురువుగారు శిష్యునకు ఒక గురువు గారు కావలయును అని భావము. యిందుకు చిన్మయవిలక్షణస్వామి టీకీ వెంకటాచార్యులువారు రచించిన కందార్థం.

కం॥ పరమెరుగని గురు శిష్యులు - పరిపూర్ణబోధకొరకు - పాటు పడుటకై గురువరుని
ఆశ్రయించియు - పరిపూర్ణబోధ దెల్పి - పరమెరిగించయ్యా - జన్మ రహిత -
మవజేయవయ్యా - పరమారహస్యము పరిపూర్ణబోధను - యెరిగించి మర్మము-
యెరుకను లేక చేయు పరమెరిగించయ్యా - జన్మ రహిత - మవజేయవయ్యా॥

తా॥ శిష్యా ! పరిపూర్ణబోధ ఎరుగని గురు శిష్యులు యిద్దరు పరిపూర్ణబోధ ఎరిగిన సద్గురుని ఆశ్రయించి ద్వాదశ సాష్టాంగ దండ ప్రమాణములు జేసి సద్గురు ప్రభో మాకు పరిపూర్ణబోధ తెలియజేసి, మేము ఏ విధముగా పాటు పడితే మాకు తెలియబడునో ఆ విధముగా తెలియచేసి మాకు జన్మ రహితం చేయండి అని పరమ రహస్యమైనటువంటి పరిపూర్ణబోధను ఎరిగించి ఎరుకను ఏమి లేకుండా చేయండి ప్రభో అని ప్రార్థించెను అని భావము.

**229 ॥దృష్టాంతమెరుక సేదసే - యోష్టము గదలించగా నెయుదులు కలనుడున్ - బోధ్యాం**
**తముడుగబోధకు - స్పష్టముగా కర్పూరము - దీపము జూపవోయీ - యీ యుక్తిలో-**
**పము జేయ కోయీ తుష్టి నొందెదరట్లు తెలి చెప్పెరెనే - శ్రేష్ఠమౌ యీ బోధ**
**చేకొన్న వారు - దీపము జూపవోయీ - యీ యుక్తి లోపము జేయకోయీ ॥ 6**

తా॥శిష్యా! ఎరుకకు దృష్టాంతమేమిటి అని అడిగిన కలలో తోచిన శరీరములు ఏలాగో ఈ శరీరములు అలాగేనని చెప్పవలెను మరియూ ఎరుకయాలా లేకపోవునా ద్రాష్టాంతమడిగిన కర్పూరము అగ్ని రెండూ ఏకమైవెలిగి వెలిగి ఏమి లేక పోయినట్లు గురు సూచన ద్వారా ఎరుకను విచారించి ఎరుక ఏమి లేకుండా పోయే యుక్తి లోపము చెయ్యకు ఆ యుక్తి చెప్పినయెడల యెరుకను రహిత పర్చి తాను పరిపూర్ణుడై ఆనందించునని భావము.

**విశేషార్థము :** చిన్మయవిలక్షణ స్వామి రచియించిన కందార్థము 110

కం॥ దృష్టాంతమెరుకకలయని - ద్రాష్టాంతము యెరుకతోదని - దారెరిగించిన్
ద్రాష్టాంతము కర్పూరముదీపము - స్పష్టముగా యీ యుక్తి - లోపము
చేయకోయీ - కలమేల్కొనిన - యేమిలేదోయీ - అష్టతనువులు లేవు
యిష్టముగా చూడు - నిష్టవదలకనీవు - నిరతాము చేయుము లోపము
చేయకోయీ - కలమేల్కొనిన యేమి లేదోయీ ॥

తా॥ యెరుకకు దృష్టాంత మేమనగా కలలో దోయిన శరీరాలు ఏలాగో అలాగే ద్రాష్టాంతమేమనగా అగ్ని కర్పూరములు వెలిగి వెలిగి ఎలా లేక పోవుచున్నవో అలాగే ఈ మూలం లేని గుర్తెరిగేశరీరం ఏమిలేదు ఈ విధముగా లేకపోయేటటు వంటి యుక్తి ఒకటున్నది ఆ యుక్తి లోపము చేయకు అనగా గురుమూర్తి ద్వారాగా ఆయుక్తి తెలుసుకొనవలెను ఈ విధముగా విచారించి ఆ నిష్టవదల కుండా వుంటే అష్ట తనువులు లేవు ఏమి లేక ఉత్త బయలైయున్నదని భావము.

**230 ॥ యెరుకభ్రమగల్గు శిష్యుని పరితాపము మాన్ప నట్టి పంతులకెరుకనే - గురువులరి**
**కాని గురువులే - గురువులమని - పొట్టకొరకు గిరిగిరి తిరిగెదరిల్లా - వారికి బోధ -**
**తెలియుట కల్లా - పరిపూర్ణమును లేని యెరుకనేర్పడదెల్ల - యెరుకను విడిపించ**
**నెరుగక - గురువులై - గిరిగిరి తిరిగెదరిల్లా - వారికి బోధతెలియుట కల్ల ॥ 10**

తా॥ శిష్యా! అఖండ ఎరుకే పరిపూర్ణమని నమ్మి యున్న శిష్యుని నాయనా ఈ అఖండ యెరుకను విడిచి పెట్టమని చెప్పిన గురువే సద్గురువు అలా చెప్పని గురువులు సద్గురువులు కారు పొట్టకోసం తిరిగే గురువులే వీరికి ఈ బోధ తెలియుటకల్ల తెలియబడదు నాయనా నీవు బయలైనది అఖండ ఎరుక ఈయఖండ ఎరుకను బట్టబయలు చేస్తే ఈ యఖండ ఎరుక లేకయున్నదే పరిపూర్ణము ఇట్లు అఖండాను భవరహితమైనదే పరిపూర్ణము ఈ పరిపూర్ణములో అఖండెరుక లేక యున్నది గనుక ఎరుక ఏమి లేదని భావము.

**విశేషార్థము :** చిన్మయ విలక్షణ స్వామి రచించిన కందార్థము. 112

కం॥ యెరుకను పరమని నమ్మిన - యెరుకను విడిపించలేరు - యెరుగని వారల్ - యెరుకను విడిపించక - మరి అఖండ రహితా - మెరుగా రోరయ్యా - యెరుకలేంది - యెరుగారోరయ్యా - పరమును ఎరిగించి యెరుకలేందని దెల్పి- యెరుకాను విడిపించి - యెరుకలేకుండా - జేయు - యెరుగా రోరయ్యా - యెరుకలేంది - యెరుగా రోరయ్యా ॥

తా॥ శిష్యా ! ఈ అఖండమైన ఎరుకే పరిపూర్ణమని నమ్మినవాని యెరుకను విడిపించలేరు ఎరుగనివారు ఈ ఎరుకను విడిపించక అఖండరహితమై లేకయున్న మార్గం ఎరిగించలేరు గనుక ఎరుకలేంది తెలియబడదు. అఖండరహితమైన పరమును ఎరిగించి ఈ ఎరుకలేందని తెలిపి ఈ ప్రకారం యెరుకను విడిపించి ఎరుకను ఏమి లేకుండా చేసినవారే సద్గురువులు అని భావము.

**231 ॥ గురుశ్రూష షనొనర్చుట - మెరిగించెదనెట్లనవిన యేర్పడ వినుమా-నరులిష్ట దైవ ములకున్ - పరిచర్య యొన - ర్చునట్లు -భక్తీ తోడు తనూ-గురుమూర్తిక-త్యుక్తి తోడు తనూ - నిరతామరమర లేక నీవు సల్పితివేని - గురు బోధమరుగు సద్గురునీ- వెదెలిసేవ్వ భక్తి తోడు తనూ - గురుమూర్తిక - త్యుక్తితోడు తనూ ॥ 11**

తా॥ శిష్యా! గురు శ్రూష ఎట్లు చేయవలయునూ - చెప్పుచున్నాను వినుడు - నరులు యిష్టదైవములకు - ఏ రూపంగా - సేవ చేయుదురో ఆ రూపం గానే చేయవలయును అట్లాగే భయము భక్తి విశ్వాసములు ఉట్టి పడేలాగున గురుమూర్తికి సేవలు చేయుము ఇట్లు నిరంతరము అరమరలేకుండగా నీవు చేసినట్లైతే గురు బోధలోయున్న ఆ మరుగును గురుమూర్తి నీకొసంగును ఆ మరుగు తెలుసుకొని నీవు తరించెదవని భావము.

**విశేషార్థము :** చిన్మయ విలక్షణ స్వామి రచియించిన కందార్థములు 1,2

కం॥ గురునకు వందన మిదిగో - గురునకు సాష్టాంగమెరిగి - గురిగా మ్రొక్కిన్ - గురువేదైవంబనుచును - గురువే పరబ్రహ్మమనుచు - గుర్తులేకున్నా - గుర్తులేని- పరమెరిగియున్నా - గురుని కన్న వేరే పరమేమిలేదాని - గుర్తులేక యుంటే - గురి రహితమైయుండూ - గుర్తు లేకున్నా - గుర్తులేని - పరమెరిగియున్నా ॥

తా॥ శిష్యా ! గురుభక్తి గురునిష్ట గురుసేవ గలిగి ఆ సద్గురుమూర్తి దైవ స్వరూపమని ఆ గురువే పరబ్రహ్మ స్వరూపమని ఆయనే పరిపూర్ణ స్వరూపమని గుర్తులేక సేవించుచూ గుర్తు రహితమైయున్న గురు స్వరూపాన్ని ఎరిగి ఆ గురు స్వరూపమే నా సగ్గురు మూర్తియని నా సద్గురు మూర్తికన్నా వేరే దైవము లేదని నా సద్గురువే ఆ పరమ గురు స్వరూపమని ఆయనే పరిపూర్ణ పరబ్రహ్మమని అట్టి గురు స్వరూపమును గుర్తులేక సేవించవలయును అని భావము.

కం॥ గురువే తల్లియుదండ్రియు-గురువేయిల బంధుకోటి-గురువేదైవం-గురువేనీవును నేనును -గురువేయిలవేల్పు సర్వం గురువే యైయుండూ-గురువేచరా -చరములై యుండూ గురుని కన్నా వేరే-మరియేమి లేదాని -గురి గలిగి యుంటేను గురువే బట్టాబయలు గురువే యై యుండూ - గురువే చరాచరములై యుండూ ॥

తా॥ గురువే తల్లియు తండ్రియు స్నేహితులు బంధువులు. గురువేదైవ స్వరూపం గురువేయిల వేల్పు ! గురు స్వరూపమే చరా చరములన్ని నిండిని బీడీ కృతమై లోపల వెలుపల అంతటానిండి యున్నది గురు స్వరూపమేనీ లోను నాలోను సర్వం నిండియున్నది గురు స్వరూపము బట్టబయలు గురు స్వరూపంకన్నా ఇతరం మరేమిలేదు అంతట నిండియున్నది గురు స్వరూపమే అట్టి గురి కలిగి సేవించవలెను అని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైతరహిత పరమతత్వేగురు మూర్తి లక్షణన్నామ చతుర్ధశో ధ్యాయః భావ విశేషార్ధములు
సమాప్తం



## ☆ 15 .శిష్యుని లక్షణము. 16 ☆

**232 ॥ తనుమన ధనములు గురునకు-వినయంబున ధారబోసివేడ్క గురినిచే-అనువైనబోధ పడసిన - ఘన మతిమంతునకు సాటి - గలదాయీ భువినీ - లోకులు మ్రొక్క-వలదాచాలవినీ - తనవి తరులనె తాననక - యేమాటను - వినక పరిపూర్ణతదనరు వానికి సాటి గలదా యీ భువినీలోకులు మ్రొక్క - వలదా చాల వినీ ॥ 1**

తా॥ తనువు మనస్సు ధనము సద్గురు మూర్తికి ప్రేమతో అర్పించి అనగా తనువనగా 24 ఇంద్రియములతో కూడీయున్న జీవతనువు మనస్సు అనగా 24 ఇంద్రియములకు విలక్షణమై 25వ దైయున్న ఎరుక ధనమనగా ఈ రెంటి వలన వచ్చిన దృశ్య ప్రపంచం అనగా ద్రష్ట దృక్కు దృశ్యములు ఈ మూడింటిని ప్రేమతో సద్గురు స్వరూపమైన అఖండ ఎరుకలో లీనము చేయుటే అర్పించుట సద్గురు మూర్తిచే తెలుసుకొని అఖండ ఎరుకకు మూలము లేదని ఎరిగి అఖండాను భవరహితమై పరిపూర్ణమైయున్న గొప్పమతిమంతునకు సాటిగలదా ఈ భువిలో లోకులంతా నమస్కరించవలదా చెవులవిని మరియూ అతను ఎలా ఉన్నాడనగా తానని గాని ఇతరులని గాని ఏ మాటలు వినక ఏ వూహలు లేక అఖండాను భవరహితమై పరిపూర్ణమైయున్నాడని భావము.

**విశేషార్ధము :** శిష్యా! జీవతనువు మనసనే ఎరుక ఈ రెంటి వల్ల వచ్చిన ఇంద్రియ ప్రపంచం ఈ మూడింటిని సాంప్రదాయము ప్రకారము విచారించి అఖండమైన గురు

స్వరూపములో ఈ మూడింటిని వినయముగా లీనము చేసితాను అచల పరిపూర్ణమై సర్వకాల సర్వావస్థల యందు తిరిగి రాని మార్గమెరిగి తాను అఖండాను భవరహితమై లేకయున్న ఊహారహితమైన ఉనికిలో ఉన్నవాడు ఇతడే బాలోన్మత్త గుణములు గలవాడని భావము.

**233 ॥ జలమునెడబాయనొల్లని - జలచరముల రీతిబూని సచ్ఛిష్యుడు హృజ్జల జంబనుపీఠముపై - నిలిపితరము మాని - గురువునే కొల్చుసుమ్మీ - తదుక్తాల- నేతల్చునమ్మీ - కలకాల మిరీతిగడువూచునే ప్రొద్దు - తలిదండ్రి దొరదాత దైవమనుచు గురువు - నేకొల్చు సుమ్మీతదుక్తాల - నేతల్చునమ్మీ ॥ 2**

తా॥ శిష్యా! చేపలు జలములను విడిచి పెట్టిన యెడల మనము చచ్చి పోతామేయో యనుభీతి చేత సర్వకాల సర్వావస్థలయందు జలములోనే ఉన్నట్లు సచ్ఛిష్యుడుహృజ్జలుండను పీఠముపై నిలిపి ఇతరముమాని గురువునే కొల్చు సుమ్మీ అనగా హృదయకమలమను పీఠము పై గురు స్వరూపమనే పరిపూర్ణమును నిలిపి అనగా తాను బయలై పరిపూర్ణమై యుండి ఇతరముమాని ఏ సంకల్ప వికల్పములు లేక ఆ పరిపూర్ణ ఉనికిలోనే ఉండి ఆయుక్తులనే తలంచుచు నమ్మి అనగా అఖండాను భవరహితమై ఆ పరిపూర్ణమయ్యే ఉండేలాగు ఈ ఎరుకకు మూలము లేదని దీనిమూలము నిర్మూలము జేసి మూలము లేని గుర్తెరిగే శరీరం ఏమి లేని ఉనికిలో కలకాలము అనగా సర్వకాల సర్వావస్థల యందు ఆ ఉనికి లోనే యుంటూ తల్లి దండ్రి దొరదాత దైవము సర్వమూ గురు స్వరూపమేనని భావించి నమ్మి ఆ యునికిలోనే యున్నాడని భావము.

**234 ॥ సతి పొరు గూరికి బోయిన - పతి రాకడ కోరినట్లు భావములో నన్ మతిమంతుడు సచ్చిష్యుడు - సతతముగురురాక గోరు - సత్యామువినరా - వానితోటి - సాటెవ్వరనరా - హితుని రాకడను స్నేహితుడు గోరినయట్లు - అతి దరిద్రుడు ద్రవ్యతతి రా గోరినయట్లు - సత్యాము వినరా - వాని తోటి - సాటెవ్వరనరా ॥ 3**

తా॥ శిష్యా! సతి అనగా భార్య పొరుగూరికి వెళ్ళిన తన యొక్క భర్తరాకకు నిరీక్షించునట్లు సచ్ఛిష్యుడు సతతము ఎల్లప్పుడు గురువుగారి రాకనే గోరును ఇది సత్యము వీని తోట సాటి ఎవ్వరు సాటి కాలేరు ఇంకను హితుని రాకడను స్నేహితుడు గోరినట్లు గానే అతి దరిద్రుడు యెల్లప్పుడు ద్రవ్యమునే గోరినట్లు సతతము ఎల్లప్పుడూ గురునామమునే దలంచునని భావము.

**235 ॥ అతి వెలర తిచతురతలా - యతివలచే వారి తండ్రు లరయరనుచుత - తృతులర యరెరతినటనె - మతి మంతుడు గురుడు బోధ - మానినగాని - తద్బోధతా - మానడు పూనీ అతి దరిద్రునివె విద్యార్థించినతగాడు - చతురుడై విత్తా మార్జన జేయు వంతూలు - మానిన గానీ - తద్బోధతా - మానాడు పూనీ ॥ 4**

తా॥ శిష్యా ! యుక్త వయస్సులో ఉన్న కన్యల యొక్క రతిచతురతలు వారి తండ్రులకు అవసరములేదు కానీ ఆ కన్యల యొక్క భర్తలకు ఆ రతి చతురతలు

ఆ యావేళల యందు పొందుదురు బుద్ధి మంతుడైన శిష్యుడు గురువుగారు బోధ చెప్పుట మానిన గాని స్వామి ఈ బోధ యాలాగు చెప్పండి అని చెప్పించుకొనుచునే యుండును ఎలాగనగా అతి దరిద్రుడైన శిష్యుడు గురువుగారిచే విద్య ఆర్జించి చతురుడై అనగా నాలుగు విధములుగా అనేక మందికి విద్య నేర్పి ధనము సంపాదించినట్లు గురువు మానినగాని శిష్యుడు మానడని భావము.

**236 ॥పరిపూర్ణబోధదెల్పే - పరియంతము సేవజేసి బహు నమ్మికగా - గురుమూర్తికి తరువాతను - మరి కన్నుల గనని వాని మార్గము ఛీఛీ - తలచరాదామాట ఛీఛీఛీ - గురువాజ్ఞ యివనీదెగురువై శిష్యుని గూర్చి - గురుబోధ దెల్పేటి గురువంచకుని యొక్క - మార్గము ఛీఛీ - తలచరాదా మాట ఛీఛీఛీ ॥ 5**

తా॥ పరిపూర్ణబోధదెల్పే పర్యంతము సేవజేసి బహునమ్మకముగా యుండు దుర్మార్గుడైన శిష్యుడు వీడు తరువాత గురుని కంటి కైనాకను పడడు ఇటువంటి మార్గము ఛీ-ఛీ - తలంచరాదు వీని మాటి ఛీఛీఛీ గురువాజ్ఞ యివ్వనిదే గురువై శిష్యులకు బోధదెల్పేటి గురువంచకుని యొక్క మార్గము ఛీఛీ తలంచరాదు వాని మార్గము ఛీఛీఛీ అని భావము.

**237 ॥తన శిష్యులువిని తన నతి - వినయంబున గొల్చుకొరకు వినుతి యొనర్చు -తన గురువును గురుడింటికి -జను దెంచిన జూచి-శుశ్రూష నేనర్చకుండూ-లేమినిదెల్పి- చనుమను చుండూ-వినుము కుచ్చిత శిష్యా గ్రణి వీడుడెట్లు-ఘన బోధోక్త స్థితి గనునో గురునకు-శుశ్రూషనొనర్చకుండూ-లేమిని దెల్పి చనుమనుచుండూ ॥ 6**

తా॥ తన శిష్యులు విని తన్ను బాగా నుతి జేయుదురని తన గురువును తలుస్తాడు తనగురువు తన యింటికి వస్తే తాను శుశ్రూష చెయడు లేమిని దెల్పి గురువుగారు ఎప్పుడెళ్ళతారు అని అంటాడు వినుము వీడు కుచ్చితమైన మనస్సు గలవాడు వీడు కుటిలాగ్ర గన్యుడు గనుక ఈ ఘనమైన బోధ స్థితి ఎట్లు తెలుసుకొనును అనగా తెలియనేరడని భావము.

**238 ॥కుటిలాత్ముడైన శిష్యుడు -యిటువలె తాబలుకు చుండు యింటికి వస్తే -యెటు బోవు చుండి వస్తిర-యిటుకిక దర్శనము మళ్ళి యెప్పూడయ్యోనో యెవరికిదెలుసు- యెప్పుడేమౌనో - ఎటు దోచదేమైన - యిత్తామంచను కుంటె తుటు కూనవకరాగిదు డైన లేదిప్పుడెప్పూడ య్యోనో యెవరికి దెలుసు - నెప్పుడే మౌనో ॥ 7**

తా॥ కుటిలముగల శిష్యుడు గురవుగారు యింటికి వస్తే అయ్యో స్వామి తమరు యెక్కడ నుంచి వస్తున్నారో యెక్కడకు వెళ్ళుచున్నారో తమ దర్శనము మళ్ళా ఎప్పుడౌనో ఎవరికి దెలుసు ఎప్పుడేమౌనో స్వామీ ఏమైనా యిద్దామని అనుకుంటే నా వద్ద ఒక రాగి డబ్బైనా లేదు నేనేమి చేయునని భావము.

**239 ॥ జపములు తపములు సలుపును - విపరీతస్మరణ జేయు వేదాంతార్థం - బపరిమితంబుగ జెప్పును - కపటాత్ముడు శిష్యకోటి - గని మెచ్చుకొరకూ - మెచ్చి - ద్రవ్య - మునుయిచ్చు కొరకూ - అపకీర్తి చేతాలకదరనట్లగుపడి - వుపమా చెబ్రతుకూచునుండు లోకులు తనను - గని మెచ్చుకొరకూ - మెచ్చి ద్రవ్యమును యిచ్చు కొరకూ ॥ 8**

తా॥ శిష్యా! కపటాత్ముడైనవాడు శిష్యులు గని మెచ్చే కొరకు జపములు తపములు సలుపును విపరీతముగా వేదాంతార్థమును చెప్పును అమితముగా తనలో గురువుని స్మరించుకుంటూ ఉండును శిష్యులు గని మెచ్చుకొరకు మెచ్చి ద్రవ్యమును యిచ్చే కొరకు ఏదైనా అపకీర్తైన ఒక పని జరిగినప్పుడు అయ్యో ఎంతపని జరిగినది అని ఎంతో బాధ పడినట్లు కనిపించుచు ఉపమానములు జెప్పితనములోకులు గని మెచ్చుకొరకు దొంగ వేషములు వేసికొని బ్రతుకు చుండునని భావము.

**240 ॥ గురుమూర్తి కెదురుహంకృతి -దొరుకొన్నను దొంగత్రోవ ద్రొక్కిన చెవులన్ -గురునింద వినిన చేసిన - నరునకు పరిపూర్ణబోధ - నలవీ యెతెలియా - కూడదు వాన్ని - తెలియాకకలియా - గరుడు దెల్పని పుస్తకరీతిచే పూర్ణ - మరసితి నని యెంతో మురిసిన ఈ బోధ - నలవీయెతెలియా - కూడదు వాన్ని తెలియకకలియా ॥ 9**

తా॥ శిష్యా! గురుమూర్తి ఎదుట అహంకారముగా మాట్లాడుట గురువుగారికి తెలియకుండా దొంగత్రోవలు త్రొక్కుచు చెవులతో గురునింద వినుచు తాను నిందించుచుండును యిటువంటి నరునకు పరిపూర్ణ బోధ ఎన్ని జన్మలకైనా అనగా తను బయలౌట తెలియబడదు. అటువంటి వానితో తెలిసి గాని తెలియక గాని స్నేహము చేయరాదు గురుమూర్తి చెప్పకనే నాకు పరిపూర్ణము తెలుసునని గ్రంధములు చదివి ఎంతో సంతోషపడిన గాని ఇతనికి ఏమి తెలియదని భావము.

**241 ॥ నాలుగు శిశ్రూషణములు - లోలతగా వించుకొనుచులో కాతీతం - బౌలోకించి గురునిచే - యీలోకము జోలి విడువు - మింతెచాలన్నా - నీతో గూడ - యిది మరువకన్నా - కీలు దెలియని చదువు చాలా చది వెందూకూ - చాలించినీవిట్టి కీలూ దెలిసితివేని - యింతే చాలన్నా - నీతో గూడ యిది మరువకన్నా ॥ 10**

తా॥ శిష్యా ! గురువునకు స్థాన శిశ్రూష అంగ శిశ్రూష భావ శిశ్రూష ఆత్మ శిశ్రూష ఈ నాలుగు శిశ్రూషలు చేయుచు సద్గురునిచే లోకాతీతమైన మార్గమును ఎరిగి పరిపూర్ణ స్థితిలో ఉంటూ ఎరుక మరుపుల జోలి విడిచి పెట్టితే చాలు నీ ఉన్నంతకాలము యిది మరువకుము కీలు తెలియని చదువు చాలా చదివెందుకు అనగా గురు సూచన నే కీలు తెలియని చదువు చదవిన తెలియబడదు. యివన్నీ చాలించి ఆ సద్గురు మూర్తికి నాల్గు సేవలు చేయుచునుంటే నీ జన్మ రహితమౌనని భావము.

**విశేషార్థము :** శిష్యా! నాలుగు శిశ్రూ షలనగా స్థాన శిశ్రూష అంగ శిశ్రూష భావ శిశ్రూష ఆత్మ శిశ్రూష ఈ నాలుగు విశ్రూషలతో శిష్యుడు గురువు గారికి భక్తి విశ్వాసములతో సేవ చేయవలెను ఎలాననగా

**వాచార్థం**

**స్థాన శిశ్రూష :** గురువుగారు మనయింటికిరాగానే ఒకగది యిచ్చిముందు ఆగదిలోకి ఇతరులు ఎవ్వరు వెళ్ళకుండా మనము చేయవలెను యిది స్థాన శిశ్రూష యనబడును

**అంగ శిశ్రూష :** గురువుగారు ప్రయాణబడలిక ఉండును గనుక గురువు గారి కాళ్ళు చేతులు వళ్ళు పట్టుట పిసుకుట ఈ విధముగా సేవ చేసిన తరువాత స్నానము చేయించవలయును వళ్ళు తుడిచి వారికి బట్టలు ఉంటే కట్టుకొనెదరు లేని యెడల మన యింటిలో బట్టలు యిచ్చి కట్ట బెట్ట వలయును ఇది అంగ శిశ్రూష యనబడును.

**భావ శిశ్రూష :** గురువుగారు భోజనము చేయుటకు కావలసిన అనగా వారు ఏమి భోజనం చేస్తారో వారి భావమునకు సరిపోయి వారికి కావలసిన పదార్థములు వడ్డించి దగ్గరకూర్చునికావలసినవి చూడవలెను ఆతరువాత తాంబూలం వగైరాలు ఏవేమికావాలో వారి భావమునకు సరిపోయేలా చేయవలయును ఇది భావ శిశ్రూష యనబడును.

**ఆత్మ శిశ్రూష :** గురువుగారికి ఆరోగ్యం ఎలా ఉన్నది యెప్పటికప్పుడూ చూచు కుంటూ ఉండవలయును అనగా వారికి జ్వరము వచ్చినదనుకో ఆ జ్వరం నైమోటకు ఔషధము తెచ్చి వేయవలయును అలాగే ఏ వ్యాధి వచ్చినా మనమేనయము చేయించవలెను ఇది ఆత్మ శిశ్రూషయనబడును ఈ నాలుగు శిశ్రూషలు వాచార్థము.

**లక్ష్యార్థం**

**స్థాన శిశ్రూష :** 24 ఇంద్రియములతో కూడియున్న ప్రపంచమనే స్థూల శరీరమైనది ఒక గది లాంటిది ఈ గదిలో గురు స్వరూపమున్నది ఆ స్థానము విడిచి పెట్టకుండుటయే స్థాన శిశ్రూషయనబడును.

**అంగ శిశ్రూష :** ఈ గదియనే స్థూల శరీరములో నివసించే అంగ శరీరమనే జీవుడు తిరుగుచు నిద్రించుచు తన బడలిక తీర్చుకొనుచు ఇట్టి సుషుప్తికి వెళ్ళకుండా తెల్విమత్తులోయుండు సుషుప్తిని జెందును ఇది అంగ శిశ్రూషయనబడును ఇదే సూక్ష్మ శరీరం.

**భావ శిశ్రూష :** సూక్ష్మశరీరమునకు కారణమైయుండి సూక్ష్మ శరీరమునునడిపించుటకు కారణమై జనన మరణములు పొందుట అనగా యిట్టి మరుపులేక ఆత్మ స్వరూపమై యుండుటే అనగా బయలై యుండుట అత్మను మహాకారణ శరీరమును మరచియున్నది మరుపు. ఈ విధముగా విచారించుటే భావ శిశ్రూషయనబడును.

**విశేషార్థము :** శిష్యా! గురుమూర్తి యనగా అఖండస్వరూపమనియు. అట్టి అఖండ స్వరూపములోనుంచి వచ్చిన జ్ఞానా జ్ఞానములే గురుపాదములని. అట్టి గురుపాదముల నుండి వచ్చిన జలమే దృగ్ దృశ్యములని. ఇవే కాశీ గంగయని, తన గురువు విశ్వాతీతుడని, అనగా దృగ్ దృశ్యములకు జ్ఞానా జ్ఞానములకు అతీతుడని అనగా అఖండ స్వరూపమె తారకమని, ఈ మూడు విధములు తనరకమేనని, గురి గలిగి బాగా ధృఢనిశ్చయము పొంది, ఇదే ఉపదేశమని, ఇట్టి మార్గము గలుగజేసిన సద్గురు మూర్తి యున్న గ్రామమే కాశీప్రయాగ రామేశ్వరపురమై ప్రకాశించునని భావము.

**234॥ గురుచరణజలము గోదా - వరియని గురుమూర్తి రామభద్రుండనిత - త్పురమును భద్రాచలమని - గురుమంత్రమె తారకమని - గురిగలిగినట్టి - తిరిగిరాని - మరుగెరిగినట్టి - గురుడున్న చోటె సుందరశేషగిరి భద్ర - గిరిరంగనాయక పురమాన దగియుండు - గురిగల్గినట్టి - తిరిగి రాని - మరుగెరిగినట్టి ॥ 12**

తా॥శిష్యా! యింకను గురుచరణజలమే గోదావరియని. గురుమూర్తి రామభద్రుండని. గురిమూర్తియున్న చోటే భద్రాచలమని, గురుమంత్రమే తారకమని, నమ్మిక గలిగి యున్న వాన్కి ఎరుకమరుపులు పుట్టకుండా ఉండే మరుగు తెలియబడి, గురుడున్నచోటే సుందరమైన శేషగిరి భద్రగిరి రంగనాయక పురమని, నమ్మిక గలిగియున్న వానికి, తిరిగి రాని మరుగు, అనగా **అఖండాను భవరహితమగునని** భావము.

**విశేషార్థము :** తిరిగిరాని మరుగనగా. యెరుక మరల తిరిగి పుట్టకుండా వుండే మార్గము ఎరిగి, అనగా తాను అఖండాను భవరహితుడై, పరిపూర్ణ యునికిలో యున్నవానికి, యెరుక తిరిగి పుట్టదు, అనగా యెరుక శూన్యమై యేమీ లేక, బయలై పోయినది గనుక యిక తిరిగి పుట్టదని భావము.

**244॥ ఇపుడు నరుడనుచు దలచిన - గురుమంత్రము మరిచి యున్న గురుపుత్రులనా- దరణయొనర్చక యుండిన - గురువును విడనాడి రెండో - గురునీ జేరిననూ - సద్గురుబోధ - నెరిగీ దూరిననూ - యెరుక మహత్యము నెరిగీన యిటువంటి - నరు నాకుదప్పాదు నరకము నిజమింకా - గురునీ జేరిననూ - సద్గురుబోధ నెరిగీదూరిననూ ॥ 13**

తా॥శిష్యా! సద్గురు మూర్తిని నరుడని తలంచిన, సద్గురుమూర్తి చెప్పిన గురుమంత్రం, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీలేదు అని, గుర్తెరిగే శరీరాన్ని దాని మూలం ఎరిగి, దాని మూలం నిర్మూలముజేసి, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేకుండా చేసుకొనే, పరతంత్రము మరచియున్న, గురుపుత్రులు మన యింటికి వచ్చినప్పుడు, వారిని ఆదరించని వాడు, ఇటువంటి మార్గము సూచనజేసి విమర్శించవ

**విశేషార్థము :** శిష్యా! గురుమూర్తి యనగా అఖండస్వరూపమనియు. అట్టి అఖండ స్వరూపములోనుంచి వచ్చిన జ్ఞానా జ్ఞానములే గురుపాదములని. అట్టి గురుపాదముల నుండి వచ్చిన జలమే దృగ్ దృశ్యములని. ఇవే కాశీ గంగయని, తన గురువు విశ్వాతీతుడని, అనగా దృగ్ దృశ్యములకు జ్ఞానా జ్ఞానములకు అతీతుడని అనగా అఖండ స్వరూపమె తారకమని, ఈ మూడు విధములు తనరకమేనని, గురి గలిగి బాగా దృఢనిశ్చయము పొంది, ఇదే ఉపదేశమని, ఇట్టి మార్గము గలుగజేసిన సద్గురు మూర్తి యున్న గ్రామమే కాశీప్రయాగ రామేశ్వరపురమై ప్రకాశించునని భావము.

**234॥ గురుచరణజలము గోదా - వరియని గురుమూర్తి రామభద్రుండనిత - త్పురమును భద్రాచలమని - గురుమంత్రమె తారకమని - గురిగలిగినట్టి - తిరిగిరాని - మరుగెరిగినట్టి - గురుడున్న చోటె సుందరశేషగిరి భద్ర - గిరిరంగనాయక పురమాన దగియుండు - గురిగల్గినట్టి - తిరిగి రాని - మరుగెరిగినట్టి ॥ 12**

తా॥శిష్యా! యింకను గురుచరణజలమే గోదావరియని. గురుమూర్తి రామభద్రుండని. గురిమూర్తియున్న చోటే భద్రాచలమని, గురుమంత్రమే తారకమని, నమ్మిక గలిగి యున్న వాన్కి ఎరుకమరుపులు పుట్టకుండా ఉండే మరుగు తెలియబడి, గురుడున్నచోటే సుందరమైన శేషగిరి భద్రగిరి రంగనాయక పురమని, నమ్మిక గలిగియున్న వానికి, తిరిగి రాని మరుగు, అనగా **అఖండాను భవరహితమగునని** భావము.

**విశేషార్థము :** తిరిగిరాని మరుగనగా. యెరుక మరల తిరిగి పుట్టకుండా వుండే మార్గము ఎరిగి, అనగా తాను అఖండాను భవరహితుడై, పరిపూర్ణ యునికిలో యున్నవానికి, యెరుక తిరిగి పుట్టదు, అనగా యెరుక శూన్యమై యేమీ లేక, బయలై పోయినది గనుక యిక తిరిగి పుట్టదని భావము.

**244॥ గురుడు నరుడనుచు దలచిన - గురుమంత్రము మరిచి యున్న గురుపుత్రులనా- దరణయొనర్చక యుండిన - గురువును విడనాడి రెండో - గురునీ జేరిననూ - సద్గురుబోధ - నెరిగీ దూరిననూ - యెరుక మహత్యము నెరిగీన యిటువంటి - నరు నాకుదప్పాదు నరకాము నిజమింకా - గురునీ జేరిననూ - సద్గురుబోధ నెరిగీదూరిననూ ॥ 13**

తా॥శిష్యా! సద్గురు మూర్తిని నరుడని తలంచిన, సద్గురుమూర్తి చెప్పిన గురుమంత్రం, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీలేదు అని, గుర్తెరిగే శరీరాన్ని దాని మూలం ఎరిగి, దాని మూలం నిర్మూలముజేసి, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేకుండా చేసుకొనే, పరతంత్రము మరచియున్న, గురుపుత్రులు మన యింటికి వచ్చినప్పుడు, వారిని ఆదరించని వాడు, ఇటువంటి మార్గము సూచనజేసి విమర్శించవ

లెనని, దారిచూపిన, ఈ మార్గము విచారించలేక, దీనికి దిగువనున్న ద్వైతాద్వైతములలో చేరి. ఈ గురువును విడనాడి, యింకోగురువును ఆశ్రయించిన, వారికి నరకము తప్పదు అని భావము.

**విశేషార్థము** : శిష్యా! పైన చెప్పిన సద్గురువును, అనగా యదార్థము చెప్పిన సద్గురువును విడిచిపెట్టి, అనగా ఈ గురువుగారు చెప్పినది విచారించలేక, ఈ విచారణ అతనికి తెలియక, యింకో గురువును చేరిన, నరకము తప్పదు నిజమే, కానీ తెలిసీ తెలియని గురువును తెలియక ఆశ్రయించిన. యడల అతను తరించలేడు గనుక, తెలిసిన సద్గురువును ఆశ్రయించిన తప్పు లేదు, ఎందుకనగా

శ్లో॥ మధులుబ్ధో యథాభృంగం । పుష్పం పుష్పాంతరవ్రజేత్ ।
జ్ఞానలుబ్ధో యథా శిష్యా । గురుంగురువాంతరవ్రజేత్ ॥

**245॥ జ్ఞానవైరాగ్య భక్త్యా - సమానసదీస్నానదేవమంత్ర పఠన - తధ్యాన మఖతంత్రములు పర - మానిని రతి గోరునట్టి మనుజా సంఘము కూ - బోధను దెల్పు - మనిన వారలకూ - తాను బోధించుట తగదు బోధించితె - తానునేనను భ్రాంతి తలగెడే లాగట్టి - మనుజా సంఘముకూ - బోధను దెల్పు - మనినవారలకూ ॥ 14**

తా॥శిష్యా! జ్ఞానవైరాగ్యభక్తి, స్నానము తధ్యాన్నము మఖ అనగా యజ్ఞము నదీ స్నానము తత్లింగార్చన తత్తీర్థము అర్చనయివి అన్నియు, పరమేయని నిరతము తలంచుచున్న. మనుజ సంఘమునకు వాళ్ళు బోధించ మంటే, మనం బోధించరాదు, ఒకవేళ బోధిస్తే, వాళ్ళకు తాను నేను అనే భ్రాంతి తొలుగదు, గావున వారలకు గురువులు బోధించవద్దని భావము.

**246॥ ఇంగితము నెరిగిసద్గురు - పుంగవుచేనరుడు భుక్తి ముక్తిక్రియలన్ - సంగాసంగము లెడలిన - శృంగారమెవాని చేష్ట - చూచెవారలకూ - వాడున్నట్లు - తోచేవారలకూ- మంగాళ సూత్రమే భంగి శృంగారామొ - శృంగారవతికి - య శృంగారవతి కట్లు- చూచెవారలకూ - వాడున్నట్లు - తోచెవారలకూ ॥ 15**

తా॥శిష్యా! ఇంగితజ్ఞానమునెరిగి. సద్గురు పుంగవుచే శిష్యుడు భుక్తి ముక్తి క్రియలనే, సంగము అసంఘము విడిచిన. శృంగారమోహిని చేష్ట చూచేవారలకు, వాడున్నట్లు తోచేవారలకు, అనగా సద్గురునిచే ఇంగిత జ్ఞానము నెరిగి, భుక్తి-ముక్తి క్రియలనే పనులు చేయుచు, సంఘమనగా 24 ఇంద్రియములతో గూడియున్నది, అసంగమనగా 25 వది, ఇవన్నీ మొత్తం విడిచి పెట్టినవాని చేష్టలు, శృంగారమె చూచేవారలకు, అనగా మంగళసూత్రమున్న స్త్రీకి, పసుపు, కుంకుమలు బొట్టు కాటుకలతో శృంగారముగా భర్తతో ఆనందముగా వుండును. మంగళసూత్రము లేని స్త్రీ పసుపుగాని. కుంకమగాని, బొట్టు గాని, కాటుక గాని భర్త లేడుగాన, ఏమీలేక

అశృంగారముగా ఉన్నది, అలాగే ఎరుకను విడిచిన వాడు గనుక వాడులేక ఉన్నాడు, చూచేవారలకు ఉన్నట్లు కనుపించుచున్నాడు, కాన వానికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేవు పరిపూర్ణమైయున్నాడని భావము.

**విశేషార్థము :** శిష్యా! శుద్ధ జ్ఞానమునెరిగి, సద్గురు మూర్తిచే, శిష్యుడు భుక్తిముక్తి క్రియలన్ తననడనుడులు వలన భుక్తి సంపాదించుకొని, ఆచరణకలవాడై, మోక్షము కొరకు పాటుపడుచు సంగా సంగము లెడలిన, ఆత్మానాత్మలు విడిచి రెంటికీ అతీతమై అఖండమై తానులేని తానై పరిపూర్ణమై అఖండాను భవరహితమై యున్న వాని శ్రేష్ఠులు శృంగారమే? ఏ శృంగారము కనుపించలేదు, ఎందుకనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు అతీతమై యున్నాడుగనుక, ఎలాగనగా, శృంగారివతియనగా భర్తతోయున్న స్త్రీ మంగళసూత్రము పసుపు కుంకుమ గాజులు మట్లుతో శృంగారముగా ఉండెను, యివిలేని స్త్రీ విధవరాలు గనుక, అశృంగారముగా చూచేవారికి తేడాగాకనుపించున్నది, అలాగే ఎరుకను విడిచిన వాని వద్ద ఏ శృంగారము కనుపించదు, ఎరుక ఉన్నవాని వద్ద శృంగారము కనుపించును, చూచేవారికి అనగా ఉంది చేయుచున్నవారు వీరు, లేక చేయుచున్నవారు అతను, అని భావము.

**247॥ జనులందరు గురుబోధను - గనిరాజనులందు నేను గలియకయున్నన్ - నను మన్నింతురెవారని - మనసునదలపోస్తె బోధ - మర్మామబ్బినా - అబ్బినవారి - ధర్మా మబ్బినా - జనన మరణము లేని ఘనమైన త్రోవనే - గననైతినని బోధ గనకున్న యీ బోధ - మర్మా మబ్బినా - అబ్బినవారి - ధర్మా మబ్బినా ॥ 16**

తా॥శిష్యా! జనులందరు గురుబోధను గని తెలుసుకొనియున్నారా? అనగా ఆగురు స్వరూపమనే పరిపూర్ణాన్ని చూచారా? ఆ జనులందున నేను కలియకయున్న నన్ను గౌరవింతురా? వారిని మనస్సులో తలపోసిన ఈ బోధయొక్క మర్మము ధర్మములు అబ్బినవా, మర్మము అబ్బినావారి నడనుడులు అబ్బినవా, అనగా జనన మరణములు లేని, సంకల్ప వికల్పములు లేని, అన్నిటికంటె గొప్పదైన మార్గము, అనగా పరిపూర్ణస్థితి, జన్మరహితమయ్యే స్థితి, నేను తెలుసుకోలేకపోతినని ఈ బోధగనకున్న, ఈ బోధయొక్క మర్మము అబ్బదని భావము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైతరహిత పరమతత్వే శిష్యలక్షణన్నామ పంచద శాధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము.**



# ★ 16 .గురు-శిష్యోభయ లక్షణం. 12 ★

**248॥ హృదయ గ్రంధివిడుటకై -సదయత యీ బోధదెల్ప జనదాగురుడై-వదలక చిత్త ములో గురు - పదయుగళము దలుపవలదే - భక్తుడైనపుడూ - భ్రాంతి రహిత- సక్తుడైనపుడూ - కుదురాదు యివి రెండు గురు శిష్యులకు లేక - కదిలికలేనట్టి ఘనబోధేక్ష స్థితి - భక్తుడైనపుడూ - భ్రాంతిరహిత - సక్తుడైనపుడూ ॥ 1**

తా॥శిష్యా! హృదయ గ్రంధి అనగా, ఎరుపు - తెలుపు - నలుపు కలిసినదే హృదయము, ముడి అనగా ప్రకృతి పురుషులనేవే ముడిబడి యున్నది, అక్కడ ఆ ముడి విప్పుటకై, సద్గురుమూర్తి శిష్యుని యొద్దకు వెళ్ళి, నాయనా ప్రకృతి యనగా 24 ఇంద్రియములు, పురుషుడనగా 25 వ్రోది, యిది ఇంద్రియములలో కలసి తిరుగుచున్నదేముడి, గనుక దీనికతీతముగా అచలమై పరిపూర్ణమై ఉండమని, బోధించుటే ఆ ముడి విప్పుట, గనుకనీవు సర్వకాల సర్వావస్థలయందు, ఈద్వయమనే సృష్టికి అతీతమై పరిపూర్ణమై యుండవలెనని, గురుడు బోధించుచుండవలెను. శిష్యుడు సర్వకాల సర్వావస్థలయందు, ఆ గురు పాదములనే ప్రకృతి పురుషులనేద్వయమును రహిత పర్చవలెను, భక్తుడైనపుడు, అనగా భ్రాంతి రహితంచేసుకోవలెననే ఉద్దేశమున్నవాడు, ఈ ప్రకారముగా చేయవలెను, ఈ విధముగా గురుశిష్యులిద్దరూ ఆచరించకపోతే, కదిలికలేనట్టి గొప్పదైనటువంటి, ఆ పరిపూర్ణ స్థితి కుదరదని భావము.

**విశేషార్థము :** శిష్యా! పీతవర్ణములోపల శ్వేత వర్ణమనగా ఆ రంధ్రములో పలతళ తళ మెరిసే కళ, ఈ కళే సహస్రారము, ఇక్కడే జీవేశ్వర కల్పితం, ఇదే హృదయ గ్రంధియనేముడి, ఈ జీవేశ్వర్లు రహితమయ్యే కొరకు, గురు మూర్తి శిష్యుని యొద్దకు వెళ్ళి, ఈ బోధ ఎల్లప్పుడు చెబుతూ యుండవలెను. అనగా చూచేది చూడబడేది రహితమైన తరువాత, ఉన్నది అఖండమైన అచలమే, ఆ శిష్యుడు సర్వకాల సర్వావస్థలయందు, తన హృదయములో గురుపాదములనేక్షరాక్షరములు రహితము చేసే యుక్తి, అనగా ఆ పని చేయుచునే యుండవలయును, అలా చెయ్యక పోయినా గురుగారు సదావచ్చి చెప్పకపోయినా, కదిలకలేని గొప్ప స్థితి, ఆ ఉనికి గురుశిష్యులిద్దరకు, కుదరదని భావము.

**249॥ గురుడానవదలకుండిన - మరి శిష్యుడు ద్రవ్యలో భమున్నుండైనన్ - మరియాద దక్కదిరవ్వర - కెరిగుండుము వీర - లతివిహీనులో యున్నాగట్టిగదురభి - మానులో యన్నా - గురుడు శిష్యుని కన్న కొడుకూగగన కున్న - గురునీపై శిష్యూడా గురి నిల్పకుండిన - హీనులోయన్నా - గట్టిగ దురభి - మానులోయున్నా ॥ 2**

తా॥శిష్యా! గురుమూర్తి ఆశగలవాడైనా, శిష్యుడులోభిఅయినా, వీరిద్దరకిన్నీ మరియాద దక్కదు, వీరిద్దరిలో ఒకటి అనగా లోభత్వముంటే ఒకరి వద్దనుంటే, రెండవవాని యొద్దను ఉంటుంది, వీరిద్దరునూ దురభిమానులు, అతిహీనులు, అని చెప్పబడును, గురువు శిష్యుని కన్నకొడుకుగా భావించకపోయినా, శిష్యుడు ఆ గురుమూర్తిమీద ప్రేమ యుంచకపోయినా, అనగా నా తండ్రి అనే భావం శిష్యునకు లేకపోయినా, వీరిద్దరూ అతిహీనులని భావము.

**250॥ గురుగురు బోధలచేతను - పరిపూర్ణమునెరిగి - యెరుక బాసినయతనిన్ - గురుతెరుగ- నేరులశక్యమె - యెరిగిన నరులిట్టి బోధ - నెరిగే రేయన్నా -వారెరుగానిమరుగుండదన్నా - చిరుత పాపనిరీ తిమరిపైశాచము భాతి-తిరుగూచునుండు-వెక్కురు మాడ్కిగురుడెట్లు - యెరిగే రేయన్నా వారెరుగాని - మరుగుండదన్నా॥ 3**

తా॥శిష్యా! గురువుగారు గురుస్వరూపమును బోధించి, నాయనా ఈ గురు స్వరూపమే పరపూర్ణమని తెలియజేయగా, ఆ శిష్యుడు గ్రహించి పరిపూర్ణుడై ఎరుకను విడిచి పెట్టినవానిని, ఇతను పరిపూర్ణుడని గురుతెరుగుటకు, ఈ ప్రజలకు శఖ్యంకాదు, ఒకవేళ ఎవరైన ఇతను పరిపూర్ణుడని గుర్తించిన యెడల, అతను పరిపూర్ణుడయ్యే ఉండును, దారెరిగిన వారికి మరుగుండదు, వారెలా గుంటారనగా, చిరుతపాపలరీతి, అనగా చంటిపిల్లలు మనలను చూచుచుండునుగాని, ఎరుగరు, పలానా వారని గుర్తెరుగరు, మరియూ పిచాచము భాతి, అనగా పిచాచము పట్టుకున్నవాడు ఏవోవో అంటాడు, తిరములేని మాటలు తిరములేని పనులు చేయుచున్నట్లును, మరియూ వెక్కిరిమాడ్కి అనగా, పరడైము సలిడైననక్క, దానికి తిరముండదు, అది ఎక్కడకు వెళ్ళుచున్నదో, దానికి తెలియదు, ఏమిచేయుచున్నదో, దానికి తెలియదు, అనగా వెళ్ళినచోటికే వెళ్ళుచుండును, చేసినపనే చేయుచుండును, అలాగే పరిపూర్ణులై ఆ ఉనికిలో ఉన్నవారు, ఇలా ఉంటారని భావము.

**విశేషార్థము** : శిష్యా! గురుగురు బోధలనగా, వారిగురువు గారి వల్ల ఈ గురువుగారు తెలుసుకున్న గురుబోధ, అనగా ఆ గురుడే గురుస్వరూపమనే పరిపూర్ణం, ఆ పరిపూర్ణబోధే గురువుగారు తన శిష్యునకు చెప్పెను, ఆ శిష్యుడు గ్రహించి పరిపూర్ణుడై, ఎరుకను విడిచి పెట్టిన శిష్యుని ఇట్టివాడని, ఈ ప్రజలు గుర్తించలేరు, ఎందువల్లననగా ఆ పరిపూర్ణబోధ నెరిగినవారె, యీయన పరిపూర్ణుడేనని వారెరుగును, ఆ మార్గము ఎరిగిన వారికి మరుగు ఉండదు, ఆ మార్గములో మరుగులన్నీ తెలుసునుగనుక, ఇతను పరిపూర్ణుడేనని గుర్తెంచును, ఇతరులు గుర్తించలేరు, ఎందుకనగా అతను చిన్నపిల్లలువలెను, మరి పిచాచము పట్టినవానివలెను, తిరుగుచునుండు ముసలదై పరడైన నక్కవలె, అనగా మూడు నాలుగురోజులు పిల్లలు ఉన్నట్లుడై చూచుచుండును,

కానీ దేనినీ ఎరుగడు. అలాగే ఇతను చూచుచున్నను దేనిని ఎరుగడు, వినుచున్నను దేనినివినడు, మరి పిచాచము పట్టినవాడు, ఏమి అంటున్నాడో, ఏమి చేయుచున్నాడో అతను ఎరుగడు, అలాగే ఇతను కూడా ఏమీ ఎరుగడు, వరదైన నక్క మతిలేనిది ఎక్కడకు వెళ్ళుచున్నదో, ఎక్కడకు వచ్చుచున్నదో, ఎరుగదు అలాగే ఇతను వచ్చిన కాడకే వచ్చి వెళ్ళిన కాడకే వెళ్ళును కానీ ఏమీ తెలియదు, అట్టి గురుని వల్ల తయారైన శిష్యుడు, అలాగే ఉంటాడని భావము.

ఓ చదువరులారా ! ఇట్టినదనుడులు కలగనివారలకు, ఈ పరిపూర్ణబోధనే మార్గం, అనగా దారి కుదరలేదని, తెలియలేదని, మీరంతా గ్రహించెదరని,అనగా వాచార్థముగా ఈ బోధను చెప్పుకున్నందువలన, ఏమీ తెలియదని, అంటే పరిపూర్ణుడైయ్యే మార్గము యెరుగలేదు అని వాచాగా అనుకును వారికి, ఈ మార్గము కుదరదు. ఈ బోధలో ఆరూఢతీతులైన వారు ఎలాగుందురనగా, పైన చెప్పిన విధముగా, బాలోన్మత్తగుణములు, అంటే చూడక చూచినవారు, వినక విన్నవారు, చెయ్యక చేసినవారు, మతిలేని నక్కవలె, అంటే చేసినదే చేయడం, చెప్పినదే చెప్పడం, వెళ్ళినకాడకే వెళ్ళటం. ఏమి చేస్తున్నది ఎరుగని, ఉనికిగలిగియుందురని భావము.

**251॥ మలయాద్రి చెంత చెంచుల - కిలచందన - భూరుహములె యింధనమటమి - క్కలి గలుగబట్టియట్లనె - చులకన సుమియింట గలుగు సూరిభూషణుడూ - బహుమాన్యుడు - దూరస్థుడెపుడూ - తెలియానివారికి తెలిసేది కఠినాము- తెలిపిచెడెలసితె- తెలియజేసును బోధ - సూరి భూషణుడూ - బహుమాన్యుడూ- దూరస్థుడెపుడూ ॥ 4**

తా॥శిష్యా! మలయ పర్వత సమీపంలో చెంచువారలకు, అచటయుండే మంచి గందపు తరువులే, యింధనము అనగా అవియే వంట చెరకుగా, వినియోగిస్తారు, ఎందుచేతననగా, అవి అచట ఎక్కువగా ఉండబట్టి, అట్లాగుననే యింటివద్దగాని తన గ్రామములో గాని, యున్న సుజ్ఞానులను చూస్తే అచటవారికి, లోకువగా చాలా అలుసుధనంగా ఉంటుంది, దూరస్థుడు అనగా దూరముగా యున్నవారు గౌరవించబడుదురు, తెలియని వార్కి తెలిసేది కఠినముగా యుంటుంది, తెలివి చేత తెలుసుకుంటే, జ్ఞాని ఎవరైనను బోధ చెప్పి తరింపచేయగలడు, అని భావము.

**252॥ దూరమున నుండి విన్నను - చేరున సజ్జనుడు గురుని చెంతకు బోధంగోరి దుర్జనుడు - గోరడు దూరస్థుడుగాక - గురుని - తో గూడియుండి - యెట్లనియన్న- దూరాననుండి - కోరి తుమ్మెద తమ్మి - జేరి తేని యగ్రోలు - నారీతి నెరుగావు చేరి కప్పలు తమ్మి - తో గూడియుండి - యెట్లనియన్న దూరాననుండి ॥ 5**

తా॥శిష్యా! ఎంత దూరము నుంచియైనను, సజ్జనుడు బోధను గోరి గురుని చెంతకు చేరునట్లు, దుర్జనుడు కోరడు ఎంత దగ్గరగా యున్నను, ఎందుచేతననగా

ఎంత దూరమైనను. తుమ్మెదలు ఆ పుష్పముల చెంతజేరి. అతి మృదువుగా పుష్పమునకు హానిచేయక. అందుగల తేనెను కడుపారగ్రోలును. కప్పలు అట్లుగాక పుష్పమువద్దనే యున్నను ఆ మధువును గ్రహింపజాలవని భావము.

**253॥ చూసిమది దెలసి శిష్యుని - యాశయము తగిన బోధన తనికి దెలియన్ - జేసిముదమొందజేసెటి - దేశికుడే ముఖ్యుడనుచు - తెలుసుకోవోయీ - కనియత గాబ్లి - కలుసుకోవోయీ చేసిని దయతో నీయాశసంపూర్తిట్లు - వ్రాసైతె చేసుకొ చూచేవు తార్కాణ - తెలుసుకోవోయీ - కనియతగాబ్లి కలుసుకోవోయీ ॥ 6**

తా॥శిష్యా! చూచిమది తెలసి శిష్యుని యాశయమునకు, తగిన బోధ అతనికి తెలియుంజేయును. చేసి సంతోషింపజేయును, ఇటువంటి గురుమూర్తియే జగద్గురువు. ఇటువంటి గురువు ముఖ్యుడని తెలుసుకొనవోయీ, శిష్యుడు అట్టి గురువును వెతుకవలయును, అనగా ఆశ్రయించవలెను, ఈ విషయము నీవు వ్రాసుకొనిచూచుకో తెలుసును, యిట్లు చేసితే దయతో ఆ గురుమూర్తి నీ ఆశయము నెరవేర్చును. అనగా నిన్నుపరిపూర్ణునిగా తయారుచేయును. వ్రాసుకొని చూచుకో అని భావము.

**విశేషార్థము :** శిష్యునకు పరిపూర్ణబోధ చెప్పి, తనకు పరబ్రహ్మ సుఖము కలుగజేసి. అనగా సర్వకాల సర్వావస్థలయందు తానులేని తానైవుండె ఉనికి కలుగజేసిన, గురులే సద్గురువుయని. ఇట్టి గురువులే యధార్థమైన పూర్ణగురువు, అనగా భ్రాంతి రహితమైన అశరీర దేశిక చక్రవర్తియని, ఈ లాంటి గురువులు నూటికికోటికి ఒక్కరుంటారేమో, కాని అలాంటి వారినే సద్గురువుగా వెతికి వెతికి, ఎలాగైతే కిరికి పట్టుకొని వారిని ఆశ్రయించినవారిని, తనంత వానిగా తయారుచేయును, అనగా నీవచ్చినపని పూర్తి యగును, అనగా అలాంటి గురువు నీకు దొరికితె, నీ వచ్చినపని నీకు జయప్రదమౌను, నీకు అనుమానముంటే వ్రాసేసి చూచుకో, నీయను మానంతీరునని భావము.

**254॥ మంతనమున గురుబోధన - యెంతో వింతనుచునమ్మితింతే కద - యేవింతలు గనరావనిధా - వంతమునొందెటివాని - బ్రతుకెంత కంతే - చింతలు లేని - గతిగానడంతే - అంతకంతకు వానికతి చాదస్తమెకాని - సంతాకూటముతోటి సంభాషించడువాని - బ్రతుకెంతకంతే - చింతలు లేని - గతిగానడింతే ॥ 7**

తా॥శిష్యా! మంతనమున అనగా ఎంతో పట్టుదలగా ఎంతో వింతగా యుంటుంది అని నేర్చుకున్నాను ఈ బోధ ఓసి యింతేగదా ! ఏవింతలు కానరావడములేదే అని అనుకునే వాని బ్రతుకు ఎంతకు అంతే అంతకంతకు వానికతి చాదస్తమేకాని, సంతకూటముతో సంభాషించదు. అనగా 24 ఇంద్రియములతో 25 దోది కలసి తిరుగుచున్న విషయమే సంతకూటము గనుక దీనిని విచారించితే గాని చింతలు లేని గతిగానడు అనగా పరిపూర్ణస్థితి కనలేడు గనుక అతనికి తెలియబడదు అని భావము.

255॥ తనగుబోధను తా-జదివినవినుజనవితతిమదికి వింతై యీ బోధనునే ప్రకున వ్యర్థము - జననంబనితేచి శరణు శరణానెటట్టు - వెంటనెవాండ్లు - దరిజేరెటట్టు - ఘనమైన యుక్తి జేసిన వాడె శిష్యుడు - అనుమానమే మిందుగనరాదు వినవోయి - శరణానెటట్టు - వెంటనెవాండ్లు - దరిజేరెటట్టు ॥ 8

తా॥శిష్యా! తనగురుబోధను తాను చెప్పుచుండే ఆ వినేవారి యొక్క మనస్సు ఎందుకురా మనకీ జన్మ అని అనుకునేటట్లుగా అనేక యుక్తులు సూక్తులు చెప్పాలి వాడు విని ఈ బోధలోకి రావాలి. ఈ గురుబోధను యిదితెలుసుకొపోతే జన్మవృధాయని తోచాలి. ఈ బోధ వింటే శిష్యులు శరణు శరణు అనేటట్లు అట్లాంటి ఘనమైనయుక్తి చేసినట్లైన వెంటనే వాండ్లు దరిజేరును. అట్లాంటి యుక్తితో చెప్పిన అనగా చతురోపాయముగా చెప్పే గురువుయొద్ద అనుమానమేమీలేదు సంతోషముగా ఈ బోధనేర్చుకో అని భావము.

256॥ తనభార్యారూపు రేఖలు-తన పుత్రుల సద్గుణములు తనసంపదయున్-తన పెరటి మందు చెట్టులు- తన గ్రామపు సాధు జనులు- తనకూమెప్పౌనా- యీ యిలలో యెం-తటి వానికైనా -వినలేదెసివాహల్యను జూచి మోహించె-ఘనవాహనుండు చక్కని భార్యగలిగుండి తన కూమెప్పౌనా -యీయిలలో యెంతటి వానికైనా ॥ 9

తా॥శిష్యా! తన భార్య యొక్క రూపురేఖలున్నూ తన పుత్రుల సద్గుణములున్నూ తన సంపదయున్నూ తన పెరటిలో వనమూలికలున్నూ తనకు ఎన్నడూ మెప్పుగావు యిట్లాగుననే తన గ్రామములో ఉన్న గురువు గారి బోధ ఆ గ్రామం లో శిష్యులకు పట్టదు యిది వినరు నీవు వినలేదా అతి సుందరమైన భార్య కలిగియుండియు సన్యాసి భార్య ఐన అహల్యను చూచి మోహించినాడు ఇంద్రుడు ఎంతటి గురువైనా తన గ్రామంలో గురువు పనికి రాడు అని భావము.

257॥ జతనముగదాచి చదువుము - రతనమ్ముల హారమిదియురసికుల గళమూ-యతనము దీనికినే బహు- యతనము గావించి తెచ్చి- యిస్తిర నేడూ- బోధకు బందో-బస్తొర చూడూ- రతనాలెట్లొ రాళ్ళు రతనాలంచని యంటె-రతనాలి పద్యాలేరసికు లెరిగెదరివి -నీకిస్తిరనేడూ- బోధకు బందో బస్తొరచూడూ ॥ 10

తా॥శిష్యా! జతనముగా అంటే ఎంతో ప్రేమాతిశయముగా దాచుకో చదువుకో ఈ బోధ నీ కంఠమునకు రత్నాలహారము వంటిది. అనగా ఈ కందార్థములు కంఠస్థముచేసి గళగ్రాయముగా బోధ చెప్పగలిగినప్పుడు ఈ కందార్థములే రత్నములహారము ఈ బోధలోని మర్మము తెలిసిన వారు అనగా ఈ బోధ కురసికులు ఐతే రత్నాలు అంటే రాళ్ళు అయినవి గదా రాళ్ళు గాదు రత్నాలెట్లాయెను రత్నములేఈ పద్యములు విలువైనవి అని ఈ బోధ తెలిసిన రసికులు యిదివిని సంతోషిస్తారు అంతే గాని యితరులకు రాళ్ళు గాజుముక్కలవలె ఉంటావియని భావము.

258॥ విన నేర్చి చెప్పనేర్చిన-మనుజులకే దీనిలోని మర్మముదెలుసున్ వినజెప్ప నేరకుండిన -మనుజులు యీ బోధలోని-మర్మామెరిగేరా-దీనందుండే-ధర్మా మెరిగేరా-జనులె కొబ్బరికాయ తన నేర్పుగలవారు-తిన నేర్చునాకోతి-తన కాకాయబ్బిన-మర్మ మెరిగేరా-దీనందుండే-ధర్మామెరిగేరా ॥ 11

తా॥శిష్యా! ఈ బోధ ముందువినటం నేర్చుకోవాలి తదుపరి చెప్పటం నేర్చుకోవాలి యిటువంటి వారికే ఈ బోధలోని మర్మము ధర్మము తెలుస్తుంది కాని వినుట చెప్పుట చేతగాని వార్కి ఈ బోధలోని మర్మము గ్రహించలేరు ఎట్లనగా కొబ్బరికాయ జనులే అది వలిచి కాయకొట్టి అందులోని పదార్థమును తీసుకొని తినగలరు గాని అదేకాయ కోతికిదొరికిన దానిని కొట్టి దానిలోని మాధుర్యము తీసుకొని తిన జాలదు అని భావము.

259॥ నేనంత లెస్స జదివిన -దీనిని తెలియంగలరె దేశిక పర్యున్ -పూని సే వించకుండిన -మానవులదియెట్లనన్న మరి వినవోయీ నామాటందు- మనసుంచ వోయీ - వాన కాలములోని వర్షాము వొక బిందు - చైన మిట్టను విల్వ - దది నిశ్చయమెకద -మరి వినవోయీ- నామాటందు మనసుంచవోయీ ॥ 12

తా॥శిష్యా! ఈ నేను ఎంత చదువు చదివినా ఎంత విపులముగా చెప్పినా దీనిని తెలియజాలడు అనగా చిరకాలం గురుసేవాదురంధరులకే యిదితెలియబడుతుంది అంతియేకాని పుస్తకాలు చదివి నంత మాత్రమున యిది మానవులు తెలియజాలరు నా మాట యందు మనస్సు ఉంచుము ఎట్లనగా వానా కాలములోని వర్షము ఎంత వచ్చినా ఒక్కచుక్కైనా మిట్టను నిల్వదు ఆ నీరు పల్లమునకే వస్తుంది ఇది నిశ్చయమే గదా ఆలాగే గురుసేవ చేయనివారికి తెలియబడదు అని భావము.

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే గురుశిష్యో భయలక్షణ న్నామ షోడశోధ్యాయః భావ విశేషార్థములు సమాప్తము



## ☆ 17 .గురుదత్తాభయ దానం. 11 ☆

260॥ నన్నా శ్రయించినావని-యన్నాయీ బోధనీకు- అతుకుట కొరకై -యి న్నే యుక్తుల జెప్పితి- విన్నావాదిన్ని నీవు - విడువకెప్పటికీ-నాయాజ్ఞను - గడువాకెప్పటికీ- నన్ను నీవు విన్ను నే గన్నా వేళ్ళిట్టిదా- నన్ను నీవు విడలేవు నిన్ను నేవిడ లేను- విడువ కెప్పటికీ - నా యాజ్ఞను గడువకెప్పటికీ ॥ 1

తా॥శిష్యా! నాయనా నీవు నావద్దకు వచ్చి నన్ను ఆశ్రయించినావని ఈ బోధనీకు తెలియుటకొరకు ఎన్నో యుక్తులుగాను ఎన్నో సూక్తులు గాను చెప్పితిని నాయనా విన్నావా దీన్ని నీవు ఎన్నటికీ విడిచిపెట్టకుము నా యాజ్ఞను యెన్నడు జవదాటకుము నన్ను నీవు నిన్ను నేను కనుగొన్నవేళ ఎట్టిదో నన్ను నీవు విడువ లేవు నిన్ను నేను విడువలేను అని భావము.

261॥ పతియైనను సతియైనను -నతిసాహసపరులుగాక -యాంతర్యమునన్ -రతివేళ్ళలజ్జ పడసం- తతిగలుగదుచూడు మట్ల -తగదుల జ్జించా - గురు శిష్యూలు -తగులజ్జ నొంచా - మతినినీవిట్లు సమ్మతి జేసి యేయె - సంగతినన్నడుగుము బోధ -స్థితి నీకు దృఢపరతు - తగదులజ్జించా -గురు శిష్యూలు - తగులజ్జనొంచా ॥ 2

తా॥శిష్యా! పతియైనను అనగా భర్తఐనను సతి అనగా భార్య ఐనను రతివేళ అని సావాసముతో నుండ వలయునేగాని అట్లుండనియెడల సంతానము గలుగదు అట్లాగుననే గురు శిష్యులు ఇద్దరు మనస్సు సమ్మతము జేసుకొని నన్ను అడుగుటకు నీవుగాని నీకు చెప్పుటకు నేనుగాని లజ్జించకుండానిదానమైన మనస్సుతో ఈ బోధ నన్నడిగినట్లైతే నేను నీకు అన్ని విధములుగా అనగా ఆ స్థితినిపొందే మరుగు సూచన చేస్తాతాను దాన్ని అవలోకించి నీవు పరిపూర్ణుడవై వుంటావు. మరుగులు అన్ని చెబుతాను అని భావము.

262॥ రతి కొరకుగా దెసతిపతి-కతిహితమతిసేవజేయు -నటువలెబోధ-స్థితినీకు కుదురుటకు స - మ్మతి తో గురుసేవ జేయు మా- నీతివంతా -అభిమానాము- పొని నీదంతా-అతనికి దయ వస్తె అరనిముషమున బోధ -స్థితి నీకుకుదిరించు సిగ్గు -విడచి కొల్యుమా- నీతివంతా అభిమానాము -పోనినీదంతా ॥ 3

తా॥శిష్యా! రతి సుఖము కొరకు భార్య భర్తకు అనేక ఉపచారములు చేయును అట్లాగుననే నీకు బోధ స్థితి కుదుర్చుకొనుటకు గురునకు చిరకాలము అభిమానము విడిచి సేవసేయుము అట్లు చేసిన యెడల నీ శుశ్రూషకు సంతోషించి ఆయన అప్పుడు నీకు బోధ స్థితి కుదిర్చి నీకు సంతోషముగల వానినిగా చేయును గావున సిగ్గు విడచి అనగా నీలో అభిమానం విడచి అరమరలేకుండా చేస్తే నీకు అరనిముషములో బోధ రహశ్యము జెప్పి ఆ స్థితి నీకు కుదిరించును అప్పుడు ఆ స్థితి ని అవలోకించి సర్వకాలం పరిపూర్ణుడవై వుందువు అరనిముషములో ఆపరిపూర్ణుడవైయ్యేలాగున చెబుతారు. సిగ్గు విడిచి గురుసేవ చేయుము అప్పుడు నీవు పరిపూర్ణుడవై సర్వకాలం వుండగలవు అని భావము.

263॥ నీ మానసముగ సంశయ - మేమాత్రము నిల్పబో -కు మిక నాతోడే-నామాట విశ్వయమునే-నే మాత్రముదా చలేదనీ తోడుసుమ్మీ -యింతకు మిక్కిలికలేదు లెమ్మీ నా మీద తలవుంచునను మరువకికనేను- నీమీద దయవుంతుని జమిందుకి దెవోట్టు -నీతోడు సుమ్మీ -యింతకు మిక్కి-లిక లేదు లెమ్మీ ॥ 4

తా॥శిష్యా! చెప్పుచున్నారు గురుమూర్తి నీమనస్సులో సంకోశము ఏ మాత్రం వలదు ఇక నాతోడే సుమ్మీ నామాట నిజముగా నమ్ముము నేను ఏ మాత్రము దాచలేదు నీతోడేసుమ్మీ యింతకు మిక్కిలి యిక ఏమి లేదు లెమ్ము అనగా పరిపూర్ణ బోధకన్నా ఎక్కువైనదేది లేదు గావున నన్ను మరువక నా మీద ప్రేమ యుంచుము యిక నేను నిన్ను మరువను నీ మీద దయవుంచెదను ఇది నిజము ఇందుకు యిదే ఒట్టు అని భావము.

**264॥ నీ గురుబోధను నీచే-బాగుగ వినినిందసేయు భ్రష్టుల మాటల్-లో గొని**
**విడిచేవిదినీ - కేగురుడీలాటి బోధ నెరిగించడోయీ-యెరుకలోదె-**
**యెరిగించునోయీ- ఆ గురు బోధలన-న్నీ నేదెల సుండి - నా గురుబోధ**
**నేనయముగనీకిస్తి-యెరిగించడోయీ- యెరుకలోదె -యెరిగించునోయీ ॥ 5**

తా॥శిష్యా! నీ గురుబోధను నీచే బాగుగా విని నిదంజేసేటి భ్రష్టుల యొక్క మాటలు విని నీ మనస్సు కలతజెంది యిది విడిచి పెట్టకుసుమా నీకు ఎవరూ ఇలాంటి  పరిపూర్ణ బోధ చెప్పక యెరుక బోధను జెప్పును యిట్లాంటి బోధను ఎవ్వరూ తెలియ జేయజాలరు ఎరుకలోనిబోధ జెప్పును గావున ఆ గురుబోధలను అన్నియు దెలిసి యుండి నేను నీకు నాగురుమూర్తి జెప్పినదే తెలియజేసితిని అంతియేగాని ఎరుకలోది ఎన్నడు తెలియజేయలేదు పరిపూర్ణబోధయే నీకు తెలియ చేసితిని అందు గురించి వారలు అన్న మాటలకు ఈ బోధను విడిచి పెట్టకు. విడిచి పెట్టిన ఈ లాంటి బోధ ఎవ్వరూ చెప్పరు. అన్ని బోధలకన్నా అతీతమైన బోధయిది. యీలాంటి బోధ ఏ గురువు చెప్పడు, యెరుకలోది చెప్పును. ఈ బోధలేక చెప్పే బోధ అని భావము.

**265॥ నిక్కముగ బీరపీచుల - చిక్కు సమీ విచ్చరాదు - ఛీ యీ యెరుకన్**
**మక్కువనే బోధించిన - చక్కని బోధాగ్ని చేత - సాధించు పోరా - విచ్చేచింత -**
**చాలించుకోరా - చొక్కమౌ యీ బోధకెక్కాడ యీడౌను - తక్కిన బోధాల దిక్కూ**
**చూడక దీన - సాధించు పోరా - విచ్చే చింత చాలించుకోరా ॥ 6**

తా॥శిష్యా! ఇంకను ఈ యెరుక ఎటువంటిదనగా నిక్కముగ బీరపీచు చిక్కుసుమాయిది దీనిని అనగా ఈ బీరపీచు చిక్కులను విడదీయుటకు ప్రయత్నం మాత్రం చేయకు నేను బోధించిన చక్కని బోధాగ్ని చేత కాల్చివేయుము ఇట్లు సాధించవలయునే కాని విడదీసే ప్రయత్నం మాత్రం మానుకొనుము అందమైన ఈ బోధకు సాటియిక ఈ ప్రపంచములో మరియొకటి లేదు. దీనికి దిగువి ఏగాని దీనికి పైన చెప్పే విలేవు గావున తక్కిన బోధ వైపు చూడకు దానకి దీనికి ఎట్లు ఈడు కుదురును కుదరదు అని భావము.

**266॥ అడివివ్వ శిరికెయు జలనిధి-బొడ మినలవణం బటంచుబొగడిన రీతిన్ పుడమిని**
**యీ స్థలమందున-కడువేడుక నీవు నేను గల సూట వినరా- నీనా ప్రేమ-**
**గలసె కన్గనరా-విడలేవు నీవు నన్ను -విడలేనునేనిన్ను-పొడ జూచి నీవు నే**
**నెక్కడ బోక -నిలచిట్లు-గల సూట వినరా - నీ నా ప్రేమ -గలసె కన్గనరా ॥ 7**

తా॥శిష్యా! అడవిలో ఉసిరికాయ సముద్రపు నీటి యందు ఉప్పు ఈ రెండూ కలియగానే అనగా ఉప్పు ఉసరికాయ కలిస్తే రుచిగా ఉంటుంది అట్లాగుననే ఈ బోధలో నీవు నేను అట్లాగుననే కలిసితిమి నీవు నేననేప్రేమ ఎక్కువైనది నీవు నన్ను విడువలేవు నేను నిన్ను విడువలేను యిచ్చటి మాట ఎట్లున్నదనగా అడవిలో ఉసిరికాయ సముద్రములో ఉప్పు ఎట్లు కలసి రుచి తెచ్చినవో అట్లా నీవు నన్ను నేను నిన్ను విడువలేమని తెలుసుకొమ్ము అని భావము.

**విశేషార్థము :** శిష్యా! అడవియందున్న ఉసిరికాయ ఎక్కడో సముద్రములో ఉన్న ఉప్పు ఈ రెండూ కలయుటలో ఎంతో రుచి కలిగినది అలాగే గురుమూర్తియున్న చోటికి ఎక్కడ నుండియో వచ్చిన వాడు శిష్యుడు వీరిద్దరూ కలుసుట వల్ల గొప్పదైన అచల బోదకు ఎంతో విలువవచ్చినది ఎలాగనగా కర్పూరములాంటి శిష్యుడు అగ్నిలాంటి గురువుగార్ని అంటించుకొన్నందున రెండూ ఏకమై వెలిగ వెలిగి అందున్న సారమే లేక పోయేక బూడిదైనట్లు గురుశిష్యులు ఇద్దరియందు ఉన్న జీవేశ్వర్లు రహితమైన తరువాత చెప్పే బోధ లేదు గనుక బూడిదవలె ఉత్తదై బట్టబయలై పరిపూర్ణులై యుండునని భావము.

**267॥ పెద్దల నిందయొనర్పకు - పెద్దలసేవించుకొరకు - పిరిడివియకుమే -పెద్దలతో**
**వాదించకు -పెద్దలు జెప్పేటి సుద్ధి -పెడ చెవుల వినకూ -పెద్దలు నడిచె -**
**నడకనేమనకూ -పెద్దలకన్న నే పెద్ద నంచునుకోకు-పెద్దలగనుగొన్న ప్రి - యము**
**తొమ్రొక్కుము -పెడచెవుల వినకూ - పెద్దలు నడిచె - నడకానే మనకూ ॥ 8**

తా॥శిష్యా! పెద్దలను నిందసేయకుము పెద్దలను సేవించుకొరకు వెనుకాడకుము ఏ పెద్దలతోను వాదించ కుము పెద్దలు చెప్పే నీతి పెడచెవిబెట్టకుము అనగా ఆ నీతి వినుము పెద్దలు నడిచేటి నడకను ఎంచకుము పెద్దలకన్నను నేను పెద్దవాడను అనుకోకుము పెద్దలు వస్తేవారికి ఎంతో ప్రేమతో నమస్కరించుము అని భావము.

**268॥ పెత్తనమున యేనుంగిల - చెత్తను దిన వలసె చీమ - చిన్నతనమునే**
**హత్తుకొనితినును చక్కెర - యిత్తరి యీ రెంట్లో నీకు - యిష్టమెదైతె -**
**చేకొనుమదె - స్పష్టమిదైతే - పెత్తనమున చేటె పెంపొందుచుండూను -**
**చిత్తములో దెలియ-చిన్నతనమెమేలు - యిష్టమెదైతే -చేకొనుమదె -**
**స్పష్టమిదైతే ॥ 9**

 

తా॥శిష్యా! నేను పెద్దదానను అనుకొని ఏనుగు చెత్తను తిన్నది చీమ చిన్నతనముచే ఎంతో ఆప్యాయంగా చక్కర రేణువు తీసుకొని సంతోషించినది కావున ఈ రెంటిలో నీకు యిష్టము వచ్చిన లక్షణమునే గ్రహించుము పెద్దతనం వలన చేటే వచ్చును. మన చిత్తమందు ఆలోచిస్తే చిన్నతనమే మేలుగా కనుపించుచున్నది గాన చిన్న తనమే మేలు అని భావము.

**విశేషార్థము** : శిష్యా! పెత్తనమున ఏనుగు చెత్తను తినవలసి వచ్చెను. చిన్నతనమున చీమ అత్తుకొని తినును చక్కెర శిష్యా నీవు చిన్నతనము వహించిన యెడల గురువుగార్ని అత్తుకొని కావలసిన విషయములు అడిగి తెలుసుకొని ఆచరించి తరించవచ్చును నీకు పెత్తనము కావాలంటే అనేకమైన కష్టములు వచ్చి నిన్ను బాధించును అన్నింటిని సహించి వోర్పుతో నెరవేర్చవలెను. ఈ రెంటిలో నీకేది ఇష్టమో అది స్వీకరించుమని భావము॥

**269॥ తనకు శరణన్న వారల -మనుసెట్టిదో తరచి చూచి మరి తెల్పద గున్ -వినువారికి తగినట్టిది - యనిరిట్లు మహానుభావుల తిచాతుర్యమునా - వినికనినీమను -సతి చాతుర్యమునా-ఘనమైన యీ బోధకరుణిస్తి దీని-చచ్చినదాక -నిదురావచ్చిన దాక- మరువాకు -మతిచాతుర్యమునా-వినికనినీ-మనసతి చాతుర్యమునా ॥ 10**

తా॥శిష్యా! తనవద్దకు వచ్చి, శరణు శరణు అనిన వారల, మనస్సును పరిశోధించి, వారలకు కావాలసినది బోధించుట ఉత్తమము, ఇది వినువారికి తగినట్లుగానే బోధించవలెనని, మహాత్ములైన ఆర్యులనగా అచలులు తెల్పియున్నారు. గావున యివి ఆశించిన వారివారికి, తగినట్లు గానే బోధచేయమన్నారు మన పెద్దలు. యిది ఎంతో చాతుర్యముగా వక్కాణించి చెప్పిరి, మనయొక్క పెద్దలు, ఎందుచేతననగా, ఘనమైనది ఈ పరిపూర్ణ భోధ, కరుణించి చెప్పితిని,ఇది ఈ శరీరము విడుచువరకును,మరియూ నిద్రలేచినది లగాయతు, మరల నిద్ర వచ్చేవరకు, దీనిని మరువరాదు, ఇంకను నిద్దురవచ్చిన దాకా అంటే, అట్టి స్థితిలో నీవు ఉండగానే నిద్ర కలిగేవరకు, ఇదివిడిచి పెట్టవద్దని భావము.

**270॥ చెప్పదగు గురుడు బోధను - చెప్పిన పనిజేసెనేని - శిష్యా గ్రణికిన్ చెప్పదగదు- చెప్పినపని - తప్పనివాడింటనేని - దయ దల్చిబోధా - యిద్ధరికుండ - దగునిట్టి మేధా - చెప్పిముందుగ బోధ చెప్పండి పనులన్న - చెప్పాగూడదు వాని - తిప్పాలబెట్టా కదయదల్చి బోధా - యిద్ధరికుండదగు - నిట్టి మేధా ॥ 11**

తా॥శిష్యా! ఈ భోధ చెప్పవచ్చును. ఎవరికనగా గురుమూర్తి చెప్పినట్లుగా ఆచరించేవారికే చెప్పవచ్చును, కాని చెప్పదగదు అన్నారు, ఎవరికి అనగా గురువు చెప్పినది తప్పు అని భావించువారికి చెప్పవద్దు, గనుక ఈ భావము తెలియవలయును, అయ్యా ముందుగా బోధ చెప్పేయండి, ఆ తరువాత మీరు చెప్పినట్లు చేస్తానన్న, వారలకు ఎంతమాత్రం ఈ బోధ బోధించవద్దు అని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత పరమ తత్వే గురుదత్తా భయదానం
నామ సప్త దశో ధ్యాయః భావ విశేషార్థములు
సమాప్తము.



# ★ 18 .సుజన లక్షణం. 6 ★

**271॥ ఇవి వినుమనినను సుజనులు - చెవియొగ్గిదరివియు - స్పృష్టజేసి కృతికిఖల్-**
**చవిఋట్టింతురదెట్లన - శివుడు కళానిధిని చక్క - జేసెన లేదా - నీమదిశంక-**
**బాసెనాలేదా - అవనిలో శ్రీరాముడవ గుణినా హల్య - నెవరేమియన -**
**కుండ - సవరించి సుగుణిగ - జేసెన లేదా - నీమది శంక - బాసెనలేదా ॥ 1**

తా॥శిష్యా! యివి వినండి నాయనలారా అంటే, చెవియొగ్గి మరి మరీ వింటారు సుజనులు, ఇంకను అనేకమైన ఉపమానములచే ఈ కందార్థములకు, రుచి కల్పించెదరు, ఎట్లనగా శివుడు కళానిది, అనగా చంద్రునికి కళతెప్పించెనా లేదా, మరియూ భూమియందు అవగుణి అనగా రాయిగా పడియున్న అహల్యను శ్రీరామ చంద్రుడు, శాపవిమోచనగా వించి, సుగుణవంతురాలినిగా చేసెనా లేదా, నీవే పరీక్షించి ఆప్రకారం, ఈ బోధకు కళతెప్పించు అని భావము.

**272॥ గురు సూచనైనసరులను - మరిమరి వినుమనుచు జదువుమా - పద్యములన్-**
**గురుసూచనయెరుగనియా - నరులను వినుమనుచు జదువ - నగుబాటౌ గదరా-**
**అదియట్లన్న యిది గొనేదెల్పెదరా - పురుషా సంగతి లేని పొలతికొక్కక శాస్త్ర**
**మరసిమెచ్చునెదాన్ని - యతిప్రౌఢ సతివాలె - నగుబాటౌ గదరా - అది యెట్లన్న-**
**యిదిగొనేదెల్పెదరా ॥ 2**

తా॥శిష్యా! గురు సూచన వినవారికి, మరీమరీ వినుమని యీ పద్యములు నీవు బోదించుము. గురుసూచన గాని వార్కియన్నడు ఇవి చెప్పకుము, అట్లు సూచనగాని వారలకు చెప్పితే, నగుబాటుగా ఉంటుంది, యెట్లనగా యిదిగో చెప్పెదను వినుము. పురుష సంగతి యెరుగని కన్యకు, కొక్కోకశాస్త్రము చూచినా, దానిని భర్తతో కాపురము చేసే స్త్రీ వలె మెచ్చదు, అట్లాగుననే సూచనగాని వార్ని వినుమంటే అట్లాగునే ఉంటుంది. అనగా గురు సూచన కాని వారికి అనగా తాను పరిపూర్ణమయ్యేయుక్తి తెలియని వాడు ఎంతచెప్పినా దీనిని మెచ్చడు అని భావము.

**విశేషార్థము :** శిష్యా! గురు సూచనైన వారికి, మా పద్యములు చదివి వినుపించు. అని వ్రాసేరంటే, సూచన పనివారు లక్షలు కోట్లు మీద ఉన్నారని అర్థము. గురు సూచననగా తనను తాను చూచుట తాననగా అఖండమై అచలమై పరిపూర్ణమైయున్నదే తాను. అనగా పరిపూర్ణములో నుండే జీవేశ్వర ప్రపంచమంతా కల్పితం. తాను పరిపూర్ణమైతే, యివి ఏమీలేవు, తాను పరిపూర్ణం ఏలాగౌతాడు అంటే. గురు సూచనద్వారా విచారించితే, తన్ను తాను చూచును, అనగా తాననేది ఎక్కడ ఉన్నదంటే దహరాకాశ సూక్ష్మ రంధ్రాంతర్గత చిన్మయ కుహర విరాజమానమై సర్వ ప్రకాశమానమై నిజానంద స్వరూపమైనదే తాను. అఖండమండల మండిత హృదయ పుండరీక మధ్య స్థ సర్వ వ్యాప్త సచ్చిదానంద స్వరూపమైనదే తాను, అక్కడకు వెళ్ళి, చూస్తే, తన్ను తాను చూస్తే నీవు లేవు, తానూ లేడు, మరియేమున్నదయా అంటే పరిపూర్ణ మొక్కటే యున్నది, అనగా నీవే పరిపూర్ణమై యున్నావు, ఈలాంటి మరుగులు, కొంచెము మరుగుగా చెప్పేరు పెద్దలు. రామయోగి కొంచెము తెలిసేలాగు చెప్పేరు, అవధూతగారు కూడా కొంచెం మనకు తెలిసే లాగు చెప్పేరు. అందులో అవధూతగారి కందార్థం.

కం॥ నీనిజరూపమె యచలము - నీనిజరూపంబు బయలు నిజము గనెపుడున్ -
నీనిజరూపమె పూర్ణము నీనిజ రూపంబు బ్రహ్మ నీవెరుగవయ్యా నీనిజ రూపం
నీవుగా పయ్యా నీవే విశ్వరూపం నీవే భ్రమరూపం నీవే మాయా రూపం నీవెరుక
రూపమని నీవెరుగవయ్యా నీని జరూపము నీవుగాదయ్యా ॥

రామయోగి కందార్థము

కం॥ నేనేనేననెదైవము - నేనేనీవనెటి ఎరుక - నేనెట్లందున్ - నేనేనేనైతినవో -
నేనేనీయచలమగుచునే నిల్వగాను - యెరుకను మరువ - నేనెవరి గననూ
నీనా సందున - వెలుగుదాన్ని - పరిపూర్ణము - గాను ఎరిగినయవలనీనా
బేధము విడచినే నిల్వగానూ యెరుకను మరచి నేనెవరిగననూ ॥

తా॥శిష్యా! నేనే దేవుడను, నేనే నీవనే యెరుకను నీనా సందు ప్రకాశించు దానిని పరిపూర్ణమని దెలిసికొని, నీనా భేద మువదలి, నేనే పరిపూర్ణమైనప్పుడు, యెరుకను మరచుట కింకనెవరున్నారు, ఆహాయిది చిత్రముగా నున్నదని భావము.

**273॥ యెవరుంటె యేమి భయమురా - సవరింతురు తప్పులుంటె సాధులు విన్నన్ -**
**సవరించనివ్వు మిదివిని - యవనీతులు నిందజేస్తె - అయ్యేదేమోయీ -**
**అందులో మనది - పొయ్యేదేమోయీ - భవనాశ స్థితిలేని పద్ధతి యీ బోధ -**
**చౌరంగ వినుపించు చాటేలమా తేల - అయ్యేదేమోయీ - అందులోమనది -**
**పొయ్యేదేమో యీ ॥ 3**

తా॥శిష్యా! ఎవరుయున్నానీకు ఏమీ భయములేదు, ఎవరువింటేనేమి ఒకవేళ పెద్దవారు వింటే. యిందులో తప్పులుంటే వారు సవరింతురు. అట్లు సవరించ నీయుము, మరియూ దుర్మార్గులైనవారు నిందించినా. మనది పోయేదేమి. వచ్చేదేమి.

చావు పుట్టుకలు లేని ఈ బోధ. చౌరంగ వినుపించు, దీనికి చాటు మాటలు ఎందుకు, అని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఈ అచల పరిపూర్ణ బోధలో, భవనాశస్థితిలేని పద్ధతి ఈ బోధ, అని అంటే, ఉత్పత్తి స్థితి లయములు పొందే ఎరుక, ఏమీ లేక. పరిపూర్ణమైయున్న ఎరుకే. త్రికాలములయందు ఒకే తీరుగా వున్నదే అచల పరిపూర్ణం. యెరుక, సర్వకాలం వ్యాహారహితమై ఉన్నదానికి, వేరు గాక ఉండడమే, అఖండాను భవరహితము. యిట్టి ఉనికి గల వారికే. భవనాశ స్థితిలేని పద్ధతి, అని శ్రీ భాగవతుల క్రిష్ణ ప్రభు చెప్పియున్నారు. అక్కడక్కడ. అయినా ఎవరికీ తెలియబడుట లేదు, కారణమేమ... గురుసూచనయనే యుక్తి తెలియనందున. అనగా నేత్రములు త్రిప్ప చూపి... అది గురు సూచనకాదు. గురు సూచనంటే అగ్నికర్పూరమువలె వెలిగి వెలిగి, లేకపోయినట్లు. ఆ సూచనవల్ల గురు శిష్యులిద్దరూ ఒకరికొకరు కనిపించకుండా, లేక పోయెదరిని భావము.

**274॥ పుట్టింట బిడ్డ బహాగా - దిట్టైయుండినను యెవరు దిట్టరు భువిలో - పుట్టింటి
వారుకోడలు - దిట్టైనను అత్తవారు దిట్టేరు సుమ్మీ - చేతులకొద్ది - గొట్టేరు
సుమ్మీ - అట్టుంబలెనె బహు దిట్టైన శిష్యుని - తిట్టాడు గురుమూర్తి వట్టీ వారు
జూస్తె తిట్టేరు సుమ్మీ - చేతులకొద్ది గొట్టేరు సుమ్మీ ॥ 4**

తా॥శిష్యా! పుట్టింటి ఆడపడుచు, ఎంతగడసరి ఐనా, ఆమెను ఎవరూ తిట్టరు. ఈ ఆడపడుచే అత్తింటివద్ద గడసరిగా ఉన్నట్లైతే, అత్తవారు తిట్టుటయే గాక, చేతులకొద్ది నెత్తిమీద మొట్టెదరు, అట్లాగుననే దిట్టమైన శిష్యుని, గురుమూర్తియన్నడూ దూషించడు. అదేలోకులు యితనిని చూస్తే దూషించెదరు, అని భావము.

**275॥ అందముగ ఘనులు మెచ్చెద - రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్-
చందురుడు వుదయమందిన - సింధువు చెలరేగినట్లు చెలగూనె చెర్వూ - కోనేర్లు
నూ-తులుబావులేర్లూ - మందయానల పొందు మగవారెనుతి జేతు- రెందూకునుతి
జేతురిలవండ పురుషూలు - చెలగూనుచెర్వూ - కోనేర్లు నూతులు బావులేర్లూ ॥ 5**

తా॥శిష్యా! అందముగా ఘనులు మెచ్చుకుంటారు, ఇదివిని ఇతరులు ఈ బోధను మెచ్చరు, ఎందుకనిన, చంద్రోదయమైతే, సముద్రము పొంగుతుంది కాని, చెరువులు కోనేర్లలోనూ కాలువలలోనూ గుంటలలోనూ, నూతులలోనూ నీరు పొంగుతుందా, పొంగదు. ఎట్లనగా మందయానల పొందు, మగవారే నుతింతురు. నపుంసకుడు, మంధయానలపొందు నుతించడు, అని భావము.

**విశేషార్థము :** శిష్యా! మహాత్ములైన ఘనులు, ఈ అచలపరిపూర్ణ గ్రంధమును జూచి, మెచ్చుకొందురు, అనగా ఈ గ్రంధములో జనన మరణము లనేపునరావృత్తిని రహితము జేసి పరిపూర్ణ సుఖమును కలుగజేసే మార్గము ఒకటున్నది, అది యితర మత గ్రంధములలో లేదు, అందువల్ల మహాత్ములైన పెద్దలు, అఖండాను భవ రహితులైన అశరీరులు. ఈ గ్రంధమును జూచి మెచ్చుకొందురు అని భావము.

**276॥ కాకంబులు సంపూర్ణ - తటాకస్థజలంబులెట్లు - త్రాగకత్రృష్ణ చే - గైకొనునో - కుంభజలము - ట్లీ కలయుగమందు - దుష్టులింపు మీరగనూ - నిల్వరుబోధ - కంపూబారిననూ - మీకు దీనికెలంకె మాకేలయిట్టి - చీకాకు కొక్కక మైతెగైకొందు మందూరు - యింపూమీరగనూ - నిల్వరు బోధ - కంపూబారిననూ ॥ 6**

తా॥శిష్యా! కాకులుసంపూర్ణముగా నిండియుండు తటాకము నదులు కాలువలలో నీరుత్రాగవు, కుండలలో యున్ననీరు ఎంతో ప్రేమచే త్రాగును, అట్లాగు ననే ఈ కలియుగమునందున, దుష్టులు ఈ బోధ యొక్క వాసన తగిలిందంటే, అచట నిల్వరు, పైగా దానికి మీకులంకే. కొక్కొక మైతె వింటాము, మా కెందుకు ఈ బోధ అని, దూరముగా పోవుదురు. అందుకువార్ని కనిపెట్టి బోధించవలయును. అని భావము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే సుజన లక్షణ న్నామ అష్టాదశాధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము**



# ☆ 19 .కుజన లక్షణం. 4 ☆

**277॥ కుచ్చితమతి యగుపురుషుని -చెచ్చెర వినుమనుచు-జదువ శిష్యులవలెతా -ముచ్చట పాటుగ వినడివి - కుచ్చుల కుళ్ళాయి కుక్కకూనా కెందుకురా - పిడుదుకుదుగ్ధ-పానామెందుకురా - హెచ్చైన ముత్యాలు పచ్చాల పతకాము - గ్రుచ్చి పేరుగజేసి తెచ్చి వేసితె కోతికూ నా కెందుకు రా - పిడుదుకు దుగ్ధ పానా మెందుకురా ॥ 1**

తా॥శిష్యా! చంచలమనస్సు కలిగినవారిని, వినుమంటే వినరు, ఎట్లనగా సజ్జనులు విన్నట్లు దుర్జనుడు వినడు, సంతోషముగా వినడు, ఎందుచేత ననగా, అందముగా తయారుచేసిన, కుళ్ళాయి, అనగా చొక్కాయి, కుక్కపిల్ల కెందుకు, పిడుదుకు పాదుగు యందు ఉన్న పాలును త్రాగక, రక్తము త్రాగును, అలాగే మంచిముత్యాలు గ్రుచ్చి పేరుగా జేసి తెచ్చివేసితే. కోతి పిల్ల కెందుకు అలాగే ఈ బోధ దుర్జనులకు అవసరము లేదు, అని భావము.

**278॥ అక్షయ బోధస్థితిగల - లక్షణ వేత్తలకు మెప్పులైన - కృతులలో - కక్షకు తప్పులు కుమతి - పరిక్షింపుచు నుండు నెన్నొ - రీతూలవినుమీ - తద్భావమీ - రీతిది కనుమీ - మక్షిక మెప్పాడు మానిసు గంధాదు - లీక్షించువ్రణము - ప్రత్యక్షమెకద-యెన్నోరీతూల వినుమీ - తద్భావ - మీరీతిగనుమీ ॥ 2**

తా॥ శిష్యా॥ తరుగు అంటూలేని లక్షయబోధగల, లక్షణ వేత్తలకు, ఎంతో సంతోషముగా ఉంటుంది. యిది కక్షతో దుర్మార్గుడు, తప్పులు వెతకటానికే చూస్తూ యుంటాడు. ఎన్నోరీతులు, గాని అట్టి తప్పు గలవాడు, అది ఎట్లనగా, ఈగయెప్పుడూ పుండు మీదవ్రాలు చుండును, గాని అది అత్తరుపన్నీరు మొదలైన సువాసనల గల వస్తువుల దగ్గరకు వెళ్ళదు. అట్లుండును దుర్మార్గుని లక్షణములు అని భావము.

279॥ రమ్మని పిలువని దేప - ద్యమ్ములు జదువంగ వచ్చి - యతి నిందించున్ -
సమ్మతిగాకకుమతివిని - యిమ్మహియదియెట్లనన్న - నిట్లానే వినుమీ - వాని
బుధ్యదట్లానెకనుమీ - బొమ్మలాటలో - దిష్టి బొమ్మ తానొకటి ఛీ - పొమ్మానియని
నా హాస్యమ్మెనర్పదెపోక - నిట్లానెవినుమీ - వాని బుధ్య - దట్లా నెకనుమీ ॥ 3

తా॥శిష్యా! రమ్మని పిలువనిదే, తనకు తానే వచ్చి, ఈ పద్యములు చదివి - ఛీ అని ఈ బోధను నిందిస్తాడు దుర్జనుడు, యిది వానికి సమ్మతమవదు, యిది ఎట్లునగా ఇట్లువినుము, బొమ్మలాటలో దృష్టిబొమ్మ ఒకటి వచ్చి, మంచివార్ని చెడ్డవార్ని నిందచేయును, ఛీ పొమ్మనినా పోదు, అట్లాగుననే దుర్జనుడు పోక అట్లాగుననే యుండును, అందరినీ నిందజేయునని భావము.

280॥ వటియించిన చన్నులుగల - కుటిలాలకినిందజేయు గుత్త పురవికెన్ - యెటువలె
తన తప్పెరుగక - నటువలె గ్రంథమును మెచ్చ - దతి దుర్జనుండూ - లేనిదితప్పు-
వెతుకూచు నుండూ యిటువంటి బోధనే నెరిగెదట్లనుకోక - కటు వాక్యములుబల్కి
ఘనులగా సిలజేయు - నతి దుర్జనుండూ - లేనిదె తప్పు వెతుకూచునుండూ ॥ 4

తా॥శిష్యా! శుష్కించిన చన్నులు గల యువతి తాను తొడిగిన రవిక బిగువుగా అంటుకొని లేదని రవికను నిందించునట్లుగా అనగా తన తప్పు తాను ఎరుగక రవికను నిందజేసినట్లు అటువలె దుర్జనుడైనవాడు తనతప్పుతాను తెలుసుకొనలేక ఈ గ్రంథమును మెచ్చుకొనడు. యింకను లేని తప్పులు వెతుకుచు నుండును. యిటువంటి గొప్పదైన బోధను నేను తెలుసుకొనలేక పోయానే, నేను ఎట్లు తెలుసుకొనుట అని అనుకోక కఠినమైన వాఖ్యములు బల్కిగొప్ప వారైన పెద్దల మనస్సుకు బాధ కలిగించునని భావము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే కుజన లక్షణం నామైకోనవింశోధ్యాయః భావ విశేషార్థములు**
**సమాప్తము**



## ☆ 20 .శిష్య విజ్ఞాపన. 8 ☆

281॥ గురువర మీనా సందున - యెరుకను తెరగలిగి - యుండె యిన్నాళ్ళగలెన్ -
కరుణా రసేక్షణములన్ - తెరదీసితి - రెరుక మాట - దీరెనిక్కడికి -చాలు బోధ-
దూరేదెక్కడికి - పరిపూర్ణమును లేని యెరుకాను జూపించి - యెరుక లేదని
యంత్రియెరుకె లేదా యాను - తీరెనిక్కడకి - చాలు బోధ - దూరేదెక్కడికి ॥ 1

తా॥శిష్యా!। ఆ శిష్యుడు గ్రహించిన విషయమును, గురువుగారికి చెప్పుకొనుచున్నాడు, సద్గురు ప్రభో మీకు నాకు, అఖండయెరుక యొక్క తెర ఇన్నాళ్ళ

నుంచి ఉన్నది, మీ కరుణా కటాక్ష వీక్షణములచేత, ఆ అఖండయెరుక తెరదీసి, లేకయున్న విషయమును, సూచనజేసి చూపించినారు, నేను చూచి గ్రహించినాను, ఎరుకమూట యిక్కడికి సరిపోయిన యెరుక ఏమిలేదు, ఇంక చాలు బోధ, మీరు చెప్పిన కాళీలేదు, ఎందుకనగా మీరు 26 వ దైన అఖండ యెరుక పరిపూర్ణమై యున్నదని చెప్పి, అందులో వస్తూ పోతూ యున్న 25ద్రోది లేనెరుకని చెప్పి, ఇప్పుడు ఎరుక మొత్తానికి ఏమీ లేదని, అనగా ఆ రెంటిని విడిచిన వెనుక, ఉన్న అఖండాను భవరహితమైన, ఉనికిలో నీవు ఉండవలెనని శెలవిచ్చి యున్నారు, గనుక ఈ ఎరుక మొత్తానికి ఏమీలేదు, ఆ తరువాత శేషించియున్న ఊహారహితమైన ఉనికే పరిపూర్ణమని, నేను గ్రహించితిని అనగా ఏమీ లేని, బట్ట బయలులో ఏమీ లేక యున్నానని, భావము.

**విశేషార్థము** : శిష్యుడు ఆర్యా! సద్గురు ప్రభో, మీ నాసందున ఇన్నాళ్ళనుంచి యున్న ఈయఖండ యెరుక, తెర పరిపూర్ణమనే భావముతో, ఆ తెర ఉండిపోయినది, ఇప్పుడు ఆ ఎరుక కూడా లేందేనని దాన్ని కుడా విడిచి పెట్టమని చెప్పి, దీనికి అతీతమైన, అఖండాను భవరహితమైన, ఉనికిలో ఉండమని శాసించియున్నారు, అందువల్ల నేను అఖండాను భవరహితమై ఊహారహితమైన, తూష్ణీ భావమనే ఉనికిలో ఉన్నానని భావము.

**282॥ ధారుణి కొంత జరించిచి - చారించితిగాని - యీ విచారము నేనే - వ్వారలు జెప్పగవినలే - దారయ మీనోట విన్న - దయ్యా గురుమూర్తి - నాతర మానుతి- జెయ్యా మీ కీర్తి - సారాసన యనవురారినీరజాబ్యం - దారాక ముఖులైనే రాను మిముదెలియనయ్యా గురుమూర్తి - నా తరమానుతి - జెయ్యామీ కీర్తి ॥ 2**

తా॥ శిష్యుడు చెప్పుకొనుచున్నాడు ప్రభో! ఈ ప్రపంచములో ఎన్నో చోట్లకెళ్ళి నేను విచారించి చూచితిని గాని, ఈ విధమైన బోధ ఎవ్వరూ చెప్పలేదు, నేను వినలేదు, మీనోట విన్నానయ్యా గురుప్రభో, మిమ్ములను స్తుతించుటకు, ఏ విధముగాను నేను సరిపోను, నా తరమా మిమ్ములను కీర్తించుటకు ప్రభో, బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులైనా మీ యొక్క విషయాన్ని గ్రహించి కీర్తించలేరు, నేనెంత వాడను, మిమ్ములను స్తుతించి కీర్తించుటకు అని భావము.

**విశేషార్థము** : ఆర్యా సద్గురు ప్రభో! ఈ ప్రపంచములో, కొన్ని దేశములు తిరిగి చూచితిని గానీ, తానులేని తానైన, ఈ విధమైన అఖండాను భవరహితమైన విచారణ, ఎవ్వరూ చెప్పగా నేను వినియుండలేదు, ఎక్కడ విన్నా ఎవరు చెప్పినా అఖండమే పరిపూర్ణమని, అచలమని చెప్పుచున్నారే కాని, అఖండాను భవరహితం చెప్పేవారు ఎక్కడాలేరు, మీరు చెప్పే పరిపూర్ణ బోధలోనే, ఇంతలోతు విచారణ ఉన్నది, కాని ఎందులోను ఏ మతములోను లేదు, అనగా పరిపూర్ణమున్నది ఎరుకలేనిది, అని వాచార్థముగా చెప్పుకొనే

వారే గాని. తానులేని తానైన పరిపూర్ణ భావము. చెప్పే బోధ మీనోట విన్నానయ్యా గురుమూర్తీ. మిమ్ములను కీర్తించుటకు నేనెంతవాడను. హరిహర బ్రహ్మాదులే మిమ్ముతెలియలేనప్పుడు, నేను తెలుసుకొనుటకు నేనెంత వాడనని భావము.

**283॥ ఘటమెదుట బెట్టి చూసిన - యటువలె బయలుండ - జూపియ తిమాయలచే- నటి యింపుచున్న యెరుకను - తృటిలో విడిపిస్తిరిపుడు - దీరెసంచ్చంకా -యిక బుట్టదు - యేరీతిశంకా -యెటుదోచకిలు వెళ్ళి యిటమిమ్ము జూచిన -ప్పటినుంచి దయజేసి ప్పటిదాక భోధిస్తె - తీరెసంచ్చంకా - యిక బుట్టదు యేరీతి శంకా ॥ 3**

తా॥ ప్రభో! ఒక కుండను ఎదురుగుండా బెట్టి, చూపించినట్లు, నాకు ముందు బయలును చూపించి, అతిమాయలచే నటియింపుచున్న ఎరుకను, అనగా 26 రోదైన అఖండమైయుండి అందులోనుంచి వచ్చి 25 దోదై సమస్తాన్ని గుర్తెరుగుచు మరల 24 ఇంద్రియములతో గూడి అనేక వికారములు పొందు మరల 25 దోదై కొంతసేపటికి 26 రోదైనటి యింపుచున్న ఎరుకను ఒక్కచిటికిలో, విడిపించినారు. ప్రభో నాసంశయము తీరిపోయెను. ప్రభో ఇక ఏ విధమైన సంశయము పుట్టదుప్రభో, ఏమీతోచక ఇంటి వద్దనుండి బయలుదేరి, మిమ్ములను దర్శించినప్పటినుండి, యిప్పటివరకు బోధిస్తే, మీ దయవల్ల నాశంక పూర్తిగా నశించినది. ఇక ఏ విధమైన శంక పుట్టదు ప్రభో, అని భావము.

**విశేషార్థము :** ప్రభో! ఒక కుండను ఎదురుబెట్టి, సూచించినట్లు బయలును సూచించి అతి మాయలచే నటియించుచున్న యెరుకను, అనగా ఈ యెరుక ఈశ్వరుడై కొంతసేపు వుంటున్నది, మరల 24 ఇంద్రియములతో కలసి తిరుగుచున్నది, ఒకప్పుడు అచలమై కదలకుండా వుంటుంది, అనగా బయలౌతుంది. ఈ విధముగా నటియింపు చున్నది, యెరుకయని ఎరిగినవారే లేరు, ఎక్కడనైనా ఉంటే ఉండవచ్చు,కానీ ఉన్నట్లు నేనెరుగను, అనగా ఎరుకను ఎరిగినవారులేరు, ఉంటే ఏనాటో బాగుపడుదురు. ఇందుకు 102వ కందార్థములో నేనెవ్వడనను జీవుడు. నేనేనేనను శివుడు ఈ రెండనకన్ తానుండుసచలము. వీటినినేనెరిగరిగినను, అనగా ఈ మూడెరుకలను ఎరిగి తానులేపోవటమే యెరుకను విడిపించుట, అనగా జీవతనువు ఈశ్వర తనువు ఈ రెండు ఎరుకలకు అతీతమైనది, అచలమనే అఖండ ఎరుక, ఈయఖండములో ఎరిగే యెరుకను, విడిచి పెట్టుయిక శేషించియున్నది, ఈ బయలేకదా. యిక ఏమీలేదుగదా. ఆర్యాసద్గురు ప్రభో, ఒక్క క్షణములో ఎరుకను విడిపించితిరి, నా భ్రాంతి రహితమైనది యిక ఏశంకాలేదు. అనగా మీరు పూర్ణ సూచనజేసి ఈ విధముగా యెరుకలేదని చూచించగా ఎరుకలేకపోయెను, నాసంశయము రహితమయ్యెను. యిక ఎరుక తిగిరి పుట్టదు. నాకు యిక ఏ సంశయములేదు. నేను వచ్చి మిమ్ములను దర్శించి నప్పటినుంచి, బోధించితే యిప్పటికి తీరినది, నాశంక, యిక ఏ విధమైన శంక పుట్టదని భావము.

**284 ఒరులు నేనకనిండిన - దెరిగింపుమదేమొ బయలు -యేనొరుల నుచున్ -యెరుగు నీవెవరు యీ - లేనెరుకను - వున్నావువుంటె - యిదిలేనంచను కోనేనొనినునీ - మదినీ లేనను కో - యెరిగి యీలేనెరుకయిట్లా లేకుండితె - పరిపూర్ణమో -దాన్నెపగిది గుర్తెరిగేము - యిది లేనంచనుకో - నేనొనినునీ మదిని లేననుకో ॥ 4**

తా॥ గురుడు : ఇతరులు నేనని అనక నిండియున్నది ఏమిటి?, శిష్యుడు : అది అఖండమైయున్న బయలు, గురుడు : నేను ఇతరులని ఎరిగే నీవెవరు?, శిష్యుడు : ఈ లేనెరుకను, గురుడు : వున్నావు గదా?, శిష్యుడు : దాన్ని లేకుండా చేయవలెను, గురుడు : నేనో?, శిష్యుడు : నిను నీ మదిలో లేక వుండవలెను. గురుడు : ఈ లేనెరుక యిలా లేకపోయిన తరువాత ఉన్నది పరిపూర్ణమేమొ?, శిష్యుడు : ఆ పరిపూర్ణాన్ని గుర్తెరిగే యెరుక ఏమీలేదు గనుక ఎరిగేవారు లేరు, అని భావము.

**285॥ నా బుద్ధికి సరిపడ్డది - నీ బుద్ధే కాని యెన్ని నేర్పుల - గనినన్ - ధీబుద్ధుల యాబుద్ధులు - నా బుద్ధికి మెప్పురావు - నా తండ్రి వినరా - శాబాసుని - న్నేతండ్రి గనెరా - యీ బుద్ధినిక మానకే బుద్ధి బూ నాకు - యే బుద్ధ బూనీన నీ-బుద్ధిచెడిపోవు - నా తండ్రి వినరా - శాబాసు నిన్నే తండ్రిగనెరా ॥ 5**

తా॥ నాయనా నాబుద్ధికి సరిపడినది నీబుద్ధే, ఎన్ని విధములు చూచిన ధీబుద్ధులు యాబుద్ధులు నాబుద్ధికి నచ్చవు, అనగా వాళ్ళ బుద్ధులు ఒక నిలకడగా ఉండవు, గనుక నీ బుద్ధే నచ్చెను, నా తండ్రీ వినుము, నాయనా శెబాసు నిన్ను ఏ తండ్రి కన్నాడో, నేను చెప్పిన పనివిడువకు, ఆ పరిపూర్ణ ఉనికైన బుద్ధి విడువకు, ఇక చలనముతో యున్న ఏ బుద్ధీపూనకు యిక ఏ బుద్ధైన వింటే నీ బుద్ధి చెడిపోతుంది, అనగా పరిపూర్ణ స్థితిలో ఉండలేవు, గావున ఇతర బుద్ధి పూనకు, నీవు పరిపూర్ణమయ్యేయుండుము అని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేను చెప్పిన ప్రకారం నీ బుద్ధిని పరిపూర్ణ స్థితిలో నిలిపినావు, గనుక. నా బుద్ధిపొందిన స్థితి నీబుద్ధి సరిపోయి కుదిరినది. యితర బుద్ధులన్నీ చలనముతో యున్న- ధీ -బుద్ధులు గనుక, నా బుద్ధికి నచ్చలేదు. నా తండ్రీ వినుము, నీవు యే బుద్ధి పూనినా నీ బుద్ధికి చలనము వచ్చును. గనుక ఏ బుద్ధీ పూనకు నీవు సర్వకాల సర్వా వస్తలయందు అఖండాను భవరహితమై యుండుమని భావము.

**286॥ కొట్టితి తిట్టితి శ్రమలన్ - బెట్టితినీ మనవి చెవునం బెట్టక పెడచా - బెట్టి తిమొట్టితి పెడలన్ - గొట్టితి నీ మనసు దెలియ - కోపాములేకా - సరె తెలిసెనీ - వోపిక పోకా - పట్టు మిచ్చెదయింకనట్టే మియని దయ - బుద్ధి యిచ్చితి బోధ - గట్టివాడవు రోరి - కోపాము లేకా - సరెతెలిసెనీ - వోపిక పోకా ॥ 6**

తా॥శిష్యా! నాయనా నిన్నుకొట్టితిని, తిట్టితిని, అనేక శ్రమలను బెట్టితి, నీమాట పెడచెవుల బెడితిని, మొట్టితిని, పోరా నా వద్దకు రాకు, అని కసరితిని, యివన్ని ఎందుకు చేసితిని, అంటే నీ మనస్సు తెలుసుకొనుటకు, నీవు కోపించక యుంటివి, సరే నీ మనస్సు తెలిసినది, కావున పట్టము యిచ్చెదను అనిదయబుట్టి నీకు అధికారము యిచ్చితిని, ఈ బోధ నీవు బోధించవచ్చును, ఒరే నాయనా నీవు చాలా ఘట్టివాడవురా, అని భావము.

**287॥ నీవెంత కొట్టి తిట్టిన - నే విడిచేవాడగాను నీ చరణంబుల్ - చావైన పెండ్లియైనను- నే విడువనటంటి వట్టి నిజ భక్తుడవెరానేగను గొంటి - నీనిష్టనౌరా - కావున నీకిట్టి ఘనమైన యీ బోధ - నేనే గదయజేస్తి నీ విదివిడువాకు - నిజ భక్తుడవెరా- నేగనుగొంటి - నీనిష్టనౌరా ॥ 7**

తా॥శిష్యా! స్వామి మీరు ఎంతకొట్టినా తిట్టినా నేను మాత్రం మీ పాదములను వదలను, మీ చరణములు విడువను, చావు అవనిమ్ము పెండ్లి అవనిమ్ము, ఏదైనా సరే, నేను వెరువను, అంటివిరా, నీవు నిజ భక్తుడవే, నేను చూచితిని, నీ నిష్ట గావుననే ఈ ఘనమైన బోధను నేను నీకు త్వరగా బోధించితిని, నీవు నిజమైన భక్తుడవు, గురు నిష్టగలవాడవురా నాయనా అని భావము.

**288॥ నా నోటి మాట వెంబడి - తానెప్పుడు సంచరించె తగ నీచిత్తం - జేనదిగని యీ బోధ - విధానము నీకిస్తి - దీన్ని దాచుకొనుమ్మీ - నిత్యము నీవు - చూచుకొనమ్మీ- యేనరుడైన - నిన్నీ బోధనడిగితె - వాని మనుసరయాక వానికి జూపేవు - దాచుకో నుమ్మీ - నిత్యము నీవు - చూచుకొనమ్మీ ॥ 8**

తా॥శిష్యా! నా నోటిమాట వెంబడి తానెప్పుడు చంచరించు చున్నావో, తగునీ చిత్తము నేనదిగని, అనగా నేను చెప్పిన ప్రకారంగా గీటుదాటకుండా నీవు నడుచుకునే నడనుడులు, నేను గమనించి, ఈ బోధయొక్క విధానము నీకిస్తిని, అనగా నీవు ఎరుకను విడిచి పరిపూర్ణమై యుండేలాగు, అఖండాను భవరహితమైన మార్గంనీకు, సూచనజేసి చెప్పితిని, దీనిని ఎవరికి తెలియుండా దాచుకో, నిత్యము నీవు చూచుకొనమ్మి, ఏనరుడైనా ఈ బోధ నిన్ను అడిగితే, వానిని వానియొక్క మనస్సు వాని నడనుడులునూ కొంత కాలమైనా పరిశీలించి చూచి, ఇతను మంచివాడని నీకు తోచినప్పుడు, వానికి చెప్పవలయునే కాని, తదితరులకు చెప్పగూడదు అని భావము.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే శిష్య విజ్ఞాపనం నామ వింశతమోధ్యాయః భావ విశేషార్థములు**

సమాప్తము.



# ★ 21 .గ్రంథపూర్తి 3 ★

**289॥ కూడి గురుశిష్యులిద్ధరు - వేడుకతో - బయలు వున్న విధమెరిగెరుకన్ -విడిరిది లేవిదవి - మాటాడుటకిక - యేమిదోచ - దదియేమొ కావీ - వింటి రెమీరలిది- యిందులోవి - జాడమీకెరుకాని - వేడితివినుమంచు - యీడికి సరిము - చ్చటాడూ టకికదోచ - దదియేమొకావీ - వింటిరెమీర - లిదియిందులోవీ ॥ 1**

తా॥శిష్యా! గురు శిష్యులిద్దరు కూడి, వేడుకతో బయలై అఖండమైయున్న ఎరుకను ఎరిగి, అందులో వస్తూ పోతూయున్నలేనెరుకను ఎరిగి, ఈ నటనలన్నీ అఖండ ఎరుకే ననిగ్రహించి అనగా బంగారమే వస్తువులు వస్తువులే బంగారము అని గ్రహించినట్లు, ఈ అఖండ ఎరుకను. విడిచి లేక యుండి, ఒకరికొకరు మాట్లాడుటకు కూడా, యిచ్చలేక ఏమీ ఎరుగక, ఏమీతోచక ఎరుకలేకున్నారు, మీరు ఎవరైనా దీనియొక్క సంగతి విన్నారా. దీనిని గమనించి చూచారా! యిందులో దీని యొక్కజాడ, మీరెరుగుదురని. మిమ్ములను వేడుకొంటిని. వినుమని. యిక విచారించుట కేమీతోచుట లేదు అది ఏమో అని భావము.

**290॥ శరశాస్త్ర స్వరహిమకర (1765) పరిమిత మైనట్టి - శాలివాహనశకమం - దరయుగ- శోభ కృదనువ - త్సరమార్గ శిరంబు కృష్ణ - చవితినాటికిని - పద్యాల్పది దక్కువ- మున్నూ టికినీ - మురయాచుశ్శో నెవ్వరువిన్న చదివిన -పరిపూర్ణమెరుకై- లేనెరుక లేకుండూనె - చవితీ నాటికినీ - పద్యాల్పది తక్కువ - మున్నూటికినీ ॥ 2**

తా॥శిష్యా! శరశాస్త్ర స్వరహిమకర పరిమితము అనగా (1765) శాలివాహన శకమందు శోభకృతు అనువత్సరము మార్గశిర కృష్ణ చవితినాటికి, పద్యాలుపది తక్కువ మున్నూటికిని, ఎంతో ఉత్సాహముతో వ్రాస్తిని, యిది ఎవ్వరు విన్నా చదివినా, పరిపూర్ణమెరుకై లేనెరుక లేకుండును, పరిపూర్ణము తెలియబడిలేని ఎరుకలేకుండును అని భావము.

**విశేషార్థము :** శిష్యా! శరములనగా ఐదు, శాస్త్రములనగా ఆరు, స్వరములనగా ఏడు, హిమకరుడనగా ఒకటి, అనగా 1765 ఇది శాలివాహనశకము అనగా క్రీస్తుశకము 1843 సంవత్సరములో మార్గశిర కృష్ణ చవితినాటికి, ఈ పద్యముతో కలిపి, 290 పద్యములను వ్రాసినట్లుగా, కృష్ణ ప్రభువులు వ్రాసియున్నారు. మరియు పరిపూర్ణమెరుకై లేనెరుకలేకుండుము, అంటిపరిపూర్ణం తెలియబడి లేనెరుక లేకఉండును, అంటే యెరుక ఏమైనతి ఎక్కడకు వెళ్ళినతి అంటే, నక్కముదిరి వరడైనట్లు, తొండముదిరి ఊసర వెల్లి ఐనట్లు, ఎరుకబయలై పరిపూర్ణమైనది, అనగా వస్తువులు కూడా బంగార

మన్నట్లు, మరియు కెరటములు కూడా సముద్ర మన్నట్లు, యెరుకకూడా పరిపూర్ణమేయని ఎరుగవలెను, మరియూ పరిపూర్ణం మనకు తెల్లియబఢ్డినదంటే, మనము పరిపూర్ణమైతేనే, మనకు తెలియబడినట్లు, అందువల్ల పరిపూర్ణమొకటి ఎరుక ఒకటి అనుకున్నవారికి. ఈ జన్మలో తెలియబడదని ఎరుగవలెను, మరి... సముద్రం వేరు కెరటములు వేరు అంటే, విషయం తెలియబడనట్లు మరియు ... వేరు వస్తువులు వేరు అంటే విషయము తెలియబడనట్లు, పరిపూర్ణ మేదో యెరుకే... తెలియదని అర్థం, అందువల్ల వాచార్థపరులు పరిపూర్ణమె యెరుక యెరుకే పరిపూర్ణమని చెప్పిన యెడల, ఎంతమాత్రము ఒప్పుకోరు, వారికీ మార్గము తెలియదని భావము. యిందుకు వెంకటేశ్వర అవధూతగారు చెప్పిన కందార్థములు.

కం॥ అప్పుడు యిప్పుడు యనకను - యెప్పుడు బయలయ్యి యుండు వెరుకయు లేకన్- యిప్పగది యెరిగినప్పుడె - చప్పుడు మరిలేకయుండు - చదరకవినరా - మదిలోనెపుడు- వదలక గనరా- అదియైతిననము - అది కాలెదనకుము - విదితాముగా రెండు విడచితానైయుండు - చదరాక వినరా - మదిలోనెపుడు వదలకగనరా ॥

కం॥ తానే పరిపూర్ణుండై - లేనిది యీ యెరుక - మరుపు లేకను యెపుడేన్ - స్వానుభవాతీతుండై - తాననకను - యుండవలయే తలపులులేకా - నిలకడ యైయ్యి - చలనముగాకా - ఫలము యిట్లెరిగితే పరిపూర్ణమౌదువు - తెలసి విడిచితె చాలు - తెలివి లేకుండును - తలపులు లేకా - నిలకడయైయ్యి - చలనము గాకా ॥

వీరు శిష్యులు ఎరుగలేదంటే వీరి మనుమలకు ఎట్లు తెలియబడును, అందువల్ల చాలా రహస్యముగా ఉన్నది, ఈ మార్గం అందరికీ తెలియబడేది కాదు. కొందరికే తెలియబడును.

యిందుకు రామయోగి కందార్థము

కం॥ నిజముగ నిలువని తనువులు నిజముగ మనమెంతవరకు - నిలువ వశంబౌ నిజపరిపూర్ణప్రభ - గురునిజదేహము - నీ వటంచు - నెరిగితేసరిరా - యెరిగేవరకు గజిబిజిగదరా - అజభవాదులునైన నిజగురు ప్రభగని విజనదేశములలో సుజనులై తనుమహిమనెరిగితే సరిరా - ఎరిగేవరకు గజిబిజిగదరా ॥

తా॥శిష్యా! నిలువకుండా పొయ్యే మాయా శరీరము లను, మనమెంతవరకు నిలుప శక్యమగును, నిలుపుటకు వశముగాదు, బ్రహ్మ, విష్ణు, శివులైనను, గురుస్వరూప మైన పరిపూర్ణమే, తమ నిజదేహమని, తెలుసుకుంటే చాలును, ఈ మర్మము తెలిసేవరకు చిక్కుగా నుండును, గాన పరిపూర్ణమే నీ శరీరమని, నమ్ముమని భావము.

**291॥ ఏ పురుషుడు గురువర్యుని - శ్రీ పాదము బట్టలేదో - పేలుగనాతం - డీ పుస్తకము ను జూచిన - యే పట్టున నిలువకేగునిది - విజమయ్యా - నరులారవిూ-మది దెలియరయ్యా - యీ పరమగో ప్యాము యెవరెరుగరయ్య - నా పల్కు మదిలోన నాటిన వారికె యిది నిజమయ్యా - నరులార - మీ మదిదెలియరయ్యా ॥ 3**

తా॥శిష్యా! ఏ పురుషుడైనా శ్రీ గురుమూర్తి పాదములను బట్టకపోయినా, అతను త్వరగా యిది చూచి ఈ పుస్తకమును చదివినట్లైతే ఏమూల ఎక్కడ నిలువకపోవును, యిది నిజము. నరులారా మీరు యిది వినండీ నా పల్కులు అనగా నేను రచియించిన ఈ కందార్థములు చాలా గోప్యమైనవిగాను, చాలా రహస్యమైనవి గాను యున్నవి, గనుక నేరచించి చెప్పిన మాటలు, మదిలో నాటిన వారికే, తెలుసునని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఏ పురుషుడు శ్రీ సద్గురుమూర్తి వద్ద, ఉపనయనం పొందకుండా యున్నాడో, అతనికి గురు సూచన అవలేదో, అతను ఈ అచల గ్రంధమును చదివిన అచలబోధవిన్నా, ఆ చోటులో నిల్వకుండా పోవును, ఎందుకనగా ఈ మార్గము ఎరుగడుగనుక, అలాగే వాచార్థపరులకు గురుసూచన అవని వారికి కూడా, ఈ అచలబోధ తెలుసినట్టే ఉండునుగాని ఏమీ తెలియదు, ఇది నిజము ఓనరులారా, ఇది యదార్థము. ఈ పరమరహస్యమైన అచలపరిపూర్ణ బోధ ఎవ్వరూ ఎరుగరని, గ్రంధకర్తే చెప్పినారంటే, అది ఎంత రహస్యమైనదో, ఎంతగోప్యమైనదో, మీరేగమనించండి, మరి ఎవరికి తెలుసును, అనగా ఆయన చెప్పిన గురు సూచననే యుక్తిమదిలో నాటిన వారికి తెలుసునని చెప్పియున్నారు, అనగా సూచనంటే తానేలేక ఉండే మార్గము. అనగా తాను పరిపూర్ణమైయుండే మార్గమని, తెలియవలెనని భావము.

యింద్యుపండిత శివానందస్వామి జన్మఫల ప్రకరణలో 93వ.పేజీలో

గతిలేనమ్మకు గంజి పానకమన్న సామ్యం - అలాగే దీన్ని సంగ్రహించక యెరుకనవ లంబించుట, చేతిలో ప్రసాదముంటే, మో చెయ్యి నాకిన చందం, బంగారము లేకుంటే యిత్తడి సొమ్ములు పెట్టుకున్న ఛందము, కస్తు మృగములేకుంటే లేళ్ళనేనుకొని బ్రతికినట్లు. యెరుకను నమ్ముకొని అంతావుంటారు, యోగీశ్వరులైన, సన్యాసులైనా, సర్వసంగపరిత్యాగులైనా, పరిపూర్ణ స్థితి యైన రాజమార్గం తెలియరు, తెలియకుంటే ముక్తి లేదా యంటేలేదు.

మరియూ నూరునోములు, ఒక్కరంకుకుపోయిన సామ్యం, దక్షయాగమందు శివుణ్ణి పిలవక సమస్తమైన దేవతలను దక్షుడు పిలచితే ఏలాగున అయెనో అలాగే, నన్యబోధలనుంచి నరర్థకము.

మరియూ ప్రసాదముచే నా కలితీరునట్లు, యీ బోధచేతగాని ఎరుకనే తెరతెగదు, వజ్రాయుధము చేతపోవును. ఈ బోధ జంఝామారుతము వంటిది. దీనితో సమానమైనదిలేదు, సమానమున్నదని కలలో కొందరికి తోచును, సహవాసాయ పుణ్యా

గుణాభవంత్. సహవాసాయ దోషగుణాభవంత్, అన్నచందము, ఎంతవారి సాంగత్యము వల్లనంత వారగుదురు, గురుడెంతట వాడైతే శిష్యుడు అంతటివాడగును గురువుకు రాని విద్య శిష్యునకు యేలాగున వుపదేశించును, లేనివాడినను సరిస్తేనేమియున్నది? సన్యాసులు ఉభయులు పోట్లాడితే బూడిద బూడిద అన్న చందము, స్త్రీలు ఇద్దరు రితి చేస్తే ఏమి సౌఖ్యమున్నది శతాంధః కూపం ప్రవేశయతి అన్నట్లవును. యెటువంటి గురువైతే అటువలెనే జేసును, అగ్నియైనను ముట్టుకుంటేనే గాని కాలదు. గనుక పరిపూర్ణములో వస్తూపోతూయున్నదానిని ఎరిగితేనేగాని,దీనిని విడువడు, పాము కూసము విడిచినట్టు, యెరుకనే ఆవరణము పోవును, ఆ పైన అన్నా అన్నదిపోవును, సింహాస్వప్నవత్ అవును. నీచాశ్రయం నకర్తవ్యం కర్తవ్యం మహదాశ్రయం అని వున్నది గనుక, పరిపూర్ణుడైనగురుని చేత పరిపూర్ణమును గుర్తెరగవలె, నీచః కలహ మిచ్ఛంతి సంధి మిచ్ఛంతి : సాధన : నిచోవతఃమైన యెరుకవున్నంతసేపు, కలహమే యిచ్ఛ యిస్తూ నుండును, అహంకారమే - సాధువు అంటే, సంధియనగా బయలులో శృతి

శ్లో॥ ద్రష్టదర్శన దృశ్యానాం । విరామోయత్ర వాభవేత్ ।<br>దృష్టిస్త త్రైక కర్తవ్యం । నవాసాగ్రవలోకిని ॥

అని బయలునే కోరుతూవుంటారు, సంధియనగా, లేకపోవటమే, మరియు 96పేజీలో యెరుక ఎప్పుడూ పుట్టనేలేదు, మూడుకాలముల యందూ ఎరుకయేలా వున్నదంటే, వాయువు నీళ్ళవలె కానవచ్చినట్లు యెరుకయున్నది, యిది ధృడమైతేయే బాధాలేదు, ప్రత్యక్షమైన పరశివతత్వం తెలిస్తే తెలివిరహితం.

మరియు 100పేజీలో ఈ పరిపూర్ణ అచలగురు సూచన చేత, అడుసులో తాటిపండు నసగ త్రొక్కినట్లు, తొక్కవలెను, ఇతర భ్రమలు పోతే మృగతృష్ణలవత్, ఇది భ్రాంతిలేని బ్రహ్మ బోధ, ఇది వింటే నట్టేటిలో పుట్టిమునిగిట్టు, పరిపూర్ణములో ఎరుకమునిగిపోవును, నీళ్ళలో ఉప్పుపోసినట్టు, ఎరుకలో ఎరుక మునిగిపోవును, పరిపూర్ణమైన పరశివుడే వుండును.

**ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వే గ్రంథపూర్తినామ ఏక వింశోధ్యాయః భావ విశేషార్థములు**

**సమాప్తము**



# ★ 22 .గ్రంథ సమాప్తి. 1 ★

**292॥ ఎరుకనెరుంగని బయలులో - గురుడును - శిష్యుండువారి గొడవయునేమి - కెరిగించినవన్నియును - మీర - లేనుళ్ళక్కీ - వుళ్ళక్కితా - నెప్పాడుళ్ళక్కీ - మరియింకమాటాడమాటెలే - దాయానుసరిపాయసరిపోతె సరిపాయసరిమీర - లేనుళ్ళక్కీ - ఉళ్ళక్కితా - నెప్పుడుళ్ళక్కీ ॥ 1**

తా॥శిష్యా! ఎరుక నెరుంగని బయలులో, ఎరుకలేని అఖండమైయున్న బయలులో గురుడును శిష్యుండు వారిగొడవయు, అనగా ఎరుక మరుపులనె జీవేశ్వర్లు, వారినడనుడులు, నేను మీకెరిగించిన వన్నియు. మీరెరిగినవన్నియును, మీరలేను ఉళ్ళక్కి, అనగా అఖండ ఎరుక జీవేశ్వర్లు అన్నియు ఏమీ లేవు. మొత్తము ఏమి లేదు. మరియింక మాటాడమాటెలేదాయెను, అనగా మరియింక మాటాడుటకు మాటయేమీ లేదు గనుక సరిపాయె సరిపోతే సరిపాయెసరి. అనగా ఏమీ లేకుండా సరిపోయినది. సరిపోతే సరే యింకేమీ లేదు, అనగా ఎరుక యేమీలేకుండా సరిపుచ్చుకొనెను, అనగా అఖండ ఎరుక ఏమీ లేకయున్నది. అనగా అఖండానుభవ రహితమై ఎరుకే లేకయున్నాదని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఈ గ్రంథకర్త భాగవతులకృష్ణ ప్రభువు గ్రంథ సమాప్త మయ్యేసరికి, యెరుక ఏమీ లేకుండా పోయినట్లు, అనగా యెరుక ఉళ్ళకైనదంటే, ఎక్కడికి వెళ్ళినదంటే ఎక్కడికి వెళ్ళలేదు, యిక్కడే బయలైయున్నది, యెరుక లేదంటే, పరిపూర్ణమైయున్నదని అర్థము, అంటే శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువే మలినయెరుక అంతా పోయినతరువాత, శేషించియున్నదేదో అదే పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపము. యిందులోయే యెరుక ఎంతమాత్రములేదు, ఈ విధముగా ఎరుకను పూర్తిగా, తీసివేసి యెరుకను రహిత పర్చినారు, అనగా నేను వుళ్ళక్కి నీవు వుళ్ళక్కి అంతా వుళ్ళక్కి, అని చెప్పేవారు లేరు. వినేవారు లేరు. ఎవ్వరూ లేరు, యెరుక అసలేలేదు. అని గ్రంథకర్తగారు శుద్ధ నిర్గుణ తత్వకందార్థదర్వులు అనుగ్రంథము యిక్కడితో సమాప్తము చేసెను. అనగా ఇంత విచారణ గురు శిష్యులు ఇద్దరూ విచారించినట్లు, చెప్పియున్నారు, అనగా యింత విచారణ చేసి యెరుకను పూర్తిగా తీసివేసి రహిత పర్చినవారే, పరిపూర్ణులని, అట్టి ఉనికిగలవారే, శుద్ధ నిర్గుణులని, ఊహారహితులని, అశరీర దేశిక చక్రవర్తులని అఖండానుభవరహితులని శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువు శెలవిచ్చియున్నారు.

యిందుకు రామయోగి కందార్థం 118

కం॥ పరిపూర్ణమైన బయలులో - నెరుకే గురుశిష్య రూపు - లేర్పడి యోమో సరిసరిగా గురిగురిగా- మరిమరి వాదించి యెరుక మాటనిల్చెనుగా - నానాటికా మరుపు గెల్చెనుగా - యెరుగవలసిన బయలెరిగిన పిమ్మట - యెరుక తనువుళ్ళక్కియెను నీవుళ్ళక్కి మాటానిల్చెనుగా - నానాటికి - మరుపుగెల్చెనుగా॥

తా॥శిష్యా! అచలమైన బయలులో, శుద్ధ ఎరుకే గురుడని శిష్యుడని, రూపములేర్పడి, కడకు ఎరుక కనబడకుండా మాయమైపోయెను. తెలుసుకోవలసిన, పరిపూర్ణము నెరిగినపిమ్మట, భ్రమ రూపమైన ఎరుక శరీరము ఉళ్ళక్కే నీవు అబద్దమే నేను అబద్ధమేనని భావము.

రామయోగి కందార్థము 93

కం॥ అరమరయెరుగని శిష్యుని - పరితాపముదీర్చి - యెరుక బాపినగురుడే - గురు డౌనుగాని హీనపు - పరద్రవ్యార్జనముచేత బ్రతికే వారెంతా -గురువేషముల తిరిగేరు కొంతా - జతలు జతలుగ శిష్య తతుల గూర్చి ముందు - గతులగానక యెరుక స్థిరమతులు దెలుపుచు - బ్రతికేవారంతా - గురువేషముల తిరిగేరుకొంతా॥

తా॥శిష్యా! కపటములేని శిష్యుని యొక్క, తాపత్రయములను చల్లార్చి, యెరుకను పోగొట్టిన గురువే సద్గురువుగాని, పరద్రవ్యాపేక్ష చేత, గురువేషములు వేసుకొని, గుంపులు, గుంపులుగా, శిష్యులను గూర్చి, ముందొచ్చే చేటు తెలియక ఎరుక సంగతులు చెప్పుచు, భ్రమ కల్పించి, ద్రవ్యమును సంపాదించి, బ్రతికెడి నీచులంతా గురువులు కారని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత ద్వైతా ద్వైత రహిత పరమతత్వగ్రంధ సమాప్తినామ ద్వావింశోధ్యాయః భావ విశేషార్థములు

సంపూర్ణము



యింద్కు నాగమిల్లి గోత్రోద్భవుండును

సీతమాంబ సమేతా అబద్ధాలనే దంపతులకు పుత్రుండును

శ్రీ శ్రీ శ్రీ విమలానంద సద్గురుసార్వభౌములనే దంతులూరు జగన్నాధరాజా

వారి ప్రియ శిష్యుండును బుధజన విధేయుండుననగు

శ్రీ చిన్మయవిలక్షణ స్వామి టేకి వెంకటాచార్యులు కృత భావ విశేషార్థములు

సంపూర్ణము

జై సద్గురు ప్రభు మహరాజుకీ జైజైజై

సర్వంసద్గురు చరణారవిందార్పణమస్తు

శ్రీ సద్గురుభ్యోనమః ఓం౦ శ్రీ నిజగురుభ్యోనమః

శ్రీ సీతారామ్యాయ నమః

శ్రీ విమలానంద సద్గురు పరబ్రహ్మణేన్నమః

# క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వకందములు

**కం॥ ఈ కల కందములను విను - ఁకలనరులార మీకు వొప్పిదమైనన్ - నేకలగ**
**ను కరచించితి - యాకలమోక్షమును జెందనగు వినివినినన్ ॥ 1**

తా॥ ఓ జనులారా ఈ కలలోనేను చెప్పిన కందపద్యములను వినుడు. మీ మనస్సుకు వొప్పిదమైతె, వినండి. నేను కలగనుక ఆకలలోనుండే, అనగా యెరుకయనే కలలోనుండే, ఈ కందములు రచించుచున్నాను. వీటిని మీరు వినిన మోక్షమును పొందెదరు. అనగా యెరుకను విడిచి పెట్టెదరు అని భావము.

**విశేషార్థము :** ఓ నాయనలారా, కలయనగా జీవేశ్వర్లనే యెరుక మోక్షమనగా మేల్కొయనే బయలు. నీవు కలనే యెరుకలో ఉన్నంతకాలం బయలనే మేల్కొ నెరుగవు, గనుక గురుసేవ. గురుభక్తి - గురునిష్ట, గలిగి సేవ చేయగా, ఆయనకు, దయగలిగి, అతనికి దయవస్తే, అరనిముషమున, బోధస్థితి నీకు కుదిరించును. సిగ్గువిడిచి కొల్వు అని శెలవిచ్చియున్నారు.

**కం॥ మాటలేనట్టి బయలున - మాగలిగెననుట వినుట మాయగదయ్యా -**
**మాటమాయైతె మానెను - మాటను మాట్లాడి మనము మానుదమవలన్ ॥ 2**

తా॥ ఓ జనులారా, అంతటా నిండియున్న బయలుకు మాటలేదు, అలాగే తాను బయలైన. అచలమునకు, మాటలేదు, అట్టి బయలుకు, మాట గలిగెననుట, మాయేగదా, మాటమాయైతే అవని, ఆ మాటను విచారించి, తాను బయలైతే, మాటలేదు మరియూ ఆ బయలులోనే, తనంతట తానుగా, కలిగిన, ఈశ్వరతనువైన, యెరుక ఇంద్రియములతో కలసి, తిరుగుటవలన, జీవతనువైనది, ఆ ఈశ్వరుడు ఈ జీవుడు, మాయేగనుక, ఈ మాయైన జీవేశ్వర్లను, రహిత పర్చినప్పుడు, తాను అఖండమై, అచలమైనాడు. గనుక మాటలేదు. గనుక మాటను మాని వేసి, తానుబయలై యుంటే మాటలేదని భావము.

**విశేషార్థము :** బయలునకు మాటలేదు, యెరుక లేదు. సంకల్పము వికల్పములు లేవు. ఇతరము. ఇంకోటియేమీ లేదు, అట్టి బయలుకు. మాటకలిగినదంటే. మాయేగదా. ఈ మాయ ఆ బయలులో, తనంతటతానే వచ్చినది. గనుక ఈ మాయను. విమర్శించి చూస్తే, ఎలాగున్నదనగా, ఎండమావుల యందు నీరువలెను. స్వప్నములో, కనుపించినది. మేలుకున్న తరువాత, ఏమీలేనట్లు. మాయయేమీ లేదు. అనగా యేమీ లేని బయలులో, తనంతట తాను కల్పింపబడి. యెరుక యేర్పడి, జీవేశ్వర్లుగా,

ఈ జగత్తైనది, ఇందులోనుండి మాటలు వచ్చినవి, అనేక సంకల్ప వికల్పములు. తోచినవి, దీనిని గురుకరుణచే మేలుకొనిచూడగా, యివియేమీ లేక బయలైయున్నాడు అనగా మాటలేదు. సంకల్పములు లేవు, యెరుకే లేదు గనుక ఏమీ లేదు, తాను బయలైన దొక్కటేయున్నది అని భావము.

కం॥ **ఏ కందముకాకందమె - మాకందఫల రసరుచివి మరిపించురుచిన్ - మీ కంధములైనను విను - డీకందములన్నిన - త్కవీంద్రుల్లారా ॥ 3**

తా॥ ఓ జనులారా, ఏ కందపద్యమునకు, అకందపద్యమె, ఒకదానిని మించి, ఒకటి రుచిగా ఉన్నది. ఎలాగనగా, మామిడిపండ్లు, రసాలు, ఒకరుచి, బంగినిపిల్లి పండు ఇంకోరుచి, ఏ పండుకాపండు, రుచి తేడా, ఎలాగు కనుపించుచున్నాదో, అలాగు మాకందపద్యములు, ఒకదానిని మించి ఒకటి, రుచిగా కనుపించుచుండునని, తెలుసుకొని, మీకు బాగున్నవని, తోచితేనే, వినండి సత్‌కవులు, అనగా గొప్ప కవీశ్వరైన మీకు, నచ్చితేనే వినండి. నచ్చలేదా మానివేయండని భావము.

**విశేషార్థము :** మామిడిపండ్లు, ఎన్నోరకములు కలవు, ఒకదానిని మించి ఒకటి రుచిగా ఉండును, అలాగే మాకంధపద్యములు, ఏకందపద్యమున, కాకందపద్యమే, మంచి రుచిగా, మరిపించురుచి, ఎలాగనగా ఈ పద్యములో, రుచియని చెప్పేం. యింకో పద్యములో బయలని చెప్పేం మరో పద్యములో అచలమని చెప్పేం. యింకో పద్యములో పరిపూర్ణమని చెప్పేం. ఈలాగే ఏకంద పద్యమునకు ఆకందపద్యమే రుచి గలిగియుండునని భావము.

కం॥ **నేఛందముజదివెరుగను - నాచందంబిదియుగురుని నమ్మిరచిస్తిన్ - యీ చందపు పద్యములను - చూచందరునగక దిద్దరుడీ సుకవుల్ ॥ 4**

తా॥ ఓ జనులారా. నేను ఏ చందస్సు, జదువలేదు, నేచదివిన చందస్సు. ఏదనగా గురుని నమ్మినదే, నా చందంబిది, ఈగురువాఖ్యాన్నినమ్మి ఈ కందపద్యములురచించి తిని, యివి మీరు చూచి, సుకవులు, మీరంతా, చందస్సు, సరిపోని యెడల. నవ్వక దిద్దండి, సరిపోతే వినండి, మరియు చందవండి మీరు సుకవీంద్రులు అని భావము.

కం॥ **కథగాదుజననమరణ - వ్యథమానుటకై రచిస్తి వరకవులారా - మథియించి చూచిదిద్దుడి - పథమే మాత్రంబు దప్పిపొరకయుండన్ ॥ 5**

తా॥ ఓ జనులారా. ఇది పుల్లమ్మకథ. యల్లమ్మకథ కాదు. జననమరణమనే సంకల్ప వికల్పమను రోగమనే యధను తగ్గించుట కొరకై అనగా పునరావృత్తి రహితమై తాను బయలై యుండే స్థితిని ఈ పద్యములలో రచించితిని. ఓ శ్రేష్ఠమైన, కవులారా. విచారించి చూచి. ఏమైనా తప్పులుంటే, నవ్వకదిద్దండి సరిపోతే చదవండి. మీరు సుకవీంద్రులు అని భావము.

కం॥ తక్కువ పాండిత్యముచే - నిక్కేపండితులు మెచ్చనేరరు వీటిన్ - యెక్కువ
పాండిత్యముగల - చక్కని పండితులు మెచ్చిసరెనన్నట్లన్ ॥ 6

తా॥ ఓ శ్రేష్ఠమైన కవులారా. తక్కువపాండిత్యముచే, నిక్కేపండితులు, వీటిని చూచి, మెచ్చుకొనరు, నిజము తెలిసిన మహాత్ములే అనగా ఎక్కువ పాండిత్యము, గలిగిన, చక్కని పండితులైతే, వీటిని చూచి, మెచ్చుకొని యెదరు. మరియు సంతోషించెదరని భావము.

**విశేషార్థము :** ఈ పరిపూర్ణ భావము అందరికీ తెలియబడేదికాదు, ఎందుకనగా అన్ని మతములకన్నా అతీతమైనది, ఈ బోధగనుక, తక్కువ పాండిత్యముచే నిక్కేపండితులకు ఇదియేమీ తెలియబడేదికాదు. ఎక్కువ పాండిత్యము గలిగిన బుద్ధిమంతులైతే, సద్గురు మూర్తిని ఆశ్రయించి వారికరుణచే ఈ పరిపూర్ణ బోధ గ్రహించి, ఆచరించి పరిపూర్ణులై తరించెదరు గాని, తక్కువ పాండిత్యముచే నిక్కేపండితులు తరించలేరని భావము.

కం॥ సూరి జనులె యీ గ్రంధపు - సారముగను వారుగాని - సంసారమహా -
ఘోరవారాసి జేరిన - వారలువిని దీన్ని జూచి వచియింపుదురె ॥ 7

తా॥ ఓ జనులారా సూజ్ఞాన వంతులైన సూరిజనులే ఈ గ్రంధముయొక్క సారాంశము గ్రహించి, ఆచరించెదరు గాని సంసారమహా సముద్రములో మునిగిన అజ్ఞానులైన ఈ నరులు దీనిని అనగా ఈ పరిపూర్ణబోధను గ్రహించలేరని భావము.

కం॥ గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి - తిప్పలబడున్నతతికెపుడు దీరదువినని -
యొప్పులకుప్పగు బోధను - తప్పక నామాటనమ్మి- దగుతప్పనకన్ ॥ 8

తా॥ ఓ జనులారా, సర్వకాలములయందు గొప్పప్రతిష్ఠకు ప్రాకులాడే అజ్ఞానికి,ఈ ఒప్పుల కుప్పయైనటువంటి పరిపూర్ణ బోధను వినుటకు ఎన్నెన్నో ఆటంకములు వచ్చి వానిని ఈ పరిపూర్ణబోధ వినకుండా చేయును. తప్పక నామాటనమ్ముముఅని భావము.

**విశేషార్థము :** గొప్ప కీర్తి కావాలని, కీర్తి కోరకే, కాలమంతా ప్రజలతో, సోధి చెప్పుకుంటూ, కాలం వృధాగా, నడుచుకొనే, అజ్ఞానికి, ఈ పరిపూర్ణ బోధ, వినుటకు తీరి కుండదు, ఇట్టి కాలయాపన, చేయువాన్కి, ఈ పరిపూర్ణ బోధ, ఏమీ తెలియదని భావము.

కం॥ మెప్పైన బోధ గలనా - యప్పలు తప్పుంటె దిద్దు - డదినాకిష్టం - బిప్పగిది
కందములనే - జెప్పితి యీ కవిత జూచి శిడిముడిపడకన్ ॥ 9

తా॥ ఓ జనులారా, గొప్పదైనటువంటి, ఈ బోధ గ్రహించిన మా తండ్రులారా, మహాత్ములారా, యిందులో తప్పులుంటే, దిద్దండి, నాకిష్టమే, యిప్పుడు నేచెప్పిన కందముల కవిత్వము జూచి, మీరు కంగారుపడి, చిడిముడి పడవద్దని భావము.

**విశేషార్థము :** ఈ పరిపూర్ణ బోధ, గ్రహించిన, మా తండ్రులు, మహాత్ములైన, పెద్దలైన వారినే దిద్దమని చెప్పియున్నానే, కాని తెలియని అజ్ఞానులను, దిద్దమని చెప్పలేదు,

నేను చెప్పిన కందపద్యముల కవితము మీరు చూచి చిడిముడి పడెవారు దిద్దుటకు అర్హులుకారు, గనుక శ్రేష్ఠులైన, జ్ఞానాతీతులు, దిద్దితే అదినాకిష్టమేనని భావము.

**కం॥ ఒకసారియైన వినకన్ - వికవికనవ్వేటి కుకవివేత్తల్లారా - ప్రకటించక మీ శౌర్యం - బికదాచుటె మీకు మాకు - హితవైయెప్పున్ ॥ 10**

తా॥ ఓ కవులారా, ఒకసారియైన, ఈ పద్యములు, వినకను, పకపక నవ్వేటి, కుకవేత్త ల్లారా మీరు యిక మీ శౌర్యము దాచుకొనుటే, మీకు మాకు, హితవుగా ఉండునని భావము.

**విశేషార్థము** : ఈ పరిపూర్ణ భావము, ఒకసారియైన గ్రంథము చదవక వినక, గ్రహించనేరక, యున్నకుకవులను, ఈ పద్యములలో శ్రీ భాగవతుల, కృష్ణ ప్రభువు, బాగా చీవాట్లుపెట్టి, యున్నారు, గనుక మీయచ్ఛరాయితనము, మీయజ్ఞానము, యిక దాచుకొనుటే, మీకు మాకు, మంచిదని తెలియజేసినారని భావము.

**కం॥ స్వచ్ఛాన్వయగుచ్ఛములని - పృచ్ఛయొనర్చెదరు కవులు పృదుయశులారా - యిచ్ఛజనించిన జదువుడి - యచ్ఛాపద్యంబులివ్వియాసాంతముగాన్ ॥ 11**

తా॥ ఓ జనులారా, స్వచ్ఛమైనటువంటి, మంచి పద్యములని, తలంచెదరు సుకవులైన మీరు గొప్ప ఖ్యాతి, పొందిన మహాత్ములు, మీకు చదువవలెనని, యిచ్ఛ జనించిన యడల అనగా ఈ కందపద్యములు చదువవలెనని కుతూహలము, ఉంటే చదవండి, ఈ గొప్ప పద్యములను, మొదటినుండి, చివరివరకని భావము.

**కం॥ తక్కిన బోధవలెనిది - చిక్కులుగల బోధగాదు చేబట్టదగున్ - మక్కువతో మీమునుపటి - చిక్కులబోధలను చూర్ణజెక్కిముదమునన్ ॥ 12**

తా॥ ఓ జనులారా, ఇతరమతములలో, చెప్పిన బోధవలె యిది బీరకాయపీచు లాంటి, చిక్కులుగల బోధకాదు, దీనిని మీరు అభ్యసించవలయును, అలా అభ్యసించితే, మీకు మునుపున్న చిక్కుల బోధలన్నీ నలిపివేసి, ఒక ప్రక్కనపెట్టి, మిమ్ములను పరిపూర్ణులను చేసి పరమసుఖమును, గలిగింప జేయునని భావము.

**విశేషార్థము** : ఇతర మతములవారు, అనేక చిక్కులతో కూడిన బోధలు చెప్పేవారు, అనగా యోగాభ్యాసములు, ముద్ర భావములు ద్వైత అద్వైత విశిష్టాద్వైతములచే, అనేక రకములైన, ఎన్నో తీరులు, చెప్పెదరు, ఈ బోధకు, ఒకే మార్గము, అనగా ఏ చిక్కులు, లేని రాజమార్గం అంటే ఈ చిక్కులుగల బోధలన్నింటికీ, అతీతమైన, పరిపూర్ణ బోధ అనగా ఈ బోధలన్నీ, యెరుకలోనివే, అనగా అఖండ ఎరుక, వరకే మీ మతములవారు చెప్పేవన్నియు ఈ పరిపూర్ణ బోధ, ఎలాగనగా ఇట్టి యెరుకను, యేమీలేకుండా, చేస్తే, ఆశేషించియున్నదే, పరిపూర్ణమని, చెప్పే అతీతమార్గం, అనగా పరిపూర్ణమొకటి, లేనెరుకనే రెండాకటి, ఈ రెంట్నీ యెరిగి, యెరుకను, తీసివేయుటే, గురుబోధ అనగా యెరుకను, యేమీ లేకుండా, తీసివేసితే, ఉన్నది పరిపూర్ణమని చెప్పే బోధ యిదియని భావము.

కం॥ సకల కార్యప్రయత్న - జనకమ్ముగువస్తువమబట్టినలచినైచుదీ - న్నొకసారి వినిన
చదివిన - నికనింతకుయెక్కువైన వేబోధలయా ॥ 13

తా॥ ఓ జనులారా, సకల కార్యములకు, మూలమైన వస్తువును, బట్టి నలిపి వైచును, అనగా 25వది అయిన యెరుకను, పట్టి విచారించిన, ఏమీ లేకుండా, చేయును, దీన్ని ఒకసారి వినిన, చదివిన, సమస్తము తెలియబడును, యిక యింతకంటే ఎక్కువైనటువంటి బోధలు ఏమీ లేవు, దీనికి తక్కువైనవే, దీనికి క్రిందివేనని భావము.

**విశేషార్థము :** సమస్త సృష్టికి, కారణమైనది, అఖండ ఎరుక, ఈ ఎరుకవలననే, సమస్త లోకములు, కల్పించబడినవి, అట్టి అఖండ ఎరుకను, విచారించి ఏమీలేక, ఉండేలాగు చేయును ఈ పరిపూర్ణ బోధ. యింతకన్నా ఎక్కువైన, బోధలేమున్నవి. యే బోధలు లేవు గనుక దీన్ని ఒక్కసారి, వినిన, చదివిన, చాలును, సమస్తము తెలియబడియెరుకను ఏమీ లేకుండా, ఉండేలాగు ఈ బోధ చేయునని మీరంతా గ్రహించవలెనని భావము.

కం॥ కేరుచుమీమువినుమనినే - సారెకు మీ చుట్టుదిరిగి సన్నుతుజేసె - తోరపు
బోధకు మూలం - బైరెవ్వరోవార్ని దలచి వరుసనుతింతున్ ॥ 14

తా॥ ఓ జనులారా, సంతోషముగా, కేకలు వేయుచు, మీ చుట్టూ, తిరిగి మీరు వినండని నేను పదే పదే, చదువుచు, మిమ్మందరని ఏకము చేసిని దెందుకనగా, దీన్నితోరముగా ఒకదాని తరువాత ఒకటి, బోధించుట, కొరకు ఐతే ఈ బోధకు మూలకారణమైవున్న శివరామదీక్షితులవారి గురువులైన శ్రీ ధరస్వామి, గురుపరం పరమును వరుసగా పెద్దలను నుతించెదనని భావము.

కం॥ ఈ క్షితి శివరామాహ్వాయు - దీక్షితులకు - బోధజేసి దిద్దిన సామ్యా - దక్షుని
శ్రీధరమూర్తిని - నిక్షేపముగా దలంచినే వినుతింతున్ ॥ 15

తా॥ ఓ జనులారా - ఈ ప్రపంచములో, పరిపూర్ణ బోధ, బాగా విచారించి, వృద్ధిచేసిన, శ్రీ శివరామ, దీక్షితులవారికి బోధచేసి వారిని తీర్చిదిద్దిన మహాత్ములైన శ్రీ ధరస్వాములవారిని, నేను సంతోషముగా, తలంచుచు ప్రార్థించుచు, నమస్కరించితినని భావము.

కం॥ దక్షిణామూర్తియనదగు - నీక్షితి శివరామనామదీక్షితులనుచున్ - వీక్షింతు
రార్యులతని క - పేక్షను దండములు బెట్టి ప్రేమనుతింతున్ ॥ 16

తా॥ ఓ జనులారా, దక్షిణామూర్తియనదగు శ్రీ శివరామదీక్షితులను, నామము గని, మహాపెద్దలంతా, వానిని పొగడుచు ఎంతో ప్రేమతోనుతింతురు, వారికి నేను నమస్కరింపుచూ, ఎంతో ఆప్యాయముగా పూజించెదనని భావము.

కం॥ ఆ దీక్షితులకృపకుదా - పాత్రైయ్యప్పయ్యమంత్రి పఠియింఛెను యీ - మేదిని
తద్బోధన తని - పాదములకు -నతులొనర్చి ప్రార్థింతుమదిన్ ॥ 17

తా॥ ఓ జనులారా ఆ శివరామ దీక్షితులవారి కృపకు తాను పాత్రుడైన, అప్పయ్య మంత్రివర్యులు, వారు చెప్పిన బోధను, స్తుతియించి, ఈ మేదినిలో, పరిపూర్ణులైనవారి, పాదములకు, ద్వాదశి నమస్కారములుచేసి ఈ విధముగా ప్రార్థించుచున్నానని భావము.

కం॥ నతిజేసెదనప్పయ్యన్ - గతికైకొల్చతడు బోధగనెనోనేనా - ప్రతిలేని
పరశురామ - క్షితిసురవంశమణియైన సీతాపతికిన్ ॥ 18

తా॥ ఓ జనులారా స్తుతి జేసెదను. అప్పయ్యమంత్రి వర్యుల వారిని, అనగా ఓ ప్రభోయని. ప్రార్థించి, యే బోధ గనెనో, అదే విధంగా,.ప్రతిలేని బట్టబయలైయ్యే స్థితిని తాను పొందే గురుబోధను, గనిన పరశురామ, సీతారామస్వామికి, నేను మ్రొక్కెద వారికి అని భావము.

కం॥ బుచ్చి వెంకమ్మతల్లిని - చెచ్చెరపెండ్లాడి కాశి సేతువుదాకన్ - విచ్చలవిడి
యొగజల్లెను - సచ్చరితుల కచలబోధ సాకల్యముగాన్ ॥ 19

తా॥ ఓ జనులారా, పరశురామ సీతారామ స్వాముల వారు బుచ్చివెంకమ్మతల్లిని పెండ్లి చేసుకొని, కాశీ సేతువుదాకా,ఈ అచలబోధను, విచ్చలవిడిగా, దేశమంతటా, యగజల్లెను, సత్ప్రవర్తన గలిగిన వారికి, ఈ పరిపూర్ణ బోధను, సులభముగా తెలిసేలాగు చెప్పెనని భావము.

కం॥ ఆ సీతాపతినతివి - శ్వాసమునంగొల్చికొంటి సర్వేశ్వరుడం - చీ సద్బోధను
తేటగ - జేసితిని వినకలజనులు - చెవియొగ్గివినన్ ॥ 20

తా॥ ఓ జనులారా పశురామ సీతారామస్వామిని, నేను అతి విశ్వాసముతో కొల్చుకొంటిని, సర్వేశ్వరుడనుచు ఈ సద్బోదను, తెలుసుకొంటిని, యీవి మీరు తెలుసుకొనుటకు, తేటతెల్లముగా, తెలిసేలాగును ఈ పద్యరూపముగా తెలియజేసితి, కావున సర్వజనులు శ్రద్ధగా చెవి యొగ్గి వినవలెనని భావము.

కం॥ భాగవత వంశభవుడను - భగవతోత్తముల పాదపద్మంబులకున్ - సాగిలి
మ్రొక్కేవాడను - బాగుగనను జనులు కృష్ణ భట్లందురిలన్ ॥ 21

తా॥ ఓ జనులారా నేను భాగవత వంశములో పుట్టిన వాడను భాగవత వంశములోని ఉత్తముల పాద పద్మములకు సాగిలి మ్రొక్కేవాడను బాగుగ నన్ను ప్రజలు కృష్ణభట్లు అందును అని భావము.

**విశేషార్థము :** ఈ పద్యములు రచించిన గ్రంధకర్త తన పేరుతాను చెప్పగూడదు గనుక ప్రజలు అన్నట్లుగా చెప్పినారు నేను భాగవతోత్తములనగా భక్తి జ్ఞాన వైరాగ్య తత్వ విచారణ చేసి ద్వైతా ద్వైత విశిష్టాద్వైత మహాద్వైతములు విచారించిన పరిపూర్ణులైన భాగవతోత్తములకు సాగిలి మ్రొక్కే వాడనని ఈ ప్రజలు నన్ను కృష్ణబట్టు అని పిలుతురు, అంటే అటువంటి. మహనీయుడు, కూడా భాగవతోత్తములకు సాష్టాంగ నమస్కారములు, చేసినారంటే, ఎంత అనహంకారులో మనందరికి. స్పష్టమగుచున్నది, గనుక మన అహంకారము తగ్గించుకొనుట. మంచిదని భావము.

కం॥ **ధారుణ్యత్ర్యనసూయలు - వీరేయని జనులు బొగడ వెలసిన వారల్ - నారాయణ జానకియను - వారిరువురుగన్నయట్టి వాడనుసుమ్మీ ॥ 22**

తా॥ ఓ జనులారా! అత్రి మహాఋషి, అనసూయలు వీరివలెయని ప్రజలు పొగడే నారాయణ, జానకియను వారిరువురు కన్నవాడను నేను అని భావము.

కం॥ **ఆనేనొనర్చినాడను - యీని జకందముల గ్రంథమెప్పుడు దీనన్ - వీనులవివికన్నులగని - రేనట్టిజనంబుబల్కునేనే - ననుచున్ ॥ 23**

తా॥ ఓ జనులారా ఆపైన చెప్పిన విధముగా కృష్ణబట్టు అను నేను వ్రాసిన వాడను, ఈ నిజకందమ్ములు, ఈ గ్రంథము, ఎప్పుడు దీనిని మరువకుండా, చదివిన, వినిన, అట్టి జనులు నేననే, అహంకారముతో పలుకుదురురా నేను బ్రహ్మనని పల్కగలరా, పల్కలేరు అని భావము.

**విశేషార్థము :** పైన చెప్పిన, కృష్ణబట్టు అనునేను ఈ నిజ కందములు వ్రాసితిని, యిందులో ఈ గ్రంథములో, యున్న విశేషమేమనగా, నేనే బ్రహ్మను అనే నేనును, రహితము చేసి, అనగా ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి తత్వమసిబ్రహ్మ, అయిమాత్మాబ్రహ్మ , అని వేదములు, చెప్పెను, అనగా నేను అనగా ఆత్మ యిదే ప్రజ్ఞానం బ్రహ్మ, అనగా నేననేదే అహం ఈ యహమే బ్రహ్మమని చెప్పినవి. అనగా ఈ యాత్మయనే, యెరుకే, బ్రహ్మమని, వేదములు, చెప్పినవి, గనుక ఈ నేననే, అహమనే యెరుకను రహితముచేసి, ఆత్మాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును, యెరిగి. గని ఈ రెంట్లో దేన్నీ ఎరుగకను. ఉనికి గలిగినట్ట, అనగా అహమనే యెరుకను, యెరుగక, దీనికతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును, యెరిగి అంటే, ఈ రెంటినీ. విడిచిపెట్టి అనగా ఈ రెంటినీ యెరుగని ఉనికిలో ఉన్నప్పుడు, ఈ అహమనే ఎరుకను యెరుగడని భావము.

కం॥ **చిల్లర బోధలనన్నిటి - నొల్లరునిజ బోధ దెలసియొప్పెటి పెద్దల్ - పొల్లనియందు కెనేనవి - వల్లక యీ బోధయందె వర్తిస్తి జుమీ ॥ 24**

తా॥ ఓ జనులారా పరిపూర్ణ బోధలో ఉత్తీర్ణులైన. ఆపథాతీతులు, మిగతా చిల్లర

బోధలన్నీ, విడిచిపెట్టి, పరిపూర్ణ బోధయందే, యుంటూ. నేను కుడా, పరిపూర్ణ బోధయందే. వర్తించితినని. భావము.

కం॥ **గురు శిష్యుల మాటలవలె - పరిపూర్ణపు బోధకంద పద్య ఫణితిచే - విరచిస్తి**
**వినుడి ముందర - జరిగేముచ్చట్లు మీకు సహ్యంబైనన్ ॥ 25**

తా॥ ఓ జనులారా! గురుశిష్యులు, విచిరించినట్లు. ఈ పరిపూర్ణ బోధను, కందపద్య, రూపములో, రచించితిని. వినండి. ముందర జరిగే. ముచ్చట్లు, మీకు. అర్థమై నచ్చినట్లయితే అని భావము.

కం॥ **సకలనిగమాగమాది - ప్రకరమహానారి కేళఫలసారముదీ - సొక గ్రంధము జేసితి**
**లొ - కిక జనులొక వేళ గొన్నకీడు దొలంగున్ ॥ 26**

తా॥ ఓ జనులారా! వేదములు. ఉపనిషత్తులు. మొదలగు, సకల శాస్త్రములతో. కూడియున్న, అనేక గ్రంధములలో. సారాంశమును, దీసి, ఒక గ్రంధము, జేసితిని. సంసారములో. మునిగియున్న, సామాన్య జనులు. ఈ గ్రంధము, చదివిన, వినిన, వారికి మునపున్న కీడు. పూర్తిగా పోయి జ్ఞానము లభించును. అని భావము.

**విశేషార్థము** : కొబ్బరి కాయలో. ఉన్న గుంజులో. బెల్లంకలిపి, బుజించిన యెడల ఎంతరుచిగా. యుండునో. అలాగు, సకలశాస్త్రములలో. యున్న సారాంశము. తీసి అట్టి రుచి కలిగే లాగు. ఈ కందపద్యములలో యిమిడ్చి, ఒక గ్రంధము. రచియించి తిని, ఇట్టి ఫలసారమున్న. ఈ గ్రంధము. చచ్చుచు, పుట్టుచు, సంకల్ప, వికల్పములు. పొందుచు. అనేక వికారములు పొందుచున్న సామాన్యప్రజలు. ఈ గ్రంధము చూచి. చదివిన, వినిన. వారికి, మునుపున్న సంకల్ప. వికల్పములు. వగైరాలన్నీ, పూర్తిగా తొలగిపోయి, అఖండ జ్ఞానము, కలుగును అని భావము.

కం॥ **తనకూదా వచ్చిసద్బో - ధను దెల్పుమటంచు మ్రొక్కు తన శిష్యునకున్ -**
**వినజెప్పదొణగె నొకగురు - డను మానించకను వాని కతిదయతోడన్ ॥ 27**

తా॥ ఓ జనులారా! తనంతట. తాను వచ్చిన. శిష్యుడు, తన పుణ్యోదయమున, సద్గురు మూర్తిని. గాంచి. సాష్టాంగ. ద్వాదశ. నమస్కారములు, చేసి ఈ సద్బోధను. దెల్పుమనిన, తన శిష్యునకు. వినుమని అతనిని. అనుమానించక, వానికి. అతిదయతో. ఒక గురువు. వినజెప్పచుండెను. అని భావము.

**విశేషార్థము** : శిష్యుడు. ఈ విద్య. అభ్యసించ వలెనని. కోరిక. విశేషము. — కలిగియున్నవాడు, తనంతటతాను, గురువును. వెదకి, తెలుకొని. ఆ సద్గురు. మూర్తిని, ద్వాదశ. నమస్కారములు. జేసి, ఆర్యా! ఈ పరమ ధర్మము నాకుపదేశించుమని. కోరిన శిష్యునకు, ఆ గరుమూర్తి చెప్పవలయునే కాని. శిష్యులు, కావలెనని. శిష్యుని ఇంటికి వెళ్ళి ఈ బోధ నేర్చుకోమని చెప్పిన గురువు సద్గురువు కాదని భావము.

 

కం॥ పరమపురుషుడును లేనిది-యెరుకయుగల దరసిలేని యెరుకను విడుమం-
చెరిగించిన శిష్యుడు గురు-వరునడిగెను మ్రొక్కిరెంటి వర్తనలపుడున్ ॥ 28

తా॥ శిష్యా పరమపురుషుడు ఒకడున్నాడు లేని యెరుక ఒకటి యున్నది ఈ రెంటిని నీవెరిగి విచారించి లేని యెరుకను విడిచి పెట్టుమని చెప్పిన గురువు గార్కి శిష్యుడు నమస్కరించి పరమ పురుషుడు ఎలాంటి వాడో లేని యెరుక ఎలింటిదో తెలియజేయుము ప్రభోయని అడిగెనని భావము.

విశేషార్థము : పరమపురుషుడు అంటే అఖండ యెరుక యిది సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణము యిది జీవేశ్వర్లకు అతీతమైనది యిదే అచలము అనగా చలనముతోయున్న జీవగుణములు నశించవలెను ఏకమైయున్న ఈశ్వరతత్వం నశించవలెను ఈ రెండూ నశించిన వారికి పరమ పురుషుడనగా కదిలకలేని అచల మంటే ఏమిటో తెలియును అంతేకాని వాచార్థముగా పరమ పురుషుడే పరిపూర్ణం అని అనుకొనేవారికి యిది యేమి తెలిసేది కాదు. యిక లేనేరుకయంటే 24 ఇంద్రియములకు విలక్షణమైన దానిని మరచి ఇంద్రియములతో తిరుగునదే జీవతనువు 25వదైన తశ్వరతనువే లేనెరుక ఈ రెండూ ఒక్కటే ఇదే లేనెరుక అండే మాయలేందే నని అర్థము అని భావము.

కం॥ పరమ పురుషుడనెవ్వడో యెరుకెట్టిదో తెల్పియవలయెరుక ను విడిచే- తెరువెట్టిదొ యిన్నియునా-కెరిగించు మటంచు బల్కనిట్లనెరుగురుడున్ ॥ 29

తా॥శిష్యా! గురుదేవా సద్గురు ప్రభో పరమ పురుషుడనగా ఎవరో యెరుకనగా ఎటువంటిదో ఈ రెంటిని ఎరిగించి ఆతరువాత యెరుకను ఏ విధముగా విడిచి పెట్ట వలయునో ఈ విషయములు అన్నినాకెరిగించు మని శిష్యుడు ప్రార్థించగా గురుదేవులు ఆలాగేనని చెప్పియున్నారు అని భావము.

కం॥ నే పెద్దలచే విన్నది - నీపై దయబుట్టి చెప్పనేబూని తినీ - కాపద్ధతి నం - తయువిని - యే పద్ధతికాశపడకు - మిదిమరువకు మీ ॥ 30

తా॥శిష్యా! నేను పెద్దలవలన విన్నది నీమీద దయగలిగి నేను చెప్పటకు పూనుకున్నాను నీవా పద్ధతి నంతయు విని అనగా ఈ బోధనంతయు విని యితర బోధలకు ఆశపడకుము ఈ బోధ మరవకుము అని భావము

కం॥ కదలడట పరమపురుషుడు - కదిలిక మాయయట ఇట్టి కదిలిక కేదో - మొదలన పెద్దలు పల్కిరి - కదలనిదే కలదు లేదు కదిలిక యనుచున్ ॥ 31

తా॥శిష్యా! పరమ పురుషుడు అచలం కదలదు కదిలేది మాయయనేలేనెరుక ఈ కదిలే దానికి మొదలు ఏదో యని పెద్దలు అనిరి కదలనిదే ఉన్నది కదిలేది లేనిదే గనుక అచలమునకు కదలికలేదు. కదిలేది మాయ, లేనిది కదలనిదే ఉన్నదని భావము.

**విశేషార్థము** : పరమపురుషుడు ఈఖండయెరుక యిదిగురుకరుణ వలన కదలిక లేనిదైయున్నది యిదే శుద్ధ యెరుక యిందులోనే మలిన యెరుక తోచినది యిదే ఈశ్వరతనువు యిందులో మరుపను జగత్తు తోచినది ఇదే జీవుడు ఈ యెరుక మూడు విధములుగా యున్నది ఈ మూడే క్షరము అక్షరము పరమపురుషుడు ఈ పరమపురుషునకు మూలములేదు కానీ ఈ పరమపురుషునిలోనే ఈశ్వరుడనే యక్షరం కలిగినది ఈ యక్షరంలోనే క్షరమునే జీవుడు కలిగెను అనగా తాడు యందు పాముతో చినట్లు బంగారమే వస్తువులైనట్లె సముద్రమేకెరటములైనట్లు ఇలాగే తొండ ముదిరి ఊసరివెల్లైనట్లు నక్కముదిరి వరడైనట్లు ద్వాదశే సోడశియైనది షోడశే ద్వాదశియైనది ఇట్లు ఒకదానికొకటి మూలమైయున్నది యిది వాచార్థపరులకు తెలియదుయని తెలియవలెను మరియూ ఈ అఖండాను భవరహితమైనప్పుడుయే మాయలు యే యెరుక యేమి లేవు అనగా ఊహారహితమైన పరిపూర్ణ పరమ శివుడైనప్పుడూ యేమి లేవని భావము.

కం॥ పురుగుక్కు స్తంభమును - కొరకినదనవీతి హో - త్రుగొని మ్రింగె చదల్ -
ధరననినను మాయసతి-హరినిచికాకుగయొనర్చినవినదగునే ॥ 32

తా॥శిష్యా! పురుగు ఉక్కుస్థంబమును కొరికినదా కొరకలేదు అగ్ని హోత్రునకు చదలు పట్టినావా పట్టలేవు ఈ ధరలో మాయ పరిపూర్ణమును వికారము కలిగించిన దంటే వినదగునా వినగూడదని భావము.

**విశేషార్థము** : పరిపూర్ణం రెండు విధములు అఖండ సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణం యిది శుద్ధ యెరుక రెండవది ఈ అఖండ స్వరూపమైన యెరుక రహితమైన పరిపూర్ణం రెండవది ఈ పరిపూర్ణములో మాయలేదు గనుక దీనిని వికారముకలిగించలేదు అఖండమైన పరిపూర్ణములో మాయ ఉన్నది గనుక వికారము కలిగించగలదు అఖండానుభవరహితమైన పరిపూర్ణమును ఏ వికారములు కలిగించలేవని భావము.

కం॥ హరియందుదోచు విశ్వము-నరస్వప్నమువంటి దనిరి నానాజనముల్ - సుర
స్వప్నము వంటిదియనె - స్థిరమతి శివరామ నామ దీక్షితులు ధరన్ ॥ 33

తా॥శిష్యా! పరిపూర్ణములో తోచిన యెరుకనే స్వప్నమును నరులకు తోచిన స్వప్నము వంటిదేయని నానా ప్రజలు ఇతరమతములు వారలు అన్నారు శ్రీ శివరామదీక్షితుల వారు సురస్వప్నము వంటిది అని అన్నారు దేవతలకు స్వప్నములేదని భావము.

**విశేషార్థము :** అఖండాను భవరహితమైన పరిపూర్ణములో మాయ ఒకప్పుడూ లేదు ఒకప్పుడుతోచినా అది పరిపూర్ణమేగాని యెరుక యెంతమాత్రం కాదు యెరుక ఉన్నదంటే అది పరిపూర్ణం కాదు యెరుకే యలాగనగా ఉన్నదంతా సముద్రమే అని నిశ్చయించిన వారికి కెరటములు కనిపించవు అంతా బంగారమే అని నిశ్చయించిన వాడు వస్తువును చూడడు ఆలాగే పరిపూర్ణమైయున్నవాడికి చూపలేదు గనుక యెరుకను చూడనే చూడడు అని భావము.

కం॥ **సురలందుదోచు స్వప్నము - హరియందునదోచు విశ్వ మాసులహరిన్-యెరిగిన**
**కల విశ్వముతా - మరుగవెతమ లేమి నెరిగి యతిబిడియమునన్ ॥ 34**

తా॥శిష్యా! సురలందుదోచు స్వప్నము హరియందు విశ్వములేదు అనియెరిగిన తమ లేమి తాము ఎరిగి తామే లేక పోవునని భావము.

**విశేషార్థము :** దేవతలకు స్వప్నములేదు అని, పరిపూర్ణములో ఎరుకలేదని ఎరిగి తాను పరిపూర్ణమైతే కలయెరుకలు రెండూ లేకపోవునని భావము.

కం॥ **కదలనిదికగలదెన్నడు - కదిలికగల దనిన దాని కగుపడదు మొదల్**
**కదిలికలేదదిగావున - యిది పరమ రహస్యమెవ్వరెరుగరుదీనిన్ ॥ 35**

తా॥శిష్యా! అచల పరిపూర్ణమునకు చలనములేదు అట్టి అచలపరిపూర్ణములో ఒకప్పుడూ యెరుకతోచి చలించినదంటే ఆ ఎరుకను విచారించి చూడగా దానికి మొదలేలేదు గాన అచలమై-పరిపూర్ణమై యున్నదానికి ఒకప్పుడూ కదిలిక లేదని అది శాశ్వితమై ఒకే తీరుగా ఉన్నదని ఎరిగిన వారు లేరు యిది పరమ రహస్యము ఎవ్వరూ ఎరుగరని భావము.

**విశేషార్థము :** శిష్యా మనకు ఎదురుగా ఉన్న బయలుకు లోపలా వెలుపలా వున్నబయలుకు కదలికలేదు ఆ బయలు వలె మనము బయలైయుంటే మనకు కదలికలేదు ఈలాగున ఉండాలంటే గురుకరుణ కావలయును ఎందుకనగా ఇది పరమ రహశ్యమైనది ఈ రహస్యము ఒక సద్గురువుకు తప్ప మిగతావాచార్థ పరులు ఎవ్వరు ఎరుగరు అనగా వాచార్థపరులైన గురువులు గాని శిష్యులుగాని ఇతర మతస్తులుగాని ఎవ్వరూ ఎరుగరు యిది గుహ్యోద్గుహ్యం అనగా గుహ్యమంటేనే తెలియదని అర్థము గుహ్యోద్గుహ్యం అంటే అసలే తెలియదని అర్థమని భావము.

కం॥ **కదలనిది కదిలెనన్నను -ముదమున వినదగదు వారి ముచ్చట నెపుడున్ కదిలిన**
**కదలని దెట్లగు-నది గావున కదలదనుచు నమ్మదగుజుమీ ॥ 36**

తా॥శిష్యా! కదలనిది కదిలినదంటే వారు చెప్పే బోధ శుద్ధ అబద్ధము అందువల్ల వారు చెప్పే అబద్ధబోధ ఎవ్వరూ వినగూడదు మరియూ కదిలినది కదలని దెట్లగును

అవుతాది సద్గురుమూర్తి కరుణ ఉండే అందరూ సద్గురువులు కారు కొందరే, అట్టి సద్గురుని కరుణ ఉంటే కలదనుచునమ్మదగును అని భావము.

**విశేషార్థము :** శిష్యా! శాస్త్ర జ్ఞానం బహుక్లేశం బుద్ధే చెలనకారణం గనుక శాస్త్ర జ్ఞానం పనికిరాదు ఈ రహస్యం శాస్త్రాలకు తెలియబడేది కాదు గురుసూచన వల్ల అది తెలియబడుచున్నది అందువల్ల మనకు ఎదురుగా ఉన్న బయలుకు లోపల వెలుపల నిండియున్న పరబయలు అనగా పరిపూర్ణ పరాకాశము వలె మనముంటే అనగా గురుకరుణ వల్ల మనం కూడా వుండగలుగుతాము అందువల్ల మనం గురుసూచన ద్వారా విచారించి మనం పరిపూర్ణ పరాకాశమైతే కదలకుండా ఉండగలుగుతామని భావము. యిందుకు వేమనార్యులవారు ఈ విధముగా శెలవిచ్చియున్నారు.

కం ॥ బయలందు పుట్టు స్వరం ।
బయలందే లియ్యమౌను బ్రహ్మాండంబుల్ ।
బయలే తానని తెలిసిన ।
బయలందే ముక్తి బట్ట బయలగువేమా ॥

కం॥ **నినుమేనును ప్రకృతిద్వయ - మనినిను నీమేను మృషనిమానిరి నీజో - లిని పెద్దలు నీవెరుగక- నిను నీవొక కొండనవెనిజమా మాట ॥ 37**

తా॥శిష్యా! నేను మేనులను ప్రకృతి పురుషులని ఈ ద్వంద్వముగా నున్న నిన్ను నీమేనును లేనివని నిన్ను వదులుకున్నారు పెద్దలు అదినీవెరుగక నిన్ను నీవు ఒక కొండ ననుకుంటే నిజమౌనా ఆ మాట అని భావము.

**విశేషార్థము :** శిష్యా! ప్రకృతి పురుషులు నేనుమేనులు యివినీస్వరూపం ఇవి మాయలే యని వీటిని పెద్దలు ఇడిచిపెట్టిరి ఇది నీవెరుగక అనగా నీవు నీమేను లేనేలేవని వీటిని విడిచి పెట్టి దీనికి అతీతమైన పరిపూర్ణమై యున్నారు పెద్దలు ఈ రహస్యం నీవెరుగక అనగా నీవు పరిపూర్ణమైయుండుట ఎరుగక నీవే ఒక కొండననుకొనుచున్నావు నీవలెనే విచారించలేని వాచార్ధ పరులనుకొనుచున్నారని భావము.

కం॥ **పేరచలమనుచు బయలని -పేరెప్పుడు లేని మనము బెట్టుట చేతన్-పేరాయ బయలుకిప్పుడు- పోరానివు నేను మృషనిపోతే జాలున్ ॥ 38**

తా॥శిష్యా! పేరు ఎప్పుడూ లేనిదానికి మనము పేరు పెట్టినాము బయలని అచలమని. పేరాయెను బయలని యిప్పుడు. అంటున్నారు గనుక నీవు నేను పోతే ఉన్నది ఆ బయలేనని భావము.

**విశేషార్థము :** శిష్యా! పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఎప్పుడూ పేరులేదు ఎందుచేతననగా దానికి నామము లేదు రూపము లేదు క్రియలు ఏమి లేవు నామ-రూప - క్రియా రహితమైన

బయలునకు ఏమిలేవు అట్టి బయలుకు మనము బయలని పేరు పెట్టి నాము గనుక నీవని నేననే యెరుక లేకపోతే ఉన్నది బయలేనని నీ వెరిగి నీవు బయలైయుండే యెరుక యేమీ లేదని భావము.

కం॥ పరమపురుషుడీ బయలని-గురుడెరిగించినను జూచి గొప్పకు రుచలై-యెరిగెటి
నిను నేమృషనని -యెరిగరుగుము నీవె మాయవిక బుట్టవిలన్ ॥ 39

తా॥శిష్యా! పరమపురుషుడు యీ బయలని అంటే నీవు బయలైనదే పరమ పురుషుడని గురుమూర్తి సూచనచేసి చూపించగా ఆ శిష్యుడు ఆ సూచన గ్రహించి చూడగా తానే బయలైయున్నాడు అప్పుడు తన గొప్పంతా పోయి నేనుమేనులు లేకపోయెను అప్పుడు శిష్యుడు యిది అంతా ఎరిగి మేను నేను లేనివని ఉన్నది బయలేనని భావము.

విశేషార్థము : పరమ పురుషుడునగా తాను బయలైన అచలమే పరమ పురుషుడు అనగా తాను పరమై అచలమై నిర్గుణమై నిరాకారమై తనలో ఏమీ లేక ఉత్తదై బయలై అఖండ పరిపూర్ణమై యున్నదే పరమ పురుషుడు మలిన యెరుక నేను మేనులు యేమి లేవని గురుమూర్తి సూచన జేసి చూపించగా తాను గ్రహించి తాను లేక యున్నదే పరమ పురుషుడని భావము.

కం॥ అయమాత్మయనిసరీతిగ-నయముగ యీ బట్టబయలు నదుగోయనుటల్ -అయ
మియమని - యనుటుళ్ళ - క్కి యయిననవలసె నీదుకీడుడుగుటకై ॥ 40

తా॥శిష్యా! నీ యాత్మ బయలైనదే బట్ట బయలని సూచన ద్వారా చూపించిన ఆ శిష్యుడు చూచి తాను బయలైయున్నది గ్రహించి ఆత్మానాత్మలు లేనివని ఎరిగెను. ఆత్మానాత్మలు లేనివని గురువుగారు చెప్పి యిట్లు విచారించుమని చెప్పవలసి వచ్చెను నీ కీడు పావుటకు నీకు తెలియుటకు అని భావము.

విశేషార్థము : శిష్యా! నీ యాత్మ బయలైనదే బట్ట బయలు నిజము యిది యధార్థము నీకు ఎదురుగా వున్న బయలును చూడుము ఆ బయలు యలాగున్నదో నీవు కూడా ఆలా ఉండాలి అనగా నీవు బయలై ఆ బయలు వలె నీవు వుండవలెను అప్పుడు ఆత్మానాత్మలు రహితమై యుంటాయి అనగా నీకీడు నీ ఎరుక పావుటకు నీవెల్లప్పుడూ విచారణ చేయుచునే యుండవలెను ఆలా చేయుట వలన నీ యాత్మానాత్మలనే యెరుక రహితమై నీవు బట్ట బయలై యుంటావని భావము.

కం॥ లేని నేనీవు లేని - స్థానంబును కారణంబు సర్వమునరధి - స్థానంబు సాక్షి
సత్య - జ్ఞానా నందంబులనిన సత్యములగునే ॥ 41

తా॥శిష్యా! నేనునీవు లేని స్థానము యేది కలదో అదే సమస్తానికి కారణము మరియు సర్వమునకు అధిష్టానమైనదే సాక్షి యిదే సత్య జ్ఞానానంద స్వరూపమైన యెరుక యిది సత్యమా ? సత్యముకాదని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేను నీవు లేని స్థానము యేది కలదో అది అఖండ స్వరూనమైన బ్రహ్మము యిది సమస్తానికి కారణమై సాక్షీ భూతమై సత్య జ్ఞానానంద స్వరూపమై అనగా సచ్చిదానంద స్వరూపమైన అఖండ యెరుక యిది పరిపూర్ణమైయున్న యెరుక ఈ ఎరుకను విడిపించినవారే సద్గురువులు ఈ ఎరుకలేక యున్నదే అఖండాను భవరహితమైన పరిపూర్ణ పరబ్రహ్మమని భావము.

**కం॥ అట్టిది యిట్టిదియనరా - నట్టిది బయలనుచు దెలసియా మీదట నీ - వట్టిది**
**యిట్టిది యనరా - నట్టిది బయలనిన దాని నరయకు మెపుడున్ ॥ 42**

తా॥శిష్యా! అట్టిది యిట్టిది యని యనుటకు వీలులేనిది బయలని తెలిసిన మీదట నీవనే ఎరుక లేదు గనుక యిట్టిది అని, వట్టిది బయలని ఎరిగి ఈ ఎరిగిన యెరుకను విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! బయలును యిట్టిది అట్టిదియని అనుటకు వీలు లేదని ఎరిగి అనగా తాను బయలైన తరువాత యెరుక లేదు గనుక యిట్టిదని అట్టిదని అనేవారు ఎరిగేవారు ఎవరున్నారు ఎవరూలేదు గనుక ఉత్తబయలే ఉన్నదని ఎరిగి నీవు సర్వకాలముల యందు బయలైయుండుమని భావము.

**కం॥ అదియిదియంచని యనరా -నిదిబయలని తెలిసి నీవు యిదియదియనారా -**
**నిది బయలని తెలిసిననిను -వదిలుండుము లేనటంచు వరుగుణవంతా ॥ 43**

తా॥శిష్యా! అదియని యిదియని అనుకొనుటకు వీలులేనిది బయలని. తెలిసిన తెలివనే నిన్ను నీవు విడిచిపెట్టుము అనగా నీవు సర్వకాలముల యందు ఎరుకను విడిచి పెట్టి బయలైయుండుము మంచి గుణముల గలవాడా అని భావము.

**కం॥ కలనీకు జగము కంతట-గలబయలుకు గలిగి-యున్నఘనమగు తిప్పల్-**
**కలయుగని మేలుకనియా -కలవలె మేలుకను జూచి కదలు ముళక్కీ ॥ 44**

తా॥శిష్యా! జగములన్నీ నీకు కలలో తోచుచున్నవి. అంతట ముళక్కీ వున్న బయలకు తోచవు ఈ కలయనే తిప్పలు బయలనే దానికి లేవు గనుక ఆ కలను ఎరిగి మేలుకొని అనగా కలయనే యెరుకను విడిచి పెట్టి మేల్కొయనే బయలు నీవైయుండుము అనగా కలమేల్కొలను రెంటిని నీవెరిగి కలలేదని మేల్కొ ఉన్నదని నీవు గని నీవు లేకపోవలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! నీవను యెరుకకు కలయనే జగములు తోచుట తప్పవు నీవు బయలైతే ఈ కలయనే జగముల తోచవు గనుక కలలేనిదని మేల్కోయున్నదని కల

లేని బయలేయుండును గనుక కలలేనిదని మేల్కొయున్నదని ఎరిగి కలయను యెరుకను విడిచి పెట్టి మేల్కొయను బయలు నీవై యుంటే నీవనే కలలేకపోవునని భావము.

కం॥ కలనేన్గ సింహమును క - న్నుల గన మృతి జెందినట్లు యుళ్ళక్కగు నీ - వల గురుకృపచేబయలున్ - దెలసూరికెయుంటి వేని తీరును మాటా ॥ 45

తా॥శిష్యా! కలలో ఏనుగు సింహమును చూచినయెడల మృతిజెందును, అలాగే శిష్యుడు సద్గురుని కరుణచే బయలును చూచిన యెడల, తాను బయలై, యూరుకుంటే యెరుక లేకపోవును, ఎరుకమాట తీరును అని భావము.

**విశేషార్థము :** శిష్యా! యేనుగు కలలో సింహమును, చూచినంత మాత్రమున, చనిపోయినది, అలాగే, శిష్యుడు గురుకరుణచే, గురుసూచన, ద్వారా విచారించితే, తాను బయలైతే, యెరుక ఏమీ లేకపోవును, గనుక తాను, సర్వకాల, సర్వావస్థలయందు, యెరుకను, విడిచిపెట్టి, బయలైయుంటే. యెరుక ఏమీ లేకపోవును, అనగా, యెరుకతో, పని తీరిపోవును, తాను త్రికాలములయందు, పరిపూర్ణుడై, యుండునని భావము.

కం॥ ఎప్పటికి యొక్కరీ తిగ - తప్పక నిలచున్న దాన్ని దయతో గురుడున్ - చెప్పినగని యగణితమగు - తిప్పలు గల నిన్ను నీవు దీసితెసరిరా ॥ 46

తా॥శిష్యా! ఎప్పుడు, ఒకే తీరుగా, నిలచియున్న, బయలును, గురుడు, దయతో, శిష్యునకు, చెప్పి చూపిన యెడల, ఆ శిష్యుడు చూచి గ్రహించి తాను బయలైతె, మునుపున్న తిప్పలు పొందే, నీవైన యెరుక, రహితమై, తాను లేక, ఉంటాడని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఎప్పుడు, ఒకే తీరుగా, నిలచియున్న, బయలును, గురుడు దయతో, మితములో, చూచించిన, ఆ శిష్యుడు చూచి గ్రహించి విచారించి, మితమును, అమితము. చేసినయెడల, తాననెయెరుక. బయలై, లేకయుండును. అప్పుడు తాను సర్వకాలం బయలై, యుండునని భావము.

కం॥ నీవున్న చోట నుండును - నీవివిధ విచిత్ర జగము నీతో గూడక్ - నీవు లేనట్టి చోటను - నీ వివిధ విచిత్ర జగము నిలువదు కుర్రా ॥ 47

తా॥శిష్యా! నీవనే యెరుక, ఉన్నచోటులో, నీ వికారమైన, చిత్ర విచిత్రములన్నీ వుండును, నీవు బయలైన, నీవు లేని చోటులో, నీ వివిధ విచిత్రమైన జగమనే యెరుక, నిలువకుండా, పోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! నీవనగా 25వ దైన, యెరుక, ఈ యెరుక ఎంతకాలం వుండునో,

అంతవరకూ, యెరుక వికార చేష్టలనే చిత్ర విచిత్రములు, మంచి చెడ్డలు అన్నీ యుండును, అందువల్ల, గురు కరుణయనే, గురుయుక్తి వలన, నీవనె యెరుకను, బయలు జేసి, అనగా, నీవు అఖండ స్వరూపమైన, అచలములో, లీనమై నీవు అచలమైయుంటే, నీవనె యెరుక ఏచోటులోను ఉండకుండా, పోవును, అని భావము.

**కం॥ నానా వికారములుగల - నానా విధనామ రూప నటనలు గల యీ - నీనా దశ దిశలునుగల - దీనందే లేక మనము తిరుగుట మన్నా ॥ 48**

తా॥శిష్యా! నానా వికారములతోను, నానా విధ, నామరూపములతోను, నటించుచున్న, ఈ యెరుక, మనకు, దశదిశల యందు, అంతటా నిండియున్న దాని యందే మనము లేక తిరుగుట తండ్రీయని భావము.

**కం॥ అబ్బీ యీ బయలున్నది - దబ్బున గురుడెరుక జేయదబ్బర నను చున్ - దెబ్బకు మాయముగాకను - కబ్బము జెప్పు - టకు నిల్వగలవేనీవున్ ॥ 49**

తా॥శిష్యా! నాయనా, ఈ బయలు, ఉన్నదని, సద్గురుమూర్తి, గురు సూచన జేసి, నీకు, చూచించితే, నీవు చూచి, విచారించి, నీవు బయలైతే, నీలో ఉన్న తప్పొడు, గుణములన్నీ, లయమైపోవును. మరల నేను నీవని, చెప్పుటకు, యెరుక, కనుపించదని భావము.

**కం॥ మూలములేకనె వచ్చిన - నీలీలలు జూచుకోని నీ వెమురుతువీ - బైలున్న దనుచుదోచితె - నీలేమిని నీవెరింగి నిలువవు కుర్రా ॥ 50**

తా॥శిష్యా! మూలములేక, వచ్చిన, యెరుక, తనచిత్ర, విచిత్రములు, అన్నీయూ చూచుకొని తాను సంతోషించు చుండును, తనకే, బయలున్నదని, తెలిసిన తాను బయలై తనలేమె తానే ఎరిగి నిలువక తానేలేకపోవునని భావము.

**కం॥ జ్ఞాన కర్మస్వరూపము - గాని బయల్నదుగో చూచి కలకాలము యీ - జ్ఞాన కర్మ స్వరూపం - బౌనినునీ వెరిగి మృషని పనివినవోయీ ॥ 51**

తా॥శిష్యా! జ్ఞాన కర్మ స్వరూపము, గాని, బయలును, చూచి, తాను బయలై, సర్వకాలములయందు, యీ జ్ఞానకర్మ, స్వరూపంబైన, జీవేశ్వర్లను, లేనివని నిన్నునీ వెరిగి, నేను లేనివాడను, గనుక నేను లేకపోయేపని అనగా తన మూలము తాను ఎరిగేపని సర్వకాలం చేయవలెనని భావము.

**కం॥ ఈ నిర్మలపౌ బయలున - నానాగమని గమ కల్పనాయనటంటే - యేనరులు నమ్మరిందుకు - నానీయందుననటంటె నమ్మిన మాడ్కిన్ ॥ 52**

తా॥శిష్యా! ఈ నిర్మలమై నిర్గుణమై యున్న బయలందున వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు కల్పన ఐనవంటే యేనరులు నమ్మరు గనుక నీ వలన నా వలన ఈ కల్పనంతా ఐనదంటే నమ్మెదరు అని భావము.

**విశేషార్థము** : శిష్యా! ఈ నిర్మలమైన బయలందు, ఏ కల్పనలు ఉండవు గనుక దానివలె నీవు కూడా గురుకరుణచే నీవు బయలై యుంటే ఏ కల్పనలుండవు. నీవు బయలై ఉండకపోతే అన్ని కల్పనలు నీవలన నావలన అవుతాయని భావము.

కం॥ **నేనీవనని మహాత్ముని - కీనిగమాగమ విచార మిష్టతియౌనా - నేనీవని యీ**
**పల్కే - నానీ కేయిష్టతౌర నానాయన్నా ॥ 53**

తా॥శిష్యా! నేనునీవనని నేను మేనులకు, అతీతమైయున్న మహాత్ములకు ఈ నేనుమేనుల వేదశాస్త్రాల ఉపనిషత్తుల విచారణ వారికి అవసరముండదు. నేను నీవని పల్కేనాకు నీకే వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు విచారణ కావలెను అని భావము.

**విశేషార్థము** : శిష్యా! నేను నీవు అనక నేను మేనుల కతీతమై తానులేని తానైయున్న మహాత్ములకు. ఈనేనుమేనుల వేదశాస్త్రాల ఉపనిషత్తుల విచారణ వారికి అవసరముండదు. ఎందువల్లననిగా ఆయన యివన్నీ విచారించి వీటికన్నిటికి అతీతమై యున్నవారు అనగా ఇంద్రియములతో పనిలేదు. ఇంద్రియాతీతమైన ఆత్మతో పనిలేదు, ఆత్మాతీతమైన కేవలాత్మైయున్నారు, గనుక వారికి యివియేమీ అవసరంలేదు, వారెప్పుడూ ఆ ఉనికిలో ఉంటారు, గనుక వారికి అవసరంలేదు యిది గురువుకు అవసరము లేకపోయినా, నీకూ నాకూ ఇవన్నీ కావలయును అనగా వేదశాస్త్రములు వగైరాలన్నీ నీకు నాకే కావలెనని భావము.

కం॥ **కలవేళ్ళను యీ మేల్కను - గల యీబయలుండ - జూచికలమేల్కలలో -**
**గలలేని నిన్నునీమే - నులలేవని నీవు దెలిసి యుండుము చాలున్ ॥ 54**

తా॥శిష్యా! కలను పొందుచుండగా మేల్కవచ్చినది, ఆ మేల్కలో కలలో చూచిన వస్తువులు ఏమీలేవు, ఈకల మేల్కలు రెంటిని విచారించి నీవు బయలై ఆ బయలును ఉండజూచేసరికి. కలమేల్కలు రెండూలేవు, నీవునీమేనూ రెండూలేవు గనుక నీవు బయలైయుండుము చాలునని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవు కలను పొందుచుండగా మేల్కవచ్చినది, ఆ మేల్కలో కలలేదు, కలనుపొందే నీవులేవు గనుక వీటిని విచారించి తాను బయలై ఆ బయలును ఉండజూచి, విచారించగా కలమేల్కలు లేవు, నేను మేనులు లేవు, వీటికి అతీతమైన అచలపరిపూర్ణమే యుండెను, అట్లు సర్వకాల సర్వావస్తలయందు విచారించుచూ తానులేని తానైయుండెనని భావము.

కం॥ **మేనుజడ మజడమని నను - నేనును మీ రెండు గలసి నేనన బడుస్వ -**
**ప్నానందమె మదవస్థగు - నేనను మృషని తెలియనే మృషనౌదున్ ॥ 55**

తా॥శిష్యా! మేనుజడము, నేను అజడము, అనిన ఈ రెండు కలిసి నేననబడును యివి స్వప్నానందము లాంటివి, గనుక నేను మేనులు రెండూ లేని నేనని తెలుసుకొనిన యడల నేనే లేకపోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేననగా 25వదైన ఈశ్వర తనువు, మేననగా 24 ఇంద్రియములతో కలసి తిరిగే జీవతనువు, ఈ రెండూ ఒక్కయెరుకే, ఈ ఎరుక ఒకప్పుడు జడముగాను, ఒకప్పుడు అజడముగాను ఉన్నది. ఈ ఎరుక యలాంటిదనగా కలలో తోచిన శరీరాలు మేలుకొంటె ఎలా ఏమిలేవో అలాగు గురుముఖతా విచారించి తాను బయలైతే, ఈ నేను మేనులనే యెరుక ఏమీ లేకుండా పోవునని భావము.

కం॥ **నేనెతానైతెనౌవలె - యీ నేలేనట్టి బ్రహ్మనే ననకు న్నే - నేనందునేను లేనిడె -**
**మేను జగత్తులయితోచి మృషనౌకొంచున్ ॥ 56**

తా॥శిష్యా! నేను తానైతే తానే నేనని తెలుసుకొని నేను లేని బ్రహ్మము, నేనన కుండా ఉన్నది గనుక నేనులేని నేనే బ్రహ్మము ఇదే బయలు. ఇందులో నేను జగములు తోచినవి లేనివని ఎరిగితే ఈనేను జగములు లేకుండా పోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేననే ఈశ్వరతనువు అఖండ ఎరుకైతే, ఈనేను మేనులు రెండూ ఉండవుగనుక, నేనని నీవని అనదు గనుక గురుముఖతా విచారించి తాను అఖండమైన బయలైతే, నేనుమేనులు రెండూ లేకపోవును అ తరువాత ఉన్నది అఖండమైన బయలే ఉన్నదని భావము.

కం॥ **కానరావారు మతములు - నానాగమనిగమ సమితినామము రూపం -**
**బేనులేనపుడు నాకై - నేనరుదెంచినను వెంటనేయవివచ్చున్ ॥ 57**

తా॥శిష్యా! నేను లేనప్పుడు ఆరు మతములు లేవు, వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు లేవు, నామ రూపములు లేవు, బయలే ఉన్నది అందులో నుండి ఈనేను తనకుతానే వచ్చినది, దాని వెంటనే ఈనేనుమేనులు వచ్చినవని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేననగా ఓం, ఈ ఓంకారమే అఖండమైన యెరుక, ఇందులో నుండే ఆరుమతములు ఉపనిషత్తులు సమస్తము ఉత్పన్నమైనవి, యిందులోనుండే నేనుమేనులు ఉత్పన్నమైనవి, ఈ ఓంకారము లేకపోతే ఏమీలేవు, ఈ ఓంకారమునే బ్రహ్మమని ఆత్మయని యందురు, ఈ ఓంకారమైన ఎరుక గురుకరుణచే లేకపోతే, నేనుమేనులు లేవు, ఆరుమతములు లేవు, సమస్త శాస్త్రములు లేవు, తాను బయలైన అచల పరిపూర్ణమే యున్నదని భావము.

కం॥ **నామీది ప్రేమచేతను - యీ మనుజులు నిలుపదలచి యెన్నోయుక్తుల్ - తామొనరించినిల్తునె - నేమృషమృషనిల్వగలదెనిశ్చయమువలెన్ ॥ 58**

తా॥శిష్యా! నామీద ప్రేమచేత నన్నునిలుపవలెనని నేనే బ్రహ్మనని, నేనే శాశ్వతమైన పరిపూర్ణమని యెన్నోయుక్తులు చెప్పినా నేను నిలువగలనా, ఈ ప్రజలు ఎంతనిలిచినా నేనులేని దానిని గనుక నేను నిలువలేను. శాశ్వతమైనది ఒక్క పరిపూర్ణమైన బట్ట బయలే కాని నేను శాశ్వతమైన దానిని కాను గనుక నేను నిలువనని భావము.

కం॥ **నీ తండ్రి తాతలవలెనె - నీ తనయులు నీవు జనుట నిశ్చయమెకదా - మీతోటి రాదుగదబయ - లీతెర గెరిగిపుడు శూన్యమేదోకనరా ॥ 59**

తా॥శిష్యా! నీ తండ్రి, నీ తాతలు ఉన్నారా లేరుగదా! వారివలే నీవు, నీ తనయులు లేకపోవుట నిశ్చయమెకదా! నీతోటి బయలు రాదుకదా నీవె విచారించి చూచుకొనుము, నీవే శూన్యమని ఎరిగి బయలు యన్నదు శూన్యము కాదని ఎరిగి, నీవు లేక యుండుము శూన్యమేదో నీకే తెలియబడునని భావము.

కం॥ **బయలెపుడు పట్టిగిట్టదు - బయలెప్పుడు ముట్టుకోదు బ్రహ్మాండంబున్ బయలెపుడు నన్నెరుంగదు - బయలెప్పుడు జేయబోదు పనులెవ్వైనన్ ॥ 60**

తా॥శిష్యా! బయలు ఎప్పుడు పుట్టదు చావదు, బయలు ఎప్పుడూ ముట్టుకోదు బ్రహ్మాండములను, బయలు ఎప్పుడూ నన్నెరుగదు, బయలు ఎప్పుడూ ఏ తలపులూ చేయదు, బయలనగా కదలికలేనిది, శాశ్వతమైనది గనుక నీవు బయలైతే నీవుకూడా అలాగే ఉంటావని భావము.

కం॥ **బయలనిననిత్యవస్తువు - బయలననొకరీతి నుండు బ్రహ్మాండములో - బయలనిన కండ్లబడనిది - బయలన బ్రహ్మాండ మవలబరగెడిది సుమీ ॥ 61**

తా॥శిష్యా! బయలనగా పరిపూర్ణమై శాశ్వతమై యున్నది, బయలనగా కదలక మెదలక మార్పుజెందక ఒకే రీతిగా బ్రహ్మాండములో ఉన్నది, బయలనగా మన కండ్లకు కనుపించనిది మరుగైయున్నది, బయలనగా బ్రహ్మాండమునకు అవల పరిపూర్ణమై యున్నది సుమా! యని భావము.

కం॥ **బయలనిన నేను లేనిది - బయలనిన నుపాధిగానబడనిది యెపుడున్ - బయలనిన పలుకులేనిది బయలిట్టిదియనుచు దెలియబడ దెవ్వరికిన్ ॥ 62**

తా॥శిష్యా! బయలనగా నేనులేనిది, బయలనగా ఉపాధి అనేది ఎప్పుడు లేనిది, బయలనగా మనతో మాట్లాడేదికాదు, బయలు యిటువంటిది అని ఎవ్వరికి తెలియబడదని భావము.

**విశేషార్థము :** శిష్యా! బయలనేది ఎటువంటిదనగా నేను లేని నేనే. అహంకారము లేనిది. అనగా ఇదినేను చేసేను. ఇంకెవ్వరూ చెయ్యలేరు. అది నేను గనుక కొన్నాననేదే అహము, బయలనగా ఆకలి దప్పిక లేనిది. అదికావాలనిగాని యిదితినాలని గాని ఎప్పుడూ అననిది, బయలనగా మాటలాడనిది. బయలెవరికి తెలియుననగా సద్గురు సూచనైనవారికి అవాంగ్మానసగోచరమని దాని విషయం దాని సవ్వడ తెలియునని తెలియవలెను. ఎలాగనగా నేననే అహము లేనివారికి అందులో నుండి వచ్చిన జగత్తు లేనివారికి. అనగా జీవేశ్వర్లు రహితమైన తరువాత ఉన్నది బయలేనని తెలియక తెలుసునని భావము.

కం॥ **చెప్పి చూపించరానిది - యప్పాయల్లదిగో చూడుమని నేనీకున్ - చెప్పిచూపిస్తి**
**మరువకు - యెప్పటికిది నమ్మి - లేని యెరుకను విడరా ॥ 63**

తా॥శిష్యా! బయలు యిట్టిదని చెప్పుటకుగాని చూపించుటకుగాని వీలుకానిది, అలాంటి దానిని నీకు నేను చెప్పి సూచనజేసి, నాయనా అల్లదిగో చూడు అని చూపించినాను. దీన్ని నీవు ఎప్పుడు మరువకు యిది యథార్థమని. నమ్మి 25వదైన లేనెరుకనే ఈశ్వర తనువును విడిచి పెట్టుమని భావము.

కం॥ **ఉన్నదిగదనే జెప్పిన - దన్నాదాన్నుండ జూచితలగుము మృషయౌ - నిన్నంటి**
**యున్న సంపద - లన్నియుగొని నీవు వచ్చినట్లు మృషగుచున్ ॥ 64**

తా॥శిష్యా! నేను చెప్పిన బయలు ఉన్నదిగదా! దాన్ని నీవు ఉండజూచి, యెరుకను విడిచిపెట్టుము. అనగా యెరుకనే నీవు లేకపొమ్ము నీతో అంటియున్న సంపదంతా తీసుకొనివచ్చి ఏమీ లేకుండా పోయినట్లు, యెరుకతో వచ్చిన సంపదంతా యెరుకతోనే పోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేను నీకు సూచనజేసి చెప్పి చూపించిన బయలు ఉన్నదిగదా! అనగా నీవు బయలైన బయలు ఉన్నదిగదా! ఆ బయలు ఎలావున్నది కదులుచున్నదా సంకల్పమేమైనా వచ్చుచున్నదా లేక నిర్మలముగా వున్నదా, ఎలా ఉన్నదో ఉండజూచి నీవెప్పుడూ బయలైయుండి ఎరుకను ఏమీలేకుండా విడిచిపెట్టుము, అప్పుడు యెరుకతో వచ్చిన సంపదంతా యెరుకతోనే పోవును. నీవు సర్వకాలం బయలై యుండుమని భావము.

కం॥ **పంచకోశముల సంచును - మించినదీ యెరుక - యనుటమేలా బయ -**
**లం చెంచిన దగునాముచ్చట - నంచితసద్భక్తి యుక్త అమితాసక్తా ॥ 65**

తా॥శిష్యా! సమన్వితమైన భక్తిగలిగిన నాడే, పంచకోశము లనగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ ఈ ఐదు వీటికన్నింటికి మించినది యెరుక యనుట మంచిమాట కాదు. బయలు యెరుక కన్నా మించినది.

అనగా అన్నిటికన్నా అతీతమైనది బయలు అని భావము.

**విశేషార్థము :** శిష్యా! పంచకోశములకన్నా మించినది యెరుక, అంటే సరిపోదు వీటికన్నింటికి మించినది బయలు, బయలంటే యెరుకలేనిది, యెరుక ఉంటే అన్నీ ఉన్నవి అనగా సంకల్పములు వికల్పములు ఊహలు యింద్రియచలనములు అనేక వికారములతో గూడినది యెరుకేనని ఎరుగుము. ఈ ఎరుకను రహితము జేసితే అనగా ఈ ఎరుకను ఏమీ లేకుండా తీసివేసితే, ఆ తరువాత శేషించియున్నదే బయలు, అనగా తాను బయలైతే యెరుక ఏమీలేదని భావము.

కం॥ **లేని నేనను శరీరము - లోనబయట గల్గినట్టి లోకసమితికిన్ లోనబయట**
**గలబయలిది - దీనందే లేకమనము - తిరుగుటమనఘా ॥ 66**

తా॥శిష్యా! లేని నేననే శరీరమునకు, లోపల బయట గలిగినట్టి లోకమనే సమూహామునకు లోపల బయట కలిగియున్నది, మనకు ఎదురుగా వున్న బయలేనని నీ వెరిగిన, నీవు బయలైన దానందే మనము లేక తిరుగుటయని భావము.

**విశేషార్థము :** శిష్యా! మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమునకు, లోపల బైట కలిగియున్నది యింద్రియ ప్రపంచమనే సమూహాము, దీనికి లోపల బైట కలిగియున్నది, తానులేక యున్న బయలు, ఆ బయలందే మనము మన ఇంద్రియ ప్రపంచము మొత్తం అన్నీ లేక తిరుగుచున్నామని ఎరుగుమని భావము.

కం॥ **ముడిబడి కర్మము జ్ఞానము - విడువకనా రెండు వెలసె విశ్వమన నదే -**
**కడువేడ్కబయలుగనెనా - ఘడియైననునిల్వలేక కల్గెపోవున్ ॥ 67**

తా॥శిష్యా! కర్మమును విడిచి జ్ఞానము వుండదు, జ్ఞానమును విడచి కర్మము వుండదు. ఈ రెండూ ఒకయెరుకే, గనుక కలిసే ఉంటాయి. యిదే విశ్వము యిదే ప్రకృతి పురుషులు, ఈ యెరుక బయలును గనినట్లైతే ఒక్క నిముషమైనను నిల్వలేక పారిపోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! కర్మము జ్ఞానము రెండు కలిసి తాయారై ప్రపంచమాయెను, అనగా ఆత్మానాత్మల వలన యింద్రియ ప్రపంచమైనది, యిదంతా ఆత్మీయనే ఎరుక వలన కలుగుచున్నది, యిట్టి యెరుక బయలును ఎప్పుడు చూచినదో ఒక్క క్షణమైనను నిలువలేక పారిపోవుచున్నది, అనగా గురుకరుణచే తాను విచారించి బయలైనప్పుడు, యెరుకయనే ఆత్మానాత్మల ప్రపంచం ఏమీ లేకుండా పోయెను, ఆ తరువాత శేషించి యున్నది బయలనే అచలమే యున్నదని భావము.

కం॥ **సకలంబు లేని బయలున - సకలము లేనిదిట కొచ్చి చనెనాలేనం - చుకని తా లేచిపోయిన - నికనిలిచే బయలు నెరుగనేదుండునురా ॥ 68**

తా॥శిష్యా! యేమీలేని ఉత్తబట్టబయలులో తనంతట తానుగా ఏమీలేకనె వచ్చిన యెరుక, ఆ బయలును కని నేను లేను లేనిదానినని తానులేక పోయిన, తరువాత ఉన్న బయలును ఎరుగుటకు ఎవరుండునురా యని భావము.

కం॥ **ఉన్నలేనేమోయనకన్ - వున్నది బయలనుచు - యేమొవుంటిని లేనం - చెన్నులేనట్టి నిన్నును - పన్నుగగని లేని నీవు పరుగిడవోయీ ॥ 69**

తా॥శిష్యా! ఉన్నాదో లేదోయని అనుమానము లేక ఎప్పుడు ఉన్నది బయలని తెలుసుకొని, ఉన్నానో లేనో ఏమో వుంటిని యని ఎరిగి, నిన్నును నన్నును లేననుచు తెలుసుకొని, లేనట్టినీవు లేకుండా పరుగిడిపొమ్మని భావము.

కం॥ **రెండు వస్తువులనడుమన - ఖండంబిదె కానుపించుగద దీనిని నీ - వుండి కనుగొని చనందగు - మండిత సత్కీర్తి సాంద్రమానవ చంద్రా ॥ 70**

తా॥శిష్యా! రెండు వస్తువులనగా, చూచేదానికి చూడబడేదానికి మధ్యఉన్నదే అఖండము, దీనిని నీవు చూచితివి గదా, ఈయఖండ స్వరూపమును నీవు ఉండి విచారించి తెలుసుకొని చూచి నీవులేకపోవలెను. మంచి సత్కీర్తిగలవాడా మానవులలో చంద్రుడు నంటివాడా అని భావము.

**విశేషార్థము** : శిష్యా! రెండు వస్తువులనగా చూచేది యెరుక, చూడబడేది మితములో ఉన్నబయలు, ఈ బయలు అఖండమైనదే గనుక నీవు దీనిని మితములో విచారించగా, నీవు అఖండమై కనుగొన్నావు గనుక నీవైన ఎరుక ఏమీలేదని భావము.

కం॥ **ఉన్నదానందునిజముగ - నెన్నడు లేనట్టి మనము యేతెంచిట యీ - తిన్నని ముచ్చటలాడితి - మిన్నియికన్మనము బోతె యేదిరమాటా ॥ 71**

తా॥శిష్యా! ఎప్పుడు వున్నది శాశ్వితమైన పరిపూర్ణమనే, బయలందున ఎన్నడు లేనట్టి మనము వచ్చి, ఎన్నో విషయములు ముచ్చట్లాడితిమి అన్నియు మాట్లాడిన మనము లేకపోతే ఆ తరువాత మాట్లాడేదేమున్నది అని భావము.

కం॥ **ఓపాపరూప బయ - లేపరమాత్మనుచునమ్మిలేనట్టి నినున్ - ఆపో జ్యోతిననుచుదెల - సీపట్లనె లేనటంచు చేరుముశక్కిన్ ॥ 72**

తా॥శిష్యా! ఓ పాపరూపా, బయలే పరిపూర్ణమని నమ్మి, లేనట్టి నిన్ను ఆపోజ్యోతైన యెరుకయని తెలుసుకొని, ఇప్పుడే నేను లేనని, నీవు లేకపోతే యెరుక లేని బయలు నీవై యుంటావని భావము.

**విశేషార్థము** : శిష్యా! ఓ పాపరూపనగా , నేత్రములో ఉన్న పాప రూపమైన యెరుకే నీవు, బయలే పరిపూర్ణ పరబ్రహ్మ మనినమ్మి నీవులేనట్టి నిన్ను ఆపోజ్యోతి యైన యెరుకని ఎరిగి విచారించి యిప్పుడు నేనులేనని ఎరిగి, అనగా అంగుష్ట మాత్రములో అష్టదళ కమల మధ్యమున పీతవర్ణము లోపల శ్వేతవర్ణమైనదే నీవనెయెరుక, ఆ యెరుక దగ్గరకు వెళ్ళి ఆ యెరకను యెరుకే చూచితే అద్దమును అద్దమే చూచినట్లు, ఏమీలేక చూచే ఎరుక బయలై పరిపూర్ణమై యుండునని భావము.

కం॥ **ఇచ్ఛారాహిత్యంబునె - స్వచ్ఛంబగు బోధయనుచు సజ్జనులని యీ -**
**యిచ్ఛనెకూడని దనిరా - స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా ॥ 73**

తా॥శిష్యా! యిచ్ఛయనగా ఎరుక, యిచ్ఛారహితమైనదే స్వచ్ఛమైన బోధయని సజ్జనులనిరి, అయిచ్ఛ ఉండకూడదన్నారు, గనుక ఆ స్వచ్ఛందుల మాటలన్నీ సత్యములేనని భావము.

**విశేషార్థము** : శిష్యా! యిచ్ఛయన్నా, కోరికన్నా, సంకల్పమన్నా, యెరుకే, ఈ యెరుక రహితమైనదే యిచ్ఛా రహితమైన స్వచ్ఛమైన పరిపూర్ణబోధయని సజ్జనులైనవారు అన్నారు, ఈ యిచ్ఛ వుండకూడదన్నారు గనుక సద్గురు కృపచే యెరుకను రహితపరచిన, ఆ స్వచ్ఛందుల మాటలన్నీ సత్యములేనని నమ్మి నీ యరుకను రహితపరచి, స్వచ్ఛమైన పరిపూర్ణమై, సర్వకాలముల యందు యెరుక లేక యుండుమని భావము.

కం॥ **ఏయాపేక్ష జనించిన - నాయాపేక్షలెల్ల మాయయని తెలియదగున్ అయాసమౌను**
**దానను - ఛీయనియవి విడువదగును సేమము కొరకై ॥ 74**

తా॥శిష్యా! నీవు బయలైయున్న బయలులో. ఏ యపేక్ష జనించిన, ఏ సంకల్పమొచ్చినా, ఏ ఊహవచ్చినా, యివి అన్నీ మాయయేయని యెరుకయే యని విచారించి, యివిలేనివేనని వీటినన్నిటిని విడిచిపెట్టవలెను నీ క్షేమము కొరకుయని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవు సర్వకాల సర్వావస్థలయందు బయలయ్యే ఉండవలెను, ఆ బయలులో యే యపేక్ష జనించినా, యే సంకల్పమొచ్చినా, యే ఊహ వచ్చినా, వీటని విచారిచి ఛీ యివి వుండగూడదని యివి మాయయని ఇదే ఎరుకయని, వీటనన్నిటిని విడిచిపెట్టి గురుకరుణచే నీవు త్రికాలములయందు బయలై యుండుమని భావము.

కం॥ **లేనినీ కలిమి వంధ్యా - సూనివలె పుష్కర ప్రసూనము వలె స్వ - ప్నానందము**
**వలె గంధర్వానీక స్థానము వలెనని తెలియదగున్ ॥ 75**

తా॥శిష్యా! నీ కలిమి, నీ సంపద, నీ భోగ భాగ్యములు యివి యన్నీ, గొడ్రాలు బిడ్డవంటివి, ఆకాశపుష్పము వంటిది, స్వప్నములో కలిగిన ఆనందము వంటిది, త్రిశంకుని స్వర్గము వంటిది, యండమావులలోని నీరువంటిది యని తెలుసుకొని, యీ యన్నిటిని విడిచిపెట్టి నీవు త్రికాలములయందు బయలై లేక యుండుమని భావము.

కం॥ నీ తండ్రి జనినమీాదట - నీ తనయుడు రాకమునుపు నీవున్నపుడున్ - యేతత్వమంతటనుగల - దాతత్వము నరసిమ్మనని తలపుమమిమ్మున్ ॥ 76

తా॥శిష్యా! నీ తండ్రిపోయిన తరువాత, నీకుమారుడు రాని క్రితము, నీవు వున్నప్పుడు యేతత్వము అంతటావున్నదో, ఆతత్వాన్ని విచారించి నీవు బయలై నీవునేననే యెరుక యేమీ లేదని విడిచిపెట్టుమని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవు రాని క్రితం, నీవున్నప్పుడు, నీవుపోయిన తరువాతను, యేబయలు అంతటావున్నదో ఆ బయలును చూచి విచారించి నీవు బయలై, నీ వని నేననే యెరుకను విడిచిపెట్టి నీవు సర్వకాలములయందు యెరుక లేని బయలై యుండుమని భావము.

కం॥ నీవె సుమీ జీవశివుల్ - నీవెసుమీ మేను జగము నీవే సుమ్మీ - జీవశివైక్యము బయలున - నీవుగలుగలేదు లేదునీ మొదలెచటన్ ॥ 77

తా॥శిష్యా! నీవే సుమీ జీవుడు ఈశ్వరుడు, నీవే సుమీ మేను జగములు, నీవే సుమీ జీవశివైఖ్యం, నీవు బయలులో పుట్టనేలేదు, గనుక నీకు మొదలే లేదు ఎచ్చట చూచినను, గనుక నీవు బయలైయుంటే, నీవనే యెరుక యేమీ లేదని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవే జీవుడు, నీవే శివుడవు, నీవే మేను జగములు, నీవే జీవశివ ఐఖ్యం, అనగా 24 ఇంద్రియములలో తిరుగుచున్న జీవుడవు నీవే, 25వదైన ఇద్రియములకు విలక్షణమైన ఈశ్వరతనువు నీవే, ఈ జీవేశ్వర్లు ఐఖ్యమై అచలములో లీనమై అఖండమై యున్నది నీవే, గనుక ఈ మూడు విధములుగా ఎరుక నటించుచున్నది ఎరిగి. అసలు నీవైనది అఖండ ఎరుకని ఎరిగి విచారించి జీవశివులు మొదలే లేవని, వాటిని విడిచిపెట్టి, తానైన అఖండ ఎరుకను వుండజూచి, తాను బయలైయుంటే జీవేశ్వర్లనే మలిన యెరక యేమీలేదని భావము.

కం॥ కదిలీనా మెదిలీనా - కదలనియీ బయలు నిన్నుగనలేదు గదా - మొదలెక్క డగన రాదిక - కదులుము నీకలిమిలక్కిగా దల్చినుతా ॥ 78

తా॥శిష్యా! నీవనెయెరుక, కదిలిన మెదిలిన ఈ బయలు నిన్నెరుగదు గదా! నీకు మొదలు ఎక్కడా కనుపించదు గనుక నీ కదిలిక ఉల్కక్కి. గనుక నీవనే ఎరుక ఏమీ లేదని భావము.

 

కం॥ మేననినను దెలసినగతి - నేననిది బయలుగాను నీవెరుగోయీ - నేననిది నే ననదని - నేనను నేనరయ మృషనినే మృషనౌదున్ ॥ 79

తా॥శిష్యా! మేననినను అందరికి తెలుసును, నేననిది బయలని ఎరుగుము, అనగా నీవు బయలైతే నేనని ఎప్పుడు అనదు, నీవు బయలౌవ్వకపోతే నీ వని, నేనని, అంటూనేయుండును, అనేనును విచారించి చూస్తే మృషయై యక్కడా కాన రాకుండా పోవునని భావము.

కం॥ మేనొక్కటినేనొక్కటి - నేనీమాటలనువిడచి నిను నీతనువున్ - నేనేనని యచలముగని - నేనునునీ వేగవోయి నే మృషననుచున్ ॥ 80

తా॥శిష్యా!॥ నేనొక్కటి మేనొక్కటి అనేటి మాటను నేను విడిచిపెట్టి, నిన్ను నీతనువును నేనేయని తెలుసుకొని అచలమును చూచి, అనగ, నీవు బయలైయ్యి నేనేనీవని ఎరిగి నీవులేక పోవోయీ, నేను లేని దానినని నీకే తెలియునని భావము.

విశేషార్థము : శిష్యా! నేను మేనులనే మాటను విడిచిపెట్టి, నీవు నీ తనువు నేనేయని ఎరిగి అచలమును చూచి, అనగా నీవు బయలైయ్యి నేను నీవు ఒక్కటేనని ఎరిగి, నీవు లేకపోతే నేను లేని దానినని నీకు తెలియబడును, గనుక యెరుకలేని బయలు నీవయ్యి అనగా నీవు అచలములో లీనమై, సర్వకాలముల యందు అచల పరిపూర్ణమై యుండుమని భావము.

కం॥ దేహమున కొంత నిజమని - మోహంబున నిల్పుకొనుటె మోసంబు గురు - ద్రోహమగుగాన విడువుము - మోహంబును మేల్కని కలముఙిగిన రీతిన్ ॥ 81

తా॥శిష్యా! దేహములో కొంత నిజమని, అనగా దేహిసత్యము, దేహము అసత్యమని, మోహమును నిలుపుకొనుట మోసమేయగును, మరియు దేహిదేహములు రెండుగా చెప్పుట గురుద్రోహమే యగును, గనుక రెండుగా చెప్పుట కూడదు, అట్టి మోహమును విడిచిపెట్టుము, నీవు సర్వకాలం బయలై కలను మేలుకొనుము, అట్టి మేల్కలో నీ వుంటే కలనే ఎరుక ఏమీ లేకుండా పోవునని భావము.

విశేషార్థము : శిష్యా! దేహము, దేహములో వున్న దేహి, మొదలగు అన్నీలేనివే యేదీ నిలుపుకోవద్దు, అంతా కలవంటిదే, ఈకలకు అతీతమైయున్న మేల్కొయనే, బయలును నీవెరిగి జీవేశ్వర్లు రహితమై నీవా బయలైయుంటే, దేహిదేహములు ఎప్పుడు వుండవు, మేల్కొనేసరికి కలయేలా వుండదో నీవు బయలయ్యేసరికి ఎరుక అలా వుండదు, అని తెలుసుకొని నీవు సర్వకాలములయందు బయలై యుండవలెనని భావము.

కం॥ **చలనమనసీవుసుమ్మీ - చలనరహితమనిన బయలు చలనమెకలయీ -**
**చలనము చలన రహితము - గలదనికని తొలగమేలుకగునో యప్పా ॥ 82**

తా॥శిష్యా! చలించేదంతా నీవే సుమ్మీ, చలనము లేనిది బయలని తెలియుము, చలించుచు సంకల్పములు పొందుచున్నదేకల, ఈ చలనము, చలనరహితము గలవని ఎరిగి, నీవు లేకపోవుట మేల్కయని, అనగా నీవు బయలవటమే మేల్కయని భావము.

కం॥ **ఈ గుర్తెరిగేమేనును - బాగుగ విడచుండుమిందు బట్టకుదేనిన్ - ఆగడమౌదానను**
**విని - త్యాగము నీకుంటె మంచిదౌరా వోరీ ॥ 83**

తా॥శిష్యా! మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేకుండా పూర్తిగా విడిచిపెట్టుట చాలామంచిది, ఈ గుర్తెరిగే శరీరమే ఇన్ని వికారములు పొందుటకు మూలమని ఎరిగి దీనిని విడిచిపెట్టే త్యాగము నీకుంటే చాలా మంచిదేరా, ఓ బుద్ధిమంతా ఈ గుర్తెరిగే శరీరం యేమీ లేకపోతే శేషించి యున్నది నీవైన బయలే వుండునురా యని భావము.

కం॥ **చలియించనిదాకాశము - చలనంబే వాయువనుచు సాటింపదగున్ - చలనమె**
**విశ్వమునేనన - చలనమె తను వెరుకలనిన జగమనినసుతా ॥ 84**

తా॥ష్యా! చలనములేనిది ఆకాశము, ఈ చలనమంతా వాయువేనని గ్రహించుకొని సాటించి అందరికి చెప్పుము, ఈ చలనమె తను వెరుకలు, ఈ జగత్తంతా అదేనని భావము.

**విశేషార్థము :** శిష్యా! చలించని దాకాశమనగా, అఖండయెరుక చలించదని ఎరుగవలెను, ఈ చలనమంతా వాయువే, అనగా జీవేశ్వర్లే నేను మేనులే యని చాటించి చెప్పుము, ఈ చలనమే విశ్వమనే ఇంద్రియములు నేనును, ఈ చలనమే జగమనిన యెరుకనిన తనువనిన యివియన్ని లేనెరుకే ఈ ఎరుక లేనిదే నీవైన బయలు అని భావము.

కం॥ **వలదెక్కువముచ్చట్లిక - చలనములేనట్టి బయలు చందముగని యీ -**
**చలనమిగు నీకు నీవే - తలిదండ్రులంటంచుదెలిసి తలగుము చాలున్ ॥ 85**

తా॥శిష్యా! యిక మాటలు కట్టిపెట్టుము, యిక మాటలు చెప్పకుము, ఈ మాటలనే చలనము లేని బయలును చూచి, అనగా నీవు బయలయ్యి ఈ చలనమంతా నేనేనని, నేనే తల్లీదండ్రీయని ఎరిగి, నేను లేకపోతే చాలు, వున్నదంతా నేను లేని నేనని భావము.

**విశేషార్థము :** శిష్యా! చలనమనే, సంకల్ప వికల్పములను, మాటలను, కట్టిపెట్టి, యే

సంకల్పములు, యే ఊహలు, యేమీలేని, బయలును వుండజూచి అనగా తాను బయలైయ్యి, నేను మేనులు, క్షరాక్షరములు, ప్రకృతి పురుషులు, మొదలుగా గల, ఈ ద్వంద్వ స్వరూపముగా యున్న, ఈ జీవేశ్వర్లనే యెరుకయను ప్రపంచమును విడిచిపెట్టి, తాను సర్వకాల సర్వావస్థలయందు పరిపూర్ణమై యుండవలెనని భావము.

కం॥ బ్రహ్మండులేక కలిగిన - బ్రహ్మమునే ననెటిమాయ ప్రబలె జగంబై - బ్రహ్మను
గని తానేగుటె - బ్రహ్మనేమాయకు పని బ్రహ్మండుజూమీ ॥ 86

తా॥శిష్యా! బ్రహ్మమనగా అఖండమై, అచలమై, బయలై, తానున్నదే బ్రహ్మము. యిట్టి బ్రహ్మమునందు లేనిమాయనే యెరుక తనంతట తాను కల్పనై వచ్చి, నేను మేనులై, జగత్తనే యింద్రియ ప్రపంచమై ప్రబలెను, ఈ మాయ నేనే బ్రహ్మమును అని చెప్పుచున్నది, కొంతమంది తెలియక జీవుడు జగత్తు మాయని తెలియక ఈశ్వరుడు దేవుడు అని నమ్ముచున్నారు, గనుక ఈ మాయనే జీవేశ్వర్లను ఏమీ లేకుండా చేసుకొనే విచారణే మాయకు పనియని భావము.

కం॥ నిరుపాధికమగు బయలున - మరిలేకనె కలిగినట్టి మారుతమునకే - పరియాయ
నామములగు - కరువలియన - యెరుక యనిన కడు మాయయనన్ ॥ 87

తా॥శిష్యా! యే ఉపాధిలేని బయలులో మరిలేక కలిగినట్టి, వాయువునకే పరియాయ నామములు కలిగెను, కరువలియనిన, యెరుక యనిన, మాయయనిన, పేర్లుబేదమేగాని యివియన్నీ ఒక్క యెరుకకే [illegible] తెలియవలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! వాయువు అనగా ప్రాణవాయువు, అపానవాయువు వ్యానవాయువు, ఉదానవాయువు, సమాన వాయువు అని, పంచవాయువులు గలవు, వీటివలన గలిగినవి నాగ, కూర్మ, కుకుర, దేవత్త, దనంజయ యను ఉపవాయువులు ఐదు కలిగినవి, యివి ఏ వాయువు చేయుపనులన్నీ, ఆ వాయువులు చేయుచున్నవి, మరియు యెరుక యనిన మాయయనిన, ఈ పేర్లన్నీ, యెరుక వలననే కలిగినవని నీ వెరిగి, నీవు బయలైయుంటే యివి ఏమీ లేవని భావము.

కం॥ మానసము దేహిజీవుం - డానందము సత్తుచిత్తులహము జగదధి - ష్ఠానంబు
సాక్షి సత్య - జ్ఞానము ద్రష్టనినవీ వెసత్యము సుజ్ఞ ॥ 88

తా॥శిష్యా! మనస్సన్నను, దేహియనిన, జీవుడనిన, ఆనందమనిన, అహమనిన, సత్తనిన, చిత్తు అనిన, అధిష్ఠానమనిన, సాక్షియనిన, ద్రష్టయనిన, సత్య జ్ఞానా నందంబనిన, సుజ్ఞానమనిన, యివియన్నీ నీవైన యెరుక యేయని భావము.

**కం॥ జ్ఞానా జ్ఞానంబులు యీ - జ్ఞానంబు వెకాని వేరుగా వెన్నిటికీ - జ్ఞానా**
**జ్ఞానానికిపని - జ్ఞానా తీతమును గాంచి చ - నుటయెసుమ్మీ ॥ 89**

తా॥శిష్యా! జ్ఞానమువేరు అజ్ఞానమువేరు కావు ఈ రెండు ఒక్క జ్ఞానమే, ఈ జ్ఞానా జ్ఞానానికి పని జ్ఞానా తీతమును తానుగాంచి తాను బయలై తాను లేకపోవుటయే అనగా తాను లేకపోవుటంటే తాను బయలవటమే నని భావము.

**కం॥ జలమంధు మొదలు లేకనె - జలచరములు బుట్టి పెరిగి సమసిన రీతిన్ -**
**అలపరిపూర్ణములోనీ - విలసజ్జననంబు స్థితియు విలయము లౌరా ॥ 90**

తా॥శిష్యా!! జలములో మొదట మీనములనే చేపలు లేవు తరువాత జలములో వాటికవె పుట్టి పెరిగి, వాటికవె నశించినవి, అలాగుననే పరిపూర్ణములో మొదట నీవు లేవు తరువాత నీకు నీవే వచ్చి కొంతసేపు ఉండి నీకు నీవే లేకపోతి వని. అనగా నీవనే యెరుక వచ్చి లేకపోయెనని భావము.

**కం॥ అచలమున మొదలు లేకనె - సచరాచర జంతునిచ -య జననమగు య -ప్ప**
**చయముల లేని జలచర-నిచయము జన్మించినట్లు - నిశ్చయము సుమ్మీ ॥ 91**

తా॥శిష్యా! అచలమందు మొదట యెరుక యేమీలేదు, ఆ తరువాత చెలించేవి, చలించనవి, అనేక రకములైన జంతు జాలము అన్నీ పుట్టి పెరిగి నశించునట్లు, యివియన్నీ అలాగే అచలములో పుట్టి పెరిగి నశించినవని భావము.

**విశేషార్థము :** శిష్యా! అచలమనే బయలులో మొదట యెరుక యేమీ లేదు తరువాత సంకల్ప, వికల్పములు తమంతట తామె వచ్చి పెరిగి నశించును, అనగా తాను బయలైన స్థితిలో యెరుక ఉండదు, తరువాత సంకల్పములు వచ్చును, ఎలాగనగా జలములో మొదట చేపలు లేవు, తరువాత, పుట్టి పెరిగి నశించినట్లు, ఆ పరిపూర్ణములో యెరుక ఉత్పత్తి స్థితిలయములు పొంది లేకపోయెనని భావము.

**కం॥ నీరందు ఝషలేకనె - నీరునజన్మించి మించి నీల్గిన రీతిన్ - తోరమగు**
**బట్టబైటను - వారక గుర్తెరుగు మేనువ - చ్చున్ బోవున్ ॥ 92**

తా॥శిష్యా! నీటిలో చేపలు లేవు, తరువాత ఆ నీటిలోనే చేపలు పుట్టి పెరిగి నశించునట్లు. అంతటా ఉన్న బట్టబయలులో మొదట ఏమీ లేవు తరువాత గుర్తెరిగే శరీరం తనంతట తానేవచ్చి అనేక వికారములు పొంది, తనంతట తానే లేకపోయెనని భావము.

**కం॥ జలధి జలచరములోపల - గల దా జలరాశిలోని జలచరమువలెన్ - జలధినిత్యం**
**బనిత్యము - జలచరమట్ల చలచలము సరణులు గనుమీ ॥ 93**

తా॥శిష్యా! జలము చేపలలోపల యున్నదా! లేదు, జలములో చేపలు పుట్టి

పెరిగి నశించుచున్నవి. జలము నిత్యమైనది. చేపలు అనిత్యమైనవి అలాగే అచలము జంతు జాలమైన 84 లక్షల జీవరాశులయందు ఉన్నదా! లేదు ఆయచలము అంతటా ఉన్న ది దానిలో యివియన్ని పుట్టి పెరిగి నశించుచున్నవి, అచలము శాశ్వతమైనది. మానవులు మొదలుగా గల చరాచరములన్నీ అనిత్యమైనవి అని తెలియవలెనని భావము.

**విశేషార్థము** : శిష్యా! జలములో చేపలు లేవు, తరువాత వచ్చి నశించినట్లు, పరిపూర్ణములో ఏమీలేవు, తరువాత యెరుక తనంతట తాను వచ్చి అనేక చిత్ర విచిత్రములు చేయుచున్నవి, ఆ పరిపూర్ణములో ఉత్పత్తి స్థితిలయములు పొందుచూ, అనేక నటనలు చేయుచున్నది, అట్టి యెరుకను విచారించి గురు కరుణచే ఏమీ లేకుండా చేస్తే వున్నదంతా తానైన పరిపూర్ణమే యున్నదని భావము.

కం॥ **జలరాసికి బుట్టవుగద - జలచరములు వాటి కవ్వెజనియించుగదా - కలకాల మిట్లు బయలెరు - కలగాంచిన సంశయంబు కడకేగు జుమీ ॥ 94**

తా॥శిష్యా! జలమునకు చేపలు పుట్టవుగదా, వాటికవే పుట్టి నశించుచున్నవి, అలాగే బయలునకు యెరుక పుట్టదు, కానీ తనంతట తాను బయలులో వచ్చి తనంతట తాను నశించుచున్నదని గ్రహించునట్లైతే, యే సంశయము వుండదని భావము.

**విశేషార్థము** : శిష్యా! జలమునకు చేపలు పుట్టనట్లు, అచలమైన బయలునకు ఎరుక పుట్టదు, కానీ యెరుక తనంతట తాను పుట్టును, తనంతట తాను నశించును, యెరుకను యెరుకే విచారించి యెరుకను యేమీ లేకుండా చేసినయెడల, యిక శేషించి యున్నది బయలేనని గ్రహించవలెనని భావము.

కం॥ **పుట్టదు గిట్టదు వొకరిని - పుట్టించదు చంపబోదు భూమ యెరుకదా - పుట్టును గిట్టును వొకరినిపుట్టించును సమయజేయు భూమ కితరమై ॥ 95**

తా॥శిష్యా! బయలు పుట్టదు గిట్టదు ఇతరులను పుట్టించదు ఎవరిని చంపదు, బయలునకు యితరముగా ఉన్న యెరుక పుట్టును గిట్టును, వొకరిని పుట్టించును చంపును అని తెలియవలెనని, భావము.

**విశేషార్థము** : శిష్యా! బయలుకు చలనము లేదు, బయలు అంటే ఉత్తదని, యేమీ లేనిదని తెలివి లేనిదని మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగు ఇంద్రియములు వగైరాలు యేమీలేనిది గనుక, ఎరిగేదే లేదు, గనుక తాను పుట్టదు గిట్టదు, వొకరిని పుట్టించదు చంపదు, పరిపూర్ణము దీనికి ఇతరముగా యున్న ఎరుక తాను పుట్టును, గిట్టును, వొకరిని, పుట్టించును, చంపును. కారణమేమనగా, ఈ ఎరుకకు, తెలివి ఉన్నది, ఇంద్రియములున్నవి, మనస్సు, వగైరాలన్నీ వున్నవి, గనుక

వున్నవి, గనుక ఈ వికారములన్నీ, చేయునని, తెలియవలెనని భావము.

కం॥ కలలోపలయేనుగపై - గలదొరమేల్కొనిన నిల్వగలడా గురుడున్ - తెలిపి
బయలునీవు లేవిక - దలపకు మన నీకు నిల్వదరమా తలపన్ ॥ 96

తా॥శిష్యా! ఒక దొరగారు ఏనుగు మీద, అంబారిలో కూర్చుని ఊరేగిచున్నట్లు కల వచ్చినది, అంతలో మేల్కొన్నాడు, కలలేదు. ఊరేగింపు లేదు, ఏనుగు లేదు తాను మంచం మీద పడుకుని యున్నాడు, అలాగే గురువుగారు సూచనజేసి మేల్కొల్పగా, తాను బయలై యెరుకనే కల మేల్కొనగా యెరుకలేని బయలే ఉన్నదని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఒకడు యెరుకనె కలలో, ఏనుగును ఎక్కి ఊరేగినట్లు, కలవచ్చినది, ఆకల మేల్కొనగా యేమీలేదు, అలాగే గురువుగారు గురుసూచననే యుక్తి చెప్పగా, ఆ యుక్తివలన తాను విచారించగా తాను బయలై యెరుకయనే కలమేల్కొని తాను పరిపూర్ణుడైనాడని భావము.

కం॥ ఎందరులేదన్నను తా - నెందుకు లేకుండు బయలు నేనీవనకన్ - యొందరు
కలదని యన్నన్ - యెందుకు కలిగుండు యెరుక నేనీవనుచున్ ॥ 97

తా॥శిష్యా! ఎంతమంది లేదు లేదనినను బయలు లేకుండా,పోవునా! పోదు, బ్రహ్మము లు శాశ్వితముగా ఉన్నది, ఎంతమంది ఉన్నదని, యెరుకను నిలిపినా, యెరుక నిల్వగలదా, నిల్వకుండా పోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! యెరుక తనకు తా వీడిపో దెరుకను విడిపించ లేరు, యెవ్వరు ధాత్రిన్ గురుడొకడు తప్ప, కృష్ణ ప్రభువు అన్నట్లుగా. యెరుక సాధారణముగా లేకపోదు, మరి ఎలా పోవుననగా గురుసూచన ద్వారా విచారించినవారికి, యెరుక ఏమీ లేకుండా పోవును, తాను యెరుకలేని బయలైయుండునని భావము.

కం॥ నీకచ్చిరానియూరున - నీకే గృహమచ్చనట్లు నీవౌమేనన్ - నీ కచ్చి రాదు
నీవునిను - చేకొనుటము మానవయ్య శ్రేయస్కామా ॥ 98

తా॥శిష్యా! నీకు అచ్చిరాని ఊరిలో. నీకు ఇల్లు నచ్చనట్లు, నీవు నీమేను నీకచ్చిరావు, గనుక నీవు, నిన్ను నిలుపుకొనుట మానుము, అట్లు యెరుకను విడిచిపెట్టినయెడల నీకు మంచి కలుగునని భావము.

కం॥ అష్టాంగ యోగముల నతి - కష్టించే ప్రజలవలెనె కష్టించక యా - స్పష్టమగు
బోధవిను నీ - కష్టములన్నియును దొలగి కడకేగు సుమీ ॥ 99

తా॥శిష్యా! అష్టాంగయోగములు ఎన్నో కష్టములకు ఓర్చుకొనుచు చేసే ప్రజలు,

వలెగాక ఈ ప్రత్యక్ష ప్రమాణంమైన ఈ బోధను విన్నందువలన నీ కష్టములన్నీ తొలగి, సుఖమును కలిగించు నని భావము.

**విశేషార్థము :** శిష్యా! అష్టాంగయోగము లనగా, యమము, నియమము, ఆసనము, ప్రత్యాహారము, ప్రాణాయామము, ధ్యాన్నధారణ, సమాధియనినవి. యివి ఎనిమిది, ఎన్నో కష్టములకు ఓర్చుకొని చేయవలయును. ఈ ప్రజలు వలె నీవు కష్టపడ వలసిన, పనిలేదు. ఈ పరిపూర్ణబోధ అలవర్చుకొని యెరుకలేక సేవించవలెను. అంటే యెరుకను విడిచిపెట్టి తాను బయలైయుండవలెనని భావము.

**కం॥ ఇదిగాదు బోధనేదె - ల్పెదరమ్మని నీకు వేరెపేరిడియవలన్ - ముదమునసే బ్రహ్మననుచు - వదురు మనిన వాడె మాయవసుమతి లోనన్ ॥ 100**

తా॥శిష్యా! యిది గాదు బోధ, నే దెప్పేదే పూర్ణబోధ, రమ్మని పిలిచి, నేను చెప్పుచున్నాను చూడు, యిది పునర్జన్మ లేకుండా జేయును, నే వేరే పేరు బెట్టి, తరువాత నీవే బ్రహ్మవునని చెప్పేవాడే మాయకుడు. యిట్టి తరబోధల జోలికి బోకుము అని భావము.

**కం॥ మంత్రయంత్రములు ముద్రలు-తంత్రంబులు నీకు దెల్పిధనమడిగెటియా-మంత్ర జ్ఞుల మంత్రములకు - యంత్రములకు తంత్రములకు నీగకు కూనా ॥ 101**

తా॥శిష్యా! మంత్రములు, తంత్రములు, యంత్రములు, ముద్ర భావములు, జెప్పి ధనమడెగే, ఆ మంంద్రజ్ఞల, మంత్రములకు, తంత్రములకు, యంత్రములకు, నీవు వారు చెప్పే బోధలు వినవద్దని భావము.

**కం॥ దీపము గతికన్నులలో - పాపవలెన్ మెలగు నిన్ను పరమాత్ముడవం - చీప్రజలు దలతురెరుగక - నీ పాట్లెరిగుండి నేను నిను నమ్ముదునే ॥ 102**

తా॥శిష్యా! కన్నులలో దీపమువలె నున్న ఆపో జ్యోతి యైన పాపయను, నిన్నే పరమాత్మయని, ఈ ప్రజలు యెరుగక చెప్పుచున్నారు. కానీ నీపాట్లన్నీ నేనెరుగుండే నిన్ను నమ్మలేదని భావము.

**కం॥ తర్జనుల వలన జూపును - నర్చున వర్ణగతనీలమని శిష్యులకున్ దౌర్జన్యగురుడునీవువి - సర్జింపు మసత్యమనుచు - సజ్జన తిలకా ॥ 103**

తా॥శిష్యా! కన్నుల ప్రక్కల, వ్రేళ్ళతో, నొక్కితే, కనుపించే, మెరుపువలె, మెరిసే, అనగా, ఎరుపు, తెలుపు. నలుపు, ధూమ్రము, నీలము, మధ్య ఉన్న, ఆకాశమనే, నీలివర్ణములో ఉన్నదే, పరమాత్మయని చూపు, గురువు దుర్మార్గుడని విడిచిపెట్టుము సజ్జన తిలకా యని భావము.

కం॥ **పురుషోత్తముడని పూజలు - నరులొనరింపుదురు భువిని నానా చోట్లన్ - ధర మొదలగు భూతములను - చిరుత శిశువులాడుకొనెటి చేష్టల రీతిన్ ॥ 104**

తా॥శిష్యా! పురుషోత్తముడని, పరమపురుషుడని, అచలమై యున్నాడని, అతనికి పూజలు చేయుచున్నారు, చాలాచోట్ల నరులు కానియిది ఏలా ఉన్నదంటే, యేమీ తెలియని పిల్లలు తాటాకు బొమ్మలు చేసి ఆటాడుకున్నట్లు, ఆ చేష్టల రీతిగా చేయుచున్నారని భావము.

కం॥ **రసమనదగనిది వస్తువ - బసవన్నకదెట్లు లెరుక ప్రభువుకు దెలుసున్ - రుసమైతె విసము సగుణము - ససిగా దాముచ్చటంత చెవుల వినుటకై ॥ 105**

తా॥శిష్యా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము, గానిది బయలు, ఇట్టి బయలు తానవటము. ఎద్దు మొద్దులాంటి బసవన్నకు ఏమి తెలియును, అల్లమా ప్రభువుకు తెలుసును, తన్ మాత్రలు, సగుణము రసము గనుక విషము, యిలాంటి ముచ్చట్లు వినుటకు చెవులకు యితవుగా ఉండవని భావము.

**విశేషార్థము :** శిష్యా! రసముగానిది బయలు. అనగా తన్మాత్రలు లేనిది బయలు, ఇట్టి బయలు గురుయుక్తి వలన, తాను బయలు అపటము, ఇట్టి బయలపటము, వాచార్థ పరులైన ఎద్దు మొద్దులాంటి బసవన్నలకు తెలియదు. ప్రభువులైన అల్లమా ప్రభువులాంటి గురువులకే తెలుసును, తన్ మాత్రలు సగుణము, గనుక విషము, అనగా యెరుకే ఇట్టి ఎరుక ముచ్చట్లు వినుటకు చెవులకు ఇంపుగా ఉండవని భావము.

కం॥ **నీరాంశము స్వగ్వేదన-సారము రేతస్సురెంటి సమ్మిశ్రంబే-ధారుణి తనువై నిలుచును - నారీనరసగమమున నయగుణ రత్నా ॥ 106**

తా॥శిష్యా! మంచి గుణములు గల రత్నము లాంటివాడా నీరాంశము రక్తము అనగా నీరు త్రాగుట వలన స్త్రీలకు శోణితము ఏర్పడును పురుషుడు అన్నము తినుట వలన శుక్లము ఏర్పడును ఈ రెండు కలయిక వలన తనువై ఈ ధరపై వెలసెనని భావము.

కం॥ **మనుసన్న పుసూక్ష్మాంశము - వినుజలసూక్ష్మాంశవలన వెలసెను ప్రాణం - బును రెండు గలసి పిండంబన బ్రహ్మాండంబనంగ బరగును వత్సా ॥ 107**

తా॥శిష్యా! కుమారా మనస్సు అన్నము యొక్క సూక్ష్మాంశవలన వెలసెను ప్రాణము జలము యొక్క సూక్ష్మాంశము ఈ రెండు కలియుటచే పిండము బ్రహ్మాండము లాయెను యని భావము.

**విశేషార్థము :** కుమారా మనస్సు అనగా ఆకాశము ప్రాణమనగా వాయువు ఇదే పిండము ఆకాశమనగా బ్రహ్మాండము, పిండములో జీవుడు బ్రహ్మాండములో ఈశ్వరుడు, ఈ

 

జీవేశ్వరైక్యమే పరమపురుషుడు అనగా యెరుక యొక్క నడక మూడు విధములుగా ఉన్నది ఎట్లనగా ఇంద్రియములతో కలిసితిరిగేది జీవుడును, ప్రకృతి పురుషులకు అతీతమైనది పరమ పురుషుడు ఈ పరమ పురుషుడే బయలే ఇదే అచలము ఇదే పరిపూర్ణం ఇందు్క 141 కందార్థం పరమ పదమనిన బయలన -మరియు కందపద్యం పరమ పురుషుడీ బయలని గురుడెరిగించినను జూచి మరియు వాచార్థపరులకు యిది యేమీ తెలియదు ఎట్లనగా పొల్లు ఎంతదంచుకున్నా బియ్యం కానట్లు వాచార్థపరులకు ఎంత విచారించిన విషయం తెలియదు.

**కం॥ రెండు రీతులగనంబడు - చుండే యీమేని చేత చూచిబయలును - ధ్దండ తదీనిను శక్యని - యుండుము దీనందు వాంఛనుంచక శిష్యా ॥ 108**

తా॥శిష్యా ॥ రెండు విధములుగా కనుపించే ఈనేను మేనులను నేనుచే బయలను చూచి అనగా తాను బయలై ఈ నేను మేనులు ఉళక్కని ఎరిగి వీటిని విడిచి పెట్టుము ఎంత మాత్రం నిలుపవద్దని భావము.

**విశేషార్థము :** శిష్యా! రెండు రీతులు అనగా 25వదైన ఈశ్వరుడనే అక్షరుడు రెండవది 24 ఇంద్రియములతో వ్యవహరించేది జీవుడనేక్షరుడు ఈక్షరుడేమేను అక్షరుడేనేను యివి రెండు ఒకటే ఐనసూ రెండుగా కనుపించుచున్నవి ఎలానగనగా 25వదైన చైతన్యమనె అక్షరుడే 24 ఇంద్రియములలో కలిసి తిరుగుచునేను అక్షరుడను అన్న విషయము మరుచుట వలన దీనిని మరుపని కూడా అందురు ఈ విధముగా చెంచరించే క్షరుడనే చైతన్యము సుషిప్తినుంచి మేలుకకు వచ్చినట్లు ఒకప్పుడు ఇంద్రియములకు విలక్షణమై అక్షరుడనే ఈశ్వరుడగుచున్నాడు ఈవిధముగా రెండుగా కనుపించుచున్నది ఇట్టి చైతన్యము నేను మేనులను గురుముఖతా విచారించి గురు కరుణచే వీటిని రహిత పరచిన యెడల అనగా యెరుకను యెరుకే యేమి లేకుండా చేసిన యెడల తాను బయలై అచలయై పరిపూర్ణమై యుంటాడని భావము.

**కం॥ ద్వైతాద్వైత విశిష్టా-ద్వైతులమని కీచులాడు దయ్యములవలెన్-ద్వైతా ద్వైత విశిష్టా -ద్వైతులతో కీచులాడదగునేనీకున్ ॥ 109**

తా॥శిష్యా! ద్వైతులు అద్వైతులు విశిష్టా ద్వైతులు మమత మెక్కువని ఒకరిని ఒకరు దెప్పుకొనుచు కీచులాడే దెయ్యముల వలెను అట్టి ద్వైతా ద్వైత విశిష్టా ద్వైతులతో గొడవలు తగువులు పెట్టు కొనుట మంచిదికాదని భావము.

**విశేషార్థము :** జీవేశ్వర్లే గొప్పవారని ద్వైత మతం వారు ఈ రెండూ ఏకమైన అఖండమే గొప్పదని అద్వైతమతం వారు యివియే మీలేవు ఉన్నది అఖండమేనని విశిష్టా ద్వైతులు వారు చెప్పుచున్నారు ఇట్టి వారితో నీకు పని లేదు ఈ మూడుమతములకు అతీతమైన మనది మహాద్వైతమనేది మనది మతము కాదు సమ్మతము ఎలాగనగా జీవుడనగా

ఇంద్రియములతో కలసి తిరిగే ఎరుక యనే మరుపు. ఈశ్వరుడనగా ఈ ఇంద్రియము లకు విలక్షణమై తనకు తానైయున్న ఎరుక ఈ ఎరుకనే గొప్పదని చెప్పేది ద్వైతమతము జీవేశ్వర్లు లేనేలేరు ఉన్నది అఖండమేనని చెప్పేది విశిష్టా ద్వైతమతము, మనది ఈ మూడూ రహితమైన తరువాత శేషించి యున్నదే అనగా అఖండాను భవరహితమైనదే పరిపూర్ణ పరశివ స్వరూపమని అనగా జీవుడనే మలిన యెరుక ఈశ్వరుడనే యెరుకయనే యెరుక ఈ రెంటికీ అతీతమై అఖండమై యున్న శుద్ధ యెరుకే అచలము ఈ మూడు ఎరుకలు రహితమైనదే మహాద్వైతమనే పరిపూర్ణ పరబ్రహ్మమని కేవలాత్మయని మన పెద్దలు శెలవిచ్చియున్నారని భావము.

**కం॥ అనుభవవేదాంతులమని-తినరాని పదార్థమెల్ల తినుదుర్జనులన్ - కనబోకుము తద్బోధను-వినబోకుము యెన్నటికి వివేకవిచారా ॥ 110**

తా॥శిష్యా! అనుభవవేదాంతులమని తినరాని పదార్థములనెల్ల తినుదుర్జనులను కనబోకుము ఈలాంటివారు చెప్పేబోధలను వినబోకుము ఎప్పుడును, మంచి సుగుణవంతుడవగు ఓ బుద్ధిమంతాయని భావము.

**విశేషార్థము :** శిష్యా! తినరాని పదార్థములనగా మల మూత్రములు వీర్యంవమనాన్నము మొదలగునవి తినుట వలన యెరుకను మ్రింగి రహిత పరచితిమని వారి భావము యిటు వంటి వారిని ఎన్నడు కలియకుము. వారు చెప్పేబోధను ఎప్పుడూ వినవద్దు నీవు సుగుణముల గలవాడవు మంచి తెలివి తేటలు గలవాడవై విచారించే వివేకవంతాయని భావము.

**కం॥ జిహ్వోపస్థ విషయము - లెవ్విగలవొ వాటి విడువలేని గురువులన్ - యెవ్వరు జేరి కొలుతురొ - యివ్వ సుధను వారు జెడుదురిదినిజముసుమీ ॥ 111**

తా॥శిష్యా! జిహ్వోపస్తులు విడువని గురువులనగా జిహ్వకు యితవుగా వున్న పదార్థములను తినరానివైన త్రాగరానివైన తినుటయు త్రాగుటయు జారత్వము ఈగుణములను విడువలేని గురువులను ఎవరు శిష్యులు గా చేరి విద్య నేర్చు కొందురో ఈ ప్రపంచములో వారు చెడిపోవుట యదార్థము అని భావము.

**విశేషార్థము :** తినరాని పదార్థములు అనగా జంతువులను చంపితినేవారునూ కల్లు సారాయి వగైరాలు త్రాగే వారునూ అనగా తన భార్యను తప్ప ఇతరముగా యున్న స్త్రీల పొందు సల్పేవారును యిట్టి గుణములు విడువలేక పాటించే గురువులను అనగా ఈ అచల ఋషి సాంప్రదాయము పాడుచేయుచున్న దుర్మార్గపు దుర్జనులైన గురువులను ఎవరు ఈ ప్రపంచములో వారిని చేరి కొల్తురో వారు చెడిపోవుట నిజము సుమీ ఎందుకనగా తాను అచలమై యుండుట తెలియక వాచార్ద గురువులు చలనముతో తాను ఏమి చేయుచున్నది తెలియక ప్రవర్తించే గురువులను ఎవరు వారు చెడిపోవుట నిజమని భావము.

**కం॥ పాషండమతమువారల-వేషంబులు జూచి శిష్య వితతి భ్రమించున్ -ఈషత్తీ బోధెరుగక -దూషింతురు విన్న కన్న దుర్భాషణలన్ ॥ 112**

తా॥శిష్యా! పాషండ మతముల వారలను జూచి ఏమి తెలియని వారు భ్రమను జెందుదురు వారి వేషములను జూచి, కానీ వారి నిజ స్వరూపము తెలియక వారికీ బోధ తెలియదు ఒక వేళ విన్న కన్న ఈ బోధను దూషించెదరు అని భావము.

**కం॥ ఎందురుదూషించితెయే - మందరు మనవారెకాని యన్యులెవీ వాయందరితో వాదించక - నందంబౌనిట్టి బోధనరయరతంత్రీ ॥ 113**

తా॥శిష్యా! ఎంతమంది దూషించినా మనది పోయేదేమీ లేదు ఈ యందరూ మనవారె అన్యులు కారు నీవా అందరితో వాదించక ఈ అందమైన అచల బోధను విచారించి నీవు బయలై యుండి తరించమని భావము.

**కం॥ కోపమెపాపంబన బడు - కోపమెహంకారమనుచు కొనియాడబడున్ - కోపమెతాపంబనబడు - కోపమెమృత్యువన బడును కుటిల విరహితా ॥ 114**

తా॥శిష్యా! కోపము ఉండరాదు ఎందుకనగా కోపమెపాపము, అహంకారము కోపమె మృత్యువగును గనక కొపము పూర్తిగా విడిచి పెట్టి యేకుటిలము లేని వాడవై ఈ బోధ యందు వర్తించమని నీవు బయలై యుండుమని భావము.

**కం॥ నిజ గురు బోధ నెరుంగక-గుజగుజ శిష్యులకు జెప్పు గురువుల బోధల్ - భుజగ విషో పమమగుసుమి-సుజనౌఘము మెచ్చ దట్టి సుద్ధిని పట్టీ ॥ 115**

తా॥శిష్యా! నిజగురుబోధయనగా అచల సాంప్రదాయము ఎటువంటిదనగా నిజ గురుని వలన గురు సూచన యనే యుక్తి సంపాదించి తాను అచలమై యుండ వలెను గురు సూచన యనే యుక్తి సంపాదించి తాను అచలమై యుండవలెను ఇట్టి మార్గమెరుగక ఎంతో రహస్యంగా చెప్పుచున్నట్లు శిష్యులతో గుసగుసలాడుచు చెప్పే గురుబోధలన్నీ పాము విషము లాంటి దగును సుమీ, సుజనులైన ఘనులు మెచ్చరు, సుగుణములు గల బుద్ధిమంతా యని భావము.

**కం॥ తనువును విడి బ్రహ్మమనే - నను మును వటిసీ విచారమటు బెట్టిపుడున్ - నిను నీ తనువునువేరని - యనకను పరిపూర్ణమరసియవి విడువదగున్ ॥ 116**

తా॥శిష్యా! నేను తనువునుగాను, ఈ తనువకు విలక్షణమై, అతీతమై యున్న బ్రహ్మమును అనుకునే మునుపటి విచారణంతా అటుబెట్టుము, యిప్పుడు నిను నీ తనువును వేరని యనక, ఈ రెంటికీ అతీతమైన పరిపూర్ణబోధను గురుముఖతా విచారించి, నీవు బయలై తను వెరుకను విడిచిపెట్టుమని భావము.

**కం॥ కొందరు వైరాగ్యంబున - కొందరు తీర్థాటనమున కొందరు కర్మం - బందున వ్రతజ పతపముల - మరికొందరు నటియింతురిట్టి కోర్కెల మనుజుల్ ॥ 117**

తా॥శిష్యా! కొందరు వైరాగ్యముచే సన్యాసులై యుందురు, కొంతమంది కాశీవగైరా యాత్రలు గొప్పవని తిరుగును. మరికొందరు యజ్ఞయాగాదికర్మలు గొప్పవనుచుందురు మరికొందరు స్నాన సంధ్యా వందన జపతపములు గొప్పవని వాటియందే యుందురు యిట్టి కోర్కెలన్నీ విడిచి పెట్టి నీవు బయలై యుండుమని భావము.

**కం॥ కొందరు భక్తిత్రయమున - కొందరు యోగముల యందు కొందరు జ్ఞానం - బందు రమింతురు వారల - కందరికీ బోధ యిష్టతౌనానాయనా ॥ 118**

తా॥శిష్యా! కొందరు భగవంతుని యందు భక్తి జ్ఞాన కర్మత్రయము కలిగి యుందురు, మరికొందరు ఏకాంతముగా అనన్యముగా ఉండవలెనందురు, కొందరు యోగా భ్యాసములు చెయ్యవలెనందురు. మరికొందరు జ్ఞానమే గొప్పదందురు వీటి యన్నిటి యందు మనస్సు లగ్నము జేసి విచారించెదరు గనుక వీరందరికీ పూర్ణబోధ యిష్ట మౌనా! నాయనా యని భావము.

**కం॥ భ్రమరహితసహితజనులకు-సు మనసులనునరుల సమముజూచిన విశ్వం-బమరి లేకుండు నుండును - క్రమమున కలవంటిదగుచు కడు నిజముజూమీ ॥ 119**

తా॥శిష్యా! బ్రాంతి రహితులైన మహాత్ములకు ఈ జగత్తనే ప్రపంచము లేందని కల వంటిదని వారు లేక యుందురు బ్రాంతితో యున్న నరులు ఈ జగత్తనే ప్రపంచము నిజమైనదని నమ్మి యుందురు, అయిన బ్రాంతి రహితులు అందర్ని సమముగా జూతురు. కానీ వీరికిది కలయని ఇది మేల్కొయనే విషయము క్రమ క్రమముగా లేక పోవును అనగా అచలమనే బయలై యున్నారు గనుక రెండూ ఉండవని భావము.

**విశేషార్థము :** శిష్యా! బ్రాంతి రహితులంటే వారికి ఇంద్రియ ప్రపంచమనే జీవుని రహిత పర్చినారు ఇంద్రియములకు విలక్షణమై యున్న ఈశ్వర తత్వమునురహిత పర్చినారు, ఈ రెంటికీ అతీతమై అచలమై బయలైయున్నారు గనుక వారికి ఏ బ్రాంతి ఉండదు. బ్రాంతి సహితులైన నరులు 24 ఇంద్రియములలో తిరుగుచు ఇంద్రియములకు కావలసినవి తెచ్చి (చేసి) వాటి బ్రాంతిని తీర్చుచున్నాడు గనుక వాడు బ్రాంతిలో వాడు మరియు 24 ఇంద్రియములకు విలక్షణుడై యుండిన వానిని ఈశ్వరుడన్నారు ఈ ఈశ్వరుడనే యెరుకే ఇంద్రియములలో తిరుగుచున్నప్పుడు జీవుడనే మరుపగు చున్నది గనుక ఈ రెండూ ఒక్క యెరుకే అందుకే దీనిని మలిన యెరుకందురు ఈ రెంటికీ అతీతమై అఖండమైయున్న యెరుకను శుద్ధ యెరుకయని అన్నారు దీనికే బ్రాంతి లేదని భావము.

అందుకే యెరుక ఒకటి పరిపూర్ణమొకటి యున్నదని ఎటువంటి పశువైన అనడని శివరామ దీక్షితులవారు భ్రాంతి రహిత ప్రకరణములో శెలవిచ్చియున్నారు.

**క॥ కలతనను లేను కలనని-తలపోసెటి వారి మాటతమ కేనిజమౌ-కలలేనివారు కలవా - రలు వీరలెనొకరినొక రరయరిరువురున్ ॥ 120**

తా॥శిష్యా! కలలేందని కలమేలు కున్నవారు బైలైనవారు కలలో ఉండి కలనిజమనుకునేవారు ఈ మాటలు ఎవరివి వారికే నిజము. గనుక ఈ కలను విచారించి చూచిన వారికి కలలేందని తెలిసినది ఈ కలను విచారించని వారికి కలేనిజమనుకొనును గనుక కలమేలుకున్నవారు కలలోనివారు ఒకరి నొకరు విచారించి చూచుకొనరు గనుక ఎవరిది వారికే నిజమని భావము.

**విశేషార్థము :** కలనగా యెరుక ఈ యెరుకననమ్మియున్నవారిని అనేక వికారములు పొందించును అనగా యిదినాది దీనిని నేను చేసితిని యిది చేయుచున్నాను అను చిత్ర విచిత్రములనే ఆలోచనలను పొందించుచు అనేక పనులు చేయించుచుండును యెరుకనే కల మేలుకున్న వారికి యెరుకేలేదు గనుక వారికి సంకల్పమేలేదు ఆలోచించే మనస్సేలేదు ఏమిలేక అచలమై యుంటారు గనుక వారికి ఊహేలేదని భావము.

**క॥ ఎరుగుట జ్ఞానము దానను - జరిగే పని కర్మ మనుచు జనులెన్నిరి యీ - యెరుకయుకర్మము లేనిదె - పరిపూర్ణము వీటినీవు బట్టకు మెపుడున్ ॥ 121**

తా॥శిష్యా! ఎరిగే ఎరుకయే జ్ఞానము దీనివల్ల జరిగే పని కర్మయందురు జనులు ఈ ఎరుకయు కర్మయు లేనిది అనగా జీవేశ్వర్లు రహితమైన తరువాత శేషించియున్నది పరిపూర్ణం గనుక జీవేశ్వర్లును విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము :** ఎరిగే జ్ఞానమనే ఎరుక 25 వది చేసే పనియనే కర్మ ఎరుకయనె మరుపు అనగా ఇంద్రియములలో తిరిగే జీవుడు ఈ ఇంద్రియములకు విలక్షణమై నన్నింటికి అతీతమైనది అనగా ఇంద్రియములు లేనిది జ్ఞానమనే ఈశ్వరతత్వం ఈ ఈశ్వరతత్వం కూడా రహితమైనది యేతత్వములేనిది పరిపూర్ణం మీకు యింకా అర్థంకాలేదా వాచార్థ పరులకు అర్థం అవదు మళ్ళీ మీకు అర్థమయ్యేలాగు చెప్పెదను వినండి 24 ఇంద్రియములనే జీవుడనగా జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియము ఐదు, ప్రాణేంద్రియములు ఐదు, విషయేంద్రియములు ఐదు, అంతరేంద్రియములు నాలుగు మొత్తం 24. యిది మనకు కనుపించే స్థూల శరీరము దీనికి లోపల సూక్ష్మ శరీరం దీనికి లోపల కారణ శరీరం ఈ మూడు శరీరములు మరుపనేజీవుడు దీనికి అంతరముగా లోపల యున్నది మహాకారణమనే ఈశ్వరుడున్నాడు దీనికి అంతరముగా లోపల పరిపూర్ణం ఉన్నది అనగా వీటినన్నిటిని రహిత పరిచి కేవలం ఏమిలేక బట్ట బయలై ఉత్తదైయున్నదే పరిపూర్ణం తెలిసిందా అనగా మనలో ఉన్న ఎరుక పూర్తిగా

రహితమై యేమి లేక మనం ఉంటేనే పరిపూర్ణమని భావము.

కం॥ కలవారికి మేలుకలో - కలవారికి జాగ్రతందు కలహము గలదా - కలహించి రేనివారలు - కలవారలె మేల్కవారుగారెన్నటికిన్ ॥ 122

తా॥శిష్యా! కలలో చూచినవి కలనిజమని కలనుపొందేవారికి అనగా కలయనె యెరుకలో ఉన్నవారికి ఈ కలను గురుముఖతా విచారించి గురు కరుణచే మేలుకొని బయలైయున్నవారికి జాగ్రత యందు కలహముగలదా! గొడవలు పెట్టుకొనిన యెడల కలలో వారే మేల్కలో ఉన్నవారుకారిని భావము.

కం॥ సురలందుదో చుకలవలె- నరుదెంచును బ్రహ్మయందునఖిలజగంబుల్ - యరుదెంచియజానిగన్గొని - బిరబిర తామేగు నిల్వ బిడియంబగుచున్ ॥ 123

తా॥శిష్యా ॥ దేవతలకు కూడా కలవలె తోచును బ్రహ్మయందు తోచును అఖిల జగములుఅనగా యెరుక అనేక చిత్ర విచిత్రముగా చూచించును యిట్టి యెరుక పరిపూర్ణమును చూచిన యెడల నేను లేని దానినని తానే ఎరిగిన తానేలేక పోవునని భావము.

**విశేషార్థము :** శిష్యా! యెరుక దేవతులకు కలవలె తోచును ఈ యెరుక పరిపూర్ణములో కూడా తోచునుఈ యెరుకే గురు కరుణచే పరిపూర్ణమున్నదని ఎరిగిన యెడల అనగా తాను పరిపూర్ణమైన యడల ఎరుకే లేదు అనగా యిన్ని విధములుగా తోచే యెరుక బయలైన పరిపూర్ణమైనప్పుడూ తనలేమి తానుఎరిగి సిగ్గుపడి యెరుక యక్కడా ఉండకుండా పోవునని భావము.

కం॥ మనమీ బయలునలేనిదె -మనకు మనమె వచ్చి నిల్చి మనమేగినయే -మనక మన జోలి గొనకన్ -తనకైతానుండి యున్నదిదు గోకనరా ॥ 124

తా॥శిష్యా! బయలందు మనము లేము ఆ బయలులో యెరుకయనే మనము మనకు మనమే వచ్చి కొంతసేపు ఉండి మనకు మనమె లేకపోతిమి అనగా తాను బయలైయున్న బయలులో యెరుకనే మనము వచ్చినా పోయినా ఆ బయలు ఏమి అనక తనకుతానైయున్న బయలు అదిగోచూడుము దానిని విచారించి ఆ బయలు ఏలా ఉన్నదో అలాగు నీవు బయలై ఉండుమని భావము.

కం॥ జ్ఞానంబు సత్వ గుణమను - దానికి జన్మించెననుచు దామోదరుడా - మేనత్త కొడుకుతోననె - జ్ఞానమునకు జన్మమొకటి గలిగెగదోయీ ॥ 125

తా॥శిష్యా! జ్ఞానము సత్వ గుణమునకు జన్మించినది యని శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునితో ఆ జ్ఞానమునకు జన్మమొకటి గలిగె గదోయి యని చెప్పెనని భావము.

**విశేషార్థము** : శిష్యా! ఎవరైన సత్వ గుణము గలిగి యున్నవారు జ్ఞానులని గ్రహించుకొనుము అనగా సత్వగుణమునకు జ్ఞానము గలిగినది ఈ జ్ఞానము వలన అజ్ఞానము కలిగెను అజ్ఞానము వలన జగత్తు గలిగినది యిన్ని విధములుగా తోచిన ఎరుక బయలును చూస్తే నిలువ కుండా పోవునని భావము.

**కం॥ పుట్టింది గిట్టు జ్ఞానము -పుట్టెననుచు కృష్ణమూర్తి పురుహూతజుడౌ - నట్టి తనుముద్దు మరిదికి -గట్టిగ విన జెప్పెనిందుకలతే మోయీ ॥ 126**

తా॥శిష్యా! పుట్టిన జ్ఞానము కొన్నాళ్ళకు నశించును అని శ్రీ కృష్ణ పరమాత్మ తన ముద్దుల మరిదిగారైన అర్జునునకు గట్టిగా వినజెప్పెనని అందువల్ల ఏగొడవలేదని భావము.

**కం॥ జ్ఞానమగునీవు జ్ఞేయం-బైన బయలు గాంచి జ్ఞానమగు నిను నీవే-లేనంచు దెలియుమని తా -నానరునకు వాసుదేవు డానతియిచ్చెన్ ॥ 127**

తా॥శిష్యా! జ్ఞానమనగా 25 వ దైన ఈశ్వర తనువు అట్టి నీవు 26వదైన జ్ఞేయము బయలును చూచి అనగా నీవు బయలై జ్ఞానమనేనీవు లేనని ఎరిగి నీవు లేకపోతే ఉన్నది బయలేనని శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు వినజెప్పెనని భావము.

**కం॥ మనమచలమనదగదుతగ-దనుటయు మనమ చలమునకు తగవేరని రెం-డని లేవు మనమ చలమని-వినుమనముళ్ళక్కి తెలియ విడు మనము మనన్ ॥ 128**

తా॥శిష్యా! మనం 26 వతత్వమైన అచలం మనమౌట చాలా కష్టమైన పని గనుక మనము చలమనుట తగదు అనకూడదు సుమీ ఉన్నది అచలమె నీవు వుళ్ళ క్కి గనుక నీవు లేనని తెలుసుకొనుము గనుక జీవేశ్వర్లును విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము** : శిష్యా! మనమచలమని అనుట తగదు మచలమని యెరుకని రెండనవేరని అనకూడదు మనము చలమని వినుము అనగా మన స్వరూపం అచల స్వరూపమై ఎలాగనగా తల్లి గర్భము లో పిండ మేర్పడి నప్పుడూ యెరుకలేక అచలమైయున్నది తరువాత తెలివి వచ్చినది అయినా అచలమై చలనము లేక యున్నది ప్రపంచములోకి వచ్చిన తరువాత కూడా అచలమైకొన్నాళ్ళున్నది ఆ తరువాత కొద్ది కొద్దిగా మనము అన్నీ నేర్చినాము ఈ విషములన్నీ మనందరకూ తెలిసినవేనని ఎరుగుము ఈ అచలమైయున్న పిల్ల వానికి మనమెన్ని నేర్పామో వాడు ఎన్ని నేర్చుకొన్నాడో అన్నీ ఇప్పుడు రహితపర్చుకుంటే ఉన్నది అచలమేనని భావము.

కం॥ జ్ఞానము నేననునొక్కటె - జ్ఞానము నేవేరటంచు గనపోకు సుమీ - జ్ఞానము వచ్చును బోవును - జ్ఞానా తీతమును తానుగాంచిన దొకన్ ॥ 129

తా॥శిష్యా! జ్ఞానము అన్నా నేను అన్నా పురుషుడన్నా అక్షర మన్నా ఇవియన్నీ ఒక్క యెరుకే గనుక నేను వేరు జ్ఞానము వేరని ఎన్నడూ అనుకోకుము ఈ రెండూ ఒక్కటే ఈ జ్ఞానము వచ్చును, పోవు చుండును గనుక ఈ జ్ఞానానికి అతీతముగా ఉన్న పరిపూర్ణమున్నదని ఎప్పుడైనా ఈ యెరుక చూచినదంటే యెరుక యేమీ లేకుండా పోవునని భావము.

కం॥ నీకలనువచ్చి పోయిన-లోకులలోకములవలెనె - లోనినుగనుమీ - నీకలను నీవు మేల్కని - యీ కలనటువలెనె చూస్తె యెటునిల్వపురా ॥ 130

తా॥శిష్యా! నీకు కలవచ్చును పోవును అలాగే ఈకల లోకులకు వచ్చును పోవును గనుక నీకల మేలుకుంటే కలలేకపోయినది అలాగే నీకు వచ్చిన కల జ్ఞానా జ్ఞానమని ఎరిగి నీవు బయలైతే అది మేల్కనే అచలం అనగా నీకు కలలో ఎన్నో వచ్చినవి మెలుకవలో ఏమైనా ఉన్నవా అలాగే నీవచలమైతె ఏమిలేనని భావము.

**విశేషార్థము** : కలనగా లేనెరుక, మేల్కనగా బయలనె అచలం ఈ అచలములో కలతోచినది ఈ కలను గురుయుక్తి చే మేలుకొంటే నీవచలమై కలయనె యెరుక లేక ఉంటావు అలాగే లోకులైనా ఎవరైనా సర్వకాలముల యందు నీవు బయలనే అచలమైయుంటే యెరుకనేకల ఏమీ లేకుండా పోవునని భావము.

కం॥ అందరికలనీకలెకద-అందరునీకలను వచ్చి అగుపడిపోవన్ - కందువుగద విన్నట్లనె - మందమతీకనగదోయి మరిలేననుచున్ ॥ 131

తా॥శిష్యా! అందరికి వచ్చిన కలె నీకు వచ్చెను గదా ఆకలలో అందరిని నీవు చూచితివి అలాగే వారు కూడా ఆకలలో నిన్ను చూచితిరి కల వచ్చి పోవును గదా అలాగే నిన్ను నీవు విచారించిన నీవు లేకపోతే తానైన బయలే గద ఉన్నది అని భావము.

**విశేషార్థము** : శిష్యా! నీవు బయలై ఉండకపోతే ఈ కలనెయెరుక తోస్తూనేయుండును గనుక నీవు సర్వకాలముల యందు బయలై అచలమై యుంటే ఆకలయనే యెరుక ఎప్పుడూతోచదు గనుక యెరుక యనే కలనునీవు గురుముఖతా విచారించి ఈ కలను మేలుకుంటే నీవు బయలనే అచలమై యుంటానని భావము.

కం॥ అకాశమనిన శూన్యం - బాకాశంబనినసగుణ మాకాశమనన్ - కాకివలెనల్ల రూపుది - అకాశము మితములోన నణ గుండు జుమీ ॥ 132

తా॥శిష్యా! అకాశమనగా శూన్యరూపము అకాశమనగా సగుణము అకాశము కాకివలె నల్ల రూపము గలది. అనగా, ఎరుపు-తెలుపు-నలుపు-ధూమ్రము, ఈ మధ్య

నున్నది, ఆకాశము, ఇదే యెరుక, ఈ యెరుకను, ఆకాశము, నీకు సూచన జేసిన మితములో అణిగి ఉన్నది అని భావము.

**విశేషార్థము** : శిష్యా! ఆకాశమనగా బయలాంశము, ఆకాశమనే యెరుక శూన్యమైనది, ఇదే ఆత్మ ఇది ఇంద్రియములకు విలక్షణమై యున్న ఎరుకే, నీవు అనగా నీ స్వరూపం బయలు అందువల్ల ముందు నీ స్వరూపం నీవైయుంటే, అన్ని విషయములు నీకు తెలియబడును, ఆ పైన గురుముఖతా విచారించిన యెడల నీవు అచలమై ఉంటావని భావము.

కం॥ **ఆకాశమనిన కాలం - బాకాశంబన విలంబమాకాశమనన్ లోకమున చంచలం బగు - నాకాశము శబ్దరూపమగువినవోయీ ॥ 133**

తా॥శిష్యా! ఆకాశమనగా కాలము, ఆకాశమనగా కాళీగా బయలాంశమై యున్నది, గనుక అందులో యింకోవస్తువు కల్పింపబడుచున్నది, ఆకాశమనగా శబ్దరూపమని తెలుసుకోమని భావము.

కం॥ **అహమేతనువీవిశ్వం - బహమే జీవేశ్వరులన నహమె తదైక్యం - బహమే యహముకు మూలం - బహమణగిన నణగు నన్ని యనఘ చరిత్రా ॥ 134**

తా॥శిష్యా! అహమే తనువనే యెరుక అహమే విశ్వమనే ఇంద్రియ ప్రపంచము, అహమే జీవుడు ఈశ్వరుడు, అహమే ఏకమైయున్న తత్వము, అహమనే, యెరుకే యెరుకకు మూలం, అహమనే ఎరుక లేకపోతే ఏమీ లేదని, శేషించియున్నది బయలేనని తెలియవలెనని భావము.

**విశేషార్థము** : శిష్యా! సమస్తానికి సాక్షీభూతమైన నేననె అధిష్ఠానము అహమె, నేను మేనులు అహమె, ప్రకృతి పురుషులు అహమె, జ్ఞానా జ్ఞానములు అహమె, సమస్తము అహమె, అహములేకపోతే ఏమీలేదు, అనగా అహము లేనిది, ఒక్క పరిపూర్ణం తప్ప, ఉన్నదంతా అహమె, గనుక సద్గురు మూర్తి కరుణ సంపాదించి, గురు సూచన వలన విచారించి, అహమును రహితపర్చిన యెడల, ఉన్నదంతా తానైన పరిపూర్ణమే నని భావము.

కం॥ **భ్రమయనిన పుట్టు కనినను -భ్రమకేనామంబు లిట్టి భ్రమనే నీవున్ - భ్రమె యీ మేను జగత్తులు - భ్రమెయెరుకయు మఱపు రెండు భ్రమె భ్రమవినరా ॥ 135**

తా॥శిష్యా! భ్రాంతి, యనినను, పుట్టుకనిన, నీవనిన, నేననిన, జగత్తనిన, యెరుక యనిన, మరుపు యనిన, ఈ పరియాయ నామలన్నీ బ్రమకే, యిన్ని నామములు ఏర్పడినవి, రెండుగా కనుపించే వన్నీ బ్రమకే, బ్రమలేనిది ఒక్క పరిపూర్ణం మేనని తెలియవలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! భ్రాంతి రహితమె బ్రహ్మము బట్టబయలని తెలియవలెను, అనగా యేభ్రాంతిగాని యేఊహగాని యే సంకల్పముగాని తానులేక ఉత్తదై యున్నదే పరిపూర్ణ పర బ్రహ్మమని భావము.

కం॥ **యెరుక సుమీ బ్రహ్మనినను - యెరుక సుమీ మాయయనిన యెరుకే జీవుం - డెరుక సుమీ ఈశ్వరుడన - యెరుక సుమీ నేను విశ్వమిది సత్యమురా ॥ 136**

తా॥శిష్యా! యెరుకే సుమీ బ్రహ్మయనినను, యెరుకే సుమీ మాయయనిన, యెరుకే సుమీ జీవుడనిన, యెరుకే సుమీ ఈశ్వరుడనిన, యెరుకే సుమీ నేననిన, యెరుకే సుమీ విశ్వమనిన, యిది సత్యమురా యని భావము.

కం॥ **మాట సుమీ నేననినను - మాట సుమీమాయనిన మరి జీవశివుల్ - మాట సుమీ బ్రహ్మనినను - మాట సుమీ మేను జగము మాటే సుమ్మీ ॥ 137**

తా॥శిష్యా! మాట సుమీ నేననిన, మేననిన, మాటసుమీ బ్రహ్మమనిన, మాయయనిన, మాట సుమీ జీవుడు, శివుడనిన, మాట సుమీ నీ వనిన జగమనిన, యివియన్నీ మాటేయని తెలియుము, మాటలేనిది ఒక్క పరిపూర్ణమేనని భావము.

**విశేషార్థము :** శిష్యా! మాటలేనట్టి బయలున మాటగలిగెననుట వినుట మాయగ దయ్యా అని 2వ పద్యములో శెలవిచ్చియున్నారు అంటే బయలులో నుండే మాట వచ్చినదని, ఈ మాట మాయని చెప్పియున్నారు, అందువల్ల ఈ బయలులో ఎవరికి కనబడకుండా దాగియున్న వాక్కే పరావాక్కు, అనగా నిశ్శబ్దమైయున్నది పరావాక్కు చెట్లనుంచి వచ్చేవాక్కే ఓం మని వచ్చేదే పశ్యంతి వాక్కు పశువుల నుండి వచ్చేదే మధ్యమవాక్కు, మనుష్యులనుండి వచ్చే వాక్కే వైకరీవాక్కు, అనగా పరా పశ్యంతి మధ్యమ వైకరి అని నాలుగు విధములు ఈ వాక్కులు, అందువల్ల ఈ మాటే అన్నీ అయినవని తెలియవలెనని భావము.

కం॥ **ప్రకటమగు బింబ మందున-ముకురము ముకురస్థ బింబములు లేవెపుడున్-ముకు రంబువలన బుట్టును - ముకురస్థము దాని వలన ముకురము దోచున్ ॥ 138**

తా॥శిష్యా! ప్రశిద్ధముగా బయలులో మొదట ఏమిలేవు, తరువాత అద్దము యందు తోచిన ప్రతిబింబము వలె బయలులో తనంతట తానుగా తోచినది, అక్షరమనే పురుషుడు, దానియందు క్షరమనే ప్రకృతితోచి జగత్తైనది, యివి పరిపూర్ణములో లేవని భావము.

**విశేషార్థము :** శిష్యా! ప్రశిద్ధముగా శాశ్వితముగా ఉన్న పరిపూర్ణములో ఏమిలేవు, అద్దములో ఏమిలేదు తరువాత తన ముఖము అద్దములో కనుపించినట్లు, పరిపూర్ణములో యెరుక తనంతట తానే తోచినది, ఈ యెరుకే విశ్వ జగము లైనది

యిట్టి యెరుకను, గురుముఖతా విచారించి చూడగా ఎరుక ఏమీలేదు. పరిపూర్ణమే యున్నదని ఎరుగవలెనని భావము.

**కం॥ లేనిని రాకడే స్వ - ప్నానందమునీకు గురుడు పరిపూర్ణంబున్ - పూని**
**తెలిసి మేల్కొలిపిన - నేననకను నీవు బోవనీ మేల్కదిరా ॥ 139**

తా॥శిష్యా! నీ రాకడ స్వప్నానందము వంటిది. నీకు సద్గురుమూర్తి సూచనజేసి పరిపూర్ణమును పూనికతో చూచించి తెలియజేసి మేల్కొల్పిన, ఆ మేల్కలో విచారించి నీవు లేకపోతేనే మేల్కదిరాయని భావము.

**విశేషార్థము : శిష్యా!** నీవనే యెరుక, బయలులో వచ్చుట, పోవుట, స్వప్నము వంటిది, అనగా లేనిదని అర్థము. సద్గురు మూర్తి సూచనజేసి పరిపూర్ణమును చూచించి, అనగా పరిపూర్ణమును నీకు ఎరిగించి మేల్కొల్పగా శిష్యుడు ఆ మేల్కను గ్రహించి విచారించి తాను, పరిపూర్ణుడై యుంటే నీవనె యెరుక ఎక్కడా నిల్వకుండా లేకపోవును. యెరుక లేకపోతే ఉన్నది తానైన పరిపూర్ణమేనని భావము.

**కం॥ తనకుదానొరులు వణికిన - ధ్వని బుట్టని చోట బ్రహ్మతనుదా నొరులున్ - వనకిన**
**ధ్వనిగల చోటది - వినుమాయయు లేని మాయ విడులేననినన్ ॥ 140**

తా॥శిష్యా! తనకు తాను వచ్చి తాకినగాని యితరులు వచ్చి తాకినగాని, ధ్వనిబుట్టని చోటు బ్రహ్మమనియు, అనగా పరిపూర్ణమనియు, ధ్వని బుట్టిన చోటు మాయయనియు గనుక దానిని విడిచి పెట్టుమని భావము.

**విశేషార్థము** : శిష్యా! తనను యితరులు తాకిన శబ్దము బుట్టును, ఇతరులను తాను తాకిన శబ్దము బుట్టును, అనగా యెరుక గలిగిన చోటులో శబ్దము కలుగును, యెరుకలేని చోటులో శబ్దము బుట్టదు. ఈ శబ్దము గల యెరుక మాయగనుక దానిని విడిచి పెట్టుము యెరుక లేనిచోటు పరిపూర్ణమని యెరిగి, నీవు ఆ చోటులో సర్వకాలం పరిపూర్ణమై యుండుదువని భావము.

**కం॥ మనసుకు వాక్కుకు దెలియని - ఘనవస్తువు బయలటంచు గని యా రెంటిన్-**
**నినునను విశ్వముగాగని - వినుమూలము లేదని విటి విడరా శిష్యా ॥ 141**

తా॥శిష్యా! మనస్సునకు వాక్కునకు తెలియని గొప్ప వస్తువు బయలని గని, అనగా తాను బయలై నిను నన్ను ఈ రెంటిని, ఇంద్రియములతో కలసి తిరిగే ప్రపంచమని ఎరిగి గ్రహించి, వీటికి మూలము లేదని ఎరిగి, ఈ నేను మేనులను విడిచి పెట్టి బయలై యుండుమని భావము.

**విశేషార్థము** : శిష్యా! మనస్సునకు గాని, చిత్తమునకు గాని, బుద్ధివలను గాని, అనగా దేని వలన గ్రహింపరాని వస్తువుబయలని ఎరిగిచూచి, అనగా తాను బయలై యిట్టి

బయలులో నీవని, నేనని తోచే జగత్తు మాయయని, లేనిదని, ఎరిగి, వీటిని విడిచి పెట్టి నీవు మాత్రం బయలై త్రికాలముల యందు ఉండుమని భావము.

కంII **కలలో వానికిమేలుక - గలదని గుర్తెరుగవశమె కలమేల్కనినన్ - కలవాడు గలడె తెలియను - తలపోయుము నిన్ను నీవు తగనేరితిన్ ॥ 142**

తా॥శిష్యా! కలలో ఉన్నవానికి, అనగా కలలో ఏనుగును ఎక్కి, ఊరేగినట్లు కలవచ్చినది. తరువాత కొంత సేపటికి మెలుకువ వచ్చినది. ఆ కలలేదు, ఏనుగు లేదు, ఊరేగింపు లేదు, జాగ్రవావస్థ ఉన్నది, తాను మంచము మీదనే ఉన్నాడు, ఓహో యిది కల అనుకున్నాడు, ఆ నేననే కలలో ఉన్నవానికి, మేలుక ఉన్నదని తెలియదు. మేలుకున్న తరువాత కలలేదు, అలాగే ఎరుకనే కల ఉన్నవానికి, మేల్కనే పరిపూర్ణమున్నదని, ఎరుగ తరముగాదు అలాగే వాచార్థపరులు కూడా ఎరుగ తరమేఎరుగ వార్కి, పుణ్యోదమున సదురు మూర్తి లభించి గురు మేల్కపొందిన యెడల, యెరుకనే కల ఉన్నదా! మేల్కలో ఉంతదని భావము.

కంII **కలవాడు వాని చదువులు - గలవాశామేలు కనినగను గొనుమటులన్ - కల నిన్ను నీదు చదువును - ఫలమే మిక చాలు పెక్కు పలుకుల తండ్రీ ॥ 143**

తా॥శిష్యా! కలలో ఉండ చదువుకొనుచు ఎన్నో శాస్త్రములు పఠించి నేర్చుకొనెను, కొంతసేపటికి మేలుక వచ్చినది, కలలేదు, శాస్త్రములు లేవు, చదువులేదు. అలాగే ఎరుకలో ఉండి ఎన్నో శాస్త్రములు చదివి, ఎన్నో విద్యలు నేర్చుకొనెను కాని ఫలితము లేదు, గురుకరుణచే మేలుకొని పరిపూర్ణమయ్యేనరికి ఎరుక యనేకల లేదు, శాస్త్రములు చదువులు, విద్యలు, ఏమీలేవు. గనుక కలలో చదువులు పెక్కుమాటలు యెందుకు తండ్రీయని భావము.

కంII **కలరాజు సకలసంప -త్కలితుండై తాను మేలుకన లేడెచటన్ - కలనిన్ను వాని విధమున - దలపుము తలచితివె చాలు ధన్య చరిత్రా ॥ 144**

తా॥శిష్యా! కలకను చున్నరాజుగారికి, కలలో సిరిసంపదలు ఎన్నో కలిగినవి, ఆకల మేలుకొనెను, ఆ సిరి సంపదులు ఏమీ కనుపించ లేదు, అలాగే, గురు కరుణచే యెరుకనే, కల మేలుకుంటే, నీవులేవు నీవు పొందుచున్న ముచ్చట్లనే, కలలేదని తెలుసుకొని నీవు బయలై యుండుమని భావము.

కంII **ఏ నిర్ణయమునుజేయడు - నేననని మహాత్ముడెపుడు నేనను వాడే - నానా విధాల చదురును - నేనను తనవంటి వారినెప్పుడు గనినన్ ॥ 145**

తా॥శిష్యా! నేనసని మహాత్ముడెపుడు యేనిర్ణయమును జేయడు, నేనను వాడే సకల నిర్ణయములు చేయును, గనుక నేననే తనవంటివారిని, ఎప్పుడు గనిన అప్పుడు యే నిర్ణయము చేయక తాను బయలై ఉండమని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేననగా అహం ఈ అహమును, రహిత పర్చిన వారు, నేననని మహాత్ములు, అనగా వీరికి ఇంద్రియములు లేవు, ఇంద్రియములకు విలక్షణమైన ఆత్మలేదు, గనుక తానులేని తానైయున్నవాడే మహాత్ముడు గనుక, వీరిక ఊహలేదు, గనుక ఏ నిర్ణయము చేయడు, నేను సంపాదించితిని, నేను యిది చేసితిననువాడే నేనను వాడని ఎరిగి అందరు తనలాంటి వారని గ్రహించి తాను బయలై యుండెనని భావము.

**కం॥ మలుకలు లేవీత్రోవను - చులుకనగా దెలియవచ్చు సుజనులకెల్లన్ - తలుపదగు దీని నెప్పుడు మలకల త్రోవలకు బోక మాన్య చరిత్రా ॥ 146**

తా॥శిష్యా! మలుపులు మాలిన్యము లేని అచలబోధ, సులువుగా తెలుసుకొనవచ్చును, ఈ మార్గం సుజనులు ఐతే సర్వవేళలయందు విచారించవలెను, మలకలు ఉన్న త్రోవకు బోకుము, పొగడ దగిన చరిత్ర గలవాడా యని భావము.

**కం॥ నామాట నమ్మవేమో - నీమానస మెరుగ కంటి నేనీమాటన్ - నా మాట పద్యమైనను - యేమారకు దీన్నినీవి కెప్పటికప్పా ॥ 147**

తా॥శిష్యా! నామాట నమ్మవేమో, నీ మనస్సు తెలుసు కోకుండా నేనన్నాను, ఈ మాట, నామాట, పద్యముగా వున్నను, దీనిని ఎప్పుడు ఏమర్చియుండకు అనగా, రెప్పపాటులో సకం కాలమైనా మరువక, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేకుండా చేయవలెనని భావము.

**కం॥ సిద్ధాంతోక్తులు యివినీ - బుద్ధికి దెలసుండి చదువబోకుము వీటిన్ - బుద్ధుల వినుమని వారలు - యుద్ధమునకు కాలు ద్రవ్వుచుందురు పెలుచన్ ॥ 148**

తా॥శిష్యా! ఈ పరిపూర్ణ బోధ చాలా గొప్పది, యివి సిద్ధాంత వాక్యములు యివి వినుమని, యితర మతస్తులకు చెప్పబోకుము, నీవు గ్రహించుకొని, వారి యొద్ద చదువ, బోకుము, వినుమనిన వారు వినరుగదా, యుద్ధమునకు కాలు దువ్వెదరు అని భావము.

**కం॥ ముద్దుగ యీ గ్రంథంబును - పెద్దలముందర వచింప పిరిదివియకుమీ - దిద్దెదరు తప్పులున్నను - వద్దనకను దిద్ద నివ్వు వరకీర్తి నిధీ ॥ 149**

తా॥శిష్యా! మంచికీర్తి గలవాడా, ముద్దుగా ఈ గ్రంథమును, పెద్దల ముందర చదువుము, వెనుకాడకు వారు ఏమైనా తప్పులుంటే దిద్దెదరు, వద్దనక దిద్దనీయుము అని భావము.

**విశేషార్థము :** శిష్యా! పెద్దలనగా ఈ అచల బోధలో ఆ రూఢాతీతులు అట్టివారియొద్ద

చదువుము, అలాంటి మహాత్ములముందు చదువుటకు వెనుకాడకుము, తప్పులున్న యెడల దిద్దెదరు, అనగా నీవే బయలవ్వాలి, మనకు కనుపించె బయలు యాలా ఉన్నదో ఆలాగునమనము తయారవ్వాలి, అని చెప్పిన వారే పెద్దలు అనగా, మనలో యేగుణములు లేకుండా పోయినప్పుడే పరిపూర్ణము అని చెప్పినవారే పెద్దలు, గనుక వారు చెప్పినట్లు దిద్దుకొని తయారవటమేనని భావము.

**కం॥ నేనుగల మేనులేదని - మేనున నీ వుండి యిట్లు మిడుకుట మేలా - మేనును విడిచను వినియెదు - మానుగనీ వనక యున్న మాయవె సుమ్మీ ॥ 150**

తా॥శిష్యా! నేను శాశ్వితముగా ఉండేదానిని, ఈ మేను ఒకప్పుడు ఉండి ఒకప్పుడు లేనిది, అని ఆమేని యందుండి అట్లనుట మంచిదా, మేనును విడిచి చెప్పుము, వినియెదము, యివి మానుకొని నీవు నేనే బ్రహ్మనని అనకు, నీవు మాయే, లేనిదానివె నని తెలుసుకొని పరిపూర్ణమై యుండుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేననేది యన్నడు బ్రహ్మమనే పరిపూర్ణంకాదు, నేను శరీరం లేకుండా ఉండలేదు, ఈనేననే చైతన్యము, శరీరం ఆధారముంటేనే ఉండగలదుగాని, లేకపోతే ఉండలేదు, ఈ నేనుమేనులు లేకుండా ఉండేది ఒక్క పరిపూర్ణమేనని భావము.

**కం॥ కట్టెలు పిడుకలు లేకను - యెట్టుంబలెనిప్పు నిల్వకేగునొ పుడమిన్ - అట్టుంబలెనే నీవును - యిట్టి శరీరం బులేక నెందుందువురా ॥ 151**

తా॥శిష్యా! కర్రలు, పిడకలు లేకుండా నిప్పు ఎట్లు నిలువలేదో, అలాగే ఈ నేను, మేననే శరీరము, లేకుండా ఎక్కడ ఉండును, శరీరము లేకుండా నేను ఉండలేదని భావము.

**విశేషార్థము :** శిష్యా! నేను అనగా చైతన్యమనే 25వదైన ఈశ్వర తనువు, ఈ నేననే చైతన్యం, శరీరమనే మేను లేకుండా ఉండుటకు అవకాశము లేదు, నేను లేకుండా శరీరమనే మేను నిలువలేదు ఇందులో ఒకటి లేకపోతే రెండవది ఉండలేదు, కట్టెలు, పిడకలు లేకుండా నిప్పు యాలానిలువలేదో, శరీరము లేకుండా ఈనేను ఉండలేదని భావము.

**కం॥ తనువునేగాననంటే - ఘన సుకదుఃఖములు రెండుగను పడెనీపై - గనుక తనవు నీవొక్కటె - వినరా నా మాటనిట్టి వెర్రిన బడకన్ ॥ 152**

తా॥శిష్యా! నేనువేరు, తనువువేరు, నేను తనువును గానంటే, ఈ సుఖ దుఃఖములు నీవు నీ తనువు అనుభవించుట కనుబడుచున్నది, గనుక నీవు నీ తనువు ఒక్కటేరా నాయనా, వెర్రికూతలు కూయక నా మాట నమ్ముమని భావము.

**కం॥ ఎరుకలేనట్టి బయలున - బిరబిరనరుదెంచి యెవరు బిలువనిదెలా - నరసి పరిపూర్ణమున్నది - యెరుకేగితె చాలులేని దెరుకని లేకన్ ॥ 153**

తా॥శిష్యా! ఎరుకలేని బయలున ఎవరు పిలువకుండా, ఎరుక తనంతట తానేవచ్చి తానంతట తాను విచారించుకొని, పరిపూర్ణమున్నదని, యెరుకలేదని, ఎరిగి ఎరుకలేకపోతే చాలు ఉన్నది పరిపూర్ణమేనని భావము.

**కం॥ తనువునేగాననంటివి - విను సుఖదుఃఖములు యెవరి విరనాతోడన్ - వినజెప్పుమునే వినియెద - తనయా తప్పితె వెనిన్నుు దండింతుజుమీ ॥ 154**

తా॥శిష్యా! తనువు నేనుగాను అంటున్నావు, అలాగైతే, ఈ సుఖ దుఃఖములు ఎవరు పొందుచున్నారు, నాతో వినజెప్పుము, వినియెదను తనయా, తేడా చెప్పేవా, నిన్ను లెంపలు వాయించెదని భావము.

**కం॥ అందరి మాటల కురికే - వెందుకు నా మాట నమ్ము మిదె చాలును యీ - యందరు లేని బయలుగని - యందునవీ లేమి నెరిగి యరిగితెసరిరా ॥ 155**

శిష్యా! అందరు అనేక విధముల మాటలు చెప్పెదరు, అవన్నీ వినెద వెందుకు, ఈ అచలబోధ ఘనమైనది, నా మాట నమ్ముము. నీవు నమ్మితే చాలు, ఈ యందరూ లేని బయలును చూచి నీవు బయలై, ఆ బయలులో నీవు లేనని ఎరిగి, నీవు లేకపోతే చాలునని భావము.

**కం॥ నా బోతురుచికి రుచినిడు - నీబోధన పేక్ష చేత నేర్చిన వారిన్ - యే బాధలు బాధింపవు - బాబూ - యిది నీవు నేర్చి పఠియింపగదే ॥ 156**

తా॥శిష్యా! పటికి బెల్లం చీకే కొలది, తియ్యదనముకన్నా ఇంకా తియ్యగా ఉండును, అలాగుననే ఈ బోధ విచారించు కొలది అనగా ప్రేమతో నాపేక్షించే కొలది, వారికి, అంతకంతా రుచికి రుచిగా ఉండును. బాబూ ఈ బోధనేర్చి పఠయింపుము, నిన్నే బాధలు బాధింపవు అని భావము.

**విశేషార్థము** : శిష్యా! పటికి బెల్లం రుచికి రుచినిడు నంటే, ఈ అచల బోధ వాచార్థపరులకు కొంచెము రుచిగా ఉండును, మరి లక్ష్యార్థ పరులకు ఇంకా కొంచెము రుచి ఎక్కువగా ఉండును మరియు, ఈ అచల పరిపూర్ణబోధ, అనుభవార్థపరులకు, వారిద్దరి కన్నా ఎక్కువ యింకా రుచిగా ఉండును, అనగా వాచార్థపరులు పరిపూర్ణం ఒకటి, ఎరుక ఒకటి, పరిపూర్ణములో ఎరుక పుట్టు చున్నది, గిట్టు చున్నది, పరిపూర్ణమున్నది, ఎరుకలేదు, పరిపూర్ణం శాశ్వితమైనది. ఎరుక అశాశ్వితమైనదని వాచార్థంగా చెప్పచున్నారు, లక్ష్యార్థ పరులు, పరిపూర్ణం ఎరుకగుచున్నది, ఎరుక పరిపూర్ణమగుచున్నది, అనగా తాను విచారించనప్పుడు పరిపూర్ణమగుచున్నది, విచారించే

నప్పుడు ఎరుకగుచున్నది అని లక్ష్యార్థపరులని [illegible] ఖవార్థ పరులు పరిపూర్ణం మెరుకవదు, ఎరుక పరిపూర్ణమవదు ఉ[illegible] యింకేమిాలేదు. అని అందురు ఇంక నిర్ణయార్థ పరులు ఎరుక పుట్ట[illegible]వో ఉన్నది అది నిరంజన తూష్ణీ భూత పరిపూర్ణ స్థితియని అందరు. అన[illegible]ంగ్మానస గోచరమని చెప్పుచుందురు, ఈ నలుగురు నాలుగు విధములుగా చెప్పినట్లు, మన సాంప్రదాయ పెద్దలు చెప్పుచున్నారు, గనుక దీనికి తల్లా, తండ్రా ఇది చిన్నులేని సాంప్రదాయమైనది, ఎవరికి యిష్టమొచ్చినట్లు వారు విచారించుకొనుచున్నా[illegible] భావము.

కం॥ తాము తమతప్పు నెరుగక -నా మాటలు తప్పులనుచు నవ్వే జనములే -సామాన్యు లనుచు దెలియుము - నీ మానసమందు లెస్సనిరుపమ సుగుణా ॥ 157

తా॥శిష్యా! ఉపమానములకు అందని సుగుణములు గలవాడా, తమ తప్పులు తామెరుగక, నా మాటలు తప్పని నవ్వే జనులను, సామాన్యులని తెలుసుకొనుము మరియు నీ మనస్సులో బాగా ఆలోచించుకొని విచారించు కొనుమని భావము.

కం॥ దప్పప్పున జనినట్లుగ - నిప్పున చలిబాసినట్లు నిజమోగిరమున్ - వొప్పుగదిన్నప్పుడక్షుధ - దప్పినగతి బోధ విన్న దప్పును బాధా ॥ 158

తా॥శిష్యా! తప్పు, ఒప్పు చేత పోయినట్లు గాను, చలిసిప్పు చేత పోయినట్లుగాను, అబద్ధము, నిజమెరిగితె పోయినట్లు గాను, అన్నముతింటే ఆకలిపోయినట్లుగాను, దప్పిక, మంచినీరుత్రాగితే తీరునట్లుగాను, ఈ పరిపూర్ణబోధనా, చెవులతో వింటే బాధలన్నీ తప్పును నీవు పూర్ణస్థితి పొందెదవని భావము.

కం॥ సాధనలు జెప్పి శిష్యుల - బాధలు పెట్టేటి గురుని బాటవదిలియే - బాధలు లేనీ బోధను - సాధుల సేవించి వినుము సద్గుణ శాలీ ॥ 159

తా॥శిష్యా! సద్గుణములు గలవాడా, సాధనలు జెప్పి శిష్యులను బాధలు పెట్టే గురువుల బాటవదలి. యే బాధలు లేని బోధను సాధువులను సేవించి, ఈ పరిపూర్ణబోధను వింటే, అన్ని బాధలు తీరిపోవును నీవు అచలమై యుందువని భావము.

కం॥ బోధలకెల్లను గురువగు - బోధ సుమీ దీన్ని నీకు బోధిస్తినియా - బోధను వదలకు మెప్పుడు - సాధుజనస్తు తవివేక సతతా శోకా ॥ 160

తా॥శిష్యా! గురువులచే స్తోత్రము చేయదగినవాడా, బోధలనన్నింటికిని గురువైన, బోధయిది. దీన్ని నీకు బోధించితిని, దీన్ని విడిచి పెట్టకు, సర్వకాల సర్వావస్థలయందు విచారించుచు, సాధువులను సేవించుము, సతతా వివేకాయని భావము.

కం॥ **ఈ వికాశించు గురుడును - నా వొద్దిక కాసులేదు నన్నడుగకు పో - పోవయ్యా
యనెటి శిష్యుడు - కేవల హీనాత్ములనుచు కీర్తింపదగున్ ॥ 161**

తా॥శిష్యా! ధనము కోసము ఆశించి చెప్పే గురువును, నావద్దకు రావద్దు ఇప్పుడు ఒక కాసైనా లేదు నన్నడగకు, పో పోవయ్యా యని అనేటి శిష్యుడునూ, వీరిద్దరున్నూ అతి హీనాత్ములు, మహా లోభి గుణము గలిగి కీర్తింపబడునని భావము.

కం॥ **దేవుడు తేతెమ్మనునా - జీవుడు లేదనుచు మదిని శిడిముడి పడునా - భావమున
దెలసి యిద్దరు - నానా విధమున నడువ వలయు నందరు మెచ్చన్ ॥ 162**

తా॥శిష్యా! దేవుడు భక్తునితో నాకు పండ్లు ఫలహారములు తెమ్మని చెప్పినా, ఆ భక్తుడు నావద్ద యేమీలేవని మదిలో చీకాకు పడునా, దేవునివద్దకు, వెళ్ళేటప్పుడు, మనస్సు నిర్మలము చేసుకొని, ఏ పండో పట్టుకొని వెళతాడు ఆ విధముగా భావమున తెలిసి, యిద్దరు నా రీతిగా నడువ వలయు, నందరు మెచ్చుకొనే లాగునని భావము.

కం॥ **కోటి విధంబుల జెప్పిన - చేటొదవేటి తనదు పూర్వ చేష్టలు విడకన్ - చాటున
నేటున ద్వివిధము - గాటన మొనరించునతని కతుకునెబోధా ॥ 163**

తా॥శిష్యా! ఈ బోధ కోటి విధముల చెప్పినా గాని, చేటు వచ్చేటి తన పూర్వపు చేష్టలు వదలక, చాటునా, మాటునా నేనే బ్రహ్మను అను తన వంకర బుద్ధిని వదలక, రెండు విధములుగా మాట్లాడే వానికి, ఈ బోధ తెలుసునా తెలియబడదని భావము.

కం॥ **బంగారువంటి యీబో - ధాంగీ కరుణులనుజే - రియది విని వారిన్ - భంగ
పరచదలచేటియా - వెంగళులకు జెప్పకు మని వేడెదనిన్నున్ ॥ 164**

తా॥శిష్యా! ఈ బోధ మేలిమి బంగార మెంత విలువైనదో అంత విలువైనది. ఈ బోధను అంగీకరించి గురుముఖతా విచారించే వారి యొద్దకు, కొంతమంది దుర్మార్గులు వచ్చి ఈ బోధవిని, తిరిగి వార్ని వేళాకోలములాడే వెంకళప్పలకు. ఎన్నడు ఈ బోధ చెప్పవద్దని వేడికొనెదనిని భావము.

కం॥ **సదమలగురువెవరనినను - యిదుగో బయలిదుగో లేనియీ గురుతెరిగే - టి
దగు శరీరము - దీనిని వదులు మనుచు నీకు జెప్ప వచ్చినవారే ॥ 165**

తా॥శిష్యా! కళంకములేని మంచి గురువెవరనగా, ఇదిగో బయలిదిగో, లేని గుర్తెరిగే శరీరం లేంది అని అనగా తాను బయలై యున్న బయలులో ఎరుకలేదు. దానిని విడిచి పెట్టుమని నీకు చెప్ప వచ్చినవారే అనగా ఈ గుర్తెరిగే శరీరం లేకపోయే. గురు సూచనజేసి ఎరుకను యేమీ లేకుండా జేసినవారే సద్గురులని భావము.

కం॥ **రోగపు చేష్టలు బోయిన - రోగముగల దనిన మాడ్కిరోయకనిన్నున్ - నీ గుర్తెరుగుట
మణగిన - నేగలనన నీదు మాట నిశ్చయమటరా ॥ 166**

తా॥శిష్యా! రోగము చేష్టలు పోయిన తరువాత రోగముగల దనిన మాట, యదార్థమగునా, నీవు గుర్తెరుగుట పోయిన తరువాత, గుర్తెరుగు చున్నదనే మాట, యదార్థమౌనా. యదార్థము కాదని భావము.

**విశేషార్థము :** శిష్యా! పాలుకాచి పెరుగు చిలికిన తరువాత చల్లలో వచ్చిన వెన్న చల్లలో కలియనట్లు, నీవు సద్గురుని వలన గురుసూచన పొంది అంటే, అన్నీ గురు సూచనలు కావు గురు సూచననగా తన్నులేకుండా చేసేదే గురుసూచన, అనగా తన్ను బయలు చేసేదే గురుసూచన. అట్టి గురుసూచన వలన, విచారించి తాను బయలైతే మళ్ళీ ఎరుక వచ్చునా. ఈ యెరుకను లేకుండా చేసినవారే సద్గురువులు అని భావము.

**కం॥ దిచ్చుతనపు శిష్యుని మది - నొచ్చిన ధనమివ్వడనుచు నూహించి మదిన్ - యిచ్చకము లాడబోకను - చెచ్చెరఝాడించు వాన్ని సద్గురుడైతే ॥ 167**

తా॥శిష్యా! యిచ్చకము లాడే శిష్యుని, అనగా తన యిష్టమొచ్చినట్లు ప్రవర్తించే శిష్యుని, మనస్సు నొచ్చిన ధనమివ్వడని, మనస్సులో తలంచిన గురుడు, సద్గురువుగాడు, యిచ్చకము లాడబోకు, జాగ్రత్తగా మసులు కోయని గట్టిగా కూకలేసి మందలించే గురుడే సద్గురుడౌనని భావము.

**కం॥ గురుడు తనెంత మెచ్చిన - వరశిష్యుడు లోగితిరుగవలయును మదిలో - మురిసి భయభక్తి లేకను - తిరిగిన చేటొదవు నిజము తెలియగదోయీ ॥ 168**

తా॥శిష్యా! సద్గురు మూర్తి శిష్యుని ఎంత మెచ్చుకొనినను, శిష్యుడు భయ భక్తులు గలిగి వొదిగి తిరగవలెను, అలాగుకాక తనయిష్ట మొచ్చినట్లు భయ భక్తులు లేకుండా సంతోషముగా తిరిగే వానికి చేటువచ్చును నిజము. యిది తెలియవలెనని భావము.

**కం॥ గురు శిష్యుల లక్షణములు - గురు శిష్యుల బోధ రీతి గురుగీతార్థం - బెరిగిన నరులకె మెప్పగు - నెరుగని యా మూఢనరుల కిష్టతియౌనే ॥ 169**

తా॥శిష్యా! గురు శిష్యుల లక్షణములు, అనగా, శిష్యుడు భక్తితో గురుసేవ చేయవలెను, గురువుగారు చెప్పే బోధ శిష్యుని మనస్సుకు తెలిసేలాగు చెప్పవలెను, శిష్యుడు లక్షణయుతముగా విని ఆచరిచవలెను, గురు గీతలు అర్థమెరిగిన శిష్యులకే మెప్పగును, యెరుగని యా మూఢులకు యిష్టము కాదని భావము.

**కం॥ స్థిరముగ నిర్మైతే - పరుగెత్తక భ్రాంతి నిల్వబడదా భువిలో - నరులు విమర్శించిన తా - నురుకుట మది యెందుకోనమూహానుకనరా ॥ 170**

తా॥శిష్యా! యెరుక స్థిరముగా శాశ్వతముగా ఉండే దైతే, పరుగెత్తక నిల్వబడదా, ఈ భువిలో ఈ అచల బోధ విచారించిన పెద్దల వొద్ద కనపడకుండా పోయినదే, భ్రాంతి రహితులు వద్ద ఉండలేదు, గనుక ఎందుకు లేకపోయినదో నీవు ఊహించి తెలుకోమని భావము.

**కం॥ తనసంతతిపై గలదయ - తని శిష్యుని మీద నుంచదగు గురుడెపుడున్ - తన ధనము మనుసు తనువులు - తనగురునివటంచు దల్చదగు శిష్యునకున్ ॥ 171**

తా॥శిష్యా! గురుమూర్తి తన కుమారుని మీద ఎంత దయ ఉండునో, అంతదయ శిష్యుని మీద ఉండవలయును. సశ్శిష్యుడైతే తన మనస్సు ధనము తనతనువు గురుమూర్తివేనని, ఎప్పుడూ దలంచవలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! గురువునకు తన సంతతిపైన ఎంతదయ మనస్సులో ఉన్నదో, శిష్యుని మీద అలాగే దయ ఉంచవలెను, ఇట్లు ఉంచిన గురువే సద్గురువు, మరి శిష్యుడు గరుమూర్తికి ఏ విధముగా సేవచేయవలయునంటే ? 232వ కందార్థములో తను మన ధనములు గురువునకు వినయంబున ధారబోసి, అంటే తనువనగా 24 ఇంద్రియములతో కలిసి తిరిగే చైతన్యమనే జీవుడే తనువు, మనస్సనగా 25వ దైన చైతన్యమనే ఈశ్వరుడే మనస్సు, ధనమనగా ఈ రెంటివలన వచ్చినవే సంకల్ప వికల్పమనే జగత్తు, ఈ మూడు గురుడనే అచలములో లీనము చేయుటే, అనగా ఈ మూటిని రహితము చేయుటే గురునకు దారబోయుట, అనగా తాను బయలౌటమని భావము.

**కం॥ శూరత్వమాత్మ పనికై - వైరాగ్యము గురుని గొల్చు వర్తనకెపుడున్ - యీ రీతివృత్తి గల్గిన - నారీనరులేగి చొరరెనరకములోనన్ ॥ 172**

తా॥శిష్యా! ఆత్మనే యెరుకను తెలుసుకొనుటకు, ఎంతో పట్టుదలగా వైరాగ్యముచే గురుమూర్తికి సేవ చేయుచున్న వారు, పురుషులుగాని, స్త్రీలు గాని, ఎవరైనా నరకమునకు, పోవుదురని తెలుసుకొనవలెనని భావము.

**కం॥ మనసున నొకటిదల్చు వా - క్కున నొక్కటి బలుకు చుండు కుటిలుడు మరితా- తనువున నొక్కటి జేయును - వినువారికి బోధదెల్ప విహితమటోయీ ॥ 173**

తా॥శిష్యా! మనస్సులో ఒకటి తలంచును, వాక్కున యింకొకటి పలుకు చుండును, తనువున మరియొకటి చేయుచుండును, ఇటువంటివాడు కుటిలుడు గనుక, ఇలాంటి వానికి ఈ పరిపూర్ణబోధ చెప్పకూడదని తెలుసుకుని చెప్పవద్దని భావము.

**కం॥ మనసున వాక్కున తనువున - పనియొక్కటె జరుపునట్టి భక్తుని కిదయన్ - వినిపించుము వినుమని యీ-ఘనబోధను వాని కతుకగల దుడుగకుమీ ॥ 174**

తా॥శిష్యా! మనస్సున వాక్కున తనువున పనియొక్కటి చేయునట్టి బుద్ధి మంతునకు, ఈ ఘనమైన పరిపూర్ణ బోధ పిలిచి, వానికి చెప్పము అలాంటి వానికి ఈ బోధ తెలియబడునని భావము.

కం॥ **మేలైన బోధ వినుటకు - చాలా విఘ్నములు వచ్చి సముకూడినయే - లీలన్ విడు సచ్ఛిష్యుడు - వాలాయము బోధయందె వర్తించుజుమీ ॥ 175**

తా॥శిష్యా! గొప్పదైనటువంటి ఈ పరిపూర్ణబోధ వినుటకు, యెన్నో ఆటంకములు వచ్చుచునే యుండును, గనుక ఈ బోధను వినలేరు కానీ, సచ్ఛిష్యుడైనవాడు ఎన్ని ఆటంకములు వచ్చినా వాటిని, తప్పించుకొని సతతము ఈ బోధయంతే వర్తించు చుండునని భావము.

**విశేషార్థము** : శిష్యా! ఈ పరిపూర్ణబోధకై జన్మించిన వాడైతే, వానికి ఆటంకములు రానే రావు ఒకవేళ వచ్చినా వాటిని తప్పించుకొనేలాగు సరిపెట్టుకొనును, కారణమేమనగా వాడుదానికై వచ్చినవాడు, గనుక సర్వకాల సర్వావస్థలయందు గురుభక్తి గురుసేవ గురు నిష్టవదలడు, గురు నిష్టయనగా గురు సూచన ద్వారా, గురు స్వరూపాన్ని దర్శించుట. అట్లు సర్వకాల సర్వావస్థలయందు గురు స్వరూపమనే పరిపూర్ణాన్ని దర్శించుట, ఆ పరిపూర్ణమెతా నై యున్నవానికి ఇతరముగా తాను వ్యవహరించుటకు సావకాశమేది. ఒకప్పుడు, ఎరుకతోచినా, ఆయెరుక, పరిపూర్ణమేనని, తాను నిశ్చయ జ్ఞానియై యున్నాడు, వానికి ఇతరవాంఛలు లేనేలేవు, అనగా బంగారమే వస్తువులైనట్లు సముద్రమే కెరటములైనట్లని భావము.

కం॥ **గురుడు తనయాజ్ఞలోపల - చరియింపగగోరునట్టి శిష్యునకెపుడున్- దురితంబు వృద్ధియై తా - నరకమునన్ గూలకున్నె నరనుత చరితా ॥ 176**

తా॥శిష్యా! ఏ శిష్యుడైన సద్గురుని, తనచెప్పు చేతల్లో ఉంచుకోవాలని కోరిక ఎవరికి యున్నదో, అట్టి శిష్యునకు ఎప్పుడును దురితము వృద్ధైనరకకూపములో బడి తాను కష్టములు అనుభవించునని భావము.

**విశేషార్థము** : శిష్యా! గురుమూర్తి వద్ద భయభక్తులు గలిగి నడుచుకొనవలెను. గురుభక్తి, గురుసేవ, గురునిష్ట, కలిగి వినయ విధేయతలు గల వాడైయుండి, మంచివాడనిపించు కొంటే, గురుమూర్తి గురుసూచన జేసి గురుయుక్తి చెప్పి, పరిపూర్ణము చూపించును, అప్పుడు నీవు పరిపూర్ణ విచారణ జేసి కొన్నాళ్ళు సర్వకాల సర్వావస్థలయందు, విచారించగా నీవే పరిపూర్ణ సిద్ధి పొందగలవు, గాని గురుని వంచించి నీ చెప్పు చేతల్లో పెట్టుకొనే ఉద్దేశము నీకు కలిగిననాడు, నీవెందుకు పనికిరాకుండా పాడైపోయి రౌరవాది నరకం తప్పక అనుభవించెదవని భావము.

క॥ **గురుకను సౌజ్ఞనుగనుగొని - పరిచర్యయొనర్పు చుండు భక్తుడు భక్తిన్ - పరిపూర్ణ బోధ జెందును - పరమోదార ప్రచండ బంగరు కొండా ॥ 177**

తా॥శిష్యా! గురుకరుణచే, గురు సూచననే కను సౌజ్ఞ కనుగొని, గురునకు పరిచర్యలు భయభక్తులు కలిగి ఎల్లప్పుడు చేయుచుండినచో, అటువంటి భక్తుని గురుమూర్తి పరిపూర్ణునిగా తయారుచేయును. అందువల్ల నీవు పరిపూర్ణుడవై ఆచరించుకొనుచు కాలము గడుపుకొందువు, పరమునుజెంది పరమోదార ప్రచండ బంగరు కొండా యని భావము.

క॥ **ప్రాకటముగ నిద్దురయిక - యే కథలను వినిన రాదు యీ బోధందున్ రోకుండ దేమి చిత్రమొ - ప్రాకృత నరమూక కెల్ల పావనచరితా ॥ 178**

తా॥శిష్యా! మంచి చరిత్రగలవాడా, తప్పకుండా ఈ బోధ వినునరులకే నిద్ర వచ్చును. ఇతరముగా యే కథలు విన్నా నిద్రరాదు, యేమి చిత్రమొ, ఈ ప్రాకృత ప్రజలకు యని భావము.

క॥ **కొత్త దంపతుల కూటమి - నెత్తెరగున లేమలంత నిదురలు బోకన్ - మొత్తములై కనునటువలె - బత్తుల దిరిగేటి చిన్న బాలలకగునే ॥ 179**

తా॥శిష్యా! కొత్త దంపతులు, మొదటి రాత్రి అనగా గర్భాధానము చేయుచున్న దంపతులు కలియికను చూచుటకు, ఆ వయస్సులో నున్న స్త్రీలంతా అనగా భర్తలతో కాపురము చేయు స్త్రీలు, నిదురలు మాని ఆ రాత్రి అంతా వేళా కోళములు అడుచూ, ఆ దంపతులను చూచుచు ఉన్నారంటే, కొత్తదంపతుల కలియక వీరికి తెలుసును, ఏమని తెలుసు అంటే, వీరు భర్తలు వీరుతో పొందు ఎలా చేయుచున్నారో, ఆ దంపతులు అలా చేయుదురని తెలుసును పిల్లలకు ఏమైనా తెలుసునా, తెలియదు అలాగే గురు సూచన కాని నరులకు వాచార్థ పరులకు తెలియదని భావము.

క॥ **మనసరయక ప్రజలనువిను - మని చదువకు బోధ బాధ యని యిండ్లల్లో - పనులన్ని యాది జేసుక చనియెదరాసమయమంద సహ్యమున సుతా ॥ 180**

తా॥శిష్యా! ఈ బోధవినుటకు వారి కథికారమున్నదా లేదా తెలుసుకోకుండా, వినుమని చదవబోకు, వారు వినుటకు విసుగుజెంది, ఇండ్లలో పనులు చేసుకొనెదరు, ఆ తరువాత వచ్చెదరు, ఆ సమయమున నిద్దుర తప్పకవచ్చును, గనుక వారెట్టివారో తెలుసుకొని బోధ చేయవలెనని భావము.

క॥ **వీనుల వినడీ బోధను నేనే బ్రహ్మననినిక్కి నీల్గెటి వాడున్ - మానికముగాన వచ్చిన దానిని రాయనుచు దలచు తార్కికునిగతిన్ ॥ 181**

తా॥శిష్యా! నేనే బ్రహ్మననే వాడు, ఈ పరిపూర్ణబోధను చెవులతో వినడు వాడు,

అహంకారముతో నిక్కినీల్గు చుండును గనుక వాడు వినడు మాణిక్యము కనిపించిన ఇది గాజు రాయి యని అనుమానించుచు దానిని పారవేయును తార్కికుని గతివలెనని భావము.

**విశేషార్థము :** శిష్యా! తార్కికుడనగా ప్రతి విషయమును సంసయించుచునే యుండేవాడు గనుక ఇది గొప్పదైన పరిపూర్ణ బోధయైనను నాకే తెలుసును నేనే బ్రహ్మను అని అహంకారముతో నిక్కనిల్గే వాడు గనుక ఈ యదార్థమైన అచలబోధ చెప్పినా చెవులతో వినడు సత్వ గుణము గలవాడైతే ఈ బోధ ఎలా ఉంటుందో విందాము మంచి ఉంటే తీసుకుందాము మనకు నచ్చకపోతే వదిలేద్దాం అని వింటాడు అహంకారునకు ఈ బోధ చెప్పకూడదని ఎందుకనగా వాడు సంశయగ్రస్తుడు ఎలాగంటే బంగారువస్తువు దొరికిన గాని దానిని సంశయముతో యిత్తడని పారవేయునేగాని కమసాలి వద్దకు పట్టుకు వెళ్ళి సూపించుదామని కూడా అతనికి ఉండదు గనుక అట్టి సంశయము గలవానికి ఈ బోధ ఎన్నడూ చెప్పకూడదని భావము.

**కం॥ ఒకరు విని మెచ్చవలెనని- సకల పురాణములు వేద శాస్త్రశౌత-ప్రకరమును**
**నేర్చు విద్య-న్ని కరంబిబోధ మెచ్చ నేర్చునె సుమతీ ॥ 182**

తా॥శిష్యా! ఓ మంచి బుద్ధి గల కుమారా ఒకరు విని మెచ్చుకొనుటకు సకల శాస్త్రములు పురాణములు వేదములు ఉపనిషత్తులు అన్ని విద్యలు నేర్చుకొనును కాని నికరమైన గొప్పదైన ఈ పరిపూర్ణబోధ నేర్చుకొనరు మెచ్చరు అని భావము.

**విశేషార్థము :** శిష్యా! సుజ్ఞానముగల శిష్యా ఒకరు విని మెచ్చుకొనవలెనని నేర్చుకొన్న సకల శాస్త్రములు గొప్ప కొరకు తాను కీర్తింపబడుటకు తానుపోషింపబడుటకే గాని తన జన్మ రహిత్యము కానేరదని తెలియవలెను తాను జన్మ రహితము చేసుకోవలెనంటే ఒక్క పరిపూర్ణబోధయె అభ్యసింపవలెనని గ్రహించవలెను మరి ఇతర శాస్త్రములు వల్ల కాదని కూడా తెలుకోమని భావము.

**కం॥ సాధారణముగ దెల్కు-మీాధర మానవుల బిల్చి యీ బోధను బల్-మేధానిధి**
**యాచించిన - బోధించుము వద్దులోభ బుద్ధి సుబుద్ధీ ॥ 183**

తా॥శిష్యా! నాయనా ఈ బోధ సాధారణముగా చెప్పకుము, అయిన వారికి కాని వారికి పిలిచి చెప్పే బోధకాదు, ఈ బోధ చెప్పవలెనంటే మహామేధావి కావలెను, అట్టి మేధావంతుడు ఆశించిన బోధింపుము వాడులేని వాడని గాని, ధనమివ్వలేదనిగాని ఎందుకులే శ్రమయని గాని సందేహింపక వానికి పూర్తిగా ఈ విద్య నేర్పుమని భావము.

**విశేషార్థము :** శిష్యా! యీ అచల సాంప్రదాయము అనగా ఈ గొప్పదైన బోధ ఎంత విలువైనదో ఎంత గుహ్యమైనదో ఎంత రహస్యమైనదో కాకపోతే గ్రంథకర్తయైన భాగవతుల

కృష్ణ ప్రభువుల వారు, ఈ విధముగా చెప్పినారంటే, "సాధారణముగా దెల్పకు ఈ ధరమానవుల బిల్చి ఈ బోధను బల్ మేధానిధి ఆశించిన బోధింపుము". యింకో పద్యములో ఈలా చెప్పియున్నారు, "తనకు తావచ్చి సద్బోధను దెల్పుమటంచు,తన శిష్యునకున్ వినజెప్ప దొడగె నొకగురుడను మానించకను వాని కతిదయ తోడన్" అని తెలవిచ్చియున్నారు అయితే యీ పద్యముల అర్థమేమిటి. మన సాంప్రదాయులు నడిచే నడనుడులు ఏలా ఉన్నవి, అందరూ నీతులు చెప్పేవారే, ఇందులో ఎవరు నిజాయితీపరులు అని విమర్శించగా, తెలిసినవి, కొన్ని జరిగినవి, నేను విన్నవి, ఏమనగా ఈనాడు ఈ సాంప్రదాయములో, మేమే సాంప్రయ పెద్దలమని చెప్పుకునేవారే, చేసినపనులు ఎలా ఉన్నవో చూడండి, ఒక గురువు దగ్గరకు చేరుదా మనకునే కోమటిని పిలిచి, గురుపూజకు వెళ్ళుదాముదా యని తీసుకు వెళ్ళి, కోమటిబోణీమంచిదని మాయమాటలు చెప్పి, అక్కడ అతనికి ఉపనయనం చేస్తానంటే, ఏమిలేందే ఎలాగండీ అని అంటే, ఇప్పుడు ఏమీ అక్కర్లేదు, అని చెప్పి అతనికి ఉపనయనము చేసి, వారం రోజులు పోయేక, అతనిని బట్టకొట్టులోకి తీసుకు వెళ్ళి, వీరికి కావలసినవి, నచ్చినవి, బట్టలు తీసుకొని, బిల్లు అతనిచే యిప్పించినది మోసము కాదా, యింకొకతను యింకో గురువుగారి దగ్గరకు చేరుదామని ప్రయత్నించే వానిని పిలిచికెళ్ళి, వాడికేమి తెలుసు, వాడు నీచుడు వాడు శూద్రుడు, అని మాటలు చెప్పి వానికి ఉపనయనము చేయుట మోసము కాదా, ఈ మోసం చేసే గురువులు ఎంతోమంది మన సాంప్రదాయములో ఉన్నారు, మరియు ఒక మేధానిధి అన్న పదమునకు, అర్థము మహా తెలివైన వారిలో నిధి అంటే, మహాతెలివైన వారిలో మించిన ఎక్కువ తెలివైనవాడని, గ్రంథకర్త చెప్పియుంటే, బాగా తెలివిలేని వారిని పిలిచికెళ్ళి, ఉపనయనములు చేయుచున్నారు, ఇది ఇలాగుండనిమ్ము, ఈ తెలివి తక్కువ వారికే అధికారాలు ఇవ్వటము, నాలాంటివాడు ఎవడైనా నీవు తయారైన తరువాత ఇస్తానంటే యింకోగురువు దగ్గరకు, వెళ్ళితే కొంత డబ్బు తీసుకొని, ఆ తెలివి తక్కువవానికి అధికారము ఇచ్చివేయుట, యిలాజరుగుచున్న ఈ సాంప్రదాయము, ఎంతనీచానికి దిగజారిపోయినదో చూడండి, అని అంటే ఎవరు చూస్తారు దీనికి ఒక తల్లా తంత్రా ఈ సాంప్రదాయం ఎంతగొప్పదో, అంతకన్నా క్రిందికి దిగజారిపోయినది. దీనిని సరి చేసేవారు లేరని భావము.

కం॥ ఏ బోధ శిష్యులకు గల - యాబాధల నణచి వేసునదె సద్బో ధౌ - ఆబోధయే దియనినను - యీ బోధే సుమ్మి దీన్ని యిక విడువకుమీ ॥ 184

తా॥శిష్యా! యే బోధ శిష్యులకు గలదో. ఆ బోధవలన బాధలన్నిటిని నణచి వేయునో ఆ బోధయే సద్బోధయగును, ఆ బోధయేదియనిన, ఆ బోధ, ఈ పరిపూర్ణ బోధయే, దీన్ని ఎన్నడు విడిచిపెట్టకుము సుమ్మీయని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఏ బోధవలన అన్ని బాధలు, నణచివేయునో, అని విచారించి తెలుసుకొంటే, ఈ పరిపూర్ణబోధ వలనని, తెలియవలెనని తెలుసుకోవలెను, ఎందుకనగా యింటిలో బాధలు. వంటిలో బాధలు, ఈదిలో బాధలు, అన్ని బాధలను, అణచివేచినది, అనగా గురుకరుణచే, ఎరుకపోయిన మీదట. ఇంటిలోను పూర్ణముగా నిండియున్నది, వంటిలోను పూర్ణముగా నిండియున్నది, ఈదిలోను పూర్ణముగా నిండియున్నది, ఎక్కడ చూచిన పరిపూర్ణమై నిండియున్నందున, ఎక్కడ చూచిన గుర్తులేదు. గనుక తన గురువు చెప్పిన బోధవలన, వంటిలోను, ఇంటిలోను కంటిలో లోపల, వెలుపల, తానే అంతటానిండి, పరిపూర్ణమైయున్నాడు. గనుక ఏ బాధలు లేక యున్నాడని, అనగా తాను పరిపూర్ణమై యున్నాడు గనుక, ఎలా ఉంటే అలాగు సరిపోతాడు, గనుక ఏ బాధలు ఉండవు, ఎలాగంటే, గోడమీద ఉన్నావానికీ, గోడవతల విషయము తెలుసు, గోడయివతల విషయము తెలుసును. గనుక ఎలా ఉంటే అలా సరిపోతాడని భావము.

కం॥ **హెచ్చైన బోధదెల్పే - సచ్చరితులకియ్యలేరు జనులు ధనంబుల్ - గచ్చులు**
**గొట్టే దిచ్చుల - కచ్చిన క్రియనిట్టి నృతతి నేమననోయీ ॥ 185**

తా॥శిష్యా! గొప్పదైన పరిపూర్ణబోధ జెప్పే సద్గురువులకు, ధనము ఇవ్వలేరు ఈ జనులు, గొప్పగా. డంబ్బాచారములు చెప్పే డాంబీకులకు ఇచ్చెదరు ధనము అట్టివారిని ఏమనుకోవలెనని భావము.

కం॥ **నీమదికీనిజబోధన్ - ప్రేమతోనాటించదలచి పెక్కు విధములన్ - నే మొదలు**
**బెట్టి చెప్పి - తి దేమాత్రము రాత్రి బగలు యే మారకుమీ ॥ 186**

తా॥శిష్యా! నీమదికి ఈ నిజ బోధ తెలియుట కొరకు, ప్రేమతో ఎన్నో విధములు చెప్పి నీ మనస్సునకు అత్తించుటకు మొదలబెట్టి చివర వరకూ, ఏ మీ దాచకుండా, చెప్పితిని గనుక నీవు రాత్రి బవలు నే చెప్పిన ప్రకారము విచారించి, ఎరుకలేని పరిపూర్ణమై యుండుమని భావము.

కం॥ **కమలంబులున్న కొలనుకు-భ్రమరములేతెంచినట్లు బాగుగబోధన్ - తమ**
**మదిగోరి గురుని పద - కమలములను గొల్వసుజనగణమేతెంచున్ ॥ 187**

తా॥శిష్యా! తామర కలువ పువ్వులున్న కొలనుకు ఆకమలములలోని మకరందము తీసుకొనుటకు బ్రమరములు యక్కడనో యుండి వచ్చినట్లు బాగుగా ఈ బోధ నేర్చుకొనుటకు సుజనులైన బుద్ధిమంతులు వారి మనస్సులో కోరిక కలిగి ఎక్కడ నుండోవచ్చి గురిని పాదములు గొల్చి పరిపూర్ణబోధ కొరకు వచ్చెదరని భావము.

కం॥ సురవరుడహల్యకోసము-మరులొందినరీతి నెపుడు మరుగు దురజ్ఞుల్ -పొరిగూరి సాధులకు తమ -పురమున గల సాధులందు బుద్ధి నిలువకన్ ॥ 188

తా॥శిష్యా! దేవేంద్రుడు తన భార్య చక్కని దైయున్నను అహల్య కొరకు ఎంతో ప్రయాసపడి వెళ్ళినరీతిగా మంద బుద్ధిగల వారు అజ్ఞానులు తన ఊరియందు ఉన్న సాధువులను విడిచి పెట్టి ఎక్కడో దూరముగా యున్న సాధువులను గొల్చుటకు ఎంతో ప్రయాసపడి వెళ్ళెదరని భావము.

కం॥ నే నీకు జెప్ప బూనిన- యీ నిజసద్బోధమునుసుకిమిడిన వెనకన్- నీ నా పని దీరునురా-వేనా ముద్దుల కుమార వేన గభీరా ॥ 189

తా॥శిష్యా! నేను నీకు చెప్ప బూనిన ఈ నిజమైన పరిపూర్ణబోధ నీ మనస్సుకు అత్తి ధృడ పడిన వెనుక నీ పని తీరి పోవునురా! ఓ నాముద్దులకుమారా ఓ కదిలికలేని ధైర్య శాలీయని భావము.

**విశేషార్థము :** శిష్యా! ఈ యదార్థమైన నిజము చెప్పుచున్నాను వినుము నీవు పరిపూర్ణమై సర్వకాల సర్వావస్థల యందు ఆ స్థితి నాకు కుదిరి దృఢముగా ఉండగలిగిన అనగా మూలం లేని ఈ గుర్తెరిగే శరీరము ఏమి లేని స్థితిలో రెప్పపాటులో సకం కాలమైన మరువక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి లేకుండా ఉండవలెను అట్లు త్రికాలములయందు ఆ ఉనికిలో ఉండే ధృడం నీకు కలిగిననాడు అలాగు స్థితిలో ఉండగలిగిననాడు నీ నా పని తీరుపోవునని భావము. మరియు అలాకాక వాచార్థముగా బోధ చెప్పుకొనుచు పరిపూర్ణమున్నది ఎరుకలేదు అని చెప్పుకునే బోధ నాకు ఊహ వచ్చినదిలగాయతు ఇంతవరకు అనుకుంటూ వినుకుంటూను వచ్చాము. మేము అదే నిజమని నమ్మేము కానీ యదార్థం తెలిసే సరికి తానే పరిపూర్ణమవ్వాలని చెప్పియున్నారు, అప్పుడు విచారించగా నిజమని తెలిసినది మీరు నావలెనే పాటు పడక యదార్థము తెలిసిన గురువల వద్దకు వెళ్ళి నిజము తెలుసుకొని ఆచరించి తరించవలెనని నామనవని భావము.

కం॥ త్ర్యక్షుని నిందించినయా - దక్షుని గని ప్రాణమిడినత్ర్యక్ష సతివలెన్ - యీ క్షితి తనదేశికుని - నుపేక్షించిన జనుల తాను పేక్షించదగున్ ॥ 190

తా॥శిష్యా! ఈశ్వరుని నిందించిన దక్షుని, వాని కుమార్తె యగు దాక్షాయని ప్రాణమిడిచిన విధముగా ఈ ప్రపంచములో తన గురువుని నిందించిన వానిని తాను దూషించి వానిని విడిచిపెట్టవలెనని భావము.

కం॥ గురునికపరాధియగునా-నరనాథుని దృపదునొంచు నరుని విధమునన్ - ధర సచ్ఛిష్యవరుడు తన -గురు శత్రుని చేతనైతె క్రొవ్వణచదగున్ ॥ 191

తా॥శిష్యా! అర్జునిని గురువుగారైన ద్రోణాచార్యులు వారిని పరాభవించిన ద్రుపద రాజును అర్జునుడు వెళ్ళి ఆ ద్రుపద రాజును ఓడించి గురువుగారైన ద్రోణాచార్యుల వారి పాదముల మీద పడవేసెను అట్లే తన గురువుని నిందించిన వానిని చేతనైతే దండించవలెనని భావము.

**కం॥ కాకులవలె కూకలిడే - లోకులకేకకు బెదిరిలో గుండకటన్ - మూకత్వ మూను చాలు - వివేకుడవై యుంటివేని వినినామాటా ॥ 192**

తా॥శిష్యా! లోకములో మూర్ఖులు కాకులవలె కేకలు వేసే కేకలకు భయపడి మనస్సు పాడు చేసుకొనక మూగవానివలె మౌనము వహించుము చాలు వివేకముతో నామాట వినుమని భావము.

**కం॥ పెద్దల నెవరిని జూచిన-ముద్దు గమాట్లాడివారు ముదమున జెప్పే-సుద్దుల కడ్డము జెప్పక-శ్రద్ధకతో-మ్రొక్కి వినుము వో పుణ్యతమా ॥ 193**

తా॥శిష్యా! పెద్దలైన వారిని ఎవరిని చూచిన ద్వాదశ నమస్కారములు జేసి ముద్దుగా మాట్లాడవలెను వారుచెప్పేబోధను అడ్డము చెప్పక శ్రద్ధగా వినుమూయని భావము.

**విశేషార్థము** : శిష్యా! పెద్దలనగా ఆరూఢాతీతులైన మహాత్ములు తాను లేనితా నై యున్నవారు, అహమనే చైతన్యమునకు అతీతమైయున్న వారు, నేను లేని నేనై యున్న వారు, ఆ శరీరులై ఏమి లేక ఉత్తధై యున్నవారు, క్షరాక్షరములకు అతీతమై బట్ట బయలై యున్న వారు, అట్టి మహాత్ములకు ద్వాదశి వందనములు జేసి భయ భక్తులతో మెలుగుచు ముద్దుగా వారితో మాట్లాడువారు చెప్పే బోధకు అడ్డము చెప్పక వారు చెప్పే సూక్తులు యుక్తులు వినుచు సమయము చూచి తనకు కావలసిన విషయములు అడిగి తెలుసుకొని వారికి అనుగుణ్యముగా సేవలు చేయుచూ వారు చెప్పినవి మనస్సుకు అర్థించుకొని తెలియక పోతే మళ్ళీ అడిగి తెలుసుకొని ఆచరించి తరించవలెనని భావము.

**కం॥ తనహితవెరుగని మనుజుడు-వినడాప్తజనోక్తి దుష్ట వృత్తి గల మడ్డి - ధనుడు దశాననుడువిహిత-జన వాక్యము వినక గాదెసమసిరిరువురున్ ॥ 194**

తా॥శిష్యా! తనకు మేలు చేసే హితులు చెప్పే హిత వాఖ్యములు వినక పోతే తానే పాడౌను అలాగునే దుర్యోధనుడు పెద్దలైన భీష్ముడు ద్రోణాచార్యులు వగైరాలు చెప్పినా వినక చనిపోయెను అలాగే రావణుడు విభీషణుడు చెప్పిన మంచి మాటలు వినకనే కదా చనిపోయెను అని భావము.

  

కం॥ ఎన్నో గ్రంథజలధులను - తిన్నగ మథియించి చూస్తె తేలెను సారం - బున్న బయలు గని మృషయగు -నిన్నున్ నీమేను మృషనినిలువకు మనుచున్ ॥ 195

తా॥శిష్యా! ఎన్నో గ్రంథ జలనిధులను అనగా వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు విచారించి అందులో తేలిన సారాంశమేమనగా బయలును గని అనగా నీవు బయలైతే ఆ బయలలో నీవు వచ్చి నేను మేనులు తొచుచున్నవి అట్టి నేను మేనులు లేని వేనని ఎరిగి అవిమృషయని విచారించి ఆ నేను మేనులను రహితము చేసిన అనగా ఇంద్రియములుగాని ఆ ఇంద్రియములలో కలసి తిరిగే తెలివిని గాని యేమీలేకుండగా అనగా ఆ నేనుమేనులనే యెరుక యనే చైతన్యమనే నిన్ను పూర్తిగా లేకుండా చేసిననాడు నీవే బయలై ఉంటావు ఆ బయలే అచలమని భావము.

కం॥ ఘనీకుసుమగంధవాసన-తనకొనగా దలచి షట్పదము గొనదటులన్-వినదు లేనహమెబ్రహ్మం-చని పల్కె నృతతి నిల్వనని యా బోధన్ ॥ 196

తా॥శిష్యా! తుమ్మెద సంపంగ పువ్వు సువాసన ఆఘ్రాణించుటకు తుమ్మెద ఎప్పుడూ రాదు అటులనే వినదు లేనహము అనగా నేనే బ్రహ్మనైతినని పల్కేవాడు ఈ బోధయందు నిల్వలేడని భావము.

**విశేషార్థము :** శిష్యా! తుమ్మెదకు సంపెంగ పువ్వువాసన కిట్టనట్లు నేనే బ్రహ్మనైతిని అనుకొనే అహంకారునకు ఈ పరిపూర్ణబోధ అతనికి హితవుగా ఉండదు గనుక కిట్టదు అనగా నేను బ్రహ్మననే వానికి అహమనే తెలివి ఉండి తెలివితో నుండే సమస్తమైన పనులు చేయును పరిపూర్ణుడైనవాడు తానేలేక ఉండి అన్ని పనులు చేస్తాడు అహమనువాడు తాను ఉండి చేస్తాడు పీడుతాను లేక చేస్తాడు ఇదే తేడా అనగా తుమ్మెద సంపెంగ పువ్వు వద్దకు వెళ్ళి వెళ్ళదు అలాగే ఈ అహమనే అహంకారం నేను బ్రహ్మననే అహం తగ్గిపోవునని వినదు కనేఁడని భావము.

కం॥ హద్దునుమీ గురువాజ్ఞన-ముద్దు సుమీ గురుని సేవముదమున జేయన్ - పద్దునుమీ యిట్లుండుట వద్దు సుమీ గురుని తోటి వాదించుటమున్ ॥ 197

తా॥శిష్యా! గురువాజ్ఞ ఒక హద్దు ఆ హద్దు దాటకుండగా ప్రవర్తించిన వాడే సచ్ఛిష్యుడు ఆ హద్దు దాటిన వానికి ఆపదలు వచ్చును ఎట్లనగా లక్ష్మణుడు సీతాదేవికి ఒక హద్దుయనే గీతగీసి ఈ గీత దాటవద్దని చెప్పిరాముని యొద్దకు వెళ్ళెను, భిక్ష పట్టుమని హద్దులోపల నుండి రమ్మనెను ఆ హద్దుదాటి భిక్షవేయమనెను సన్యాసి సీతాదేవి తెచ్చిన భిక్షలోనికి పట్టుకు వెళ్ళ కూడదు, అను చాదస్తముతో ఆ గీత దాటి భిక్షమేసెను ఆ సన్యాసనే రావణుడు ఆ సీతనుఎత్తుకొని పోయెను ఆ సీత ఆ హద్దు దాటుట వలన ఎన్ని కష్టములు వచ్చెనో చూడుము అలాగే గురు ఆజ్ఞదాటిన వానికి

ఇదే గతి గనుక ముందుగా గురుసేవ చేయుము ఇట్లు సేవ చేయుట మంచి పద్ధతి ఎప్పుడైనా గురుని తోటి వాదించేవు సుమా ఎన్నడూ వాదించకు అని భావము.

**కం॥ జంభాల పోతుగొరునె-సంభవనాశముల బాపు చక్కని బోధన్-**
**కంభిని షండునకుండునె-రంభా సంభోగ వాంఛ రంభనుగనినన్ ॥ 198**

తా॥శిష్యా! తిండిపోతనే దుర్గునునకు అనగా పంది గుణములు గలవానికి తనకున్న దుర్గుణములున్నూ ఆపదలున్నూ తొలిగించే ఈ పరిపూర్ణబోధ కావలయునా అక్కరలేదు అలాగే నపుంసకునకు రంభ కనుపించినా సంభోగ వాంఛ వానికి కలుగునా కలుగదని భావము.

**కం॥ పతిభక్తి గల యువతి వలె-సతతము గురుభక్తి గలిగి సచ్ఛిష్యుడిలన్-స్థితిగు దుర సేవజేయును-ప్రతి రహితాద్భుత చరిత్ర పరమ పవిత్రా ॥ 199**

తా॥శిష్యా! పతివ్రతయను స్త్రీ భర్తను దైవ స్వరూపముగా చూచుచు ఎల్లప్పుడూ భర్తరాకకు ఎదురు చూచుచుండును అలాగే సచ్ఛిష్యుడు గురు భక్తి గురుసేవ గురునిష్ఠ కలిగి ఎల్లప్పుడూ గురుమూర్తి రాకకోరుచూ ఈ ప్రపంచములో స్థితి కుదురుటకు సేవ చేయును ప్రతి రహితమైన స్థితిగల అద్భుత చరిత్ర గలవాడాయని భావము.

**విశేషార్థము :** శిష్యా! సచ్ఛిష్యుడు పరిపూర్ణుడై యుండే స్థితి కుదురుటకు గురు దేవునకు భక్తి విశ్వాసములతో సేవలుచేయుచు ఎల్లప్పుడూ గురుదర్శనముజేయుచు గురు యుక్తి యనే నిష్ఠగల వాడై సర్వకాల సర్వావస్థలయందు మరువక ఆ స్థితిలో వుంటూ ఏ ప్రతిమలు లేని యునికి గల వాడై సతతము గురునామము స్మరించుచు గురు భక్తి విడువక గురుధ్యాన్నమనే ఉనికిని ఎల్లప్పుడూ విచారించుచు తానులేనితానై యుండును. ప్రతి రహితాద్భుత చరిత్ర పరమ పవిత్రమైనవాడా అని భావము.

**కం॥ జఠరజనితులైనను బహు - కఠినమనస్కులకు ఘోర కలుషా త్ములకున్ - శఠులకు జడమతులకివకు పఠనాసక్తులకు బోధ పట్టుమటంచున్ ॥ 200**

తా॥శిష్యా! జఠర జనుతలకు అనగా తన కుమారునికైనా బహు కఠిన మనస్సుతో నుండు వారికి ఘోరమైన పాపాత్ములకు దుర్మార్గులైన వారికి కుటిలముగలవారికి మందమతులకు అన్ని చెడ్డ గుణములున్న వారికి ఈ పరిపూర్ణ బోధ చెప్పకుము సతతము దీనిని పఠించుచు విచారించేవారికి చెప్పమని భావము.

**కం॥ కప్పురము నిప్పుగలసే - చొప్పున వెలిగవల కండ్ల జూస్తుండగనే - తప్పున గనరావట్టనె - యుప్పుడు నిను నన్ను బోధ నెరుగుము బుద్ధిన్ ॥ 201**

తా॥శిష్యా! కర్పూరము నిప్పుగలసిన గమ్మునవెలిగి అవలకండ్లతో చూస్తుండగనే చప్పున గానరాకుండా పోవును అట్లనే యిప్పుడు నిన్ను నన్ను గనరాకుండా పోయే ఈ బోధనెరుగుము బుద్ధిమంతాయని భావము.

కం॥ దీవించి యిస్తినేనీ - సేవించిన సేవ మెచ్చి చిత్తములోనన్ - కావించుమెపుడు గానము - భావించిది ముఖ్య మనుచు పావనశీలా ॥ 202

తా॥శిష్యా! దీవించియిస్తిని నేను నీవు చేసిన గురుసేవకు మెచ్చి ఇస్తీని అనగా నా చిత్తములో ఆనందము కలిగి సంతోషించి యిస్తిని ఈ బోధ, గనుక నీవు సర్వకాలముల యందు దీనిని ప్రేమతో విచారించుము ఇది ముఖ్యమైనదని భావించుము పవిత్రమైన శీలముగల వాడా అని భావము.

కం॥ అనిగురుడు బోధజేసిన-విని శిష్యుడు హర్షమంది వేడుకతోడన్ - తన గురుని తోటి విజ్ఞా - పన మీరీతిగ నొనచెప్పటువాప్రారంభిన్ ॥ 203

తా॥శిష్యా! అని గురుదేవులు చేసిన బోధ శిష్యుడు విని ఆనందించి వేడుకతో తన గురుని తోటి విజ్ఞాపన మీరితిగా ప్రారంభించి చెప్పడం మొదలు పెట్టెనని భావము.

కం॥ నా కొరకు కష్టపడితిరి-మీకై మీరిటకు వచ్చి మిము బొగడుటకో-కాకోద రేశుడోపం-డా కార్యమునా తరంబె యచల మనస్కా ॥ 204

తా॥ ఆర్యా! సద్గురు దేవా నా కొరకు మీరు ఎంతో కష్టపడితిరి మీకై మీరు ఇక్కడకు వచ్చి నాకువిద్య నేర్పితిరి మిమ్ములను స్తుతించుటకు నేనెంతటి వాడను కాకోదరేశండైన ఆదిశేషునకే తరము కానప్పుడు ఆ పనినా తరమా అచలమై యున్న మిమ్ములను బొగడగలనా యని భావము.

**విశేషార్థము** : నాయనా గురు స్వరూపమనగా అఖండమై అచలమై పరిపూర్ణమై యున్న గురుమూర్తిని తెలుసుకొనుటే కష్టము అనగా గురుమూర్తి ఇటువంటి స్వరూపమై యున్నారని గ్రహించి ఆచరించే శిష్యుడు ఒకానొక్కడే కానీ అందరూ గ్రహించలేరు అట్లు గ్రహించిన శిష్యుడే పరిపూర్ణుడవగలడని గ్రహించవలెనని భావము.

కం॥ తల్లివిదండ్రివి దాతవు-వల్లభుడవు బాంధవుడవు వసుధీశుడవున్ - తెల్ల మిగ దేవుడవు నీ - వల్ల గదా యిట్టి బోధ వర్తనవినుటల్ ॥ 205

తా॥ ప్రభో! తల్లివి తండ్రివి విధాతవు వల్లభుడవు బాంధవుడవు వసుదేశుడవు నిజమైన దేవుడవు ప్రభో నిన్ను ఇట్టి వాడవని ఇప్పుడు గ్రహించితిని మహానుభావా మీ వల్లను గదా నేను యింతవాడనైతినని భావము.

కం॥ **అని శిష్యుడన్న మాటకు-మనమున హర్షించి గురుడు మరియిట్లనియెనె -**
**వినవోయి శిష్య రాయా - వినినాకోరికెను దీర్చ వేడుకయైనన్ ॥ 206**

తా॥ పైన శిష్యుడు పలికిన పలుకులు విని గురుమూర్తి సంతసించి ఇట్లనెను వినవోయి శిష్యరాయా విని నా కోరిక తీర్చెదవని నాకు వేడుకగుచున్నదని భావము.

కం॥ **నే జెప్పినట్ల జెప్పర - నే జెప్పిన బోధ తెప్ప నీకతి కుంటే - నేజూతు**
**నీచమత్కృతి - రాజితసుగుణైకసా రమ్యవిచారా ॥ 207**

తా॥శిష్యా! నాయనా నీవు మంచి నేర్పుతో గ్రహించే బుద్ధిగల వాడవు గనుక నేను నీకు చెప్పినట్లు నీవు చెప్పమని నే చెప్పిన బోధ నీమనస్సుకు అత్తియుంటే నే జూచెద నీచమత్కృతి సుగుణములలో రాజువు బాగా విచారించగలిగిన రమ్య విచారాయని భావము.

కం॥ **అనిగురుడు తనను బల్కిన-విని శిష్యుడు లేచి మ్రొక్కివినుతించి ముదం-**
**బున జెప్పదొణగె మునుతా - వినినట్లుగ గురుని మదికి వేడుకదోపన్ ॥ 208**

తా॥ అని పైన గురుదేవుడు పలికిన పలుకులు విని శిష్యుడు లేచి సాష్టాంగ ద్వాదశ నమస్కారములు జేసి స్తుతించి ప్రభోయని ప్రేమతో చెప్పుటకు ప్రారంభించెను మనుపుతాను గురుమూర్తి వల్ల విన్నట్లుగాను గురుదేవునికి సంతోషము కలిగేలాగున మొదలు పెట్టెనని భావము.

కం॥ **నేమొదలు లేని మేనును-నాముచ్చట స్వప్నమనుచునమ్మదగు సుమీ - నే**
**మేలుకొన్నలేనని-నా ముచ్చట నేను నిల్వనరఘుడియైనన్ ॥ 209**

తా॥ గురుదేవా! మొట్టమొదట నేను నామేనులేవు తరువాత తనంతట తా వచ్చినది అనగా నేను నామేను నాముచ్చట్లు యివికలవంటివని నమ్మవలెను ఈ కలను గురునిచే మేలుకొనిన నేను నా మేను నా ముచ్చట్లు నిల్వతరమా నరఘుడియైన అని భావము.

కం॥ **లేనినే లేక వచ్చిన - నేనేగిన నుండు బయలు నేనెరుగను యీ - నేనుండి**
**దాన్ని గనుగొని - నేనేగితె మరల బుట్ట నికనెన్నటికిన్ ॥ 210**

తా॥ ఆర్యా! గురుదేవా నేను లేనిదే గనుక ఈ నేను లేక వచ్చెను ఈ నేను లేకపోతే బయలే ఉన్నది కానీ నేను ఎరుగను గనుక ఈ నేను ఉండి అబయలును చూచి విచారించి తాను బయలైతే యెరుక యనే ఈ నేను పుట్టదు అని భావము.

కం॥ లేనినారాకపోకలు - దేనందున్నదోచబడెనదె బయలు సుమీ - దానిని
గురుకృపచేగని - నేనేగిన రానుపోనునిజమన్నటికిన్ ॥ 211

తా॥ అయ్యా! గురుదేవా నేను లేకనే వచ్చుచున్నాను పోవుచున్నాను దే నందున నేను తోచబడుచున్నదో అదే బయలు సుమా దానిని సద్గురు దేవుని కరుణచే ఎరిగి విచారించి తాను బయలై నేను యను యెరుకను లేకుండా చేస్తే ఇక రానుపోను అని భావము.

కం॥ తనువుకునాకును వేరని - యనగూడదదెట్టులనిన నవరతంబున్ -
పనులన్నితనువు నేనే - కనుజేయగవశముగాదు గావున స్వామీ ॥ 212

తా॥ దేవా! తనువుకు నాకును వేరని యన కూడదు అది ఏలాగనగా సర్వకాలముల యందు ఈ పనులన్నీ తనువు నేను లేకపోతే చేయతరమా చేయలేను ఈ రెండూ కలిసే చేయుచున్నాను స్వామీయని భావము.

కం॥ నను రమ్మని పొమ్మని తా-ననదుసుమీ బట్ట బయలు నాకైనేనే - తనువును
జగమును గైకొని-చనుదెంచుట చనుట నాకు సహజముతండ్రీ ॥ 213

తా॥ తండ్రీ గురుదేవా! నన్ను రమ్మని గాని పొమ్మని గాని అనదుసుమీ ఈ బట్ట బయలు నాకై నేనే వస్తాను నాకైనేనే పోతాను నాతో కూడా జగత్తును తీసుకొని వచ్చెదను నాకిది సహజ లక్షణము అని భావము.

కం॥ ప్రకటమగు బట్ట బయలున-సకలముతో లేక వచ్చిచను దరఘుడియన్-వాకకోటి
మాట్లనేరా - నోకవేళ్ళను లేనటంచునూ హబొడమినన్ ॥ 214

తా॥ గురుదేవా! ప్రసిద్ధమైన బట్ట బయలున సకలముతో లేక వచ్చి అనగా నేను వచ్చే టప్పుడు 24 ఇంద్రియములనే ప్రపంచముతో వచ్చి అనేక భావములతో నుండి అరఘుడియలో లేకపోదును ఎప్పుడైనా నేను లేని దానినని తెలుసుకొనినచో యిక రాకుండా పోదునని భావము.

విశేషార్థము : గురుదేవా! శాశ్వితముగా యెల్లప్పుడు ఉండే బట్ట బయలులో నాకునేనే కల్పితమై ఇంద్రియములతో కలిసి వచ్చి జీవుడనే పేరుతో సకల వ్యవహారములు చేయుచు నాకు నేనే లేక పోవుచున్నాను మళ్ళీ ఇంద్రియములకు విలక్షణమై ఈశ్వరుడనే పేరుతో సకలమునకు కారణమై సమస్తము ఎరుగుచున్నాను ఎప్పుడైనా ఎవరైనా నేను లేని దానినని గురుకరుణ చే యెరిగిన యడల అనగా యెరుక నే నన్ను గురుసూచన యనే యుక్తి ద్వారా విచారించి నన్ను లేకుండా చేయగలిగితే నేను లేకుండా పోయి యిక రానని భావము.

కం॥ లేనినేనెరుగ కుండిన - మేనుండదు నేను నిల్వ మేనుండక యీ - మేనగు
నాజో లొల్లని - దానిని గుర్తెరిగి నేను తలగితె చాలున్ ॥ 215

తా॥ గురుదేవా! నేను లేని దానను - నేనెరుగకుండిన, మేను ఉండదు, మేనులేకపోతే, నేను నిల్వుటకు తావులేదు, ఈ నేను మేనుల జోలియన్నడు ఎరుగని, ఆ బట్ట బయలును, గురుకరుణచే నెరిగి నేను లేకపోతే చాలునని భావము.

**విశేషార్థము** : యెరుక లేక పోవలెనంటె, మీకరుణచే లేకపోవలెను. గురుమూర్తి శిష్యుని యొక్క సేవకు మెచ్చి, యెరుకను విడిపించి, యెరుకలేక సేవింపుము, అట్లు చేసితివేని, ఎరుక ఏమీ లేకుండా పోవును, అని చెప్పి, అట్లు విచారించకపోతే యెరుక యన్నదు నిన్ను విడిచిపెట్టదు, గురుసూచననే యుక్తి ద్వారా విచారించిన యెడల, ఎరుక ఏమీలేకుండా పోవునని భావము.

కం॥ మనము మన పెద్దలందరు - చను దేరకమునుపు వారు చనినన్ గలయీ -
ఘనమును గని మనమేగిన - చనదుగదా మనను బోలి సారవిచారా ॥ 216

తా॥ ఆర్యా! మనము మన పెద్దలందరు రాని క్రితం, వారువచ్చినను, ఈ ఘనమైన బయలును చూచితాను బయలైతే, ఈ నేను మేనులు లేకపోవును, కానీ ఈ బయలు లేకపోలేదు గదా యని భావము.

కం॥ మేనుమజ్జనని నేనే - మేనికి జనకుడను నేను మేనులొకటి యై - దేనందు
సంచరింతుమొ - దానిని పరిపూర్ణమనుచు దలచెదనయ్యా ॥ 217

తా॥ గురుదేవా! మేనునాకు తల్లి, ఆమేనుకి తండ్రిని నేనే, ఈ నేను మేనులు ఒక్కటై దేనియందున చంచరింతుమొ, దానిని పరిపూర్ణమనుచు తంచెదను అయ్యా యని భావము.

**విశేషార్థము** : ప్రభో! నేను వలన మేను కలుగుచున్నది, మేను వలన నేను కలుగుచున్నది, ఈ రెండూ ఒక్క ఎరుకే ఈ ఎరుక బయలనే అచలములో, పుట్టుటగిట్టుట యెరుక యొక్క సంచారము యెప్పుడూ జరుగుచుండును, ఇట్టి యెరుక బయలును ఎప్పుడు కన్నదో, అంటే తాను బయలయినదో, అప్పుడే యెరుకలేదు, అని తెలియవలెనని భావము.

కం॥ మేనున్నది నేలేకను - నేనెరుగను మేనులేకనే నిల్వను యీ - మేనుకు నేనుకు
మూలము - గానసుమముమేమె స్పృజనగా వింతుమయా ॥ 218

తా॥ గురుదేవా! నేను లేకుండా మేను ఉన్నదనుట నేనెరుగను, మేను లేకుండా

నేను నిల్వలేను, ఈ నేనుకు మేనుకు మూలము గనలేదు, మాకు మేమే సృజన చేసుకొనుచున్నాము అని భావము.

**కం॥ నే నిల్వ జగము లేకను - నేనే గినజగము లేదు నిజమీజగమున్ - నే నును లేనప్పుడు గల - దానిని పరిపూర్ణమనుచు దలపోయ దగున్ ॥ 219**

తా॥ గురుదేవా! జగమనే మేను లేకపోతే, నేను నిల్వను, నేను లేకపోతే, జగము ఉండదు, ఇది నిజము, ఈ జగము నేనును లేనప్పుడు, యేది ఉన్నదో, అది పరిపూర్ణమని తలంచెదనని భావము.

**కం॥ లేనినేమాయమైనను - మానవులది మరుపు మూర్ఛ మరణంబునుగా - ఘానిద్ర యునిర్నిద్రన - నేనవి విని మృషని నమ్మ నేర్తునె వాటిన్ ॥ 220**

తా॥ స్వామీ! నేను లేకపోతే మానవులది మరుపుయని, మూర్ఛయని, మరణమని, గాఢనిద్రయని, నిర్నిద్రయని అనెదరు, నేనదివిని, ఇవిలేనివని వాటిని, నేను నమ్మెదనా, నమ్మనని భావము.

**కం॥ విను భాష్యములను త్రాళ్ళను - జనములునను గట్టి యుంచజనక నిలుతునా - చనుదొత్తు నాకు నేనై - కనుకనెనను నమ్మరెపుడు ఘనులగు వారల్ ॥ 221**

తా॥ ఆర్యా! వినండి స్వామీ, భాష్యమునె, పెద్దపెద్ద గ్రంధములనె త్రాళ్ళచేత, ఈ ప్రజలు నన్ను కట్టి నిలుప దలచిన, నేను నిలుతునా జనక, అనగా నేను లేకపోయె దానినేగాని, ఉండును, గనుకనే నన్ను నమ్మరు మహాపెద్దలైన పరిపూర్ణులు అని భావము.

**కం॥ నానా భాషల చేతను - నానా విధ శాస్త్రతతుల నను నమ్ముటకై - నేనే రచించిపెట్టితి - నానాదేశములయందు నరరూపమునన్ ॥ 222**

శిష్య ॥ సద్గురు దేవా! నానా భాషల చేతను, నానా విధశాస్త్రముల చేతను, నను నమ్ముట కొరకు, నానా దేశములయందు, నేనే రచించి పెట్టితిని, నరరూపముతో నని భావము.

**కం॥ ఒకచోట నవ్వుదును నే - రొక చోటను మిడుకుచుందునొకచోటనునే - ప్రకటమగుదు లేకుందును - నొక చోటను యిట్టి చేష్టలుండును నాకున్ ॥ 223**

తా॥ స్వామీ! నేనొకచోట నవ్వు చుందును, వేరొక చోట మిడుకుచుందును, మరొకచోట త్రుళ్ళిపడుదును, ఒకచోట వచ్చిపోదును, ఇంకొకచోట ప్రసిద్ధమై యుందును, ఇటువంటి చేష్టలచే ఉందును నేనని భావము.

**కం॥ కావేటి కాలువలవలె - నావల్లనె కల్గనౌను నానా విద్యల్ - యీవిశ్వమందు విశ్వము - నా వెంటనె వచ్చుపోవు నావలెను సుమీ ॥ 224**

తా॥ స్వామీ! ఒక నదినుండి అనేక కాలువలు ప్రవహించినట్లు, నా వల్లనే నా కల్పనలు అవును, అనేక విద్యలు, నా వల్లనే, నేను 24 ఇంద్రియములతో అనేక చిత్ర విచిత్రములైన పనులు చేసితిని, నా వెంటనే జగత్తు వచ్చును, పోవుచుండును అని భావము.

కం॥ నేనాడు దాన నౌదును - నేనే మగవాడనౌదు - నేనే నన్నున్ - నేనీవటంచు గూడుదు - నేనే నను జెరుపమను పనీగుదు సుమ్మీ ॥ 225

తా॥ స్వామీ! నేనేఆడదాని నగుదును, నేనే మగవాడనగుదును, నేనే నన్ను పొగుచేస్తాను, నీవని నేనని అనగూడదు, నేనే నను జరుపమను పనేగుదును లేకపోదును సుమీ నని భావము.

కం॥ నేనుల మేనుల కుప్పను - నేను బయల్ నన్నెరుగదు నే చనుదొత్తున్ - మేనైని ముషములోనిది - మానుగ నా వృత్తి నేనె మాయను సుమ్మీ ॥ 226

తా॥ స్వామీ! నేనుల మేనుల కప్పను, అనగా నేనే అనేక మేనులు నేనులు ఐతిని, బయలు నన్నెరుగదు, నేను వచ్చెదను పోయెదను, మేనై నిమిషములో నిలిచెదను, నా వృత్తిది. నేనే మాయను సుమ్మీ అని భావము.

కం॥ నేనుగా కొకటి శుద్ధ - జ్ఞానముగల దనుచు బల్కు జ్ఞానుల మాటల్ - పూనివినదగదు శుద్ధ - జ్ఞానంబననేనె నేను లేనిది యౌనే ॥ 227

తా॥ దేవదేవా! నేను గాక యింకొకటి, శుద్ధ జ్ఞానముగలదను, పల్కు జ్ఞానులమాటలు, పూనివినదగదు, శుద్ధ జ్ఞానంబన నేనే, నేను లేనిది, యగుదునే అని భావము.

**విశేషార్థము** : మేననగా 24 ఇంద్రియములతో, కలసి తిరిగే మరుపనే ఎరుకే జీవుడు, ఇది పిండాండము. ఈ ఇంద్రియములకు విలక్షణమై, తనకు తానైయున్నదే, ఎరుకయనే ఈశ్వరుడు. ఇది బ్రహ్మాండము, ఈ రెంటికి అతీతమై, అఖండమై యున్నదే, శుద్ధ యెరుక, ఇదే బ్రహ్మాండా తీతము, యిదే అచలమై ఉన్న శుద్ధ ఎరుక, ఇదే పరమ పురుషుడు ఇదే సచ్చిదానంద స్వరూపమైన పరిపూర్ణము, అందుకే శివరామదీక్షితులవారు. ఎరుక మూడు విధములని తెలవిచ్చియున్నారు -1- యెరుక అఖండమై యున్న శుద్ధయెరుక, యిదే పరిపూర్ణం -2- యెరుక, తనకు తానై ఇంద్రియములకు. విలక్షణమైయున్నదే, ఈశ్వరుడనే, అక్షరుడనే యెరుక, -3- యెరుక ఇందుకు 161వ కందార్థములో యెరుగననేటిది యెరుకే, యిది అఖండమై యున్న శుద్ధ యెరుక. యిదే పరిపూర్ణం, యెరుగుదునని తనన్ను పరుల నెరిగెదెరుకే, యిది 24 ఇంద్రియములను ఎరుగును, నేను జీవుడను, తనను పరులను ఎరుగును ఇది

మలినయెరుక, యెరుగనెరుంగుదునను, దాన్నెరుగుచునుండేటి దెరుకే నిరుపమ బుద్ధి, నీవెరుగిది నిగమ ప్రసిద్ధి అని శెలవిచ్చియున్నారు యిది ఈశ్వరుడై తనకు తానై, 24 ఇంద్రియములకు విలక్షణమై, అక్షరమై యున్న యెరుకయిన యెరుక యిది. ఈ మూడు ఎరుకలు, నీలోనున్నవి, వీటిని, విచారించి, ఈ మూడెరుకలను, విచారించి రహితము చేసిన, తరువాత శేషించియున్నదే, అఖండాను భవరహితమైన, అనగా సచ్చిదానంద స్వరూపమైన, యెరుక రహితమైన, తరువాత శేషించియున్నదే, శుద్ధ నిర్గుణతత్వమైన కేవలాత్మని, భావము.

మరియు ఈ మూడెరుకలె, ద్వాదశి, షోడశి,పంచదశి, ఈ మూడు మంత్రములు కలలో తోచ్చి శరీరాలు ఎలాగో, అలాగే, మూలంలేని ఈ గుర్రెరిగే శరీరం ఏమీలేదు, ఈ ఉత్తబట్టబయలు ఏమీలేదు, ఈ మూడెరుకలు యేమీ లేవు అని మంత్రములు చెప్పచున్నవి, శ్రీ శివరామ దీక్షితులవారు, చెప్పిన మూడెరుకలు సరిపోయినవి, యివి యన్నీ విచారించగా, తెలినసారం ఏమిటి అనగా, మనమెపంచదశి, మనమె శోడశి, మనమె ద్వాదశి, ఈ మూడెరుకలు, మనమేకదా? ఈ ఉత్తబయలు ఏమీలేదు అంటే, కలలో తోచిన శరీరాలు ఎలాగో అలాగే మూలంలేని ఈ గుర్రెరిగే శరీరం యేమీలేదు ఈ ఉత్తబట్టబయలు ఏమీలేదు, యేమీలేదు, యేమీలేదు, యేమీలేదు, అని చెప్పచున్నావంటే మనలో ఈ మూడెరుకలు యేమీలేకుండా పోవలెను ఆ తరువాత శేషించియున్నదేదో, అదే కేవలాత్మ దాన్ని ఎవరెరుగును, 180వ కంద్గార్ధములో యెరిగేది లేకుంటె యేమో ఆవలిజాడ ఎరిగే వారెవరింక, అని శెలవిచ్చియున్నారు దానికి పేరు పెట్టేరు, కేవలాత్మయని, మనపెద్దలు, మనకు తెలియటకొరకు, కేవలాత్మయన్నారు, పెద్దలు ఎన్నో చెప్పియున్నారు, అయినా మనకు తెలియబడుట లేదు, వాచార్ధపరులకు, అసలే తెలియబడుటలేదు, యిందుకు రామచంద్రయోగి వ్రాసెను, 106 పు॥ నరబయలే పరబయలని, గురుపుత్రులు తెలియవలె, గూడార్ధమిదే, పరిపూర్ణమిదిగోయిది గోయని, యోగీంద్రుడు తప్పకుండ, తనువును జూపెన్ 107 పు॥ చూచే శరీరంబు చూడకుంగ జూస్తే, నరబయలే పరబయలగును చూడు, నడిచె శరీరంబు, విడిచి, గొడవెందుకని, రామచెంద్రయోగి వ్రాసెనిట్లు అందువల్ల ఈ సూక్తులు చెప్పినవి విచారించగా శుద్ధ యెరుక పరిపూర్ణం యను నేనే యని తెలినది, గనుక పరిపూర్ణం మనమేగాని యింకోటి కాదని తెలిసినది, గనుక మనమె శుద్ధ యెరుకైన పరిపూర్ణం, అవ్వాలి అంటే మనం ఇంకా ఎంత విచారణ చేయాలో, మీరే ఆలోచించండి, అనగా ఈ మూడెరుకలు రహితమైతేకదా, శేషించియున్నది, కేవలాత్మయైయుండును, అప్పుడు కదా, ఈ అన్నిటికీ అతీతమై దేనిలోను కలియక, దేనికి సంబంధంలేక, దేనిని అంటక, తనకు తానై స్వతః సిద్ధమై, లేకయున్నదే, కేవలాత్మ ఆకేవలాత్మలో యింకోటి ఉండదు, తొండముదిరి వూసరవిల్లి యైనట్లు, నక్క ముదిరి వరడైనట్లు, చల్లలో వచ్చిన వెన్న చల్లలో కలియనట్లు ఈ కేవలాత్మయనే, పరిపూర్ణం, ఎందులోనూ కలియదు, అందులో రెండవది యింకోటి యుండదని తెలియవలెనని భావము.

కం॥ నేమాత్రముందునని యెను- నామాయలకూ తలన్నియరసినసుప్తిన్ -
యేమాయమరణమప్పుడు- యేమాయనుగురుని మాటనేమాయనయా ॥ 228

తా॥ గురుదేవా! ఈ సమస్త ప్రపంచం నశించిపోయినా నేను శాశ్వతముగా యుందుననేమాట మాయ, నామాయ మాటలన్నీ సుషుప్తియందు. మరణమందు చూడగా యేమాయెను? గురుదేవుడు చెప్పినట్లుగా నేనుమేనులు రెండూ ఒక్కటాయెను. గనుక నేను మాయయేనని ఎరుగవలెను సుమా యని భావము.

కం॥ నేనన్ననహమహంబన-నేనుసుమీయహమటంచునేనెపుడంటే-నేనపుడు
బుట్టుటదిజన - నేను గతించుటమటంచు నీవెరుగయ్యా ॥ 229

తా॥ ఆర్యానేననిన అహము, అహమనిన నేను, సుమీ, అహమని నేనెపుడంటే అప్పుడే పుట్టుచున్నాను, నేను లేకపోతే నేను చనిపోవుచున్నాను. అని ఎరుగుమయ్యా యని భావము.

**విశేషార్థము :** అహమనే నేనును ఎవరురహితము, చేసుకొందురో, వారుమరణించిన వారితో సమానము. అహముతోనునన్న వారు,నేనునేననేమాటే మాయగనుక వారు బతికి ఉన్నవారున గనుక పుట్టుచు చచ్చుచునుందురు. గనుక అహమును రహితము చేసుకొన్నవారే పరిపూర్ణులని తెలుసుకొనుడి, అనగా అహముతో నున్నవారు బ్రాహ్మణులైనావారు సూద్రులే, అనగా జన్మనాజాయితే సూద్రః కర్మణాజాయితే ద్విజః వేదపాఠంతు విప్రాణాః బ్రహ్మజ్ఞానంతు బాహ్మణః అని శృతిప్రమాణమని భావము.

కం॥ నేననవాల్గవ దేహము - మేననవాలోని మూడు మేనులు సుమ్మీ - నేను మేవనన
దొక్కటె - కానిది తనమూలమరయ గనరాదుసుమీ ॥ 230

తా॥ గురుదేవా! నేననగా నాల్గవదేహము, ఇదే మహాకారణ శరీరం, మేననగా నాలో నున్న మూడు మేనులు సుమీ అనగా స్థూల - సూక్ష్మ - కారణ శరీరములు మూడున్నూ నేను మేనులు రెండూ ఒక్క యెరుకే, కానిది తన మూలమునకు వెళ్ళి చూస్తే, అనగా విచారించితే, మూలమే మాత్రం కానరాలేదు, అనగా నేను లేదు, బయలే ఉన్నదని భావము.

**విశేషార్థము :** ఈ నాల్గవతనువైన మహాకారణ శరీరమే నేను, ఈ నేను వల్ల వచ్చినవే, ఆ మూడు శరీరములు, ఈ నేను లేకపోతే, యేమీ లేదు. గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమును, యేమీ లేకుండా చేసుకొంటే మిగిలినది బయలే ఉన్నది, గనుక ఈ గుర్తెరిగే శరీరాన్ని, సర్వకాలం ఏమీ లేకుండా చేసుకొనుటే నీ పని అనగా ఈ నేను మూలమునకు వెళ్ళి విచారించవలయును, ముందు ఈ నేనులో ఉన్న మూడు

శరీరములను, విచారించి, ఈ నేను దగ్గరకు వెళ్ళవలెను. అది ఎలాగనగా ఎరుపు తెలుపు నలుపు ధూమ్ర వర్ణములు ఈ నాల్గు వర్ణములలో 24 ఇంద్రియములతో కలసియున్న జాగ్రదావస్థయే స్థూల శరీరము, 17 ఇంద్రియములతో స్వప్నావస్థను పొందుచున్నదే సూక్ష్మ శరీరం, మనో బుద్ధులతో సుషుప్తావస్థ పొందుచున్నదే కారణ శరీరం, దీనిని మరుపనే జీవుడని అందురు. మహా కారణ శరీరమనే నాల్గవ తనువు, ఎరుపులో తెలుపు, తెలుపులో నలుపు, నలుపులో ధూమ్రం, ధూమ్రంలో సునీలం, ఈ నాల్గవ తనువైన మహాకారణ శరీరం, ఈ శరీరమే నేను. ఈ నేను వద్దకు వెళ్ళి ఎరిగితే, తన మూలము తానెరిగినట్లైతే, అనగా స్థూలం కన్నా సూక్ష్మం అంతరంగా ఉన్నది, ఒక దాని కన్నా ఒకటి అంతరంగా ఉన్నవి. ఆ నేను వద్దకు వెళ్ళి దానిని ఎరిగితే, తనమూలమంతా నెరిగిన, తానే బయలై యుండునని భావము.

కం॥ **అంగములిబగముగలసుటె - లింగశరీరంబటంచు లెక్కకు వచ్చెన్ - లింగం బంగమునెడసిన - లింగముళక్కొను నేనె లింగంబనినన్ ॥ 231**

తా॥ స్వామి! అంగమనగా జీవుడు, లింగమనగా ఈశ్వరుడు, ఈ రెండూ కలసితే, లింగ శరీరమనే నేను. ఈ లింగ శరీరం బంగము నొందిన లింగ శరీరం ఉళ్ళక్కొను, అనగా నేను బయలౌతానని భావము.

**విశేషార్థము :** అంగుష్ట మాత్రములో, అష్టదళ కమల మధ్యమున, పీత వర్ణములోపల, శ్వేత వర్ణమైనదే, నేననే ఎరుక, ఆ యెరుక వద్దకు వెళ్ళి దాని మూలము ఎరిగితే, ఈలింగ శరీరము, బంగమైయ్యి, తాను బయలై ఉండునని భావము.

కం॥ **లింగము విక్షేపంబన - నంగంబావరణమనిననగుని రెండే - లింగ శరీరము దీనికి - భంగము తన మూలమరయబడినప్పుడగున్ ॥ 232**

తా॥ గురుదేవా! లింగ శరీరం ఈశ్వర తనువు, అంగమనగా జీవతనువు, అపును ఈ రెండు శరీరములు కలుసుటే లింగ శరీరం. ఈ లింగ శరీరం భంగము కావలెనంటే, తన మూలమునకు వెళ్ళి, విచారించినపుడే లింగ శరీరం భంగమౌనని భావము.

కం॥ **ఎరుకన మరుపన రానిది - పరిపూర్ణం బీశ్వరుడనబడు నెరుకెరుకన్ - మరచిన జీవుండనబడు - నెరుక చలము నెరుగనరుగు నెరుక మరుపులున్ ॥ 233**

తా॥ పరమ పురుషా! ఎరుక మరుపులుగానిది పరిపూర్ణము. ఎరుకనగా ఈశ్వరుడనబడును, యెరుకను మరచిన జీవుడనబడును, యెరుక అచలమును ఎరిగిన, ఎరుక మరుపులు రెండూ ఏమీ లేకుండా పోవునని భావము.

**విశేషార్థము :** అంతరనాళ ముఖాంతరమధ్యత్రైలోక్య దర్శన కల్పిత ద్వాకాశమైనదే జీవుడను మరుపు, దహరాకాశ సూక్ష్మ రంధ్రాంతర్గత బిన్దువు కుహర విరాజమానమై సర్వప్రకాశమానమై బహిరంతర ప్రకాశమై నిజానంద స్వరూప [illegible] ఉన్నదే ఈశ్వరుడను

ఎరుక, అఖండ మండలమండిత హృదయ పుండరీక మధ్యస్థ సర్వవ్యాప్త సచ్చిదానంద స్వరూపమైనదే అచలం, అక్కడికి వెళ్ళి, ఈ అచలమును, యెరుక ఎరిగితే, ఎరుక మరుపులు రెండూ రహితమై, తానే అచలమై యుంటాడని భావము.

**కం॥ ఎరుకన సత్వగుణంబని - మరుపన తామసమటంచుమరి యీ రెండున్ -**
**సరియైన రాజసంబని - నరులెన్నిరి మూటివిడువనర్త మునుమ్మీ ॥ 234**

తా॥ దేవాదిదేవా! యెరుకయనే జ్ఞానమనగా సత్వగుణంబని, అజ్ఞానమను మరుపనగా తామసగుణమని, మరి ఈ రెండును సరియైన రాజసమనబడును, అని ప్రజలనిరిగాని, ఈ మూడింటిని విడిచిపెట్టుట మంచిదని. తెలియవలెనని భావము.

**కం॥ నన్నెరుగనట్టి బయటన్ - యెన్నడు లేనట్టి నేను యీ విశ్వమునై**
**వున్నట్టులుండినేలేం - దున్నదిగని నేను బోతె దుందణగుసుమీ ॥ 235**

తా॥ గురుదేవా! నన్ను ఎరుగని బయలులో ఎన్నడు నేలేనట్టి నేను తోచి, ఈ ఇంద్రియ ప్రపంచమై, ఉన్నట్టులుండి నేను లేని బయలును చూచి తాను బయలైతే, నేను మిడుచు పాటంతా లేకపోవును అనగా ఎరుక ఏమీ లేదని భావము.

**కం॥ ఈ యచలమొకటి బ్రహ్మని - మాయామయమైన విశ్వమంతయు నేనన్ -**
**వాయుమెరుంగక ననునరు - లీయడ బ్రహ్మంబటంచు లెక్కిడ నగుదున్ ॥ 236**

తా॥ ఆర్యా! ఈ అచలమొకటి బ్రహ్మమని, మాయాయైన ఇంద్రియ ప్రపంచ మంతయు నేనేనని, నా నడనుడులెరుగక నన్నే బ్రహ్మమని పల్కిన నేను బ్రహ్మమనద గని నాకు నవ్వువచ్చుచున్నదని భావము.

**కం॥ భూమును భద్రాచలమని - రాములనుచులేని నన్నర క్షణముననే - మీ మాట**
**నెరి గుళక్కని - నామాటను మరచి యునికి నయమనితోచెన్ ॥ 237**

తా॥ స్వామీ! బయలే భద్రాచలమని, అందులో తోచిన యెరుకే రాముడనుచు నెరిగి, గురుకరుణచే యెరుకను అరక్షణములో లేకుండా జేసి, నా మాటను మరచి, వునికిలో ఏమీ లేకుండా చేసి వునికిలో ఉండడమే, మేల్కనితోచి నేను లేక ఉన్నానని భావము.

**విశేషార్థము** : బయలులో ఎరుకలేనిదే తోచినది, గురుకరుణయనే గురుయుక్తివలన, విచారించి తాను బయలైతే, ఎరుక ఏమీ లేకుండా పోయినది, ఎరుక పోయివ తరువాత బయలే ఉన్నది, ఎరుక ఒకప్పుడు తోచినా లేందని తెలిసినది, గనుక యెరుకలేని యునికిలోనే, సర్వకాల సర్వావస్తలయందు ఉన్నాడని భావము.

**కం॥ నాగురుడు నాకు దెల్పిన - యీ గురుబోధంత మీకు యిప్పుడునేనున్ - బాగుగ**
**వినజెప్పితిసుమి - యోరుగువర్యయని శిష్యుడూ రకయునన్ ॥ 238**

తా॥ ఓ గురువర్యా! నా గురుమూర్తి నాకు జెప్పిన ఈ అచలబోధంతా మీకు ఇప్పుడు నేను బాగుగ వినజెప్పితిని సుమీ, యోగురు వర్యా! యని శిష్యుడు ఊరకున్నాడని భావము.

**కం॥ విని శిష్యుని వచనోక్తులు - మనమున హర్షించి గురుడు మస్తకమునచె - య్యునిచి తొడ మీద జేర్చుక - తన శిష్యుని మేను నివిరి తానిట్లనియెన్ ॥ 239**

తా॥ గురు మూర్తి శిష్యుని వచనములను విని, మనస్సులో సంతోషించి, శిష్యుని మస్తకమున చెయ్యి ఉంచి, ఆశీర్వదించి, తొడమీద కూర్చోబెట్టుకొని, మేనునివిరి తానిట్లనెనని భావము.

**కం॥ నీవంటి గట్టివాడిక - భూవలయమునందు ముందు బుట్టడు వెనుకన్ - నేవినలేదున్నాడం - చీవేళ్ళకునిన్నె చూస్తినిట భళిశిష్యా ॥ 240**

తా॥ ఓ శిష్యరత్నమా! నీవంటి ఘట్టివాడు ఈ భూమి మీదను ముందుగాని, వెనుకగాని పుట్టలేదని, యిక పుట్టడని, ఈ వేళవరకూ, నేను చూడలేదు, నిన్నే చూచితిని, భలి శెభాష్ శిష్యా యని భావము.

**కం॥ చందురుని చీమముద్దా - డిందనినట్లిపుడు నీవు యీ సద్బోధన్ - జెందితివి నీకు సరిజగ - మందెవ్వరు లేరు నిన్ను మది మెచ్చితిరా ॥ 241**

తా॥ శిష్యా! చంద్రుని చీమముద్దాడిందని యనినట్లు, యిప్పుడు నీవు, ఈ సద్బోధను జెంది, పూర్ణుడవైతివి, నీకు సరిపోయే వారు, ఈ జగమందు యెవ్వరు లేరు, నిన్ను నా మనస్సులో మెచ్చుకొంటిని యని భావము.

**కం॥ అని మెచ్చియేమి యిచ్చెద - వని గురుదక్షిణటంచు నతడడిగిన న - న్నని పల్కె శిష్యరత్నము - విని యిదియిక ముట్టబోక విహరించుమనన్ ॥ 242**

తా॥ శిష్యరత్నమాయని మెచ్చి, యేమి ఇచ్చెదవు గురు దక్షణయని, గురుమూర్తి బలుకగా, నన్నే గురు దక్షణగా ఇచ్చుచున్నానని శిష్యరత్నమనగా విని ఇది యిక ముట్టబోకుండా యుండుమని గురుదేవుడు అనెనని భావము.

**విశేషార్థము :** శిష్యుడు నన్ననే నేనును గురు దక్షణగా ఇచ్చినానని యనగా, గురుమూర్తి నాయనా శిష్య రత్నమా, ఆ నీవనే నేనును, యిక దానితో వ్యవహరించకుయని, గురువుగారన్నారంటే, దాని యర్థమేమనగా, ఆ నేను ఎక్కడ ఉన్నది ఆ నేనును విడిచిపెట్టవలెనంటే, అఖండమండలమండిత హృదయపుండరీక మధ్యస్థ సర్వవ్యాప్తసచ్చిదానంద స్వరూపమైనదే ఆ నేను, దానిని ఎరిగి, లేకుండా చేయవలెనంటే, 24 ఇంద్రియములు రహిత పర్చి 25వదైన అక్షరమనే ఈశ్వరతత్వాన్ని రహితము చేసి, 26వ దైన అఖండ యెరుకై, దాని నడకంతా రహితముచేసి, తానులేకయున్నదే నేను లేని పరిపూర్ణమని భావము.

కం॥ విని శిష్యుడు గురుమూర్తిని - గనుగొని చిత్రరువు ప్రతిమగా నిలచున్నన్ - తన శిష్యుని హస్తములన్ - గొని దగ్గర దీసుకొని కొడుకాయనుచున్ ॥ 243

తా॥ చెప్పినది విని శిష్యుడు, గురుదేవుని గనుగొని, చిత్తరువు ప్రతిమవలె, నిలచున్న, తన శిష్యుని చూచి, హస్తములతో గొని, దగ్గరకు తీసుకొని కొడుకాయనుచును ప్రేమతో అనెనని భావము.

కం॥ చెప్పదొడంగెను మునుతా - జెప్పనిముచ్చట్లు కొన్ని సేమము కొరకై - యొప్పులకుప్పా వేమా - యప్పాయని దువ్వుకొనుచునతిదయతోడన్ ॥ 244

తా॥ శిష్యా! ఓ కుమారాయని, చెప్పదొడంగెను, మునుపు తాను చెప్పని విషయములు, కొన్ని వాని క్షేమము కొరకై, నాయనా నీవు నొప్పులకుప్పవు, నా తండ్రీయని, దువ్వుకొనుచు, నతి దయతో చెప్పెనని భావము.

**విశేషార్థము :** నాయనా నీవు ఈ పరిపూర్ణ బోధను పూర్తిగా నేర్చి నే చెప్పినట్లు పరిపూర్ణుడవై తయారైతివి, కానీ నీవు ప్రపంచములో ఎలానడవవలయునో, అవినీకు ఇప్పుడు చెప్పుచున్నాను విను అని మునుపు తాను చెప్పని విషయములన్నీ చెప్పెనని భావము.

కం॥ ఒప్పకుమీ పరబోధల - తప్పకుమీ బోధనెపుడు దలచుట మదిలో - రొప్పకు మీ సచ్ఛిష్యుల - చెప్పకు మీ దీన్ని దుష్టజెనటుల కెపుడున్ ॥ 245

తా॥ శిష్యా! నీవు ఇతరముగా చెప్పే బోధలు మంచివేనని అంగీకరించకు, వదిలివేయుము, పరిపూర్ణ బోధను మదిలోనెప్పుడు అవలోకనముచేయవలెను, రోషముగా సచ్ఛిష్యులతో మాట్లాడకుము. ఈ బోధ దుష్టులకు దుర్మార్గులకు మూర్ఖులకు చెప్పవద్దని భావము.

కం॥ కూడకుమీ దుర్జనులను - వీడకుమీ సాధు మనుజవితతిస్నేహం - బోడకు మీ గురుసేవకు - పాడకుమీ పరులనింద పాటలనీతిన్ ॥ 246

తా॥ శిష్యా! దుర్జనులను ఎన్నడు కలసి స్నేహము చేయకు సుమా, సజ్జనులను ఎన్నడు విడిచిపెట్టకు, వానితో స్నేహము చేయుము సుమీ, గురుసేవ ఎన్నడు మానకు సుమా, పరులను నిందించే పాటలు ఎన్నడు పాడకు సుమీ యని భావము.

**విశేషార్థము :** శ్రీ భాగవతుల క్రిష్ణదేశిక ప్రభువులవారు, ముందు జరగబోయేవి, గ్రహించే, ఈ పద్యములలో, వ్రాసి ఉన్నారు, పరులను నిందించవద్దని, వారు చెప్పినట్లుగా, మన సాంప్రదాయులు వాచార్థపరులు ఎక్కువగా ఉన్నారని, వారు తెలుసుకొనే కొరకై

నేను రచించిన గ్రంథములతోను, ఉపన్యాసములలోను అక్కడక్కడ, యెరుకే పరిపూర్ణం అవ్వాలి ఆ పరిపూర్ణం యెరుకౌచున్నది, అని చెప్పుచుంటే, ఈ నీతులు చెప్పే పెద్దలు కొందరు యెరుక పరిపూర్ణమౌతాదట, ఎంత చిత్రముగా చెప్పుచున్నాడో, వినండి అని నన్ను హేళన చేసినారంటే, మరి దీక్షితులవారు పూర్వ భాగములో, 166వ పేజీలో 12 పంక్తిలగాయతు యిలా చెప్పేరు, వినండని నేను చెప్పితె, కొంతమంది పెద్దలు, ఈ సమస్య తేల్చవలసినదని, సభ చేసి కూర్చునేసరికి, ఎక్కడికో వెళ్ళిపోయినారు, అక్కడ లేకుండా, అలాంటివారు ఎందుకు అంటం, వారి శిష్యులచేత కూడ, అనిపించినారంటే, ఎంత తెలివి తక్కువో, మీరే ఆలోచించండి, దీక్షితులవారు చెప్పినది, ఏమనగా ఈ ఉత్తబట్టబయలు ఎవరెరుగుదురు, కేవలాత్మ ఈ ఉత్తపరము, ముంజేతి కంకణము వలె నగుపడును,ఈ కేవలాత్మ గజ్జలు కట్టుకొని ఆడేదికాదు. ఈ ఉత్త బట్టబయలు ఏమీ లేదని ఎరుగవలెను, ఈ ఉత్త బట్టబయలును, గుర్తెరిగిన యెడల, ఈ ఉత్త బట్టబయలు వలె మనస్సు కూడా ఉండును, ఈ ఉత్త పరమును, తెలిసినవారు, పరిపూర్ణులే. ఈ పరిపూర్ణమును, ఎంత వరకు ఎరుగరో, అంత వరకు సకముతప్పదు, ఈ ఉత్త బట్టబయలును, ఎరుక ఎరగనేరదు, ఈ కేవలాత్మను, ఎరుగుటయనగా, ఎరుక లేకపోవుటయని యర్థము, ఇది పరిపూర్ణమని అందరితో చెప్పగూడదు, ఈ రహస్యం అందరికి మనస్సునకు పట్టదు, మహా గూఢమైనదని చెప్పియున్నారంటే అది మీరే గ్రహించండని భావము.

**కం॥ మీరకుమీగురువాజ్ఞను - చేరకుమీ దుష్టులంత చేరిన చోటన్ - దూరకు**
**మీ బోధను విని - యారకుమీ సాధు జనులయందున తప్పుల్ ॥ 247**

తా॥ శిష్యా! గురువుగారు చెప్పిన ఆజ్ఞ ఎన్నడూ జవదాటకు సుమీ, దుర్మార్గులున్నచోటుకు ఎన్నడూ వెళ్ళకుము, ఇతరులు చెప్పుకునే బోధలోనికి నీ వెళ్ళకుము, సాదు జనులయందు తప్పులు యంచకుమని భావము.

**విశేషార్థము :** గురువాజ్ఞను దాటిన వారికి ఆపదలు సంభవించును, దుర్మార్గులున్న చోటుకు వెళ్ళినయడల, ఆపదలు కొని తెచ్చుకొన్నట్లౌను, ఇతరులు చెప్పుకునే బోధలోకి మనము వెళ్ళిన యడల, పిలవని పేరంటమునకు వెళ్ళిన, దాక్షాయని గతి, పట్టునని తెలియవలెను, పెద్దలయందు, తప్పులెంచినవారికి, లేని పోని కష్టాలు కొని తెచ్చుకున్నట్లౌను, అందువల్ల అతను చవలుడని, సాంప్రదాయుడు కాడని, తెలియవలెను, సాంప్రదాయుడైతే, సద్గురుమూర్తి శరణ పంకరుహద్వయార్చన, చేసుకొనుచు ఉంటాడని, మిగిలిన విషయాల జోలికి వెళ్ళటానికి, వానికి యిచ్ఛ ఉండదని తెలియవలెనని భావము.

కం॥ **జనులవలె జరుపు పనులను - నను నిను జనవితతి దిట్టనడువకు మెప్పుడున్ -**
**నిను నీవు బొగడుకోకుము - నిను బోలరటంచు జనుల నిందించకుమీ ॥ 248**

తా॥ శిష్యా! జనులు ఏ విధముగా చేయుదురో, అలాగే నీవు చేయుచున్నట్లు కనుపించవలెను, ప్రజలు నిన్ను, నీకు బోధ చేసినందున నన్ను తిట్టేలాగున, ఎన్నడు నడువకుము, నిన్ను నీవు ఎన్నడు పొగడుకోకుము, నాకు నేనేసాటి నాకు ఎవరూ సరిపోరని ప్రజలను నిందించకుమని భావము.

**విశేషార్థము** : ప్రజలవలె జరుపు పనులును, అనగా ప్రజలవలె పనులు చేసినట్లు కనపడు, కానీ నీ స్థితిలో నీ ఉండుము, ప్రజలకు నేను వేదాంతినని తెలియబడకుము, తెలియబడితె, నిన్ను నన్ను తిట్టెదరు, గనుక జాగ్రత్తగా, మెలగవలెను, నీకు నీవు పొగడుకొనుట, ధర్మమునకు విరుద్ధంగనుక, పొగడు కొనగూడదు, నేను గురుసేవాదురంధరుడను, నాకు సాటి, ఈ ప్రపంచములో, ఎవరుయని ప్రజలను నిందించకుము, నీ పని ఏమిటి, సర్వకాల సర్వావస్థలయందు, యెరుక లేక సేవించే పని చేయవలయును గదా, ఆ పని మానివేసి, ఎటువంటి పెత్తనాలకు వెళ్ళవద్దని భావము.

కం॥ **శ్రద్ధ బోధందునిలి ప - శ్రద్ధను నీనేర్పుచేత రూడించితివా - బద్ధ త్వమంత**
**బాయును - బుద్ధికి సరిపడితె దీన్ని బూనగ దోయీ ॥ 249**

తా॥ శిష్యా! బోధయందు శ్రద్ధ వహించి, విచారించుము, అశ్రద్ధను నీనేర్పుచేత, జాడించితివేని, బద్ధత్వమంతా పారిపోవును, నీ బుద్ధికి, సరిపోతే దీన్ని పూని, ఎరుక లేక సేవించుమని భావము.

**విశేషార్థము** : బోధయందు శ్రద్ధ వహించి యుంటే, సర్వకాల సర్వావస్థలయందు, ఎరుక లేక సేవించుటయందు, అశ్రద్ధ చేయక, నీ నేర్పుచే అశ్రద్ధను జాడించి, శ్రద్ధ వహించితివేని, నీవా ఉనికిలో ఎల్లప్పుడూ, ఎరుక లేక సేవించెదవు, ఆ సేవించుటలో, తొండముదిరి ఊసరవెల్లైనట్లు, చల్లలో వచ్చిన వెన్న చల్లలోకలియనట్లు, యెరుకయనే ఇంద్రియ ప్రపంచముతో కలియవు అని భావము.

కం॥ **సంశయమె జన్మహేతువు - సంశయమే గురుని మాట చవిగొననియదీ -**
**సంశయమె కీడునొదవును - సంశయమెడబాస్తివేని చాలునువత్సా ॥ 250**

తా॥ శిష్యా! సంశయమే జన్మకు హేతువై కారణమైయున్నది, సంశయమె గురుని మాట విననివ్వనిది, సంశయమె సమస్త కీడులకు కారణమైనది, సమస్త సంశయములు వదలి నిస్సందేహముగా ఉంటే చాలునని భావము.

**కం॥ నరులంతమెచ్చనడువను - హరిహర విధిశతమఖామరాదులకైనన్ -**
**తరముగాదనగ మనకిక - తరమౌనన - వశమె చూడు ధాత్రి నిపుత్రా ॥ 251**

తా॥ శిష్యా! కుమారా, ఈ ప్రజలంతా మెచ్చుకొనేలాగు నడవ వలెనంటే, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకైనను తరముగా దనినను మనకిక తరమన వశమౌన నాయనా ఈ ప్రపంచములో ఎవరికీ వశముగాదు పుత్రాయని భావము.

**కం॥ అందరిని చణుకుచుందురు - కొందరు దుర్మార్గవృత్తికుటిల జనంబుల్ -**
**యొందరినొగిచ్చికరుచుచు - మందలవలెకోతులుండు మాడ్కినికుర్రా ॥ 252**

తా॥ నాయనా! పుత్రా కొంతమంది దుర్మార్గులు, అందిరిని గదుముచుందురు, కొందరిని గీచుచుందురు, కొందరిని కరుచుచుందురు, కొందరిని కొట్టుచుందురు, కుటిలస్వభావముతో మందలవలె, కోతులుండే విధముగాయని భావము.

**కం॥ ఈ చెప్పిన గురుబోధను - తాచెవినిడి బయలుగాంచి తనలేమి నిజం - బైచని**
**యె శిష్యుడప్పుడు - లేచెనుగురు డవలమాటలే దామీదన్ ॥ 253**

తా॥ శిష్యా! ఈ విధముగా చెప్పిన గురు బోధను, శిష్యుడు విని, బయలును చూచి, తనలేమి నిజమని, తానులేకపోయెను, అప్పుడు గురువర్యుడు, లేచి ఆ వలిమాట, లేదనెను, అనగా చెప్పేది వినేది లేదు అని భావము.

**కం॥ శరధికరితురగసితకర (1784) పరిమితమైనట్టి శాలివాహన శకమం దురచిస్తిమాఘ**
**పౌర్ణమి - వరకి విదుందుభియనేటి వత్సరమపుడున్ ॥ 254**

తా॥ శ్రీ భాగవత కృష్ణ ప్రభువులవారు వారు రచించిన కందములు పూర్తిఅయిన కాలము ఈ పద్యములలో తెలియపర్చినారు, అనగా సంఖ్యాశాస్త్ర ప్రకారం, శరధి కరి - తురగ - సితకర - అనే పదములు తెలవిచ్చియున్నారు, అనగా శరధి (సముద్రం) అంటే చతుస్సముద్రాలు గాన శరధి 4 సంజ్ఞ - కరి, ఏనుగు అష్ట దిక్కులలో అష్టదిగ్గజాలు ఉంటవి. కాన ఏనుగునకు 8 సంజ్ఞ. అదే విధంగా తురగ - గుఱ్ఱము, సూర్య రథమునకు 7 గుఱ్ఱాలు కాన గుఱ్ఱమునకు 7 సంజ్ఞ, సితకర - చంద్రుడు, అనగా 1 సంజ్ఞ ఈ విధముగా, నాలుగు సంజ్ఞలు అంకెలు - అంకానారి వాగుతో గతిః - అనే సూత్ర ప్రకారం ఎడమనుంచి, లెక్కిస్తే, పై సంఖ్యలు 1 సితకర - 7 తురగ - 8 కరి - 4 శరధి - 1784 శాలివాహన శకం - మాఘ శుద్ధ పౌర్ణమి నాటికి ఈ కందపద్యములు రచన పూర్తి అయినది. క్రీస్తు శకము రీత్యా 1863 ఫిబ్రవరి నెలలో గ్రంధము పూర్తి అయినది అని భావము, మరియు ఈ పద్యములలో శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులువారు చెప్పినవేమనగా, సద్గురుని ద్వారా విచారించి, ఈ యఖండ యెరుకను యేమీ లేకుండా చేసుకొని, పుత్తడైయున్న యునికిలో వుండమని చెప్పి

 

యున్నారు, అలా వుండలేనివారు సర్వకాలములయందు కందార్థములు, కందపద్యములు, పరిపూర్ణ సిద్ధాంత శిరోమణులు, అచల బోధ శిఖామని, దీక్షితీయం, ఈ గ్రంథములు ఎల్లప్పుడూ చదువుచు, అవునికిని అవలోకనము చేసుకొనుచు ఎల్లప్పుడు శ్రద్ధగా చేసుకోవలెనని భావము.

కం॥ పదియిరువై యైదులు యీ - సదమల కందములువీట్ని (250) సదయామతులై-
ముదమున మీరు వినెదరని - మదిలోపలదలచిచేస్తి మానవులారా ॥ 255

తా॥ ఓ ప్రజలారా, పది ఇరువై ఐదులు అపగా 250 ఈ కందపద్యములును ఎల్లప్పుడు, మంచి మనస్సు గలవారై, సంతోషముగా, మీరు వినియెదరని, నేను నామదిలో తలంచి చేస్తిని, మానవులంతా తరించెదరని భావము.

కం॥ ఎవరీపద్యములన్నియు - వివరింతురో వారి కెల్ల విద్యావిద్యల్ - దవిలిబాధింప
వెన్నడు - భవనాశస్థితులు లేక ప్రబలుదురెపుడున్ ॥ 256

తా॥ శిష్యా! ఎవరైనను, ఈ పద్యములన్నియు, విచారించి, ఆచరించెదరో, వారికి విద్యావిద్యలు. రహితమై, ఎల్లప్పుడు ఏ బాధలు లేకుండగను, యొరుక ఉత్పత్తి స్థితిలయము లేక బయలై యుండుదురని భావము.

కం॥ అర్థము దెలియక గ్రంథము - వ్యర్థంబని నిందసేయువ్యర్థుల మాటల్ -
వ్యర్థములని యీ గ్రంథం - బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ ॥ 257

తా॥ శిష్యా! ఈ పద్యముల అర్థము దెలియక. గ్రంథము వ్యర్థమురా యని నిందచేయు, భ్రష్టులైన దుర్మార్గుల మాటలు వినక, ఈ గ్రంథము యొక్క సారాంశమును సద్గురునిచే, బోధ విమర్శ బాగుగా విని. తెలియవలెనని భావము.

**విశేషార్థము :** ఈ పద్యములయొక్క సారాంశమేమనగా ఏ పద్యమునకు ఆ పద్యములో, క్షరాక్షరములను రహితముచేసి, అచల పరిపూర్ణమును నిరూపణ చేసి, తానే పరిపూర్ణమయ్యేలాగు, అనగా తాను లేని స్థితి తెలియజేసి, తానులేని తానైన ఉనికిలో త్రికాలములయందూ, ఉండేలాగున, ఆ ఉనికిని బాగా ఉండజూచి, అనగా ఆ ఉనికిలో బాగా దృఢ నిశ్చయము పొంది, సర్వకాలముల యందు సర్వావస్థలయందు ఆ ఉనికిలో ఉంటూ. ఆ ఉనికి కూడా రహితమై, ఉనికి లేని ఉనికైయుండే సారాంశమే, ఆ పద్యములని, వాటి భావమని, తెలియవలెనని భావము. ఉనికనగా సంకల్ప వికల్పములు లేక, యే వూహలు లేక, ఉత్తదై యేమియు లేక వున్నదా? యేమైనా వున్నదా యని వుండ జూచి ఏమీ లేకుండా చేసుకోవలెనని భావము.

కం॥ పాట సుమీభక్తులకిది - బాట సుమీ బోధ జెందభ్రమరాకుండన్ - కోటసుమీ
కందములను - తోట సుమీ దీన్ని తొలగద్రోయక వినుడీ ॥ 258

తా॥ శిష్యా! భక్తులు వీటిని పాటలుగా పాడుకోవచ్చును, ఈ పద్యములు పరిపూర్ణమును తెలుసుకొనుటకు బాటసుమీ, ఈ బోధ జెందుటకు పరిపూర్ణులై యుండుటకు భ్రమరాకుండా ఉండుటకై ఈ కందపద్యములు, పెద్దకోటలాంటివి, ఎరుకను లేకుండా చేయుటకు తోట సుమీ వీటినీ విడిచిపెట్టకుండా వినండని భావము.

కం॥ పరమహంసాశ్రమధరుని - పరిపూర్ణబోధ వాని పనులు సమమెవా - స్థిరిగెరుగక
నుతినిందలు - గరపిన తత్ఫలము ప్రజలకగు నిజము జుమీ ॥ 259

తా॥ పరమైయున్న హంసను పొందిన స్థితిగల వాడైన అనగా ఆశ్రమ నియమములకు కట్టుబడియున్న సన్యాసియును పరిపూర్ణబోధ జెంది అనగా పరమ హంసను మించి అఖండాను భవరహితుడై పరిపూర్ణుడై యున్నవాడును వీరిద్దరి పనులు సమమె? వీరిద్దరు ఎలాంటి వారో ఎవరెవరు ఎలావున్నారో, ఏవునికిలో వున్నారో ఆ వివరములు ఎరుగక పరమహంసాశ్రమపరుడైన సన్యాసినే గొప్పవాడు అని పొగుడుచూ, పరిపూర్ణుడు గొప్పవాడు కాడు అని చెప్పుకునే ప్రజలు, వారు తప్పక నరకమును పొందుతారని భావము.

కం॥ ప్రతి దినము జదివి యెవరీ - ప్రతినర్పన చేతురట్టి ప్రజలకు బోధ - స్థితి
కుదుర గలదుగురుకృప - కతిపాత్రులు వారు వారి కష్టముగలదే ॥ 260

తా॥ శిష్యా! ప్రతి దినము ఈ గ్రంథమును జదువుచు, గురుపూజ చేయుచు, ఎవరు ఆచరించెదరో, అట్టివారికి పరిపూర్ణ బోధ స్థితి కుదురును, గురు కృపా పాత్రులు వారు, అట్టి వారికి ఏ ఆటంకము కలుగదు, కలిగిన అది నిలువదని భావము.

**విశేషార్థము** : నాయనా! ఏ గురుపుత్రుడైనా, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ, భయభక్తులతో, ప్రతిరోజూ, గురుపూజ చేసుకొనుచు, నీమముగా ఈ గ్రంథము, నిత్యము చదువుకొనుచు, ఇందులో ఉన్న సారము, మనసుకు అత్తించుకొనుచు, అనగా గురుస్వరూపమై, అఖండమై, అచలమై, పరిపూర్ణమై అంతటా నిండినిబిడీకృతమై సూదిమొన మోపుటకు సంధిలేక సర్వకాలములయందు, సర్వదేశములయందు, సర్వవస్తువులయందు, లోపలావెలుపలా నిండి, వెల్తిలేక యున్నదని గ్రహించి, మీనస్సుకు అత్తించుకొని, త్రికాలములయందు హృదయ కమలమునందునిలుపుకొని నిష్ఠాగరిష్ఠుడై రెప్పపాటులో సకంఠాలమైనా మరువక అచలమై బయలై యున్న గురుస్వరూపమే, తానని మరువక పాటుపడే గురు భక్తునకు, ఏయాటంకము కలుగదు, కలిగినా అది నిలువదని భావము.

కం॥ ఇతర మెరుంగని సతమం - దతి మృషయైకానుపించునట్టి మనము యీ -కృతి
గురు శిష్యులువారలు - యితరేతర వాగ్విలాసమివి మృషలు సుమీ ॥ 261

తా॥శిష్యా! ఇతరము ఏమీఎరుగని పరిపూర్ణమందు. అతి మృషయై లేకయుండి, కనుపించేలాంటి మనము యీకృతి, గురుశిష్యులు, వారల గొడవలు, ఇతరులు, వారల వాగ్విలాసములు అన్నియు మృషలు సుమీ, యేమీ లేనివని భావము.

**విశేషార్థము** : ఇతరముగా దేనిని ఎరుగక, బయలై అచల పరిపూర్ణమై, శాశ్వతముగా యున్న బట్టబయలును, గురుకరుణచే నెరిగి, అనగా తానే అచల పరిపూర్ణమై, ఉత్త బట్టబయలై, త్రికాలములయందు, ఒకే తీరుగా, ఉన్న బయలందు, ఏమీ లేవు, అనగా అచల పరిపూర్ణమందు ఏమీ లేవంటే, గురు శిష్యులు లేరు, జీవేశ్వర్లు లేరు, అవేవీ యేమీ లేవు, నీవు లేవు నేను లేను అనగా ఏమీ లేని తాను లేని తానై యున్నదానిలో యేమీ లేవు, అనగా కేవలాత్మయనే అఖండానుభవ రహితమై యున్నదాని యందు అనగా యెరుకను పూర్తిగా విడిచిపెట్టి వున్నదానికి వేరుగాకుండా వుంటే ఏమీలేవని భావము.

ఇతి శ్రీ మద్భాగవత కృష్ణ విరచిత క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత
కంద పద్యములకు భావ విశేషార్థములు
సంపూర్ణము



**శ్రీ దంతులూరి జగన్నాథరాజ విమలానంద సద్గురు సార్వభౌముల వారి**
**ప్రియ శిష్యుండైన**
**నాగముల్లి గోత్రోద్భవుండైన శ్రీసీతమాంబా సమేతా అబద్దాలనే**
**దంపతులకు ప్రథమ పుత్రుండైన**
**శ్రీ చిన్మయ విలక్షణ సద్గురు టేకి వెంకటాచార్యులు వారు**
**రచించిన భావ విశేషార్థములు**
**సమాప్తము**
**జై సద్గురు మహారాజుకు జై జై జై**

**శుభం**

# కందార్ధములకు తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 33 | దాన్య | ధ్యాన్న |
| 14 | 11 | సాదేంద్రియ | పాదేంద్రియ |
| 15 | 23 | వనుమనెను | వినుమనెను |
| 23 | 13 | ధాన్యము | ధ్యాన్నము |
| 25 | 16 | యెరగునా | యెరుగునా |
| 27 | 24 | సీయిచ్చును | సీయిచ్చను |
| 27 | 27 | నేవెరిగి | నీవెరిగి |
| 29 | 20 | తనలోలానే | తనలోతానే |
| 32 | 8 | చేరులేని | వేరులేని |
| 34 | 19 | యెరుకడ | యెరుకనిడ |
| 42 | 9 | .యెరుపు | మెరుపు |
| 46 | 14 | గున్వంటే | గున్నదంటే |
| 63 | 10 | సర్వింస్థ | సర్వావస్థ |
| 63 | 13 | ఒకేతారు | ఒకేతీరు |
| 68 | 17 | ఈధరప | ఈధరపై |
| 73 | 9 | యిట్ల | యిట్లు |
| 79 | 5 | కికేనూ | కికనూ |
| 81 | 24 | యెకుక | యెరుక |
| 82 | 4 | నీలేమని | నీవేమని |
| 87 | 9 | త్రెవెల | విత్తెవెల |
| 93 | 14 | దన్నా | దేని |
| 103 | 14 | మేలునినా | మేలుకనినా |
| 106 | 15 | నిజరుగు | నిజగురు |
| 121 | 23 | శ్వరల్లను | శ్వరులన్నను |
| 133 | 1 | ముదగ | ముందుగ |
| 137 | 9 | వత్రము | మంత్రము |
| 141 | 16 | జతగూడ | జతగూడి |
| 142 | 23 | లేయున్న | లేకయున్న |
| 144 | 21 | బట్టలై | బట్టబయలై |
| 144 | 28 | నోమముతో | నీమముతో |
| 145 | 2 | పండకుండా | పడకుండా |
| 145 | 5 | వచారించి | విచారించి |
| 150 | 12 | గురువు | గురువునకు |
| 154 | 11 | లుండను | లజంబను |

## కందార్థములకు తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 3 | దైన శిష్యుడు | దైన గురువు |
| 155 | 17 | పీడుడెట్లు | పీడెట్లు |
| 188 | 24 | తెలియుండా | తెలియకుండా |

## కందపద్యములు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 187 | 12 | మాగలిగె | మాటగలిగె |
| 193 | 16 | పలుకుదురురా | పలుకుదురా |
| 194 | 5 | విరించి | విచారించి |
| 194 | 24 | నమసా్రము | నమస్కారము |
| 195 | 5 | ఎతింటిదో | ఎలాంటిదో |
| 195 | 14 | ఆశ్వర | ఈశ్వర |
| 198 | 15 | కొండనటె | కొండనంటె |
| 209 | 25 | విచారిచి | విచారించి |
| 217 | 17 | మంద్రజ్ఞల | మంత్రజ్ఞుల |
| 218 | 7 | రుసమైతె | రసమైతె |
| 218 | 19 | నరసగ | నరసంగ |
| 224 | 8 | కలవలో | కలవలె |
| 228 | 19 | వెకరీ | వైకరీ |
| 230 | 11 | సదురు | సద్గురు |
| 231 | 1 | అహమను | అహమును |
| 245 | 10 | ఘనీకును | ఘనకును |
| 247 | 4 | సేవమొచ్చి | సేవమెచ్చి |
| 249 | 2 | నిజమన్న | నిజమెన్న |
| 249 | 6 | నవరత | ననవరత |
| 251 | 15 | భాష్యమునె | భాష్యములనె |
| 259 | 13 | నకము | నరకము |

కం॥ సత్యాసత్యము లెరుగక। సత్యముగా యున్న గురుడు ।
సద్గురుడౌను। నిత్యా నిత్యము లెరుగక - నిత్యుండై యున్న
గురునకు । నిత్యామంగళమూ । విమలానందుకు - సత్యా
మంగళమూ । నిత్యా నిత్యములానె - నిర్ణయ మెరుగక ।
నిత్యాడై యుండేటి - నిజ బోధ గురునకు । నిత్యా
మంగళమూ । విమలానందుకు - సత్యా మంగళమూ ॥